ఆర్యభారతీ గ్రంథమాలిక. ౧వ కుసుమము.

# గౌతమధర్మసూత్రములు

హరదత్తాచార్యుని మితాక్షరయను సంస్కృతవ్యాఖ్యానముతోను,
తేట తెల్లముగ ఆంధ్రవివరణములు - విశేషాంశములతో సహా కూర్పబడినది.



ముద్రాపకులు - ప్రకాశకులు:

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి.

ఆర్యభారతీప్రెస్సు. 7 ఆరణిగంగన్నవీథి,

మద్రాసు.

1927

వెల:- గ్రంథమాలికాచందాదారులకు. రూ. 4-8-0

చందాదారులు కానట్టి ఇతరులకు రూ 9-0-0

రాజపోషకులు:—

(1) శ్రీశ్రీ రాజానాయని వేంకటరంగారావు బహద్దరు ధొరవారు.
మునగాల జమీందారులు, మునగాల ఎస్టేటు. (నైజాం)

(2) శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు.
ఆంధ్రపత్రికాధిపతులు, చెన్నపురి.

(3) శ్రీయుత బుర్రా సత్యనారాయణ పంతులు గారు, బి. ఏ. బి. యల్.
హైకోర్టు వకీలు, మద్రాసు.

(4) బ్ర. శ్రీ. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు, అరియలూరు శ్రోత్రియందార్లు.
వావిళ్ల ముద్రణాలయాధికారులు, చెన్నపురి.

(5) పుల్లెల చినవేంకటరమణయ్య పంతులుగారు. బి. ఏ. బి. ఎల్.
హైకోర్టువకీలు. మైలాపూరు, మద్రాసు.

(6) డాక్టర్, కే. యన్. కేసరి గారు.
ప్రొప్రైటరులు, కేసరికుటీరము, ఎగ్మూరు, మద్రాసు.



☞ గ్రంథములు వెలకు దొరకుచోటు:—

మేనేజరు, ఆర్యభారతీప్రెస్సు అండ్ ఆఫీసు.
7 ఆరణి గంగప్పవీథి. చాకలిపేట. మద్రాసు.

# గౌతమధర్మసూత్రములు

## విషయసూచిక.

——(***)——

లగు నాచమనములు- ఆచమనకాలమున నింద్రియోపస్పర్శనములు తద్విశేషాంశములు- ఆచమింపవలసిన ఇతరసమయములు- స్వాపన భోజనక్షవనదంతశ్లేషములు ఆచమనార్హము లనుట- అందును కేవలజిహ్వాభిమర్శనమున కక్కఱలేదనుట - అందలిమతభేదములు- గౌతముని సిద్ధాంతములు. ముఖబిందువుల(నోటితుంపురుల)విషయమున మీఁదపడనంతదనుక ఆచనము అక్కఱలేదనుట. లేప గంధాదులు పోవువఱకు శౌచము చేయవలయు ననుట- అందు తొలుత జలశౌచము- పిమ్మట మృత్తికాశౌచము. వీనికి చేయదగిన మూత్రపురీషాది సమయములు- శౌచవిషయమున గమనింపదగిన ముఖ్యవిధులు- కేవల మిందుచెప్పిన వేగాక శాస్త్రములు ప్రత్యేకించి ఆయా శాస్త్రములందు నయ్యెవానికి విధించినవిన్ని చేయవలయు ననుట- గురూపసదన వివరణము- అందు గురువుల నుపసదనము [అధ్యయనముఁ జెప్పు డని సమీపింపవలసినరీతి] విధానము- అందుచక్షురాదు లగు నింద్రియములయుపస్పర్శనము - అందే ప్రాణాయామములు- ఉపవేశన విధానము- ప్రాణాయామములందలి పంచవ్యాహృతులు- ప్రాతఃకాలముల గురువులకు పాదోపసంగ్రహణము చేయవలసియుండుట- ఇందు మనువుసమ్మతి- అధ్యయనాద్యంతములలోని పాదోపసంగ్రహణము- గురుశిష్యులు కూర్చుండవలసినరీతి- దిగ్వినిర్ణయము-అధ్యయనమునకు తొల్త గాయత్రీయుచ్చారణము- ఓంకారోచ్చారణము- అంతరాగమనాదులలో- మఱల నుపసదనమును చేయవలసి యుండుట- అందు శ్వనకులాదుల అంతరాగమనములలో చేయవలసిన రీతి- తక్కుంగలవానిలో నాచరింపదగినవిధానము- శ్మశాన ప్రదేశములం దధ్యయనము చేసినచో- రాగల ప్రత్యవాయము- తత్ప్రాయశ్చిత్తవిధానము- అని ఇట్లు ఇందు ౯౮ ముఖ్యములగు విషయములు చర్చింపబడినవి. ఇందలి సూత్రముల సంఖ్య అరువదిరెండు.

---

౧-వ ప్రశ్న. ౨౨-వ అధ్యా. పేజి 33 మొదలు-౪౮ వఱకు.

ఉపనయనము కాకమునుపు వటువుధర్మములు- (అనగా అనుపనీతుని ధర్మము కామచారవాదాది పదముల యర్థమును- మస్కరీయుల పూర్వపక్షసిద్ధాంతములు- అనుపనీతుడు హుతాశికారాదనుట- మూత్రపురీషాదులలో నతనికిస్వాతంత్ర్యము- స్త్రీశూద్రులకు వలె నతనికి నాచమనవిధి లేదనుట-కాని అపమార్జనాదులలో ఆచమనము తప్పదనుట- అశుచిసంస్పర్శనమున నతని కశౌచము రా దనుట- అగ్నిహోత్ర బలిహరణాదులలో ననుపనీతుని నియోగింపకూడ దనుట- ఈవిషయమున శాస్త్రిచర్చలు - ఆశ్వలాయనాదుల యనుమతులు - ఈ విషయమునఁ గొన్ని విశేషాంశములు- మన్వాదుల యభిప్రాయములు- స్వధానినయనాదులలో తప్ప అనుపనీతునకు వేదోచ్చారణాదుల కధికారము లే దనుట- ఇందు వాసిష్ఠస్మృత్యాదుల ప్రమాణ వచనములు— ద్విజునకు ఉపనయనమైననాటినుండియే నియమసిద్ధి యని సిద్ధాంతీకరించుట- నియమము లనగా అగ్నీంధనాదులు- బ్రహ్మచర్యాదులును కూడ నిట్లే- ఉపనీతుని ధర్మములు- అగ్నీంధనముభిక్షాచరణము సత్యవాక్యత ఉదకోపస్పర్శనము- తద్విధానములు- ఉపనీతుని ఉదకోపస్పర్శనవిషయములో మతభేదము -కాలనియమము- అన

గా ఛాందోగుల మతభేదము- గ్రామము వెలుపలనే యుపనీతుడు సంధ్యాకృత్యముల నిర్వహింపవలయును- సంధ్యావందనకాలమునం దతనికి (ఉపనీతునికి) నియమములు- సంధ్యనుపాసింపవలసిన కాలమును ఏర్పరించుట- ఇతరములగు బ్రహ్మచారిధర్మములు- సూర్యదర్శననిషేధము- మధుమాంసాదులగు ఇరువదినాల్గు ప్రధానములైన వర్జనధర్మములు- దీనినిగుఱించిన మస్కర్యాదుల మతభేదములు- అందు బుద్ధిపూర్వకృతాబుద్ధిపూర్వకృతాదులను పురస్కరించుకొన్న విధినిషేధములు- గురువుల దర్శనము చేయునప్పుడు బ్రహ్మచారి యుండదగిన రీతులు- అందునిష్ఠీవనాదుల వర్జింపవలయు ననుట- స్త్రీల సందర్శనాలంభనాదులు కామితభావముతో నైనచో గూడదనుట- ద్యూతము హీనసేవాదులు పనికి రా దనుట- ఇందలిచర్చలు- బ్రహ్మచారి తనగురువులు మున్నగువారిని పేరున పిలువ రా దనుట- పరుల కుద్వేగమును గూర్చుమాటలు చేతలు మున్నగువాని నిషేధము- గురువులసన్నిధిని అధ్యయనకాలమున నతఁ డవలంబింపదగిన విధానములు- అందు శయవాసనాదుల నియమము- వాగాదుల సంయతత్వము- గురువులసన్నిధిని తనకులగోత్రాదులను కలరూపున నెఱింగింపవలె ననుట- ఈవిషయమున నితర స్మృతుల యభిప్రాయములు- గురువులు కానట్టి తక్కినపూజ్యుల విషయమునకూడ నిట్లే వర్తింపవలయు ననుట- గురువు పిలుచువేళల నవలంబింపదగిన నియమములు- అందువారిమాటను వినిపించుకొననట్లు ఉండరా దనుట- అధస్థానాసనాదులలో నవలంబింపదగిన విధానములు- గురువుల దర్శనమైనచో లేచి నిలువంబడవలయు ననుట- ఇట్లే అనుగమనాదులును చేయవలె ననుట- గురువునకు తెల్పకయే ఏపనిని చేయకూడ దనుట- పిలచిననే అధ్యయనము చేయవలయు ననుట- గురుహితమునం దాసక్తుడై యుండవలెను- అట్లే ఆతని భార్యాపుత్రాదులవిషయమునను- కాని ఈగురుభార్యాదుల యుచ్ఛిష్టాన్నాదులను గ్రహింపరా దనుట- ప్రవాసాగమనము చేసినచో గురుభార్యలకు పాదోపసంగ్రహణము నాచరింపవలయు ననుట- ఈవిషయమున తక్కినసూత్రకర్తల భిన్నాభిప్రాయములు- అందును వయస్సుపరిమితి నేర్పరచుట- బ్రహ్మచారి అన్నివర్ణముల వారిలో భిక్షాచరణమును చేయవచ్చుననుట - కాని అభిశస్తాదులయిండ్లలో పనికిరా దని నిషేధించుట- భిక్షను అడిగెడిరీతులు- అందులకునియమము- ఈసందర్భమున గృహ్యసూత్రకర్తల మతభేదము- భిక్షను యాచింపరాని యిండ్లు- విధిలేనప్పుడు చేయదగినరీతులు- భిక్షాన్నము గుర్వాదులకు నివేదించి భక్షింపవలయు ననుట- భక్షణకాలమున నవలంబింపవలసిన విధానములు- ఇందలి విశేషాంశములు- వైద్యధర్మశాస్త్రాచార కర్తల ఏకాభిప్రాయములు- శిష్యులను అనుశాసించు [శిక్షించెడి] విధానములు- అందు బెదరించుటలు మున్నగువాని చేతనే అనుశాసింపవలె ననుట- అట్లువీలు లేనప్పు డవలంబింపవలసిన రీతులు- ఈవిషయమునందు వేదమనుశాసించు బుక్కు- తదర్థము- శిష్యులను క్రూరముగా హింసించినచో నాచార్యుడు రాజదండనమునకు పాత్రు డగుననుట- వేదముల జదువవలసిన కాలమును నియమించుట- అందు ఒక్కొక్కవేదమునకు పండ్రెండేసి యేండ్లనుట- కొందఱు కాలనియమము చేయక వచ్చునంతదనుక చదువదగుననుట- విద్యార్జనకాలము ముగిసిన

పిమ్మట శిష్యులు గురువులకు ద్రవ్యాదులగు గురుదక్షిణాదులను అర్పింపవలయుననుట. ఇట్లుచే వారియాజ్ఞగొని స్నాతకుడు కావలయు ననుట- ఇందు ఆచార్యాదుల గౌరవమునుగూర్చిన ప్రశంసలు- ఇతరులుపక్షము నను సరించి అంద ఱాచార్యులకంటె తల్లియేఎక్కువని సిద్ధాంతీకరించుట- ఈరీతిగా నిందులో ౧౧ విషయములు కూర్పంబడి యున్నవి. ఈయధ్యాయమ నంగలసూత్రముల యొక్క సంఖ్య ఏఁబదియేడు.

---

౧-వ ప్రశ్న- 3-వ అధ్యా. పేజీ౯ మొదలు-౬౯ వఱకు.

స్నాతకు డవలంబించ దగిన ఆశ్రమమును గూర్చిన వికల్పపక్షములు - మన్వాదులభావములు- నాలుగు ఆశ్రమముల నిర్వచనము- క్రమభేద విచారణ- అన్ని ఆశ్రమములవారికిని గృహస్థులే మూలకంద మనుటకు గారణములు- గృహస్థు కానివారికి సంతానము గనుటకు అధికారము లే దనుట-ఇందులకు శాతాతపుని సమ్మతి- ఈవఱకు చెప్పిన ధర్మములు బ్రహ్మచారి వని తెల్పుట- నైష్ఠిక బ్రహ్మచారి ఆజన్మము గురుకులమునందే యుండవలయు ననుట- గురుకులమున నతని నిత్యకృత్యములు- శుశ్రూషలు- గురువు మున్నగువారు లేనప్పటి విధానములు- నైష్ఠిక బ్రహ్మచారికి గాగల ఫలము- జితేంద్రియత్వ నిర్వచనము- అందు మనువు సమ్మతి- నైష్ఠికబ్రహ్మచారి తక్కినవారి ధర్మములను గూడ తనధర్మమునకు విరోధము లేకుండునట్లులు చేయదగు ననుట భిక్షువు [సన్యాసియొక్క] ధర్మములు- భిక్షువు అర్థార్జనము చేయరా దనుట- ఊర్ధ్వరేతుడుగాను శీతవాతాతపాదిసహిష్ణువుగాను నుండదగు ననుట- వర్షర్తువులలో నేకత్రవాసమే యతనికి దగిన దనుట-భిక్షువుభిక్షకుమాత్రమే గ్రామములకుఁ బోవలసియుండుట-అందునను భిక్షాన్నము సిద్ధముకాని గృహములకు మఱలమఱల పోకూడ దనుట- ఇందు మనువు నభిప్రాయము- ఎక్కువభిక్షకై సన్యాసి గృహస్థులను దీవించుటలు మున్నగునవి చేయరాదు- వాఙ్నియామాదు లవలంబింపవలసి యుండుట- సన్యాసియొక్క నియమములను గూర్చి ఇతరస్మృతుల యభిప్రాయములు- సన్యాసి సంగ్రహింపదగిన వస్త్రమును గుఱించిన చర్చలు- అందు మతభేదములు- కౌపీనమునకుగాను లోకమున కుపయోగపడెడి చెట్లపట్టలను వలవరాదనుట- వర్షాకాలమున దప్ప అతడు రెండురాత్రు లొక్కగ్రామమున గడుపరా దనుట- సన్యాసివేషనిర్ణయము- ఇందలి వికల్పపక్షములు- బీజవధాదినిషేధములు- ప్రాణులయెడ సమభావము- నిరారంభత్వము- వైఖానసధర్మములు- వైఖానసశాస్త్రానుసారము అతడు అగ్నుల నుపాసింపవలసి యుండుట- గ్రామసంబంధపదార్థముల ననుభవింప కూడ దనుట- వైఖానసుడు పంచమహాయజ్ఞములను చేయవలసియుండుట- అందతిథిపూజావిషయమున నతడు వర్ణాశ్రమాదుల పాటింప రా దనుట- ధాన్యాదులు లభించనిచో దుష్టమృగముల మాంసమునైన నతడు అతిథిసంతర్పణము చేయవలసినదే యనుట- వ్యవసాయపుపొలములను జనులుండు పల్లెలను అతడు ప్రవేశింప రా దనుట- వానప్రస్థుని భోజనపదార్థముల నియమము- వర్ణాశ్రమముల ధర్మములను ముగించి చెప్పుచు గృహస్థాశ్రమమే అన్నింటికంటెను త్తమమని

ముగించుట- అని ఇందు ౨౫ విషయములు గలవు. ఇందలి సూత్రముల సంఖ్య ముప్పది యైదు.

---

౧ ప్రశ్నము-౪ అధ్యా. పే ౬౯ మొదలు ౭౯ వఱకు

గృహస్థధర్మములు - అతడు భార్యనెన్నికొనుటలో గమనింపదగిన విశేషములు- సమాన ప్రవరలు గలవారితో వివాహము పనికిరా దనుట- కన్యకలను చేకొనునప్పుడు తల్లివంకను తండ్రివంకను బంధువులపక్షమునను గమనింపదగినవిధానములు- ధృతరాష్ట్రవిచిత్రవీర్యాదుల కథల యుదాహరణములు- బ్రాహ్మవివాహలక్షణము - ప్రాజాపత్యవివాహరీతి- ఆర్షవివాహరీతి- దైవవివాహరీతి- గాంధర్వవివాహలక్షణము - ఆసురవివాహనిర్వచనము- ఇందు మన్వాదుల ప్రమాణములు- రాక్షసవివాహనిరూపణము- పైశాచవివాహలక్షణము- వీనిలో ధర్మ్యము లగువివాహములను నాలుగని పరిగణించుట- ఆరనువారి వాదము- అనులోమానంతరాది వివాహములు- అట్టివివాహములం బుట్టినవారికి వర్ణసంకేతములు- ప్రతిమలోమ వివాహములు- అందలి సంతతికి సంకేతములు- బ్రాహ్మణ స్త్రీ చాతుర్వర్ణ్యమువారివలన గన్నట్టిబ్రాహ్మణసూతమాగధచండాలాదుల నిరూపణము- ఇట్టులనే క్షత్త్రియస్త్రీ అనులోమజాతుల వారివలన గన్నసుతుల జాతినిరూపణము- అనులోమవివాహములవలన తక్కువకులములవారికి ఏడుతరములలో నుత్తమవర్ణత్వము సిద్ధించు ననుట- ఇట్లే ప్రతిలోమ వివాహములచే నెక్కువకులమువారికి నీచవర్ణత్వము గలుగుననుట- ఇట్లే సృష్ట్యంతరవివాహములలో గూడ నని చెప్పుట- ప్రతిలోములు ధర్మహీను లనుట- ఇందు మనువు చేసినవ్యవస్థ- పతితవృత్తిత్వము- పాపిష్ఠసంతాననిర్వచనము- సాధుపుత్రులప్రశంస- ఆర్షసంతానపుమహిమము- దైవసంతానపు మహత్త్వము- ప్రాజాపత్యసంతానపు గొప్ప- బ్రాహ్మివివాహజనితు డగుపుత్రుని మహత్త్వము- అని యిట్లు ఇందు దాదాపు 30 విషయములకు పైగా గలవు. ఇందలి సూత్రముల సంఖ్య ఇరువది మూఁడు.

---

౧-వ ప్రశ్నము, ౫-వ అధ్యా. పేజి ౮౦ మొదలు ౯౬ వఱకు.

గృహస్థుడు ఋతుకాలములందు భార్యను సంగమింపవలసి యుండుట- ఋతుకాలనిర్ణయము- అందు మనుయాజ్ఞవల్క్యాదుల సమ్మతులు- ఋతుకాలగమనము చేయనిచో రాగలప్రత్యవాయము- ఋతుకాలగమనముఁగూర్చిన వికల్పపక్షములు- స్త్రీరక్షణప్రాముఖ్యము- అందలి చర్చలు- పంచయజ్ఞవ్రతుడై గృహస్థు డుండవలసియుండుట- పంచయజ్ఞాదుల వివరణము- నిత్యస్వాధ్యాయత్వము- పితరులకు ఉదకదానము- ఈవిషయములలో మనుకాత్యాయనభృగ్వాదుల భిన్నభిన్నము లగు సమ్మతులు- అగ్నిపరిగ్రహకాలనిర్ణయము- అందలివికల్పపక్షము-చర్చలు- గృహస్థు డన్నికర్మలను గృహ్యాగ్నియందే చేయవలయు ననుట- ఇట్లే దేవయజ్ఞాదులును చేయవలయు ననుట- దేవయజ్ఞవైశ్వదేవవిధానములు. దిగ్దేవతాబలులు ద్వారబలివిధానము- గృహదేవతాబలివిధానములు- ఇందలి విశేషాంశములు- బ్రహ్మబలిస్థలనిర్ణయము- ఆకాశబలిస్థల

నిరూపణము- ఇట్లేన క్తంచరబలివిధానము- స్వస్తివాచనాదులు- దానములు- అందు గమనిం
దగిన ముఖ్యవిధానములు- అబ్రాహ్మణబ్రాహ్మణశ్రోత్రియాదుల కిచ్చెడి దానములోగల ఫల
త్కర్షము- బహిర్వేదిదానములు- అంతర్వేదిదానములు- అన్నిదానాదులు అధర్మునకు ఇచ్చె
నని ఈయకున్నను దోసగులే దనుట- ఇట్లే క్రుద్ధాదుల వాక్యము లనృతము లయినను ప్రత
వాయము రాదనుట- గృహస్థు తనకంటె ముందు భుజింపచేయ దగిన వారిని నిరూపించుట
భోజనముచేయునప్పుడు ఆచార్యాదులు వచ్చిన, చేయదగిన రీతి- ఆచార్యులు మున్నగుపు
జ్యులు వచ్చినపుడు మధుపర్కము నీయవలె ననుట- మధుపర్కము నొసంగదగిన ఇతరకా
ములు- మధుపర్కార్హు లగుశ్రోత్రియరాజాదులు- శ్రోత్రియున కీయదగినవస్తువులు- సామ
న్యగృహస్థధర్మములు- తృణోదకాదులచే నైన నతడు అతిథులు మున్నగువారిని సత్కరింప
తప్ప దనుట- అతిథులకు తనతోసమముగా శయ్యాసనాదుల నొసంగదగును- అతిథిలక్షణము
అతిథిగా వచ్చిన నాల్గువర్ణములవారిని యోగక్షేమ విచారణసేయువిధానము- బ్రాహ్మ
ణునకు అబ్రాహ్మణు డతిథిగా డనుట- కాని యజ్ఞకాలాదు లైనచో నతిథియే యగు ననుట
క్షత్త్రియు డగునతిథికి అన్నము నిడుటలో గమనింపదగినవిషయములు- అతిథులవలెనే తక్కి
వారిని కూడ గృహస్థు ఆనృంశస్యమునకై పూజింపవలయు నని నిరూపించుట- అనియిట్లు రా
విషయములకు పైగా గలవు. ఇందలి సూత్రములసంఖ్య నలువదిరెండు మాత్రమే.

---

౧-వప్రశ్నము, ౬-వ అధ్యా. పేజీ ౯౬ మొదలు ౧౦౫ వరకు.

ఇతరులగు వృద్ధులను పూజించురీతి- అందు ప్రవాసానంతరమందు పాదోపసంగ్రహ
ణము- ఇది మాతృపితృాదు లందఱియెడ సమమనుట- పాదోపసంగ్రహణమును చేయవలసిన
రీతి- స్వనామపూర్వమభివాదనము- ఇందు మనువుసమ్మతి- వసిష్ఠాదులవిశేషవిధి చర్చ.
దంపతులుగా నున్నచో నియమమక్కఱలే దనువారి వాదము- ప్రవాసమున కేగనిచో మా
తృపితృవ్యభార్యాదులకును ఉపసంగ్రహణ మక్కఱలే దనుట- భ్రాతృభార్యలకును తోబుట్టువు
(ఆడువార) లకును ఉపసంగ్రహణము అక్కఱ లే దనుట- ఋత్విక్ఛ్వశురాదులకును వయ
సున చిన్నవారికిని ప్రత్యుత్థానమేకాని అభివాదనము లేదనుట- గ్రామవృద్ధులు తక్కిన పెద్దలు ము
న్నగువారియెడ నవలంబింపదగువిధానము- తనకంటె తక్కువవారియెడల శూద్రుడాచరింపద
గినవిధానము- ఇట్లు ఆచరించునప్పుడు నామగ్రహణము చేయరా దనుట- అశ్రోత్రియుడగు
ప్రేష్యునిరీతి- సమానవయస్కుని అభివాదనము చేయునప్పుడు గమనింప దగినవిశేషము-
ఇందే పౌరకళాభరచారణస్త్రీల విషయము- విద్యాహీనుడగు రాజన్యవైశ్యులవృత్తిగల బ్రా
హ్మణుని విషయము- అభివాదనమున దీక్షితునివిషయము- మాన్య (పూజ్య) స్థానులపరిగణ
నము- దానిలోగల శ్రేష్ఠత- అన్నిటికంటెను శ్రుతశాలితయే ఉత్తమయోగ్యతయనుట- దా
నికిం గలకారణము- గృహస్థుడు శ్రోత్రవనొసంగి గౌరవింపదగినవారు- తత్పరిగణనము-

శ్రోత్రియు డైనచో రాజే శ్రోవ నొసంగ దగు ననుట ఇట్లు ఇందు - ౩౦ విషయములకు పైగా గలవు. ఇందలి సూత్రములసంఖ్య ఇరువదియైదు.

---

౧-వ ప్రశ్న. ౭-వఅధ్యా. ౧౦౫ పేజీ మొదలు-౧౧౨ వఱకు.

ఆపత్కల్పప్రారంభము - ఆపత్కాలములలో బ్రాహ్మణు డబ్రాహ్మణు డగువానినుండి
గూడ విద్యాగ్రహణము జేయవచ్చుననుట- చతుర్దశవిద్యల పరిగణనము- చర్చలు- ఆపత్క
ల్పమున నుత్తమవర్ణములవారు గమనింపదగిన విశేషములు- విద్యాసమాప్తికి పిమ్మట బ్రా
హ్మణుడే గురువగుట- అతనికి సర్వవర్ణములనుండియును యాజనాదుల కధికారము గల్గుట-
అందున్నను ఉత్తమోత్తమత్వములు- ఆపత్కాలమునందలి జీవితవిధానములు- క్షత్త్రివృత్తి-
వైశ్యవృత్తి- అందు బ్రాహ్మణునకు విక్రయింపరాని వస్తువులు- అందుగంధవస్త్రాదులు రంగు
బట్టలు- పెఱుగుపాలు- మూలఫలపుష్పాదులు కూడ నతనికి అపణ్యములే యనుట- హింసా
కారణమగు పశువిక్రయము కూడ కూడదు- పశువులలోను నిత్యమును అపణ్యము లగునవి-
ఇందుమతభేదములు- భూమివ్రీహియవాదులు అపణ్యము లనువారి వాదము- గాని వస్తువిని
మయము కూడుననుట- ఇట్లే రసాదులు రసాదులతో మార్చుకొనవచ్చుననుట- కాని ఉప్పు
పక్వమైనయన్నాదులు ఇట్లు మార్చుకొనరా దనుట- మార్ప వీలులేని మఱికొన్నివస్తువులు-
ఇందలిచర్చలు-వ్యాసులు మున్నగు నితరధర్మశాస్త్రప్రవక్తల మతభేదములు- అందు బ్రా
హ్మణాదుల వృత్తివ్యత్యాసములు- అని యిందు 40 కి పైగా విషయములు గలవు. సూత్ర
ముల సంఖ్య యిందు అరువది ఆరు.

---

౧ ప్రశ్న. ౮-వ అధ్యా పేజీ ౧౧౩ మొదలు-౧౨౩ వఱకు.

రాజులయు బ్రాహ్మణులయుమహిమ-లోకమున ధర్మరక్షణము సేయువార లిద్దరే ననుట-వారు
పాలించురాజును బహుశ్రుతు డగు బ్రాహ్మణుడు నని నిర్వచించుట- చాతుర్వర్ణ్యాదిసమస్తప్రాణి
కోటులజీవనము వారిద్దఱిపై నాధారపడు నని రూపించుట-అందు చాతుర్వర్ణ్యవివరణము- అంత
స్సంజ్ఞాజీవుల నిర్వచనము- చలనపతనసర్పణజీవుల నిరూపణము- తద్విషయకములగు చర్చలు-
రాజబ్రాహ్మణులు నిర్వహించదగిన త్రివిధధర్మములు- బహుశ్రుతలక్షణము- చత్వారింశత్
(40)సంస్కారములు కలవాడుగా నుండవలయు ననుట- కర్మత్రయమునందుగాని షట్కర్మలం
దుగాని నిరతుడై యుండదగు ననుట- సామయాచార పరిజ్ఞాతగూడ కావలయు ననుట- ఇట్టి
బ్రాహ్మణుడు అవధ్యుడుమున్నగు యోగ్యతలు కలవాడగు ననుట-చత్వారింశత్సంస్కారముల
నిరూపణము- అందు గర్భాధానాది ఉపనయనాంతము లగుసంస్కారములు-స్నాన సహధర్మిణీ
చర్యాదులు వేదవ్రతము లని నిరూపించుట- పంచయజ్ఞములును పంచసంస్కారము- లనుట-
పాకయజ్ఞముల పరిగణనము- తన్నిర్వచనము- హవిర్యజ్ఞములు- వానినిర్వచనములు- సోమ
సంస్థలు- వానినిర్వచనములు- ఎన్మిదివిధములగునాత్మగుణములు- అందుదయానిరూపణము-
క్షాంతినిర్వచనము- అనసూయాశౌచములవివరణము, అనాయాసస్వరూపము- మంగళస్వభావ

వము- అకార్పణ్యాస్పృహాలవివరము- వీనినిగుఱించి మస్కరీయులు చెప్పిన విశేషములు- అందాత్మగుణములవలన గల్గెడిఫలములు- చత్వారింశత్సంస్కారఫలములు- ఆత్మగుణము లును సంస్కారములును గలవాని మహిమము. అని ఇందు 40 వదికి పైగా విషయములు కలవు. సూత్రసంఖ్య ఇర్వది ఆరు.

---

౧-వ ప్రశ్న, ౯-వ అధ్యా. ౧_౭౩ మొ. ౧౫౦ పేజీవఱకు.

స్నాతకు డైనపిమ్మట పెండ్లాడి యాచరింపదగిన గార్హస్థ్యధర్మములు- నిత్యశౌచము- పరిమళవస్తుధారణాదులు- వస్త్రాభరణాదులు- అందుయథాశక్తి నిర్వహింపవలసినవిధులు- క్షురకర్మ- జలపాననియమము- ఆచమననియమములు- గృహస్థుని నిత్యకృత్యమునందలి యాచారములు- అందేగల విధినిషేధములు- మూత్రపురీషాదులను విడచుసందర్భములో గమనింపదగిన విధులు నిషేధములు- సంభాషణనియమము- తన్నిషేధము- మైథునకాలనియమము అధ్యయనకాలనియమము- స్త్రీసంభోగనియమము- రజస్వలాదిస్త్రీలతో రమణనిషేధము- రజస్వలానిరూపణచర్చలు- తత్సిద్ధాంతములు- కన్యారమణ నిషేధము- అగ్నిముఖోపధమనాదులగు ప్రతిషిద్ధకార్యములు- ప్రయాణనియమములు- ఆత్మగోపన మవశ్యము చేయదగు ననుట- ఆత్మస్వరూపముం గూర్చిన చర్చలు- పర్యటననియమములు- మూత్రవిసర్జన నియమములు- తన్నిషిద్ధప్రదేశములు- మూత్రపురీషములు విసర్జింప దగినకాలములు- దిక్కులు- పాలాశ సంబంధము దంతధావనాదులలో కూడదనుట- నమస్కారకాలముల పనికిరానిస్థితి- గృహస్థు కాలమును వ్యర్థపుచ్చరా దనుట- సర్వదా ధర్మార్థకామ తత్పరుడై మెలగవలయునను ట- అట్లున్నచో రాగల శ్రేయస్సు- పురుషార్థముల నాచరించుటలో గమనింపదగిన విశేషాంశము - కామశాస్త్రకర్తల సమ్మతి - దృష్టినియమము- శిశ్నోదరాదుల చాపల్య ప్రతిషేధనము- ఛేదనభేదనాదుల నిష్కారణముగా జేయరా దనుట- కులంకులాది నిషిద్ధ ధర్మము- యజ్ఞగమననియమము- భక్షణనియమము- అందుగమనింపదగిన ప్రతిషిద్ధ వస్తువును - సాయంప్రాతః కాలముల నన్నభక్షణ నియమము శయనవిధానము - ఈసందర్భములో సంప్రదాయవేత్తలమాట పాటింప దగు ననుట- యోగక్షేమముల నభివృద్ధిని చేకొనుటకై రాజసభాగమనావశ్యకత- తదితరస్థలములకు పోవరా దనుట- వాసస్థలవిధానము- అందు ముఖ్యముగా నేర్పాటు చేయదగిన వస్తువులు- ప్రదక్షిణ స్థలములు ఆచారమున వీలున్నంతవఱకు సమగ్రముగా ననుష్ఠింపవలయు ననుట- ఆపత్కాల్పసమాప్తి- సత్యధర్మతాదులగు తక్కినయోగ్యతలు- ఇట్లు ఆచారమును పాలించుట చేత గృహస్థాదులకు రాగలఫలమును నిర్దేశించుట- అనియిట్టిందు ౯౦ వఱకును విషయములు గలవు. ఇందలి సూత్రము సంఖ్య డెబ్బది యెన్మిది.

---

బ్రహ్మక్షత్త్రియ వైశ్యశూద్రు లను నాల్గు వర్ణములవారి ధర్మములవివరణముల సారం శించుట- ద్విజాతుల సామాన్యధర్మములు- అధ్యాయసాంగత్యవిచారణ- బ్రాహ్మణుని విశిష్టధర్మములు- ఇందలినియమములు- వేద (విద్యా) ప్రధానమున కర్మలు- కృషివాణిజ్యాదినియమములు- రాజధర్మములు- అందుసర్వభూత రక్షణము ప్రధాన మనుట- న్యాయమంత్రిత్వాదులు- విద్యావృత్తిగల బ్రాహ్మణుల రాజు తప్పక పోషింపవలయు ననుట- పూర్వరాజ దానపాలనము- లోకోపకారుల పోషణము- విజయప్రయత్నములు- భయనివారణములు- రథధనుస్సంచరణము- యుద్ధమున పరాఙ్ముఖత లేకుండుటలు- యుద్ధకాలపు శత్రువధ క్షేమంపకా దనుట- ఆయుద్ధకాలములలోను అవధ్యులను గమనింపదగురీతులు- క్షత్త్రియోపజీవనము జయములబ్ధమును విభాగించురీతులు- అందు రాజుభాగము- సాముదాయిక జయమున విభాగించు రీతులు- రాజులకు పన్నులు- వ్యవసాయముచేయువారి పన్నులు- పశుధనహిరణ్యాదివృత్తులవారి పన్నులు- అంగడిసామానులవారి పన్నులు- మూలఫలపుష్పాదులను గుఱించిన శిస్తువిధానములు- రాజుల కేల పన్నియవలె ననువాదమునకు జవాబు- పన్నులవిషయమున రాజు లవలంబింపవలసినరీతి- ఇందులకు శుక్రుని సమ్మతి- పన్నులను కర్చుపెట్టవలసినవిషయము- కోశము (ఖజానాను) వృద్ధిపరచుట- శిల్పవృత్తులవారినుండి పన్నులను వసూలు చేయువిధానము- ఇట్లే తక్కిన ఆత్మోపజీవుల విషయము- నావవ్యాపారులు చక్రీవంతులను గూర్చినపన్నులు- వర్తకము నవలంబించువారిని గుఱించిన శిస్తులరీతులు- బేవార్సు (వార్సులులేనివారి) సొత్తులను పాలించు విధానములు- అందు యాజ్ఞవల్క్యాదుల నియమములు- బేవార్సుసొత్తులను రక్షించినందులకై రాజులకు రాదగినభాగముల నియామకము-మఱియు నిందు స్వామిత్వనిర్ణయమున బ్రాహ్మణుని కధికమగులబ్ధమును నిర్ణయించుట-ఇట్లే క్షత్త్రియవైశ్య శూద్రులకును- నిధి రాజుసొత్తనుట- అభిరూపుడైన బ్రాహ్మణునికి నిధి దొఱకినచో నతనిదే యనుట-నిధిని కన్పెట్టినపుడు అబ్రాహ్మణునికి వచ్చుభాగమును నిర్ణయించుట- చోరులనుండి రాజు ప్రజలను రక్షించురీతి-చౌర్యము అయినసొత్తును అతడు తెప్పించి ఈయవల యుననుట-లేనిచో స్వంతఖజానానుండి అతడీయవలె ననుట-బాలాదుల ధనమును రాజురక్షింపవలసినరీతులు- ఇందుగల్గు పక్షాంతరములు- వైశ్యునికిగల అధికవర్తనము- శూద్రుని ఏకజాతిత్వములు- సత్యాదులు వారునాచరింపవలసినవే యనుట-మతాంతరమున వారినిగూర్చిన శౌచవిధానము శ్రాద్ధక్రియలు-భృత్యభరణములు- స్వదారవృత్తిత్వము-ఉత్తమవర్ణశుశ్రూష- అందలినియమములు- జీర్ణకూర్చాదిధారణములు- ఇందలి మఱికొన్ని విశేషాంశములు - ఉచ్ఛిష్టాశనము- మస్కరీయుల భావములు- శిల్పవృత్తిత్వము- శూద్రభరణత్వచర్చ- అతడార్జింపవలసినయావశ్యకతలు- శూద్రుడు వైశ్వదేవాదులు చేయురీతులు- ఆర్యానార్యవ్యతిక్షేపమున రాగల సమత్వములు- అనియిట్లు ౬౦ వఱకును విషయములు గలవు. ఇందలి సూత్రముల సంఖ్య అరువదితొమ్మిది.

---

౨ ప్రశ్న-౨-అధ్యా. ౧౭౭ పేజీ మొదలు-౨౦౪ వఱకు

బ్రాహ్మణులు తప్ప తక్కినవర్ణముల వారిని శాసించుటకు రాజు సర్వాధికారి యనుట వ్యవహారకాలములందు రాజుండవలసినరీతులు- ఇట్టిరాజుల కుండవలసిన విద్యాయోగ్యతలు ఇట్టి జితేంద్రియత్వాదులగు తక్కినగుణములు- జితేంద్రియులు కానిచో రాగలహాని- అందు మనువుచెప్పినయుదాహరణములు- నహుషసుదర్శనవిజనసాదుల కథలు- ఈవిషయమున నర్థశాస్త్రమునుండి యుదాహరణములు- దాండక్యకరాళజనమేజయాదుల ఉదాహరణములు- వ్యవహారవిచారములలో సమవృత్తియై యుండవలయు ననుట- ప్రజాహితత్వము- న్యాయవిచారణకాలములం దతడుండవలసినవ్యవస్థలు- అందు బ్రాహ్మణులాచరింపదగుధర్మము- న్యాయ్యరీతితో వర్ణాశ్రమరక్షణము చేయవలయు ననుట- స్వధర్మచ్యుతులను పునః స్థాపింపదగినవిధానములు- ఇట్లుచేసినచో రాగల పుణ్యాంశనిర్ధారణము- పురోహితవ్యవస్థ- తల్లక్షణము- ఇందు అర్థశాస్త్రపు సమ్మతులు- పురోహితపురస్సరముగా రాజు వ్యవహరింపవలె ననుట- ఇందుచే రాగల ఫలములు- బ్రహ్మక్షత్రియసామరస్యఫలము- ఇందు అర్థశాస్త్రకర్త సమ్మతి-పురోహితులతో గలసి రాజు చేయదగిన దైవోత్పాతాదిచింతనలు-తద్వివరణము-యోగక్షేమసాధనమున వికల్పపక్షమువారి భావములు-పురోహితుడు ఆచరింపదగిన శాంతికపౌష్టికాదికర్మలు-తద్విశేషములు- అందలినియమములు-ఋత్విక్కులధర్మములు-వ్యవహారకాలమున ప్రమాణముగా గ్రహింపదగినవాఙ్మయము-ఈవిషయమున మస్కరీయులు చెప్పిన సారస్యము- దేశజాతికుల ధర్మాదులను పరిగణింపదగిన స్థలములు- అందలినియమములు- అందు దేశధర్మములు- ద్రవిడ దేశపు వారి ఆచారములు-జాతిధర్మములు-ఇందు మస్కరిభాష్యమునందలి వైశిష్ట్యములు-కర్షకాదులకు స్వధర్మసంస్థాపనరీతులు-వారి ధర్మవ్యవస్థ-న్యాయమును కనిపెట్టుటకు అవలంబింప వలసిన విధానములు-తత్సాక్ష్యముల కనిపెట్టుటలు- అందు యాజ్ఞవల్క్యాదుల నిర్వచనములు-న్యాయమును కన్పెట్టజాలనప్పు డవలంబింప దగినరీతులు- ఇందు త్రైవిద్యవృద్ధుల ప్రమాణములు-దానంగల్గగలఫలము- దండస్వరూపము- దాని నుపయోగించందగు రీతులు- వర్ణాశ్రమాచార ధర్మనిర్వహణమున నయ్యెడి ఫలములు- విశిష్ట దేశ విశిష్టజాత్యాదుల యర్థములు- వర్ణాశ్రమాచార విరుద్ధులకు రాగల ఫలములు నిర్వచించుట- ఇందు మస్కరీయుల భావములు- వర్ణాశ్రమాచార విరుద్ధులను దండింపగల వస్తువులు- తత్పరిగణనము- వారు అనింద్యులని సిద్ధాంతీకరించుట- ఇట్లు ఈయధ్యాయమున నేబదివిషయములు వఱకు గలవు. ఇందలి సూత్రసంఖ్యముప్పదిరెండు.

---

౨ ప్రశ్న-3 అధ్యా. ౨౦౫ పేజీ మొదలు-౨౩౬ వఱకు.

దండవిధానప్రకరణము- శూద్రవర్ణమువారు ద్విజాతులను వాగ్దండాదులచే బుద్ధిపూర్వకముగా అభిహననము చేసినచో విధింపదగు దండనములు- ఈవిషయమున మన్వాదుల సమ్మ

తులు- అర్థశాస్త్రాదుల సమ్మతులు- సాహసకార్య స్వరూపనిరూపణ- అందులకై విధింపద
గినదండనలు-ఆర్యస్త్రీలతో ననార్యులు సంభోగించు తప్పిదమునకు శిక్షలు-ఇందు మస్కరీయుల
భిన్నాభిప్రాయములు-ప్రజాపరిపాలనశాఖకు చెందినవాడైనచో నీవిషయమున దండ మెక్కు
డని నిర్ణయించుట- బుద్ధిపూర్వకముగా ద్విజాతులను ప్రతిఘటించి వేదమును అధ్యయనాద్యు
లుచేసినచో విధింపదగిన దండనము- ఉపశ్రవణాదుల అర్థవిచారణ- సహాసనాదులగురించిన
ముఖోలు బ్రాహ్మణాక్రోశనమున క్షత్రియునికి విధింపదగినదండనము- కార్షాపణశబ్దవిచార
ణ- బృహస్పతియొక్క నిర్వచనము- బ్రాహ్మణాక్రోశనమునకై వైశ్యునికి విధింపదగినదండనము-
క్షత్రియులు వైశ్యులు-మున్నగువారినాక్రోశించినచో బ్రాహ్మణునికి విధింపదగిన దండశిక్షలు-
శూద్రవిషయమున దండాభావము-క్షత్రియవైశ్యుల పరస్పరాక్రోశనమున దండవిధానములు-
దొంగతనమునకై శిక్షలు-అందుశూద్రునికైన దండవిధానములు-తక్కినకులములవారికి నంత
కు రెట్టింపుదండములు-అందులకు గలకారణములు- ఫలాదిహరణములలో దండవిధానములు-
పశుపీడనమునుగూర్చినదండములు- అందుగమనింపదగినవిధానములు- పాలసంయుక్త పాలక్షే
త్రికత్వాదుల గూర్చిన శిక్షలు- గోనిమిత్తకసస్యనాశనమునదండము-మాషశబ్దార్థములు- పశు
క్రూని నిర్వచనము - అశ్వములు మహిషములు ఒంటెలు గాడిదెలు మున్నగువానిచే నైనచో
కాగల దండనములు- మేకలుగొఱ్ఱెలు వీనిచే సస్యనాశనమైనచో విధింపదగు శిక్షలు- వృత్తి
యునిందు సర్వనాశమునకైన ప్రత్యేకదండము- శిష్టధర్మములను పరిత్యజించుటకును దండము
లు- ఈవిషయమున రాజు నెరవేర్పవలసిన విధులు- వనస్పతిరక్షణము- ఫలపుష్పాదుల పాలన
ము- [అనగా పబ్లిక్ తోటలు- ఉద్యానవనములు మున్నగువానిగూర్చిన విధులు-] అందు గమ
నింపదగిన విధులు- ధర్మవడ్డీని రూపించుట- ఇందుమనుయాజ్ఞవల్క్యాదుల యభిప్రాయ
ములు- మాషాదిపరిమాణములను గూర్చిమనువుచేసిన కట్టడులు - వడ్డీని పుచ్చుకొనుటలో
గుర్తింపదగినవి శేషములు- ఇందు మనువుచేసిన నిబంధనలు- చిరకాలవృద్ధిని గూర్చిన ఏ
ర్పాటులు- భుక్తాధులు- ఇందుమన్వాదులయభిప్రాయములు- అవగుద్ధవర్తనలు- వీనిని గూర్చి
మస్కరీయుల భావములు- చక్రవృద్ధ్యాదులు- అందలిసాధకబాధకముల చర్చలు- అనగా ఆప
త్కాలపు వడ్డీలను గూర్చినచర్చలు- కాయికాదు లగు వడ్డీలలోని భేదములు అందు గర్హింపద
గినవడ్డీలు- పశూపజాదులను గూర్చిన వడ్డీల నిబంధనము- అజడాపోగండాదుల స్వామ్యత్వము
నుగురించిన చర్చలు- ఇందు మస్కరీయుల భిన్నభావములు- అందుశ్రోత్రియాదుల గూర్చిన
విశేషవిధులు- రిక్థభాక్కులు ఋణములనుకూడ తీర్పవలయు ననుట- అందుతీర్చనక్కఱలేని
యంశములు- యాజ్ఞవల్క్యాదుల సమ్మతులు- విధానములనుగూర్చిన విశేషాంశము-
క్రీతాది శబ్దముల వ్యుత్పత్తులు- స్వర్ణస్తేయుడు శిక్షనొందుటకై చేయదగు రీతులు-
వధమోక్షాదుల నట్టివారికి కాగలపవిత్రత- ఇందు మన్వాదుల సిద్ధాంతములు- బ్రాహ్మణ
దండనమున గమనింపదగినవిశేషములు- మహాపాతకోపపాతకములను గాని మహాపరాధము
లనుగాని చేసినవారివిషయమున రాజుఅనుసరింపదగిన విధానము-ఇందు మన్వాదుల సమ్మతులు
చోరాదుల విషయమున దండించకున్న, రాజునే చోరుడే యనుట- ఇట్టివానిపాతకము కూడది

రములు- దశరాత్రులు వెళ్లినపిమ్మట విషయము- జాబాలివిష్ణ్వాదుల సమ్మతులు- ఇందలి నా న్ని విశేషములు- సపిండులు కానివారిగూర్చినవిధులు- బ్రహ్మచారి శ్రోత్రియాదులవిషయములు మనుస్మృత్యాదులభావములు - ప్రేతోపస్పర్శనాశౌచములు - ఇందలిచర్చలు - హారీతాదుల సమ్మతులు- పక్షాంతరములు- అవరవర్ణమువారివిషయములు - పతితాదులను గూర్చినసందర్భములు- శవానుగమనాశౌచాదులు- మనుపారస్కరాదులగు స్మృతికర్తలసిద్ధాంతములు- శున కోపస్పర్శనాదులను గూర్చినవిధులు- కృతచూడులగు బాలకులవిషయము- కన్యకలవిషయము- ఆశౌచులకు బ్రహ్మచర్యాదినియమములు- ఉదక దానవిషయములు - వాసఃపరిత్యాగాదులు. సద్యశ్శౌచముగలవారిని పరిగణించుట- ఇందే రాజునకును మినహాయింపు చెప్పుట- అనియి ట్లు దాదాపు ౫౦ విషయాలు- ౪౩ సూత్రాలు ఉన్నవి.

---

౨ ప్రశ్న ౬ అధ్యా. ౪౯ మొదలు- ౩౦ వఱకు.

శ్రాద్ధప్రకరణము- శ్రాద్ధభేదములు- శ్రాద్ధమవశ్యముగా నాచరింపవలెనను నటలో మనుస్మృత్యాదుల యభిప్రాయములు- నిత్యశ్రాద్ధములు- నైమిత్తికశ్రాద్ధములు- ఏకోద్దిష్టాదులు- తద్వివరములు- మస్కరీయానుసారముగా శ్రాద్ధనిర్వచనములు- పితృాదులకు శ్రాద్ధదినమును నియమించుట- అందలివివిధపక్షములు- చర్చలు- శ్రాద్ధాచరణమునకు కాలనియమము- తద్వివరములు- పంక్తిపావనాది పాత్రపరిగణనము- అన్నసంస్కారవిధానములు- నిమంత్రణబ్రాహ్మణపరిగణనము- విశ్వేదేవతలను గుఱించిన వివరము- శ్రోత్రియప్రాశస్త్యము- నిమంత్రితులు యువకులుగా నుండదగు దనుట- నిమంత్రింపరాని వారు- అందును అభావపక్షములు- శ్రాద్ధకర్తలపరిగణనము- స్తేనాదులగు నిషిద్ధులను గుఱించిన వివరములు- ఇందు మనువునభిప్రాయములు- కుండాశి మున్నగు నిషిద్ధుల (నిమంత్రింపరానివారి) గూర్చిన వివరములు - మఱికొందఱు నిమంత్రణార్హులగు వారిని చెప్పుట- శ్రాద్ధభోక్తనియమములు- శ్రాద్ధకాలమున తిలలప్రాధాన్యము- పంక్తిపావనులగు బ్రాహ్మణుల పరిగణనము- ఇందుమనువు సమ్మతి- అను క్రాంతనిషేధము- మున్నగు ౫౦ ఏబది విషయములును ౩౬ సూత్రములు నిందు గలవు.

---

౨ ప్రశ్న ౭ అధ్యా. ౩౦ మొదలు- ౩౭ వఱకు.

అధ్యయనారంభకాలములు- అధ్యయనము చేయవలసిన కాలనిర్ణయము- అప్పుడు పఱుప్రారంభింపదగిన నియమములు- ఆపస్తంబాదులమతములు- అనధ్యాయకాలములు- తద్విశేషములు- అధ్యయనము వర్జింపదగిన వేళలు- పరిస్థితులు- వర్జింపదగిన ప్రదేశములు- దివారాత్రములలో చదువవలసిన కాలములను పరిగణించుట- ఇట్లే కూడనివానిని నిషేధించుట- అధ్యయన శాస్త్రములు అనధ్యయనము చేయదగినస్థితులు- త్రిరాత్రాధ్యయన విషయములు- ఇంకను మఱికొన్ని కాలములు- శ్రాద్ధభోక్తల కనధ్యయనకాలనియమము- అని యిట్లింకను దాదాపు ౪౦ విషయములకు పైగాను, ౪౯ సూత్రముల వఱకును గలవు.

---

౨-వ ప్రశ్న ౮-వ అధ్యా. ౩౨౩ పేజీమొదలు-౩౩౯ వఱకు.

భక్ష్యాభక్ష్యప్రకరణము- స్వధర్మనిరతుడైన బ్రాహ్మణుడు భుజింపదగిన గృహముల వారు-ఇందలి బ్రాహ్మణశబ్దతాత్పర్యము- ఇట్లే ప్రతిగ్రహమును-సర్వవర్ణములనుండి ప్రతిగ్రహింపదగినవస్తువులు- ప్రత్యాఖ్యానమునగల్గు దోషాలు- ఇందాపస్తంబుని మతము- అందులకు అపవాదవచనము- పిత్రాదులపోషణార్థమై నచో తక్కినదియు- గ్రాహ్యమే యనుట-వృత్తిలేనిచో శూద్రప్రతిగ్రహామునుకూడ చేయవచ్చు ననుట- భుజించుటకు అర్హతలేనట్టివారిజాతులను (అనగా బ్రాహ్మణుడుభోజనముచేయదగనివారిని) వివరించుట- అభోజ్యప్రకరణము- కేశకీటావపన్నాదులు- ఇందుగల విశేషాలు- రజస్వలాదిస్పృష్టాన్నములు- ఇట్లే తక్కినపాపులు చూచినయన్నములు దుర్భావదుష్టాన్నములు- శుక్తాదులూ పునస్సిద్ధాదులూ అభోజ్యాలనుట- ఇందు శాకాదులకు మినహాయింపులు—మఱికొందఱుఅభోజ్యాన్నము గలవారిని వివరించుట- అపాంక్త్యులు- వృథాన్నాదివివరణము- నమ్మానమాన్ననిషేధము-గోక్షీరములో గమనించి విడువదగినకాలములు- ఇట్లె మేకలు గొఱ్ఱెలు మున్నగువాని విషయము-పెంపుడుజంతువులపాలలో బొత్తుగా త్రాగరాని వానిపరిగణనము-అందు స్యందిన్యాదులు- దూడలుచచ్చినపశువులు మున్నగువాని పాలు అభోజ్యములనుట-అభక్ష్యజంతువు లగు పంచనఖాదులవివరము- ఇట్లె ఉభయతోదంతాదు లగునవి, మాంసభక్షణనిషేధములు- అందు ధేన్వనడుహాములు కిసలయాదులు- లోహితాదులు- ఇందలివిశేషములు- అభక్ష్యములగు పక్షులు, భక్ష్యములగు పక్షులు- మత్స్యములు- వీనిని అతిథిపూజాదులలో వినియోగించునపుడు గమనింపదగిన విధులు- ఇట్లె వ్యాళహతాదుల విషయములు—అనియిట్లు 60పదికి పైగా విషయములును సూత్రములును గలవు.

———

౨ ప్రశ్నే ౯ అధ్యా ౩౪౦ మొదలు- ౩౪౭ వఱకు.

స్త్రీధర్మప్రకరణము- స్త్రీ ధర్మాచరణమున స్వాతంత్ర్యయనుట- అనగా భర్తయనుమతి ననుసరింపవలయు ననుట - ఈవిషయమున శంఖనారదమన్వాద్యుల సమ్మతులు- భర్త నతిక్రమింపరాదనుట- మరియు నామెకు వలసిన వాఙ్నియమాదులు-అపతిగా నున్న స్త్రీసంతానమును కోరదగిన విధము- దేవరన్యాయము- అందనుసరింపదగిన విధులు - దేవరాదులు లేనిస్థితిలో పొందదగినవారు- ఇందుగల మతభేదములు- దేవరసుతోత్పత్తిలో సంతానమెవ్వరిదను చర్చ—బీజక్షేత్రి శబ్దార్థములు- సమయము గల సందర్భములు- అందు విచిత్రవీర్యాదుల యుదాహరణలు- భర్త జీవించినను రోగాదులచే పీడితుడైనచో అప్పు డామెయందు కన్న సంతానము భర్తకొఱకే చెప్పఁబడినదైనది కాబట్టి భర్తదే యనుట- ఇంకను ఇందలి మఱికొన్నిచర్చలు- భర్త జాడా లేకుండ పోయినచో చేయదగు విధానములు-జాడ తెలిసినచో చేయవలసినపని- జాడ తెలిసినను సన్యాసిగా నున్నచో అతనిని నిర్బంధింపరాదనుట- ఈవిధముగానే సోదరులు తమకన్న పెద్దవారి వివాహాది సందర్భములో తొలగవలయు ననుట- మూడు ఋతుకాలములు గడచినను తల్లిదండ్రులు కన్యకను దానము సేయనిచో

నామె యే స్వయముగా వరింపవచ్చుననుట- కన్యాదాన కాలనియమము- సకాలమున నీయ నిచో తండ్రికి రాగల దోషము- ఈవిషయములో మఱికొందఱి భిన్నభావము- శూద్రుని నుండి ద్రవ్యాదానము చేయు సందర్భాలు, ఇట్లే హీనకర్మలు అనాహితాగ్నులు, సోమయా జులు కానివారు మున్నగువారిని గుఱించిన సందర్భములు • వృత్తిహీనుడగు బ్రాహ్మణుని క ర్తవ్యము- అందు రాజు నిర్వహింపవగిన ధర్మములు- అని ఇట్లు దీనిలో ౫౦ విషయములకు పై గా ౭౨ సూత్రములును కలవు.

---

3 ప్రశ్న ౧ అధ్యా పేజీ ౩౪౯ మొదలు ౩౬౮ వఱకు.

సింహావలోకము - ౧వ ౨వ ప్రశ్నలలో చెప్పిన ధర్మములను పర్యాలోచించుట- ఇందు వ్యాఖ్యాతలచర్చలు-సిద్ధాంతములు- ప్రాయశ్చిత్త ప్రకరణారంభము-విహితములను చేయనందు నను నిషిద్ధములను చేసినందువలనను పాపలిప్తుడగునను సిద్ధాంతము - ఉశనసమస్కర్యాదుల భావములు- ప్రాయశ్చిత్తము అవశ్యకమా కాదా యన్న మీమాంస- అక్కఱలేదనువారి వాదములు- వలయు ననువారి సిద్ధాంతములు- యుక్తులు- వేదవచనాను వాదములు- ప్రాయ శ్చిత్తసాధనములు - ఉపనిషత్తులు మున్నగువాని పారాయణము - మేధ్యవ్రతములు - అందు పయోవ్రతత్వాది వివరణము- పవిత్ర దేశములు బ్రహ్మచర్యాదులగు తపములు వీని వివరణము ఇందుమన్వాదులభావములు - పవిత్రార్థమై ఈయదగినదానములు – ప్రాయశ్చిత్తకాల పరి మాణనిర్ణయాదులు- కృచ్ఛ్రాతికృచ్ఛ్రములే సర్వపాపములకు ఉత్తమమైనప్రాయశ్చిత్తము లని నిర్ణయించుట- అని ఇందు 30 పైగా విషయములను ౨౦సూత్రములును ఉన్నవి.

---

3-వ ప్రశ్న ౨-వ అధ్యా. పేజీ ౩౬౮ మొదలు ౩౭౪ వఱకు.

పాపులపరిత్యాగవిషయములు-తద్విధానములు- వారికి ప్రేతకార్యాదులను చేయవలసి యుండుటలు- ఇందలికీతులు- ఉదకోపస్పర్శనానంతరము గ్రామములో ప్రవేశింపదగు నను ట— పరిత్యక్తులతో సంభాషణాదులు కూడ వనుట - ప్రమాదమున చేసినచో ఆచరించుకొన దగినప్రాయశ్చిత్తములు- ఇది బుద్ధిపూర్వకమైన చేయదగురీతి - ఆజ్యహోమాదులు- సర్వ పాపములలోను నిదియే శాంతికర్మ యనుట- అని ఇందు ౨౦ విషయములు ౧౫ సూత్రము లు నున్నవి.

---

3-వ ప్రశ్న 3-వ అధ్యా. పేజీ ౩౭౪ మొదలు ౩౯౪ వఱకు.

పతితులను పరిగణించుట – అందు గమనింపవలసిన ముఖ్యాంశములు - పతితసహవాసా దులకు ప్రాయశ్చిత్తనిర్ణయము- ద్విజాతిత్వపతనము, పరలోకహాని, నరకవాసము మున్నగు నవి ప్రాయశ్చిత్తము చేయనిచో కల్గుననుట- గురుతల్పభ్రూణహాదులచే పతితత్వము గల్గుట- మహాపాతకసమములగు కూటసాక్ష్యాది పాపములు - ఋత్విగాచార్యులు స్వధర్మనిర్వహణము

ములు-ఈకారణముచేతనే అభ్రాతృక యగుకన్యను పెండ్లాడరా దన్న నిర్ణయ మనుట-ఇందు మను ప్రభావములు - వ్యాఖ్యాతల భిన్నరీతులు - సంతానహీనుని దాయమునకు హక్కుదారులను పరిగణించుటలు - అందు మనువ్యాసబృహస్పతుల సిద్ధాంతములు - పత్నీదాయమును గురించినచర్చ - దేవరునివలన సంతానము బడయందగు ననుట - దేవరులుండగా నన్యునికి పుట్టిన సంతానమునకు దాయము లేదనుట- మనుబార్హస్పత్యాదుల సమ్మతి - స్త్రీధనవిచారణ - స్త్రీ ధనమునకు దాయభాక్కులు - భగినీశుల్కమునకు దాయభాక్కులు - భగినీశుల్కమును మాతృమరణానంతరమే పంచుకొనదగు ననుట - మఱికొందఱాచార్యుల భిన్నాభిప్రాయములు - అసంసృష్టవిభాగరీతి - సంసృష్టివిషయములో హక్కుదారులు— యాజ్ఞవల్క్యుని సమ్మతి-విభాగానంతరము పుట్టినవాని దాయవిషయము - అందు బృహస్పతియాజ్ఞవల్క్యమను నారదాదుల భావములు - విద్వత్సోదరుని స్వార్జితమునుండి తక్కినవారికి దాయము లే దనుట-విద్వాంసులు కాని తక్కినసోదరుల విభాగనిర్ణయము-దాయభాక్కులగు పుత్త్రులను పరిగణించుట ఇందలిచర్చలు - దాయమునకు హక్కు లేకయుండి కేవలము గోత్రమునకు హక్కుగల పుత్త్రుల పరిగణించుట- ఇందు మనుయాజ్ఞవల్క్యాదుల భావములు. ఔరసాదిపుత్రులు లేనిచో వీరును దాయభాక్కులే యగుదురనుట - అందు భాగాంశనిర్ణయము - మను కాత్యాయనాదులగు స్మృతికర్తల యభిప్రాయములు - బ్రాహ్మణుని దాయమును అసవర్ణాపుత్రులు పంచుకొనదగినరీతులు - అందురాజన్యాపుత్రులక్రమము - రాజన్యావైశ్యాపుత్రుల సముదాయమున నవలంబింపదగినరీతులు - ఇందు శూద్రపుత్త్రుని అంశనిర్ణయము - అన్యాయ్యవృత్తుడైనచో సవర్ణాపుత్రుడైనను అంశార్హత లే దనుట - అనపత్యుడగుబ్రాహ్మణుని దాయమును పంచుకొనదగిన ఇతరులు- అందుశ్రోత్రియరాజాదులు - అందును జడక్లీబాదుల విషయమున గమనింపదగినవిధులు- ప్రతిలోమసుతుల దాయభాగక్రమము - విభాగించుకొనరానివానిని పరిగణించుట- ఇందు దాసీలవిషయము - విభాగమును చేసికొనుటలో సందేహాదులు కల్గినప్పుడు చేయదగినరీతులు- అందుశిష్టపరిషత్తును నిర్ణయించుట - పరిషత్స్వరూపనిరూపణము - పరిషత్తు సంభవింపనిచో చేయుదగిన విధానము - విప్రతిపత్తి గల్గుచో వేదజ్ఞుడగుశ్రోత్రియుని నడిగి అతడు చెప్పినట్టులుగా పోవలయు ననుట - ఇదియే ప్రశస్తమని సిద్ధాంతించుట- ఇందులకు గలకారణములు - సాధారణులగు ధర్మపథులకంటెను ధర్మవేత్తయై ధర్మముల నాచరించువారు స్వర్గఫలము నొందుదురని నిర్ణయించుట- గ్రంథాంతము-అని యిట్లిందు నూటికిపైగా విషయములును, ఏఁబదిరెండు సూత్రములును కలవు.

విషయసూచిక - సమాప్తము.

---

# ప్రకాశకుల విజ్ఞప్తి.

క. ఏ పరమేశుఁడు కృప నా, కీపాటిగనైన సేవ సేయఁగ నీ భాగ్యం
బాపాదిల్లఁగఁ జేసెనొ, యాపరముని పాదపీఠి నలరింతు నతుల్.

ప్రస్తుతకాలమున నాంధ్రదేశమందంతటను దేశసేవ యను ధ్వనులు తఱచుగ వినవచ్చుచున్నవి. పిల్లలు మొదలుకొని పెద్దలవఱకును గలసర్వులును సమస్తవిధముల తమకుదమకు ఈశ్వరుడనుగ్రహించిన శక్తియుక్తులను భక్తిప్రపత్తులతో వినియోగించి ఆరాధనాతత్పరులగుచున్నారు. ప్రతిపట్టణమునందును ప్రతిపల్లెయందును గూడ ఆయాపరిస్థితికి దగిన పరికరములతో భాషాపరిషత్తులు గ్రంథాలయములు గ్రంథమాలికలు విజ్ఞానప్రచురణసంస్థలు దినదినము నెన్నెన్నియో గానవచ్చుచున్నవి. పరిషత్తులు పండితసభలు సారస్వతసమావేశములు మున్నగువానికిక లెక్కలేనేలేదు. స్థూలదృష్టిని చూచినచో నిది యభివృద్ధిగనే కన్పట్టును; కాని సూక్ష్మదృష్టికి యథాప్రకారమున కావంతయు గొంతంత కన్పడకున్నది. ఏమందురా—జాతీయత జాతీయవిద్య అనుమున్నగువానిని మన మేకరువు పెట్టుచున్నామేకాని, నిక్కముగా మనకు జాతీయతాదులను గల్గించు విజ్ఞానమువంకకు మనచూపులను ప్రసరింపఁ జేయలేదు. దేశకాలాదుల మార్పును బట్టి విదేశీయవాఙ్మయమునుండి మనము సేకరించుకొనవలసి యున్న వాఙ్మయనిధానము అవగతముగా నున్నను స్వదేశీయమును అనాదియు నగు సంస్కృతవాఙ్మయమునుండి పరివర్తించి ప్రకటింపవలసినట్టిది- ప్రస్తుతకాలస్థితుల కుద్బోధకమగునట్టిది- అగువాఙ్మయరాశి యనంతముగా గలదు. భారతవర్షమందలి ఇతరప్రాంతములవారికన్న నీవిషయమున మాత్ర మాంధ్రులు వెనుకబడియే యున్నారనుట సత్యము. ఇందులకై ఆంధ్రులింతటనైన పూనుకొనుట మిగుల ముఖ్యము. అప్పుడుగాని సర్వతోముఖ మగునభివృద్ధి యని చెప్ప వలనుపడదు.

పైని పేర్కొన్నలోపమును యథాశక్తి పూరించుటకే ఉడుతశక్తిం బోలిన మా యీప్రయత్నము. మాప్రయత్నముయొక్క ఫలితమే ఈఆర్యభారతీగ్రంథమాలికరూపమున సోదరదేశీయుల సన్నిధిని సమర్పితము అగుచున్నది. ఆర్యభారతీగ్రంథమాలికయొక్క ముఖ్యోద్దేశము ప్రాచీనమగు నార్యవిజ్ఞానమును సమూలముగను సవ్యాఖ్యముగను సవిశేషముగను కూడినంతవఱకు సప్రమాణముగను ప్రకటించి, సోదరదేశీయులకు సాధారణముగా చౌకగా లభించునట్లు సేయుటయే యని మనవి చేయుచున్నాము. ఇకను ప్రకృతము ప్రకటింపబడుచున్న యీగ్రంథము మాగ్రంథమాలికయందు తొలుదొల్తటికుసుమము. ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధపురుషార్థములలోను మొట్టమొదటిదగు ధర్మపురుషార్థమును గుఱించి వివరించునట్టిది. దీనిని రాజ్యపాదుఁడగు గౌతమమహర్షి రచించుటవలన దీనికి గౌతమధర్మసూత్రము లనియును గౌతమధర్మ మనియును వాడుక గలదు.

ఆర్యుల ధర్మశాస్త్ర గ్రంథములలోని కెల్లను సూత్రగ్రంథములు మిక్కిలి పురాతనవ వని పెద్దలవలన విందుము. కేవల మొక్క ధర్మశాస్త్రగ్రంథములనే గాక, అన్ని శాఖల అన్ని విషయములందునుగూడ సూత్రగ్రంథములే అత్యంతము పురాతనము లనుట విజ్ఞు ను ఐకకంఠ్యముగ నొప్పుకొన్న విషయము. ఇయ్యది పాశ్చాత్త్యపండితులు [వారి యభి ములను మున్ముందువివరించెదను.] ను, అంగీకరించినదే. సూత్రగ్రంథములందు త్రయీవి లను, త్రివర్గముఁగూర్చిన విజ్ఞాన విషయములను చదువరులు కంఠస్థముగ జేసి నిల్పుకొనఁ లభ్యమును, సౌకర్యమును విరివిగా గలదు. గనుకనే తొల్లిటివారు తొల్త సూత్రగ్రంథ ప్రచారమునఁ బెట్టిరి.

ధర్మసూత్రములనుగుఱించి మనమహర్షులు రచించిన గ్రంథములలో పెక్కులు కాలగ లీనమైనవి. అనాదియునపరిచ్ఛిన్నమునునిత్యమును అగు వేదభాగముననే పెక్కులు ఖిలమై టయును, అనేకము ఖిలత్వమునొంది ఖిలసంహిత లన్నపేరుతో ఖండలుగా ప్రచా నుండుటయును తప్పనిసరి యైనప్పుడు వానితర్వాతి వగు ఋషిప్రోక్తములు ఖిలత్వవ దినవనుటలో నాశ్చర్యపడదగినట్టికారణ మేదియును లేదుగదా.

మనయీకాలమున నుపలభ్యమానము లగునట్టి ధర్మవిషయకములగు సూత్రగ్రంథవ ని కెల్లను మహర్షిగౌతములు రచించిన ధర్మసూత్రములే మొట్టమొదటివిగా గన నున్నవి. ఎంతగా నన్వేషణకార్యమును నెఱపినను నింతకన్నను ప్రాచీనములగు ధర్మసూత్ర ములు లభించుటలేదు. ఆపస్తంబుడు బోధాయనుడు కాత్యాయనుడు మున్నగువారి సూత్రగ్రంథములు కొన్ని కానవచ్చినను అయ్యవి చారిత్రిక దృష్ట్యా, పారంపర్య దృష్ట్ గౌతముని ధర్మసూత్రగ్రంథములకు దఱువాతగూర్పఁబడియున్నవే కాని అంతకు పూ మాత్ర మెంతమాత్రమును కావనుట నిక్కము. ఇయ్యదియు సర్వజనాంగీకృత మైనదే. క్క ధర్మసూత్రము ఒక్కొక్క శాఖ వారికి [అనగా యజుర్వేదులకు ఆపస్తంబధర్మ ము లనుసరణీయము లైనరీతిగా] అనుసరణీయముగా పూర్వులు ఏర్పఱచి యున్నారు. గౌతమధర్మసూత్రములు ఛాందోగ్యులకు (అనగా సామవేదులకు) అనుసరింపదగిన వని వలన వినికి. దీనికి దగినట్టులుగానే ఈగ్రంథమునందే ఇందులకు ఉపోద్బలకములుగా న యములు అనేకము గలవు. బ్రహ్మచర్యాదులగు నాశ్రమములలో గల వికల్పసము బాధపక్షములలో బాధపక్షము [అనగా నైకాశ్రమ్య పక్షము] ఉత్తమ మని సుస్పష్ట చెప్పుటయును, చత్వారింశత్సంస్కారములను విధించు పట్టులలో ఆత్మగుణములు సంస్కా కంటెను నావశ్యకములని సిద్ధాంతీకరించుటయును, అనుమున్నగునవి ఈపైజెప్పినదానిని ర్థించుటకు తోడ్పడునట్టి కారణములుగాగూడ గన్పడుచున్నవి.

ధర్మసూత్రము లన్న పేరును బట్టియే ఈగ్రంథము ధర్మములను వివరించు నట్టివాక్య మని స్పష్టపడుచునే యున్నయది. అయినను ధర్మమన్న నేమియో మున్ముందు తెలిసికొ ని ఆపిమ్మట ధర్మసూత్రములను గుఱించిన చర్చపూర్తిగా చేయ వలనుపడజాలదు కావు

ము మున్ముందు మన ప్రాచీన మహర్షులు ధర్మమనగా నేమని నిర్వచించిరో తెలిసికొనవలసియున్నది. కనుక నావిషయమును పరికింతము. ధర్మమన నేమి?

సాధారణమగు శబ్ద నిష్పత్తిని బట్టి డుధాఞ్ ధారణపోషణయోః- అని చెప్పిన ధాఞ్ ధాతువు నుండి ధర్మశబ్దము నిష్పన్నమగుచున్నది. దీనికి మనపూర్వులలో 'ధరతి లోకా నితి ధర్మః' అని కొందఱును, 'ధ్రియతే పుణ్యపురుషైరితి ధర్మః' అని ఇంక గొందఱును వ్యుత్పత్తులను చెప్పియున్నారు. సుఖాభిలాషయును, దుఃఖనిరసనమును ప్రతిజీవియును కోరునట్టివే; కాని ఇయ్యవి (అనగా సుఖదుఃఖములు) జీవులకు వారివారి కర్మల ననుసరించి గల్గుచుండును. అనగా సత్కర్మలవలన సుఖమును దుష్కర్మలవలన దుఃఖమును గలుగునని భావము. అయితే- ఇవి సత్కర్మలు ఇయ్యవి దుష్కర్మములు అని నిశ్చయించుట యెట్లందురేని అయ్యది ధర్మాధర్మవివేకమువలన సాధ్య మగును. అందునను పరిశిష్టన్యాయము ననుసరించి ధర్మము నెఱింగినచో తద్భిన్న మధర్మమని తేలును. కాంబట్టియే మనవారు ధర్మమును నిర్ణయించు గ్రంథములను కూర్చియున్నారు. ఇక ప్రకృతము ననుసరింతము. పైని చెప్పినట్టివ్యుత్పత్తులను చర్చించిచూచినచో, ధర్మమనగా నైహికాముష్మికసుఖమును గూర్చు లోకతంత్రమని నిర్ధారణమగుచున్నది. ఇట్టి తాత్పర్యముకలదు గనుకనే, సమస్తలోకమును వారివారి యాశ్రమములకును జాతులకును గుణములకును నిమిత్తములకును అనుగుణములైనట్టికార్యములను విధించుటద్వారా లోకయాత్రను సాగించి ధరించుటం జేసియును, అనుగుణములు కానట్టివియును, ఐహికాముష్మికములకు అడ్డును గల్గించునట్టివియు నగు ప్రతికూలకార్యములను పనికిరావని నిషేధించి లోకమును నియమించి నిల్పుచున్న కారణమును బట్టియును ధర్మశబ్దమునకు మనపూర్వులు చెప్పిన వ్యుత్పత్తులు న్యాయ్యములే యనియును, సత్యదూరములు కావనియును మనము నిశ్చయింపవలసి యున్నయది. కాంబట్టి మొత్తముమీద లోకయాత్రకనుకూలించు సమస్తములగుహితములను ఆచరించుటయే లోకరక్షకమగు ధర్మమనియును, అయ్యది ప్రతిజీవికి ముఖ్యాచరణీయ మనియును అట్టిలోకయాత్రానుకూలములగు హితములను సేకరించి బోధించువాక్యగ్రంథములు ధర్మసూత్రములనియును సిద్ధాంతితము.

*గౌతమధర్మమును గురించి మనకు దెలిసినవిషయములు చాల తక్కువ. అందువలన వానినాధారపఱచుకొని మనముచేయు నిర్ణయములు చాల అస్పష్టముగాను, సందేహాస్పదముగాను ఉండును. రెండువిషయములుమాత్రమే తృప్తికరముగ సిద్ధాంతము చేయవచ్చునని తోచును. అవి యేవనగా (1) ఈగ్రంథమునకును సామవేదమునకును ఒక గౌతమచరణమునకునుగల సంబంధము ఒకటి. ఇప్పుడున్న నాలుగు ధర్మసూత్రములకంటె నిది కడుప్రాచీనమైనదన్న విషయము మొకటి. ఇంతకంటె ఎక్కువ విషయములనుగుఱించి యోజించుటకు ప్రస్తుతము అసాధ్యము.

---

*గౌతమధర్మసూత్రములను గుఱించి ఈపైని వ్రాసినయంశములు పాశ్చాత్యపండితులగు బూలర్ మున్నగువారలు విమర్శించి వ్రాసినట్టివి. చదువరుల యుపయోగమునకై వానినాంధ్రీకరించి యిచ్చిన నాసోదరులు శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు నాకుచాలతోడ్పడినారు. ఇందులకై వారికి యావజ్జీవము కృతజ్ఞుడను. [పం. ఆ. శా.]

ఎందువల్ల ననగా సామవేదమును అధ్యయనముచేయు శాఖలచరిత్రమును గుఱించి ఏ
నేమియు తెలియదు. అదియునుంగాక ఈగౌతమ ధర్మమున కాధారములైన గ్ర
గుఱించి తెలిసికొనుటకు ఈగ్రంథమున దగినన్నియవకాశములు లేకపోవుట యట
యెక్కువగ గాకపోయినను గొంతవఱకైనను ఇందు గ్రంథాంతరమందలి పాఠముల
వచ్చినవి. ఈగ్రంథము నెవ్వరురచించి రన్నవిషయమున నొకగాథ కలదు. ఆగాథ
ధర్మశాస్త్రకర్త ఉతథ్యమహర్షియొక్క కొడుకో మనుమడో అనియు, ఉశనసుడులే
యొక్కమనుమడో లేక మునిమనుమడో యనియు, ఈగ్రంథము త్రేతాయుగమునక
ప్రమాణమనియు తెలియుచున్నది. విపరీతమయిన యీకల్పనాకథ నంతను గొట్టి
సర్ మాక్సుముల్లరుదొరగారు హేతుకమైన మాటలు కొన్ని చెప్పినాడు. అప్పటినుండి
వాఙ్మయమును గుఱించి వ్రాసినవారెల్లరు అతడుచెప్పిన విషయమునే యనువదించినా
డు. తన ప్రాచీనసంస్కృత వాఙ్మయచరిత్రమున(పుట ౧౩౪) నిట్లు చెప్పుచున్నాడు.
తీవ్రమైన సందేహములకు అనుమానములకు అవకాశమున్నను సామవేదచరణముల
ట్టిదైన గౌతములకు సంబంధించినది మఱియొక ధర్మశాస్త్రము కలదు. ఇది సరియైన
క్రింది హేతువులవలన రుజువు చేయవచ్చును. గౌతముని గ్రంథము ధర్మశాస్త్రమనిక
సూత్రము లనిగాని బరగుచున్నప్పటికి, రూపములోనేమి విషయములోనేమి
యన, ఆపస్తంబ, హిరణ్యకేశి వైదికశాఖలకు సంబంధించిన కల్పసూత్రములలోని
గమగు ధర్మసూత్రములను బోలియున్నది. చరణవ్యూహమునుబట్టియు, ప్రాచీన
శాస్త్రజ్ఞుల రచనలను బట్టియును కల్పసూత్రములలోని యనేకోదాహరణ
బట్టియు, పూర్వకాలమున శ్రౌత, గృహ్య, ధర్మసూత్రములను గలిగిన వైదిక
చాల ఎక్కువగ నుండెడి వనియు, ఆశాఖలకు సంబంధించిన గ్రంథజాలము చ
ము నష్టమైకాని, అథవా వేఱువేఱు భాగములు అసలు మూలగ్రంథములోనుండి చె
టచేతనో విడిపోవుటచేతనో శిథిలమైగాని యుండవలె నని తెలియవచ్చుటచేత,
ఋషివిరచిత మని తెలియవచ్చు ధర్మసూత్రగ్రంథము అసలు ఒకానొక గౌతమ
నకు సంబంధించినగ్రంథ మని యూహించుటకు హేతుకము కాక పోదు. గౌతమమనుపేరి
న సామవేదశాఖ యొకటి పూర్వముండె నన్న విషయము ఈయూహకు బలము. గౌతము
రబరగిన సామవేదులు రాణాయనీయులలోనిఒక తెగవారుగ చరణవ్యూహమున
నబడిరి. సామవేదమునందలి వంశబ్రాహ్మణమున గూడ సామవేదాచార్యులలో నలుగు
షూన్వయులు పేర్కొనబడిరి. వారెవ్వరనిన,(౧)గాత్ర గౌతములు [౨] సుమంత్ర భాభ్ర
ములు (3) శంకర గౌతములు (४) రాధాగౌతములు. అంతేకాక యిప్పుడున్న శ్రౌత
సూత్రములు కూడ గౌతమాభిప్రాయములను, స్థవిరగౌతమాభిప్రాయములను తెలుపు
చుండును గనుక వీటినన్నిటిని బట్టిచూడగా పెక్కుగౌతమచరణములు కాకపోయిన
ధమము ఒక్కటైనను సామవేదమును అధ్యయనము చేయుచుండినట్లును ఇప్పుడున్న
యున గోభిలసూత్రములు విరచింపంబడిన కాలమున గౌతమ శ్రౌత గృహ్య సూత్రముల

వేద వాఙ్మయమున నొక భాగముగ నుండెననియు నూహింపవచ్చును. సామవేదాచార్యులైన గౌతములచే రచియింపబడిన దనంబడు పితృమేధసూత్ర మొకటి బర్నెలు దొరగారికి దొరకినది. దానిని బట్టి ఈచివర తెల్పినయూహ సరియైన దని సిద్ధాంతము చేయనగును.

అందువలన గౌతమధర్మ సూత్రమును గురించిన ప్రమాణపరంపరను పూర్తిచేయుటకును, ఈధర్మసూత్రమునకును సామవేదమునకును గలసంబంధమును స్పష్టపఱచుటకును ఇక నొక కొఱతమాత్రము కలదు. ఈధర్మసూత్రములలో ప్రత్యేకము సామవేదమును గుఱించిన సూచన లున్నయెడల ఈకొఱత తీరిపోవును. ఇట్టి ప్రమాణము మనకు దొరకనంతకాలమును గౌతమధర్మశాస్త్రము ఒక వైదికచరణమునకు సంబంధించిన గ్రంథమైనప్పటినికి, గౌతములొకరు కానియనేకులుకాని సామవేదమును గుఱించినకర్మకాండ బోధించి సామవేదశాఖల నేర్పఱిచినప్పటికి, ఈధర్మశాస్త్రము ఇతరవేదమునకుసంబంధించినదని కూడ అనవచ్చును. ఎందువల్లననగా గౌతమాన్వయులు ఇతరవేదములకు సంబంధించిన గ్రంథములలో ఆచార్యులుగ కూడ పేర్కొనబడి యున్నారు. అయినను మనధర్మశాస్త్రమును రచించిన గౌతముఋషి సామవేదియనిచూపుట కష్టము కాదు. ఎట్లన (౧) గౌతముడు కృచ్ఛ్రాదులను గుఱించి తెలుపు ౨౬-వ అధ్యాయమును పూర్తిగా సామవేదమునకు సంబంధించిన యెనిమిదవ బ్రాహ్మణములలో నొకటియగు సామవిధానమునుండి గ్రహించెను. సాధారణముగ వైదికరచనలలో గానరాని దేవత లనేకము లాహూయముచేయబడినమంత్రములలో (౧ ౨-వ సూత్రము) తప్ప మిగిలిన యన్నివిషయములలోను రెంటిలోనిమూలపాఠము నొక్కటియే. (౨)జపతపహోమోపవాసాదులను గుఱించి చెప్పు సందర్భమున (౧౯-౧౨) గౌతముడు సామవేదము వైపునకుప్రత్యేకము మొగ్గుదల చూపుచున్నాడు. ఈసందర్భమునందుజెప్పినసూత్రములలో తొమ్మిదికి తక్కువలేకుండ సామవేదమునకు సంబందించినవి కలవు. ఈతొమ్మిదింటిలో బృహద్రథంతర జ్యేష్ఠ మహాదివాకీర్తి సామములవంటివి ఋగ్వేదయజుర్వేదములకు సంబంధించిన గ్రంథములలో గూడ గానవచ్చును. అన్నిశాఖలబ్రాహ్మణములును గూడ వాటికి గొప్పమహిమ మున్నదందురు. కాని పురుషగతి, రోహిణ, మహావైరాజ సామములవంటి యితరమంత్రములు ఒక్కసామవేదమునకు సంబంధించిన గ్రంథములలోనేగాని మఱియెచ్చటను గానరావు. సాధారణముగ వాటి కంత గొప్ప ప్రసిద్ధికూడ లేదు. (3) రెండుసూత్రములలో (౧-౫౦ ౨౫-వ) గౌతమధర్మసూత్రమున అయిదువ్యాహృతులు పేర్కొనబడినవి. అందుమొదటి సూత్రమున కడపటివ్యాహృతి సత్యము. కాని పెక్కువైదిక గ్రంథములలో భూః భువః స్వః వ్యాహృతులు మూడుమాత్రమే పేర్కొనబడెను. ఒకొక్కప్పుడు అరుదుగ నాలుగు, లేక ఏడు వ్యాహృతులు పేర్కొనబడుచుండును. కానిసామవ్యాహృతిలో హరదత్తుడు చెప్పినట్లు ఇటువంటివి అయిదు కలవు. వాటిలో సత్యమొక్కటి. కావున పైసూత్రములలో గౌతముడు ప్రత్యేకము సామవేదమునుండియే వాటిని గ్రహించియున్నాడనుట నిస్సంశయము. ఈపైనుడివిన మూడుహేతువులనుబట్టి చూడగా మనధర్మశాస్త్రకర్త సామవేదియే యని విశ్వసింపదగి యున్నది. సామవిధానములోని కొంత భాగమును గౌతముడు తన గ్రంథమున పొందు

పఱచె నన్నంతమాత్రముననే అతడు సామవేదియని యనలేము. ఏలయన ఆతఁడు తై
రీయ ఆరణ్యకమునుండి కూడ కొన్ని సూత్రములను [౨౫-౧-౬] గ్రహించెను. అయిన
జప తప హోమోపవాసాదుల విషయమునందు నాతడుచూపిన సామపక్షపాతమునకు
బ్రాహ్మణుల కత్యంతము పవిత్రమైనట్టియును ముఖ్యమైనట్టియును కర్మకాండలో నొకటియ
దీక్షావిధాన మంత్రములలో (౧-౫౦) నొకభాగముగ నున్న సామవ్యాహృతినుండి వ
హృతులను గైకొనుటకును ఆతడు పైనుడివినయట్లు సామవేది యన్ననే సమాధానము కు
రునుగాని లేనిచో అందులకు కారణము వేఱొకరీతిని సమర్థింప వీలులేదు. ఈపైవిధమున
తమధర్మసూత్రములు సామవేదమునకు సంబంధించినవని ప్రాఫెసరుమాక్సుముల్లరు గా
చెప్పిన విషయము సరియైనదిగనే కాన్పించుచున్నప్పటికి, ఇది రాధాకాంతుని శబ్దకల్ప
మమునం దుదాహృతమయిన చరణవ్యూహము ప్రకారము రాణాయనీయ శాఖలోని ద
గౌతమ చరణమునకు సంబంధించినదే యని స్పష్టముగా నొక్కిచెప్పుటకు ప్రస్తుతము సాధ్య
కాదు. వంశబ్రాహ్మణములో గౌతమాన్వయులైన నలుగు రాచార్యులు పేర్కొనం
యుండుటను బట్టియు, ఇరువురు గౌతముల యభిప్రాయములను లాట్యాయనుడుకొన్ని కొన్ని
ధర్మముల నుదాహరించుటనుబట్టియు, ఒకప్పుడు సామవేదులైన బ్రాహ్మణులలో గౌతమ చర
ములనేకము లుండియుండు నని యూహించుటసమంజసము కాక పోదు. వీటిలో మనధర్మస
త్రము లేచరణమునకు సంబంధించినచో స్పష్టముగ జెప్పుటకు సాధనమేదియు లేదు. సామ
దశాఖల చరిత్రను గుఱించిన పరిశోధనము లింకను జరిగిన మనకింకను ఎక్కువ సంగతులు తె
య వచ్చునేమోకాని లేనిచో నిప్పటి కింతటితోనే తృప్తినొంది యుండవలసి యుండును
ప్రస్తుత మనిశ్చయముగ నున్నయీవిషయమును నిశ్చయపఱచుటకు ఇప్పటికిని దక్షిణనిహి
దూదేశమున సామవేదులలో నున్నగాథలును, దక్షిణమున దొరకంగల క్రొత్తగ్రంథములు
ప్రాయికముగఁ దోడ్పడ వచ్చును.

పైకి స్పష్టముగ జెప్పక పోయినను గౌతమధర్మసూత్రములకును సామవేదమునకును గ
సంబంధము హరదత్తునికి తెలిసినట్లు ఊహింపదగి యున్నది. ఏలయన నతడు తన వ
ఖ్యానములో ఛందోగుల ఆచారమును గురించియే తఱుచు తెలుపుచు, వారియాచార వ్యవహ
రములను వివరించుపట్టులలో సామవేదులలోనియొకశాఖ యగు జైమినీయుల గృహ్యసూ
ములనుండి యుదాహరణము లిచ్చుచుండును. గోవిందస్వామి (మరియొక దాక్షిణాత్య గ్రం
కర్తయును] బోధాయనసూత్రములను గుఱించిన తన వ్యాఖ్యలో (౧-౧-౧౭) ఈగౌత
ధర్మసూత్రమును మొదట ఛందోగులు మాత్రమె అధ్యయనము చేయుచుచుండెడివా రని
లుపుచున్నాడు.

ఇక నిప్పుడు ఇతరధర్మసూత్రములకంటెగౌతమధర్మసూత్రములే ప్రాచీనములైనవనిన వి
యమును గూర్చి యోజింపవలసి యున్నది. ఇందువిషయమై బోధాయనవాసిష్ఠ ధర్మసూత్రవ
లను విచారణలోనికి దీసికొన్న జాలును. ఆపస్తంబ,హిరణ్యకేశి సత్యాషాఢధర్మసూత్రములు బ
ధాయన ధర్మసూత్రములకంటె తరువాతివి. బోధాయన వాసిష్ఠ ధర్మసూత్రములకం

నున్నది. బోధాయనుడు [౨-౨-౨౦) వేదాధ్యయన యజన ప్రతిగ్రహములవలనఁ దన్ను దాను
పోషించుకొనలేని బ్రాహ్మణుడు క్షత్రియవృత్తి నవలంబింపవచ్చు ననుచు, ఇంకను ఇట్లు చెప్పుచు
న్నాడు. "గౌతము డట్లు కూడ దనుచున్నాడు. ఏలయన క్షత్రియ ధర్మములు అవలంబించుటకు
బ్రాహ్మణునికి కడునిష్ఠురములైనవి క్రూరమైనవి" అని.

వ్యాఖ్యాతయైన గోవిందస్వామికూడ సూచించినట్లు మనధర్మసూత్రమున దానికిసరి గా
వ్యతిరేకసిద్ధాంతమే చెప్పబడినది. ఆపత్కాలమున బ్రాహ్మణుడు క్షత్రియవృత్తి నవలంబింప
వచ్చునని మనధర్మ సూత్రము స్పష్టముగ తెలుపుచున్నది. అయినను ఈవిషయమున,
బౌద్ధాయనుడు తెలిపినయభిప్రాయము మనధర్మ సూత్రకర్త తెలిపినది కాదనియు, ఎవ
రో మఱియొకగౌతముడు తెలిపినదనియు చెప్పి గోవిందస్వామి యీవైరుధ్యమును సమాధానప
ఱుచుచున్నాడు. ఈపైన తెలిపిన దానినిబట్టి చూడగా పూర్వము ప్రాచీనగౌతమధర్మసూత్ర
ములు రెండో అంతకెక్కువగనో యుండుననుట అసంభావ్యము కాదు. వ్యాఖ్యాత చెప్పినదికూడ
సరియైనదే కావచ్చును. కాని ఈచిక్కుకుకారణమైన యీధర్మసూత్రభాగము [౬-౬] హరదత్తు
డు గౌతమునిదిగనే గ్రహించుచున్నప్పటికి, నామట్టుకుచూడగా నిది ప్రక్షిప్తమని తోఁచును. నా
కట్లుప్రక్షిప్తమని తోఁచుటకు కారణమేమనగా క్షత్రియవృత్తినవలంబించుటకు ఒసంగినయనుజ్ఞ
గౌతముని మఱిరెండితరసూత్రములలోనిభావమునకు విరుద్ధముగానున్నది. ఎట్లన—ఆపత్కాలధర్మ
ములను గుఱించి తెలిపిన అదియేయధ్యాయముచివరనే [౬-౨౫] ప్రాణసంశయావస్థలో
బ్రాహ్మణుడు శస్త్రములను జేతఁబట్టవచ్చునని కలదు. ప్రాణసంశయావస్థలోనే తప్ప మఱియే
యితరసమయములందును బ్రాహ్మణుడు పోరాడరాదనియే పైమాటల కర్థము యుండును. కాని
ఆఱవసూత్రముప్రకారము శస్త్రోపజీవియైనక్షత్రియునివృత్తి నవలంబింప వచ్చును. అదియునుం
గాక శ్రాద్ధకల్పమును గురించి చెప్పుఅధ్యాయములో (౧౫-౧౮) ధనుర్వేదోపజీవులైన బ్రా
హ్మణులు శ్రాద్ధభోజనపంక్తికి ప్రతిషేధింపబడవలసినవా రని కలదు. బ్రాహ్మణుడు క్షత్రియ
వృత్తి నవలంబింపరా దని గౌతమాభిప్రాయమైనట్లు బోధాయనుఁడు చెప్పినదానిని ఈపైసూ
త్రములను కలిపి సమన్వయించి చూచినచోట. 6 వ సూత్రము గౌతమునిదేనా? యని బల
మైన సంశయము తోఁచును. అందువలన హరదత్తుడు స్వీకరించిన ధర్మసూత్రములలోనే అధ
మము మఱియొక ప్రక్షిప్త ముండుటచేత పైసూత్రము గౌతమునిది కాదని త్రోసివే
యుటకు సందేహింపను. ఈప్రక్షిప్తమనునది సామవిధాన బ్రాహ్మణమునుండి గ్రహించిన
యధ్యాయము [౨౬-౧౨] లోని మంత్రములకు సంబంధించిన మూడు మంత్రములు నిశ్చ
యముగ నిటీవలివి. ఏలయన ప్రాచీన సూత్రకారులు శివునికి గాని, మఱియేయితర పౌరాణి
క దేవతకు గాని తమగ్రంథములలో చోటీయరు.

వసిష్ఠధర్మమున గూడ రెండు చోటుల గౌతమాభిప్రాయము సూచితమై యున్నది. కాని
బోధాయనునిసూచనల విషయమునవలెనే వాటిలో నొక్కదానిని మాత్రమే మనధర్మసూత్ర
మున కనిపెట్టగలము. ఈరెండు సూచనలునుగూడ వసిష్ఠధర్మమున ఆశౌచమునకు సంబంధిం
చిన భాగమునందు (౪) గలవు. [అచ్చటి సూత్రములివి. చూడుడు సూ: [illegible]] రెండు

ఉదాహరణములలో మొదటిది గౌతమధర్మముగర అధ్యాయము ౭౭-వ సూత్రమును సూచించు చున్నది. అదియేదనగా ఒక శిశువు చనిపోయిన యెడల బంధువుడు వెంటనే ఆశౌచ నివృత్తి చేసికొనవలె నని సరిగా వ్యాఖ్యానము చేసిన యెడల ౩౮-వ వసిష్ఠధర్మ సూత్రము నకు శిశువు చనిపోయి నపుడును, గర్భస్రావము జరిగి నప్పుడును కూడ బంధుగులు తత్క్షణమే ఆశౌచనివృత్తులు కావలెనని గౌతముడు వక్కాణించు చున్నాడనియే యర్థము చెప్ప వలసినప్పటికి, సద్యశ్శౌచము ౩౩-వ సూత్రమునజెప్పబడిన పైరెండు సందర్భములలో నొకదానికి మాత్రమే వర్తించుటకూడ సాధ్యము. ఇటువంటి యుదాహరణములు సూత్రపద్ధతిలో నింకను దొఱకును. ఇట్టివి స్పష్టముగ నున్నవా? లేదా? అని యోజించుట కంటె అందముగ నున్నవా? లేదా? అనియే యోజించి గ్రహించినట్లగపడును. వసిష్ఠ ధర్మ సూత్ర వ్యాఖ్యాత యిట్లే యభిప్రాయపడుటలో సంకోచించుట లేదు. ౩౬వ సూత్రము నందలి రెండవ సూచన విషయములో ఇది ప్రాయికముగ దీనికి వర్తించునని చెప్పదగిన సూత్రమేదియు మన గౌతమ ధర్మమున గానరాదు. బోధాయన ధర్మసూత్రమున [౨-౨-౨౦] గౌతమాభిప్రాయమునకు సంబంధించిన రెండవసూచనను గుఱించినతన వ్యాఖ్యానములో గోవిందస్వామి యీసూత్రము కూడ మఱియొక గౌతమధర్మసూత్రమునుండియే గ్రహింపబడినదని తన యభిప్రాయమైనట్లు తెలుపుచున్నాడు. బోధాయనసూత్రములను బట్టియే " మఱియొక గౌతమ ధర్మసూత్రగ్రంథము పూర్వ ముండినట్లూహించుచున్నాడు. అందువలన వసిష్ఠధర్మములోని ౪-౩౬ నుదాహృత మైన యీయభిప్రాయము చాలవఱకు గౌతమ చరణమునకు సంబంధించిన గృహ్యసూత్రములలోనిదై యుండవచ్చును. ఎందువల్లననగా ఈసూత్రము అసలు గృహ్యసూత్రములలోనిదియు తరుచు అందే వివరింపబడునట్టిదియు నగు భూస్థాపనమును గుఱించిన యధ్యాయమున కెంతవర్తించునో, ఆశౌచనమునకును అంతే వర్తించును.

ఇరువదిరెండవ యధ్యాయముగ వసిష్ఠధర్మసూత్రములలో గాన వచ్చు గౌతముని పందొమ్మిదవ యభిప్రాయము విషయమున, అది సరాసరి గౌతముని గ్రంథమునుండి కాక బోధాయనుని గ్రంథము నుండియే గైకొనబడినదని నేనిదివఱకే చెప్పియున్నాను. ఎందువల్లననగా బోధాయనునివి సహజమైన పాఠము లనేకము లిందుగనబడును: కాని కొన్ని క్రొత్తసూత్రములు కూడ గలవు. కొన్ని సూత్రములు వదలివేయఁబడినవి. అదియునుగాక పవిత్రేష్టి యొక్కయు వైశ్వానర వ్రతపతి యొక్కయు మహత్త్వమును గుఱించి తెలుపు ఒక క్రొత్తసూత్రము చేర్పబడినది. వసిష్ఠుడు వదలి వేసిన సూత్రములలో మొదటి సూత్రమే ముఖ్యమైనది. ఇట్లు వదలివేయుట వలన సంపూర్ణముగ అధ్యాయముయొక్క స్వభావమే మారిపోయినది. ఆయధ్యాయము ప్రాయశ్చిత్తమునకు సంబంధించిన భాగమున మొదట నుండ వలె నని వాదించుటకు గల ప్రమాణాధారములలో నొకటి యైనది. వసిష్ఠుడు సామాన్యముగ పాపనివృత్తి జేయంగల ప్రాయశ్చిత్తములను గుఱించిన చర్చయొక్క ప్రారంభమునను, నేరములకు ప్రత్యేక ప్రాయశ్చిత్తములను దెలిపిన సూత్రముల తరువాతను దానిని కూర్చుచున్నాడు.

ఈకారణములన్నిటిని బట్టియు ధర్మ సూత్రములను గుఱించి యిప్పటికిని గల గ్రంథముల న్నిటిలో గౌతమ ధర్మసూత్రమే కడు ప్రాచీనమైనదని నిస్సంశయముగ జెప్పవచ్చును. ఇట్లు చెప్పుట వలన అందలిసూత్రములలో ప్రతిసూత్రమును మిగిలిన నాలుగు ధర్మసూత్రముల కంటెను ప్రాచీన మైనదిగ గ్రహింపరాదు. ఇదివఱకే రెండు ప్రక్షిప్తములు చూపబడినవి. అట్టివి అందు ముఖ్యముగ సూత్ర పద ప్రయోగములనుబట్టి తెలియవచ్చునవి ఇంకను అనేకము లుండవచ్చును. ఎట్లనగా- ఆపస్తంబ బోధాయనులభాషకంటె గౌతముని భాష పాణినీయసూత్రములకు ఎక్కువ చేరికగా నున్నట్లు కనబడును. గౌతముని గ్రంథమున కసలు మూలసంబంధము తెగిపోయినదనియు, ఒకశాఖకు ప్రమాణముగ నుండ వలసిన గ్రంథము సామాన్య ప్రమాణ గ్రంథమయ్యెననియు, పాణినీయాదివ్యాకరణ పద్ధతులలో ఆరితేరిన పండితులు దీనిని చాలకాలము నుండి అధ్యయనము చేయుచుండిరనియు గమనించినచో, దాని ప్రాచీన భాషా వైచిత్ర్యములు ఇంకను నిలిచి యుండుట కష్టమని తోపక పోదు. అయినను ఏప్రక్షిప్తము లైనను, ఏమార్పులైనను గ్రంథస్వభావము నెక్కువగ మార్చియుండునని నేను తలంపను.

అట్టి గొప్పమార్పు లేవియు కలుగుటకు వీలులేనిపద్ధతిని గ్రంథము జాగ్రత్తగ రచియింపబడినది. బోధాయనుడు గ్రహించినయధ్యాయమునందలి పాఠాంతర ప్రతిభేదములు అనేకము తప్పులతో గూడి యుండుటయు, అంతఎక్కువ మంచిపాఠములు లేకపోవుటయును ఈపైయూహకు కొంతసహకారక మగుచున్నది. గౌతమునికిని బోధాయన వసిష్ఠులకును నడుమ కాలవ్యవధి యెంత యుండునన్నవిషయములో సామవేదశాఖలలో గౌతములస్థానము తేలనంత వఱకు ఏవిధమైన యూహాలుచేయుటకు సాహసింపము. గౌతమవసిష్ఠులకంటె గౌతమ బోధాయనులే దగ్గఱివారేమో! కొన్నిచిత్రము లైనపదములలోను సూత్రములలోను గౌతమబోధాయను లిరువురును ఏకీభవింతురు. వాటివిషయములో వారిరువురు, ధర్మమును గురించి చెప్పిన మఱియే యితరగ్రంథ కర్తలతోను ఏకీభవింపరు. ఎట్లన— సామాన్యముగ బిచ్చగాడని యర్థమిచ్చుభిక్షుపదమును గౌతముడు (౩-౨-౧౧)యోగి యనునర్థములో ప్రయోగించియున్నాడు. ఈపదమే యొకమారు బోధాయన సూత్రములలోను ప్రయోగింపబడినది. వర్షఋతువున యోగి తన నివాసము మార్పరాదని చెప్పు ౩ వఅధ్యాయపు ౧౩ వ సూత్రము విషయమునను నిట్లే అది బోధాయనగౌతమ ధర్మములు రెంటిలోను గాననగును. భిక్షువను పేరును, ఆసూత్రమును బౌద్ధులుకూడ గైకొని యాసూత్రము నాధారపఱచుకొనియే వర్షఋతువులలో బౌద్ధులు ఆశ్రమ (విహార - మోనస్ట్రీ) స్థానములను వదలకూడ దనునాచారము నేర్పాటుచేసికొని యుండుటచేత నవి చాల పురాతనవులై యుండవలయును గదా!

సామశాఖలలో గౌతములస్థానమును గుఱించి మనకు నిశ్చయముగ దెలియరానందున వారిని హిందూదేశ చరిత్రకాలముతో ముడి వెట్టుటకు బ్రయత్నించుట భావ్యముకాదు. హిందూగ్రంథము లెప్పటివను విషయమును నిర్ణయించుటలో ఒకొక్కప్పుడు కడపటియాధారమునకు సూచనగా పరిగణింపంబడు పదమొక్కటి ఈగౌతమధర్మమున ఉండుటచేతగాని, లేనిచో ఈవిషయమై జాగ్రత్తగ నుండవలసిన యావశ్యకత యెంతవఱకు గలదో నేను చెప్పనక్కఱలేకయే స్పష్ట

మగుచున్నది. నేను పైని సూచించినది యవనపదము. కొందఱ యభిప్రాయప్రకారము శూద్రునికిని క్షత్త్రియస్త్రీకిని పుట్టినవాడు యవనుడని గౌతముడు చెప్పుచున్నాడు. [౮-౨౧] ఈయవనపదము గ్రీకు అయోనియన్ పదముయొక్క యపభ్రంశరూపమనియు, హిందూదేశమున నీపదమును, పూర్వకాలమున గ్రీకులకు, అందు ముఖ్యముగా క్రీస్తుకుపూర్వము రెండవ శతాబ్దిలో ఉత్తర హిందూదేశములోని కొంతభాగమునుపాలించిన బాక్ట్రియను(బాక్ట్రియా దేశపు)గ్రీకులకును, ఇండో బాక్ట్రియను(బాక్ట్రియాహిందూదేశములను పాలించిన)గ్రీకులకును వాడియున్నారు. క్రీస్తుపూర్వము నాలుగవశతాబ్దిలో దండెత్తి వచ్చిన అలెగ్జాండరుకు పూర్వము గ్రీకులనుగుఱించి హిందూదేశీయులకు దెలియుననుటకు చారిత్రికప్రమాణమేదియు గానరానందున యవనపదమున్న గ్రంథములు క్రీస్తుకు 300లకుపూర్వము రచియింపబడి యుండవని చెప్పుదుము. కాని, ధర్మశాస్త్రముయొక్కమూలపాఠము ఒక్కపదము నాధారపఱుచుకొని కాలనిర్ణయముచేయుటకు వీలిచ్చునంతటి ప్రామాణికమైనది కాదన్న యాలోచనమాత్రమే కాక ఇట్టికాలనిర్ణయవిషయములో యవనపదమున కెంతవఱకునిశ్చయపఱు పగల శక్తి కలదన్న విషయమే ఇంకను సందేహాస్పదముగ నున్నది. ఏలయన, రుద్రధాముని జూనాగడశాసనములోని పేరును బట్టిచూడగా గ్రీకుకానివాని కీపదము వాడంబడియున్నది.

ధర్మశాస్త్రము వలన తెలియవచ్చు వైదికవాఙ్మయస్థితినిగుఱించిన విషయము అంతఎక్కువ విరివిగా లేదు. కాని కొన్ని విషయములు సంతోషకరములుగ నున్నవి. అందు ముఖ్యముగ గౌతముడు తైత్తిరీయారణ్యకము నెఱుఁగును. అందుండియే యాతడు ఇరువదియైదవ యధ్యాయములోని మొదటి ఆఱుసూత్రములను గ్రహించెను. అతడు సామవిధాన బ్రాహ్మణము నెఱుంగును. అందుండియే యతడు ఇరువదియాఱవయధ్యాయమును గ్రహించెను. ౧౫వ అధ్యాయము ౧ ౨ వ సూత్రమునఁ జెప్పఁబడిన అథర్వశిరస్సు నెఱుఁగును అని దెలిసికొనుటకు ఆధారము కలదన్న విషయము మనోరంజకముగ నున్నది. హరదత్తుని వ్యాఖ్యప్రకారము అథర్వశిరస్సనునది అథర్వవేదోపనిషత్తులలో నొకటి. ఈయుపనిషత్తులు సాధారణముగ చాలపురాతనమైనవి కావని చాలమంది యభిప్రాయము. వీటిలో నొకదానిని గౌతముఁ డెఱుఁగుదు రన్నవిషయమును బట్టి యీయభిప్రాయమును ప్రాయికముగ మార్చుకొనవలసి యుండును. మఱియొక ముఖ్యవిషయ మేమనగా గౌతముడు (౨౧. ౭] మనువుయొక్క యభిప్రాయము నుదాహరించి బ్రాహ్మణహత్య మద్యపానము గురుతల్పగమనము వీటివలన గలుగుపాపమును బోగొట్టుకొనుట యసాధ్యమని మనువుచెప్పినట్లు వక్కాణించు చున్నాడు. దీనినిబట్టి మనువున కారోపింపఁబడు నొక ప్రాచీన ధర్మసూత్ర గ్రంథమును గౌతముఁ డెఱుగునని స్పష్టపడుచున్నది. అదియే యిప్పుడున్న మానవధర్మశాస్త్రమునకు మూలమై యుండవచ్చును. మనువును దక్క ధర్మమును గుఱించి తెలిపిన మఱి యేయితరాచార్యుని గౌతముడు (పేరుతో) జెప్పనియుం లేదు; కాని "కొందఱ యభిప్రాయము" అనిగౌతముడు తన గ్రంథమున పెక్కుపారులు సూచించి యుండుట చేత గౌతముని గ్రంథము మొదటిధర్మసూత్రము కాదని చెప్పవలసియున్నది."

పైని యుదాహరించిన గ్రంథసందర్భములను గమనించునచో, మనధర్మసూత్రములను గుఱించి పాశ్చాత్త్యదేశపుపండితులు ఏర్పఱచు కున్నట్టియభిప్రాయములు స్థాలీపులాకముగ నైనను చదువరుల మనస్సులకు గోచరించియుండును. ఏవిషయమునుగ్రహించు సందర్భములో నైనను మన పండితులకును పాశ్చాత్త్యదేశపు విద్వాంసులకును విభిన్నలక్ష్యము ఏర్పడుట సహజము. వారు కేవలము చరిత్రాంశములకై మాత్రమే మనగ్రంథములను చదువునట్టి వాడుక గలవారు. ఇక మనవారన్ననో, విశేషించి అందులకు భిన్నులుగా నుండుట మాత్రమేగాక, జాతీయతానుసారమగు ప్రధానలక్ష్యమును సంప్రదాయానుగతముగా మనసునం దుంచికొని అన్వయించుకొనవలసినట్టివారు. ఇట్లయ్యును ఏకారణముచేత నైననేమి రానురాను మనస్థితిని 'జీర్ణమంగే సుభాషితం' అన్నస్థితికి తెచ్చిపెట్టినారు. దీనం గ్రమముగా సంప్రదాయానుస్యూత మగు ప్రాచీన విజ్ఞానము మూలచ్ఛేదమునకు గుఱికావలసివచ్చినది. ఇట్టిస్థితిలో తమకు యుక్తములుగా తోచినవానిని, ఏలక్ష్యముతో నైననేమి, గ్రంథస్థములు జేసి ఈమాత్రమైనను దక్కించినవారు లయినందులకై మనము పాశ్చాత్త్యపండితులయెడల కృతజ్ఞతను జూపుచు భవిష్యత్తునకై మార్గములను వెదకికొనవలసి యున్నది.

మన ఇప్పటికాలపు విద్యావిధానమునకును గౌతమమహర్షి ధర్మసూత్రములను ఉపనిబంధించిననాటి ఆర్యసంఘపు విద్యావిధానమునకును హస్తిమశకముల కున్నంతటియంతరము గలదు. ఆకాలమునందలి ద్విజాతులకు (అనగా బ్రహ్మక్షత్త్రియవిట్ఛూద్రులకు) ప్రధానవిద్యలు షడంగసహితములగు వేదములు. ఇవియే ఆకాలమునాటివారికి జీవితసర్వస్వములు. సమస్తధర్మములకును సమస్తలోకయాత్రలకును సమస్తవిజ్ఞానములకును సర్వవిధము లగు స్థితిగతులకు నాల్గ్వులలోని త్రైవర్ణికులకు ఇవియే మూలాధారములు. ఈవేదములను చదువుటకై దేశమునందన్నియెడలను విద్యాజీవనులును పవిత్రములగుకులశీలములు గలవారును ఆదర్శప్రాయులును నగు బ్రాహ్మణులు ఆశ్రమములు మున్నగువానినేర్పఱచి సర్వకాలసర్వావస్థల యందును విద్యాదానము చేయుచున్నట్లు దీనం దెలియంగలదు. ఈవిద్యాలయములలో, సమస్తవిద్యాప్రపంచము నధిగమించి మఱల నద్దానిని లోకహితమునకై యుపదేశింపవలసినట్టి బ్రాహ్మణులకును, సమస్తప్రజలను కన్నబిడ్డలవలె కాపాడి పాలింపవలసినట్టి క్షత్త్రియులకును, తదుభయుల కనుయాయులై లోకక్షేమమునకై వృత్తులనుకాపాడి ఆర్జించి లోకపోషణ మొనర్పవలసినట్టి వైశ్యులకును సమముగా ప్రవేశముండినట్టులు గురూపసదనము భిక్షాచరణము గురుకులవాసము మున్నగుసందర్భములలో గలసూత్రములవలన మనకు బోడగట్టును. బ్రహ్మచర్య మనుమాట ఆదిని ఆర్యుల విద్యార్జనకాలమును దెలుపునది యైనను రానురానుఆయర్థము మారుచు వచ్చినది. బ్రహ్మచర్యకాలపు పరిస్థితులను బ్రహ్మచారులయొక్క గురుకులవాసపద్ధతులను ఈగ్రంథము విరివిగా బోధించుచున్నది. వేదవేదాంగాది విద్యాప్రపంచము నార్జించి పిమ్మట గృహస్థులుగా నగువారును, ఆజన్మమును బ్రహ్మచర్యమునే నడపుచు గురుకులమున వసించువారును, అని ఆకాలమున బ్రహ్మచారులుద్వివిధముగా నుండెడివారు. అనగా నేదో పరిమితమగు కాలమును మాత్రమే విద్యార్జనకై యుపయోగించి, ఆపిమ్మట గృహస్థ ధర్మము నవ

లంబించువారు కొందఱును, యావజ్జీవమునువిద్యార్జనకై వినియోగించు వారు కొందఱునని యర్థము. ఈ రెండవ తరగతివారినే నైష్ఠికబ్రహ్మచారు లనెదరు. నైష్ఠికబ్రహ్మచారుల కైన నేమి లేక సాధారణబ్రహ్మచారుల కైననేమివిధించిననియమములు చాల నత్యుత్తమమగు నాదర్శములతోను నలౌలికమగు విజ్ఞానాభినివేశముతోను కూర్పబడినట్టి వనుటకు ఎట్టిసందియమును లేదు. ఇయ్యవి ఆదికాలమునందు అనితరసాధారణమగు నాధ్యాత్మిక సంపద యలవడుటకు కారణము లయ్యెను, కాలక్రమేణ ఆచరణమునందు కష్టసాధ్యములై క్రమముగా నీనాటికి సుతరాం దుస్సాధ్యములుగా పరిణమించినవి. ఇయ్యది మిగుల శోచ్యమైన స్థితి.

గురుకులవాసము చేసి ముగించినపిమ్మట గృహస్థుకాగోరువా రవలంబింపదగిన ధర్మములును, కన్యావరణము చేయుటలో నేమివివాహపద్ధతులను గమనించుటలోనేమి ఆచరింపవలసినట్టివి- లేక అవలంబింపవలసినట్టివి- గావిధింపంబడిన నియమాదులును ఆర్యులయొక్క ఉత్కృష్టమగు గుణశీలాదులనుగూర్చిన యభిమానాదరములను బోధించుచున్నవి. అనులోమవివాహాదులవలన తక్కువకులములవా రుత్తమవర్ణత్వము నొందగల్గుట, ప్రతిలోమవివాహాదులవలన నెక్కువకులమువా రధమవర్ణత్వమునొందగల్గుట-అనువీనిని ఇటీవలివారు యుగాంతరవిషయములక్రింద లెక్కించినను, ఆకాలపుఆర్యసంఘముయొక్క గుణశీలాదులందుగల పక్షపాతమును వారికిఁగల యుత్కృష్టమగు జాత్యాదర్శమును నేయినోళ్ల జాటంగల్గుచున్నవి. ఏదేశమునందైనను ఏజాతియందైనను తమతమ కులములను సంతతులను ఉత్కృష్టనెనయింప దలంచువా రవలంబించెడిపద్ధతులు తెఱుచు ఇట్టివేయై యుండును గదా!

మఱియును గృహస్థునకు విధించిన ధర్మములలో నూటికి తొంబదిపాళ్లు ఐహికాముష్మిక సాధనములుగను లోకయాత్రానిర్వహణమునకనువైనవిగను ఉన్నవి. పంచయజ్ఞనిర్వహణము బలివిధానములు దానములు- ఆచార్యగుర్వాదుల పూజాదులు- అతిథిపూజనము మున్నగు విషయములను చర్చించిన పట్టులను చదివినచో పైయంశముయొక్క యాథార్థ్యమును తెల్పజాలిన విషయము లనేకము చదువరులకు స్పష్టముగనే గోచరింపగలవు. ఆర్యులధర్మవిషయములలో గురుకులవాసమునకుతర్వాత నంతటి మహిమము గలది వృద్ధోపసేవనము. ఈవృద్ధోపసేవనమును, సూత్రకారులును, శాస్త్రప్రవర్తకులును అగు అన్నిశాఖల యాచార్యులును సమానగౌరవప్రపత్తులతో, నత్యావశ్యకవిషయముగా గౌరవించియున్నారు. ఈగ్రంథమునందలి ౧ వ ప్రశ్నలోని ౬ వ యధ్యాయమున నీవిషయమును గుఱించిన చర్చలు చాల గలవు. అయ్యవి పెక్కువిధములగు శిక్షణములను గృహస్థున కొసంగి యతనికి యుభయలోకములందును అనంతము లగు సుఖముల నపారముగా నీయజాలి యున్నవి.

తరువాత నాపత్కల్ప మారంభ మగును. ఇందు కేవలము విద్యావృత్తిచే లోకముల గాశ్రయుడు కావలసినట్టి బ్రాహ్మణులు తక్కినవృత్తులను [అనగా క్షత్రియవృత్తి వైశ్యవృత్తి మున్నగు వానిని] అవలంబింప వచ్చునని యాజ్ఞయిచ్చుచు, నియమించిన జీవితవిధానములు ఆర్యులకు గల లోకక్షేమాదర్శమును, తక్కిన వృత్తులవా రియెడగల అద్రోహపూర్వకములగు దయాభిమానములను పూర్తిగా వెల్లడింపగల్గుచున్నవి. ఇట్టులనే లోకమునందు ధర్మమ

ర్యాదల నుల్లంఘింపకుండ జనులను కాపాడవలసిన భారమును రాజునందును బ్రాహ్మణునందే గలదని నిరూపించు సందర్భములు సయితముచాల గూఢార్థసమన్వితములును అర్థవంతములును నై, పురాణములు, అర్థసూత్రములు, మున్నగు గ్రంథజాల మన్నింటియొక్క యేకాభిప్రాయమును వెల్లడింపజాలి యున్నవి అనుట నిస్సంశయము.

మొత్తముమీద త్రైవర్ణికులు అగు గృహస్థులకు విధించిన భోజననియమము లేమి, వారి యాచారవ్యవహారములకు సంబంధించినట్టి విధినిషేధములను గుఱించిన యంశము లేమి, సంభాషణములు - ప్రయాణములు - మున్నగువానిని యుద్దేశించి యుపదేశించినట్టి విషయము లేమి ఆర్యసంఘము నకు ఆనాడుగల శాస్త్రశిక్షణమును వినీతత్వమును పరలోకశ్రద్ధను యోగక్షేమ పరాయణతను ధర్మదీక్షను ఇంకను ఇట్టివగు ననేకములగు యుత్కృష్టములగు నాదర్శములను ఎన్నెన్నింటినో, వేయినోళ్లజాటుచు వారియొక్క కీర్తిమూర్తులను ఈనాటికిని మనకు మనఃఫలకముల చిత్రించి యానందమును గొల్పఁజాలియున్నవి.

గౌతమునినాటి వ్యవహారస్థానములు, వానిని కొనసాగించు ప్రాడ్వివాకులు మొదలయిన అధికరణికులను నుద్యోగులను గుఱించియును, వారు వ్యవహారములను వివాదస్థానములను పరిష్కరించు తెఱఁగులును ఈగ్రంథమునందు విస్పష్టముగను సముచితముగను వర్ణింపబడియున్నవి. న్యాయస్థానములందు అధికారులుగా నేమింపబడవలసినట్టి వర్ణమువారు బ్రాహ్మణు లయ్యును, వారియందు మోపంబడినభారము అనంత మైనది. వారు ఆముష్మికక్రియలును ఐహికములం దంతగా నాదరము లేనివారయ్యును యోగక్షేమార్థమై రాజును జేరి అతని యాజ్ఞానుసారము ధర్మ నిర్వాహకత్వమునం బాలుగొనవలసినట్టులుగా విధింపబడినది. మఱియు నిట్టి యోగ్యతను వారార్జించుటకై బహుశ్రుతులుగా నై యుండవలసినట్టులు చెప్పియున్నారు. బహుశ్రుతత్వమనగా - లోకవ్యవహారసిద్ధము లగు దేశధర్మములు జానపదధర్మములు కులధర్మములు జాతిధర్మములు వర్ణధర్మము లాశ్రమధర్మములు మున్నగువానిని చక్కగా నెఱిగి యుండుట యేగాక, ఆయావ్యవహారములయొక్క నిజస్థితి నెఱుగంజాలినట్టి తర్కయుక్తిప్రత్యుక్తిరూపము లగువాకోవాక్యములను, జాతీయతను ఆనుపూర్విగా తెలుపజాలినట్టి ఇతిహాసములు పురాణములను సయితము సవిమర్శముగా నధ్యయనము చేసినవారుగాగూడ నుండవలసి యున్నది. మఱియు నింత మాత్రమే గాక, వారు ద్విజత్వమునకు ముఖ్యము లయిన చత్వారింశత్సంస్కారములను పొందినవారై యుండి షట్కర్మనిరతులుగను, సామయాచారికము లగు ధర్మరహస్యముల నన్నింటిని [అనగా పురుషులు ఆయాకులములు దేశములు జాతులు-మొదలగువాని కనుకూలముగా నేర్పాటుచేసికొని ఆచరణలో పెట్టుకొన్న లోకవ్యవస్థలను సాకల్యముగా] నెఱింగియుండవలయు ననియును, ఒక్క యెఱింగి యుండుట యేగాక వాని నాచరణలోనుంచికొని లోకమర్యాదలను కాపాడుచుండవలయు ననియును, కాబట్టియే ఇట్టిలక్షణములను యోగ్యతలను ఆర్జించినట్టి బహుశ్రుతు లగు బ్రాహ్మణులు అవధ్యులు నబంధ్యులు నదండ్యులు నబహిష్కార్యులు నపరివాద్యులు నపరిహార్యులు - అని నియమించుట గల్గినది. అనగా పైని జెప్పినట్టి యోగ్యతలను ఆర్జించి వానినాచరణలో నుంచికొని మెలగునట్టివారు ఎట్టిఅపరాధములను జేసియున్నను, (ఇట్టివా

రపరాధములను చేయుటయే పొసగదు. ఒకవేళనేదేని ప్రమాదమువలన చేయుటగల్గినను అందులకై పశ్చాత్తాపప్రాయశ్చిత్తాదు లయినట్టిపరిహారములను నిర్వర్తించుకొని శుద్ధులు అగుటకు సహజముగానే ప్రయత్నించుశీలము గలవారై యుందురు; గనుక) వారిని దండమును పాలించునట్టిరాజులు గాని, వారిప్రతినిధులు గాని వధ-బంధనము- బహిష్కారము(అనగా దేశమునుండి వెడలగొట్టించుటలు గాని, లేక ప్రవాసమున కంపుటలు గాని) పరివాదము (అనగా వారిదొసగులను గోరంతలు కొండతలుగాచేసి ప్రకటించుటలుగాని,) పరిత్యాగము మొదలయిన శిక్షలకుగాని గుఱిజేయకూడదనిభావము. ఇంతటియుదారాశయములతోను దూరదృష్టితోను బ్రాహ్మణు డవధ్యు డనిచెప్పినమాటను వెనుకముందు లరయకుండ ఏదోసాకుగొని "బ్రాహ్మణుడు తన్నుమాత్రము కాపాడుకొని తక్కినకులములవారిని చిన్నచూపుచూచి హింసించునట్లు చేసినాడు"— అనిచెప్పు ఇప్పటిసాంఘికవాదుల వాదములందు ఎంతసత్య మున్నదియో చదువరులే యూహించుకొన వచ్చును.

ఆర్యసంప్రదాయానుసారముగా వ్యవహారస్థానములు పదునెనిమిది శీర్షికలక్రింద విభజింపవీలు కలదు. వీలేమి? అష్టాదశవ్యవహార స్థానములనియును, అష్టాదశవిధములగు వివాదపదనిబంధనలనియును వీనికి పేరు. అష్టాదశవ్యవహారము లనునవి-౧ఋణాదానము ౨ ఉపనిధివ్యవహారములు ౩ సంభూయోత్థానము, ౪ దత్తస్యపునరాదానము ౫ అభ్యుపేత్యాశుశ్రూష ౬ వేతనానపాకర్మ ౭ అస్వామివిక్రయము, ౮ విక్రీయాసంప్రదానము ౯ క్రీత్వానుశయము, ౧౦ సమయానపాకర్మ ౧౧ క్షేత్రజవివాదము ౧౨ స్త్రీపురుషసంబంధములు ౧౩ దాయభాగము ౧౪ సాహసములు ౧౫ వాక్పారుష్యములు౧౬ దండపారుష్యములు ౧౭ ద్యూతవ్యవహారములు ౧౮ ప్రకీర్ణకములు. వీనిలో ఋణాదానవ్యవహారములు అప్పులకు సంబంధించినవి. ఇయ్యవి దేయాదులగు భేదములచే పెక్కువిధములు. విశ్వాసాదులుమున్నగు కారణములచే నితరులయొద్ద నిక్షిప్తముగా (నిక్షేపాదుల క్రింద) నుంచుకొనిన విషయములను గుఱించినవి ఉపనిధివ్యవహారములు. వీనిలోను భేదము లనంతముగా గలవు. వర్తకులు మున్నగు వ్యాపారవృత్తిచే జీవించువారు సంఘములుగ నేర్పడి వ్యవహరించుకొనుటలకు చేరినట్టివివాదలు సంభూయోత్థానములు. "ఫలానాపనిని నిర్వర్తించుటకు" అనిపేరుపెట్టి కొంతద్రవ్యమునొసంగినప్పుడు కర్మకరులు మున్నగువారి అశ్రద్ధాదులవలన నియ్యవి చేయబడనిచో నాద్రవ్యము మఱల నొసంగవలసియుండును. ఇట్టివానిని గూర్చినవ్యవహారములనే దత్తస్యపునరాదానములందురు. ఈయావిధమగు శుశ్రూషాదులను (పనులు మొదలయినవానిని) చేయుదుమని యొప్పుకొని వానిని చేయకుండుటలు అభ్యుపేత్యాశుశ్రూషలనంబడును. సేవకులు మొదలగువారి జీతములువగైరాలను గుఱించినవి వేతనానపాకర్మ లనంబడును. విక్రయించుటకుగాని దానమిచ్చుటకుగాని న్యాయశాస్త్రానుసారముగా అధికారము లేనివారు విక్రయాదులను జరుపుటలను గుఱించినవి అస్వామివిక్రయవ్యవహారములు. అమ్మి - వెలనీయనివి విక్రీయాసంప్రదానములు ఇట్లే క్రీత్వానుశయములును. ఆయామతములకు కులములకు చెందినవారు వారివారిసంప్రదాయముల ననుసరించిననియమముల నుండక, వానినుల్లంఘించుటలగూర్చిన వివాదములు సమయానపాకర్మలనబడును. భూములు మొదలయిన

వానిని గూర్చినవివాదములు క్షేత్రజవివాదములు; సీమా[పొలిమేరలనుగూర్చిన] వివాదములు నిందుననేచేరును. స్త్రీధనాదులు వివాహసంబంధములను గుఱించినవ్యవహారాలు స్త్రీపురుషసంబంధములు. మనుష్యులను చంపుట కొట్టుట తిట్టుట దూషించుట అవమానించుటలు పరస్త్రీలను చెఱచుటలు మున్నగునవి సాహసవ్యవహారములు. వీనిలోను అనంతము లగుభేదములు గలవు. ఈగౌతమధర్మసూత్రములందు ఈపైనిసూచించిన వ్యవహారస్థానము లన్నియును ఉచితరీతిని చర్చింపబడి యున్నవి.

వ్యవహారస్థానములను తన్నిర్ణయవిధానములను చర్చించుసందర్భములో సాక్షినిర్ణయము ప్రాడ్వివాకాదుల వివాదనిర్ణయవిధానములు కాలపరిమితులు మొదలగువానిని ఏర్పరించి నియమించుఘట్టము లిందు చాల సరళముగా పొందుపఱుపబడియున్నవి. అందునను ప్రత్యేకముగా దాయవిభాగమును గుఱించి చర్చించునధ్యాయము చాల లోకానుభవమును ధర్మపరతంత్రతను వెల్లడించుచు వ్యవహారకుశలురును లోకతంత్రనిపుణులును కాగోరువారి కెల్లరకును అవశ్యము పఠింపదగినదియై యున్నది. గౌతమధర్మసూత్రము లొక్కటిమాత్రమే గాక ప్రతిధర్మసూత్రములును ధర్మసహితముగను ఐహికాముష్మిక సుఖసాధనముగను లోకయాత్రనిర్వహించువిధానములను బోధించుటలో దేనిమట్టు కది యగ్రేసరమై యసాధారణ మగుప్రతిభావిశేషమును అనుపమానమగు లోకానుభవమును బోధించి చదువరులను తరింపజేయజాలియే యున్నను-విశేషించి, ఈగౌతముని ధర్మసూత్రములు మనఆర్యజాతియొక్క అత్యంతప్రాచీనమైన- ఐహికాముష్మికసుఖసాధనమైన- విధానములను మనకు విరివిగా బోధించి అనంతకాలము మనలను కృతజ్ఞతాబద్ధులనుగా నొనర్చుటకు సమర్థ మనుట నిర్వివాదాంశము.

వివాదస్థానములను గుఱించిన చర్చలు ముగియుటతోడనే ప్రాయశ్చిత్తప్రశ్నము ఆరంభమగును. దీనియందు సాధారణముగా నింద్రియదౌర్బల్యమునఁగాని లేదా చిత్తవృత్తుల నరికట్టి వశ్యములుగా జేసికొనం జాలమిచేతగాని జ్ఞానపూర్వకముగా నైనను సరియే అజ్ఞానపూర్వకముగా నైనను సరియే అలవడినట్టి సమస్తపాతకములకును నానావిధములగు ప్రాయశ్చిత్తములు నయ్యై అధికారులతారతమ్యతల ననుసరించివిధింపబడినవి. వ్యవహారస్థానములలో ప్రసక్తానుప్రసక్తముగావిధింపబడినట్టి కొన్నిదండనవిధానములు శిక్షాపద్ధతులును కొన్నిప్రాయశ్చిత్తములు స్థూలదృష్టికి చాల క్రూరములుగాను గర్హ్యములుగాను కనుపట్టినను ఆకాలపు స్థితిగతులయొక్కయును అప్పటివారి ఐహికాముష్మికసంబద్ధములగు నాదర్శములంబట్టియును అట్లు విధింపకయున్నచో, లోక సంకరము గలిగి బహుళానరకములకు గుఱిగావలసి వచ్చుననన్న యభిప్రాయముతో ఆనాడట్లు విధించియుండవచ్చునని తోఁచునేకాని దయాదాక్షిణ్యాదిగుణములకును సర్వభూతహితత్వము మున్నగు నుత్కృష్టాదర్శములకును నిధులై కేవల మాముష్మికములంతే ప్రధానలక్ష్యముగల యార్యులు ఇప్పుడు మనవారుచెప్పు ఒంటెత్తుతనమును మున్నిడికొని యట్లు చేసిరని చెప్పుటకు నోరురాదు. ఇయ్యది ఏమాత్రము పరిశీలించినను విస్పష్టమగు నంశమగుటచేత నిక నీవిషయమును గుఱించినట్టిప్రస్తావము నింతతో ముగించుచున్నాము. మొత్తముమీద ఆర్యసంఘముయొక్క ప్రాచీనపరిస్థితులను ఈగ్రంథము చక్కగా మనకు ప్రద

ర్శించుచున్నదనుట నిస్సందిగ్ధ మగువిషయము. కావున నిందలిధర్మములను విధానములను తూచాతప్పకుండ నీకాలమున నాచరణకు గొనివచ్చినను రాకున్నను ఇప్పటి మనవారు మనప్రాచీన సంఘముయొక్క ఆదర్శములను పద్ధతులను ఒక్కమాఱు సంస్మరించుటకైనను ఇట్టిగ్రంథములు ఈకాలమున కత్యంతము నావశ్యకము లని మావిశ్వాసము. కనుకనే మేమీపనికిబూని మాయోపినమట్టునకు ఇట్టిగ్రంథములను సమూలముగను సవ్యాఖ్యలుగను సాధ్యమైనంతవఱకు విషయవైశద్యము గల తెలుగువివరణముతోను మాసోదరులగు నాంధ్రదేశీయులకు ప్రచురించి నివేదించి సేవచేయందలంచితిమి ఈమాప్రయత్నమునందు అనేకవిధము లగు లోపము లున్నమాట యథార్థమేయైనను సోదరదేశీయులలో సమర్థులగువా రిందులకు బూనుకొన్నచో మావంటి యల్పప్రజ్ఞులము వైదొలగి యుండగలమని విన్నవించుచున్నాము.

ప్రకృతము ప్రకటింపబడు నీగౌతమధర్మసూత్రములకు వ్యాఖ్యానము వ్రాసినవాడు హరదత్తాచార్యుడు. ఈయనవ్యాఖ్యానముగాక వీనిపైని మస్కరీయభాష్యమని మఱియొక వ్యాఖ్యయును, రుద్రదత్తుని లఘుటీకయును ఇంకను ఒకటిరెండు గచ్ఛద్వ్యాఖ్యానములునుగలవు. వీనిలో మొదటిదగు హరదత్తాచార్యుల వ్యాఖ్యానమగు మితాక్షరతో వంగమహారాష్ట్రాంధ్రులును, మస్కరిభాష్యముతో మైసూరివారును మూలసంస్కృతగ్రంథములను ప్రకటించి యున్నారు. తక్కినవి ఇంతవఱకును అముద్రితములు. వీనినుండి ఈగ్రంథమునం దచ్చటచ్చటగల విశేషము లిందు కూర్పంబడినవి. ఆంధ్రులు ప్రకటించిన గౌతమధర్మసూత్రములలో కేవలమొక్క దాయభాగమునకు మాత్రమే ఆంధ్రతాత్పర్యము వ్రాయబడి లభించుచున్నది; కాని సమగ్రముగా లభించుటలేదు. ఆకారణమునను మాకు సూత్రవాఙ్మయముపైగలభక్త్యభినివేశములచేతను, ప్రకృతము ప్రాచీనుల ఆచారవ్యవహారములను గుఱించి చదువవలె నని యభిలషించు మాబోంటిసోదరుల కిది సాయపడు ననుతలంపుతోను, ఇందు హరదత్తవ్యాఖ్యాసమన్వితముగా గౌతమధర్మసూత్రములు సంపూర్ణముగా అనువదింపబడి ప్రకటింపబడుచున్నవి. ఇందలి గుణదోషవివేచనవిషయములోనేమి, తక్కినవిషయములలోనేమి గ్రాహ్యతాగ్రాహ్యతలను సదసద్వివేచనదక్షులగు పండితులే తగినయత్నము చేసి నిర్ణయింపగల రనునమ్మక మున్నవార మగుటచేతను నీవిషయమును వారికే వదలివేయుచున్నాము. గుణమున్నను లేక దోషమున్నను స్పష్టీకరించి మమ్ము తరింపచేయుటకై విమర్శకులగు సోదరసంస్కృతాంధ్రపండితులకు వందనపూర్వకముగ మనవి చేయుచున్నాము.

ఈగౌతమధర్మసూత్రములను వాత్స్యాయనసూత్రము లయినవెనువెంటనే ప్రకటింపదలచినను మావంటి దౌర్భాగ్యులు చేపట్టినదోషమువలన నింతవఱకును అయ్యది సాధ్యము కాకపోయినది. ఇందులకు నిరంతరమైన దారిద్ర్యము అనుత్సాహము తెల్వితక్కువ మున్నగుకారణము లెన్నియోగలవు. అన్నిటిని మించినవి మాసాంసారికములగు కష్టములు. కనుక చదువరులు ఈయాలస్యమునకు మన్నించి యథాశక్తి ప్రోత్సాహమిచ్చి మాకొకింత కార్యనిరతి లభించునట్లు యనుగ్రహింతురుగాక.

## కృతజ్ఞతాభివందనములు.

ఈగౌతమధర్మసూత్రములను ఆంధ్రీకరించి ముద్రింపదివిరినపుడు నాకు తమగ్రంథమునొసంగి తోడ్పడిన నామిత్రులు శ్రీయుతులు చల్లా జగన్నాథము పంతులు బి.ఏ గారికిని, గ్రంథము వ్రాతప్రతి చివికిపోవుదశలో నున్నప్పుడు ప్రప్రథమమున తమపత్రికలో ప్రకటింప తావిచ్చి ఇంత పఱకును మావలనగల్గుచున్నయనేక కష్టములకోర్చి ప్రకటించుచు వ్యాప్తిగల్గించుచు వచ్చిన మిత్రులును బ్రాహ్మణపత్రికాసంపాదకులును అగు బ్ర॥ వే॥ శిరోభూషణము వేంకట రంగాచార్యులువారికిని, గ్రంథమునకు విజ్ఞప్తిని వ్రాయుసందర్భములలోను మఱి యితరములగు కష్టసమయములలోను నాకు కుడిబుజముగా నుండి ప్రోత్సాహమొసంగిన నాసోదరుడు మల్లంపల్లి సోమశేఖరశర్మగారికిని, నడుమనడుమ అనేకములగు ఆర్థికకష్టములకులో నైనప్పుడు చేయూతనిచ్చి ధైర్యమిచ్చిన శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ శ్రీ మునగాల మహారాజుగారగు రాజా శ్రీనాయని వేంకట రంగారావుబహద్దరుధారవారు, శ్రీ బుర్రా సత్యనారాయణ పంతులు బి. ఏ., బి. ఎల్. గారు, పుల్లెల చినవేంకటరమణయ్యపంతులు బి.ఏ., బి.ఎల్. గారు శ్రీయుతులు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు, మున్నగు నాఆప్తవర్గమునకును నాతోపాటు అనేకకష్టములకోర్చి తోడ్పడిన యితరమిత్రులకును అనేకముగ కృతజ్ఞతాభి వందనముల నర్పించుచు వారి కీశ్వరుడు అనంతాయురైశ్వర్యముల నిచ్చునట్లు అనుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాను.

మదరాసు.
ప్రభవ॥ ఆషాఢ శు ౧౦ లు.

పంచాగ్నుల ఆది నారాయణ శాస్త్రి.
గ్రంథమాలికా ప్రకాశకులు.

దలగునట్టివి(అవైదికాచారాగములు)ధర్మములుగా నిరూపింపఁబడవు. మూలసూత్రమునందు-"వేదోధర్మమూలం"—అని ధర్మశబ్దము ఇచ్చట ఉపలక్షణము. కాఁబట్టి అధర్మమువిషయమునఁగూడ వేదమే ప్రమాణము అని తేలుచున్నది. [అనఁగా అధర్మము పనికిరానిదని ప్రతిషేధించునట్టిది గూడ వేద మగుటవలన కేవల మొక్క ధర్మమునకు మాత్రమే కాక అధర్మమునకుగూడ వేదమే (అనఁగా ప్రతిషేధాత్మక మగు వేదమే) ప్రమాణ మగు చున్నదని భావము.] అనగా నిషేధవిధులు బ్రహ్మహత్యాదికార్యములందు ప్రవర్తించువానిని నివర్తింపచేయుచున్నవిగదా! అట్లైనచో నిషేధవిధులను గమనించి నివర్తిల్లుచున్నారా? యని యడుగవచ్చును. కాని అది రాగద్వేషాదులచేత విషయములయెడల వర్తించువారి విషయము. అట్టివారిని నివర్తింపఁజేయుట అశక్యము. ఈ విషయము అనుష్ఠితమైనచో ప్రత్యవాయహేతువు కాదని నిషేధవిధియే ప్రత్యవాయహేతుత్వమును తోఁపింపఁజేయుచున్నది.

## 2. సూ. తద్విదాంచ స్మృతిశీలే.

[౧—౧—౨]

హరదత్త మితాక్షరా:—అథ యత్ర ప్రత్యక్షో వేదో మూల భూతో నోపపద్యతే తత్ర కథ మితి చే దాహ—తద్విదామితి—తద్విదాం వేదవిదాం మన్వాదీనాం యా స్మృతిస్త త్ప్రణీతం ధర్మశాస్త్రం యచ్చ తేషాం శీల మనుష్ఠానం తే స్మృతిశీలే-అస్మదాదీనాం ప్రమాణం. నచ తేషా మనుష్ఠానం నిర్మూలం సంభవతి. సంభవతిచ వైదికానా (1) ముత్పన్నపాఠే వేదానుభవ ఇతి. తేషాం తుతదానీం విద్యమానత్వేన సంప్రదాయావిచ్ఛేదాచ్చ వైదికానుష్ఠానం వేదమూలమేవ. యథాహాపస్తంబః— తేషాముత్సన్నాః పాఠాః ప్రయోగా దనుమీయంత ఇతి.

[పాఠాంతరములు-(1) ఉత్సన్న పాఠ వేదానుభవ ఇతి-అనియున్నది]

ఆంధ్రవివరణము.—తత్ అనఁగా వెనుకఁ జెప్పిన వేదము. ఆవేదము నెఱింగినవారు తద్విదులు అనఁబడుదురు, మనువు మొదలగు ధర్మశాస్త్ర ప్రవర్తకులందఱును ఇచ్చట తద్విదులను మాటచేత గ్రహింపఁబడుచున్నారు. స్మృతి యనఁగా చిరకాలమునుండి పారంపర్యముగా వచ్చుచున్న మన్వాదులగు పెద్దలయాచారవ్యవహారములను గ్రంథస్థముఁ జేసిస్మరించునట్టివాఙ్మయ మని యర్థము. శీల మనఁగా వారి యాచారము. అర్థాత్తు అనుష్ఠానము. ధర్మమునకు వేదము లే విధముగా ప్రమాణములు అగుచున్నవో, ఇట్లులనే ఆ వేదముల నెఱిఁగిన పెద్దలగు మనువు మొదలగు వారియొక్క స్మృతిశీలములుకూడా ధర్మమూలములే యగునని సూత్రార్థము. అనగా వేదవేత్తలగు మన్వాదులచే రచింపబడిన ధర్మసూత్రములును వారి నిత్యవ్యవహారసిద్ధమగు అనుష్ఠానములునుకూడ ధర్మమూలములే యగునని భావము. వేదమే ధర్మమూలము అని వెనుకటిసూత్రమునందుఁ జెప్పఁబడినది. దానిచేతనే అభీష్టము సిద్ధించుచున్నది. కాని వేదము ప్రత్యక్షముగా మూలభూతము కానప్పుడు, (అనఁగా ఆచారములోనుండు ధర్మమునకు వేదమునందు ఆధారము కానరానప్పు డని తాత్పర్యము,) చేయవలసిన దేమి? అనే ప్రశ్న వచ్చినది. రాగా దానికి సమాధానముగా ఈసూత్రమును చెప్పవలసివచ్చినది. వేదము ప్రత్యక్షముగా ప్రమాణముగా లభింపనప్పుడు, వేదవేత్త లగుమనువు మున్నగు పెద్దలు రచించినధర్మశాస్త్ర గ్రంథములును, వారియాచారవ్యవహారములును మనబోంట్లకు ధర్మనిర్ణయ విషయమున ప్రమాణములుగా స్వీకరింపఁదగియుండు నని తాత్పర్యము. "అయ్యా! అట్లైనచో వారినడవడి (అనుష్ఠానము నందును. వేదతుల్యముగా భావించి గ్రహింపవలసినదా?" అని అడుగవచ్చును కాని పరావరజ్ఞులు అధిగతయాథాతథ్యులగు వావేత్తలయనుష్ఠానము (నడవడి) ఎప్పటికిని నిర్మూలముగానుండదు (అనఁగా వేదబాహ్యముగానుండదు) అని నమ్మవలసియున్నది. వైదికులలోకూడ ఉత్పన్నపాఠమువందు వేదానుభవముకల్గుటయు నున్నది. ఏమనఁగా వారు ఆకాలమునయున్న వారగుటచేతను, సంప్రదాయము అవిచ్ఛిన్నముగా

(లేకపోయినా) వచ్చుచుండుటచేతను, వైదికులయనుష్ఠానము వేదమూలముగా నుండునే కాని వేదవిరుద్ధముగా నుండజాలదు, ఆపస్తంబుఁడుకూడా ఇట్లే అన్నాఁడు- ["తేషాముత్సన్నాః పాఠాః ప్రయోగా దనుమీయంతే" ఇతి] అనఁగ ఆవేదముల యొక్క పాఠములు ఉత్సన్నములై పోయినవయ్యును, వైదికులయొక్క ప్రయోగమునుబట్టి ఊహింపబడుచున్నవని.

## ౩. సూ. దృష్టో ధర్మ వ్యతిక్రమః సాహసంచ మహతాం [౧—౧—౩]

హరదత్తమిశ్రాః:—యదిశీలం ప్రమాణమతి ప్రసంగస్స్యాత్. కథం, కతక భరద్వాజౌ వ్యత్యస్తభార్యే జగ్మతుః. వసిష్ఠశ్చండాలీమక్షమాలాం, ప్రజాపతిస్స్వాందుహితరం, రామేణ పితృవచనా దవిచారేణ మాతుశ్శిరశ్ఛిన్న మిత్యాదిసాహసమపిప్రమాణం స్యాదిత్యుక్తే నేత్యాహ- దృష్టఇతి. మహతామేతాదృశం సాహస మపి ధర్మవ్యతిక్రమ ఏవ దృష్టో నతు ధర్మః, రాగద్వేష నిబంధనత్వాత్.

ఆంధ్రవివరణము:—అయ్యా! ఆవేదవేత్తలలోకూడ అందఱును శీలవిషయమున పరిశుద్ధికలవారు కారు. కతకుఁడని భరద్వాజుఁడని పూర్వము ఇద్దఱుఋషులుండెడివారు. వారు పరస్పరభార్యల నొకరుమార్చుకొని సంగమించినారు. శీలమే ప్రమాణము కావలసి వచ్చుచో ఈకతక భరద్వాజుల శీలముకూడ ప్రమాణమై లోకులకు అనుకార్యమై యుండదా మఱియును వసిష్ఠమహర్షి చండాలస్త్రీయగు అక్షమాలను పొందెనని యున్నది. సమస్తప్రపంచమునకు సృష్టికర్తయై ప్రజాపతి యని పేరుగాంచిన బ్రహ్మగారు స్వకీయదుహితను పొందెనని యున్నది. పరశురాముఁడు తండ్రిమాటను నమ్మి విచారణకూడ చేయక తల్లిని తలనఱికెనని యున్నది. కాఁబట్టి శీలము ప్రమాణమన్నచో ఈపైని చెప్పఁబడిన సాహసకార్యములు కూడా ప్రమాణములు కానక్కఱలేదా?"—అని యందు రేని, కాము ఏమందురా? చెప్పెదము. వినుండు-మహానుభావు లగువారు చేసిన ఈలాగంటి సాహస కార్యములుకూడా పరంపరగా ధర్మవ్యతిక్రమములుగానే పరిగణింపఁబడుచూ వచ్చుచున్నవే గాని ధర్మములుగా పరిగణింపఁబడుటలేదు. ప్రధానమగుకారణమేమనఁగా ఇట్టిసాహసకార్యములు రాగద్వేషాదులున్నందున సంభవించునట్టివి. కనుకనే, - అనఁగా రాగద్వేషనిబంధనము లగుటవలననే, అవి ధర్మవ్యతిక్రమములుగా లక్షింపఁబడుచునేయున్నవని భావము.

విశేషాంశములు—ఇచ్చట మస్కరీయభాష్యమునందు సాహసము అనుమాటకు- లోకమును శాస్త్రసంవ్యవహారమును లెక్కింపక ఆత్మవిశ్వాసబలమున చేయునట్టి కార్యమని- అర్థము చెప్పి ఇందులకు ప్రమాణముగా సహోబలమిహోచ్యతే- అను నారదవచనము ఉదాహరింపబడినది.

## ౪. సూ. (1)అవరదౌర్బల్యాత్. [౧—౧—౪]

హరదత్తమిశ్రాః:—నచ తేషా మేవంవిధం దృష్టమిత్యేతావతాఽస్మదా దీనామపి ప్రసంగః. కుతః అవరదౌర్బల్యాత్. అవరేషా మస్మదాదీనాందుర్బలత్వాత్తథాచ శ్రూయతే. "శ్లో. తేషాం తేజోవిశేషేణప్రత్యవాయో న విద్యతే, తదన్వీక్ష్య ప్రయుంజానో సీద త్యవరకో జనః" ఇతి.

[పాఠాంతరములు-(1) నతుదృష్టార్థే అవరదౌర్బల్యాత్ -అని తెలుగుప్రతులలోని పాఠము.]

ఆంధ్రవివరణము:—అవరులనఁగా తక్కువవారు. మనబోటు లగు అవరులకు దౌర్బల్య ముండుటవలన (వారియెడలగల యట్టి సాహసము నొనర్చుటకు మనకు వీలు లేనందున) అట్టిసాహసము మనయెడ చెల్లదు అని సూత్రార్థము. ఇటులనే పెద్దలు చెప్పఁగాఁగూడ వినఁబడుచున్నది- మహాత్ములకు తక్కినవారికంటె నుత్కృష్ట మగు తేజ

ముండును. అట్టి తేజ మున్న సామర్థ్యమున నెప్పుడైన నేది యైన సాహసకార్యము లొనర్చినను వారికంతగా ప్రత్యవాయ ముండదు. కాని వారసాహసములను చూచి అట్లే మేము నొనర్చెద మన్నచో దుర్బలులు గనుక తక్కుడు వారు నశి తురు.

విశేషాంశములు—ఇచ్చట మస్కరీయ భాష్యమునందు—"అయ్యా! వెనుకటి సూత్రములో ధర్మవ్యతిక్రమమని సాహసమని రెండు వాక్యములను చెప్పితిరి. ఈవాక్యములలో భేదమేమున్నయది? విషయాభిలాషతో చేయు అయుక్తకార్యము ధర్మవ్యతిక్రమమును క్రోధావేశముచే జేయునట్టి అయుక్తకార్యము సాహసమునుగదా!"—అని శంకించుకొని, (నతుదృష్టార్థే అనేపాఠము నవలంబించి) దృష్టప్రయోజనముగల పట్టుల మాత్రము (వారి) శీలము ప్రమాణము కాజాలదు అనియును, ఏలయనగా అవరదౌర్బల్యమువలన ననియును సమాధానము చెప్పబడినది. మఱియును అవరదౌర్బల్యమను మాటకు—"వరుడు (శ్రేష్ఠుడు) కాడు గనుక అవరుడు. అనగా ద్వేషమున్నగు గుణములచేత గొట్టుబడినట్టి నికృష్టుడని భావము. (ఇదియుక్తమిది కాదనినిర్ణయింపగల యంతటి పరమార్థజ్ఞానము లేనివాడనుట) అవరుని కుండునట్టి దౌర్బల్యము (అనగా ధర్మాధర్మపరిజ్ఞానశక్తి చాలకుండుట) కలుగుచున్నది కాబట్టి"—అని యర్థము చెప్పబడినది. ఈయర్థమువలన దేలిన సారమేమనగా—"మహానుభావులగు తద్విదులకుకూడా-ఒకప్పుడు [ప్రాణిమాత్రమునకు ప్రియాప్రియత్వము కలుగక తప్పకుండుటవలన] అభిభవము కలదనియును. కాబట్టి ఎంతదనుక వారికి రాగద్వేషాది ప్రయుక్తమగు అభిభవము కలుగుచుండునో అంతదనుక వారి ఆచారముకూడ పరిగ్రహింప తగినది కాదనియును"—తేలుచున్నది.

## 5. తుల్యబలవిరోధే వికల్పః.

[౧—౧—౫]

హరదత్త మితాక్షరా:—అథ యత్ర ద్వే విరుద్ధే తుల్యబలే ప్రమాణే ఉపనిపతతః - యథా అతిరాత్రే షోడశినం గృహ్ణాతి నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి. ఉదితే జుహోత్యనుదితే జుహోతీతి శ్రుతిః. నిత్యమభోజ్యం కేశకీటావపన్నమితి గౌతమః—శ్లో॥ పక్షిజగ్ధం గవాఘ్రాత మవధూతమవక్షుతం. కేశకీటావపన్నంచ మృత్ప్రక్షేపేణ శుద్ధ్యతీతి మనుః. తత్ర కిం కర్తవ్యమిత్యాహ తుల్యేతి—తుల్యపరిమాణ ప్రాపితయో రేవం జాతీయకయో రర్థయోర్వికల్పః. తద్వేదం వేత్యన్యతరస్వీకారః నసముచ్చయోఽసంభవాత్. శ్రుతిర్ష బాధ నేతు శ్రుతిస్మృతివిరోధే స్మృత్యర్థో నాదరణీయః, అతుల్యబలత్వాత్. అతఏవ జాబాలి రాహ—శ్లో. శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవ గరీయసీ, అవిరోధే సదాకార్యం స్మార్తం వైదికవ త్సదా-ఇతి.

ఆంధ్రవివరణము:—ఒకొక్కప్పుడు వేదప్రమాణవిషయమునగూడ పరస్పర విరుద్ధములై సమానమగు బలము గలవై రెండు ప్రమాణములు వచ్చు చుండును. ఎట్లనగా "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి-నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి-"అనియును, "ఉదితే జుహోతి - అనుదితే జుహోతి"—అనియును నీమున్నగు సందర్భములలోను సందేహనివారణ మెట్టులు కలుగును.—అని ఆశంక రాగా సమాధానము ను జెప్పుచున్నాడు:—ఈవిధముగా సమాన బలవిరోధము తటస్థించినప్పుడు వికల్పము అనుసరింపదగును కాని రెంటిని ఆచరింపరాదు. ఒకవేళ తొలిదానికంటె రెండవదాని యందు ఆధిక్యమును సూచింపగల్గినట్టి శ్రుతిస్మృతి విరోధము ఉపస్థితమైనప్పుడు స్మృత్యర్థమును నిరాకరించి శ్రుత్యర్థము నే స్వీకరింపవలసి యుండును. ఏలయనగా శ్రుతిస్మృతులు తుల్యబలములు కావు. శ్రుతి ఎక్కుడుబలము కలది. స్మృతి అంతకన్న తక్కుడు బలముగలది. కాబట్టి వీని రెంటికిని తుల్యబలత్వమే లేదు. ఇట్టిస్థితిలో వికల్పశంకకు బొత్తుగా అవకాశమే లేదు. శ్రుతిస్మృతులు తుల్యబలము కలవి కావున; అనుటకు ఆధారమే సందురాని

ఎచ్చట శ్రుతిబోధిత మైన ధర్మమునకును, స్మృతి బోధితమైన ధర్మమునకును, విరోధ మేర్పడునో, అచ్చట శ్రుతిబోధితమైనధర్మమే, బలవత్తరమైనది గానుండును. ఎచ్చట విరోధమేర్పడదో అచ్చట వైదికవాక్యము లందువలెనే స్మార్తవాక్యములలోగూడ సమానప్రతిపత్తితో కార్యము నొనర్పఁ దగు నని భావము.

## ౬సూ. ఉపనయనం బ్రాహ్మణస్యాష్టమే. [౧—౧—౬]

హరదత్త మితాక్షరా:—అథేదానీం ధర్మాన్వక్ష్యన్నుపనయన పూర్వకత్వాత్తేషాముపనయనం తావదాహ —ఉపనయనమితి:—ఉపనయనానంతర భావిని బ్రాహ్మణత్వేత్ర బ్రాహ్మణగ్రహణంతు బ్రాహ్మణస్యసతప వోపనయనం నతూపనయనాది సంస్కార జన్య బ్రాహ్మణత్వమితి జ్ఞాపనార్థం. కించ బ్రాహ్మణోనహంతవ్యః బ్రాహ్మణోనసురాంపిబేదితి నిషేధశ్రుతిరనుపనీత విషయేనస్యాత్. బ్రాహ్మణస్యాష్టమం వర్షంముఖ్యముపనయనకాలః ప్రథమభావినోగర్భాధానాదీ నుల్లంఘ్యఉపనయనం వ్యాచక్షాణస్తస్య ప్రాధాన్యందర్శయతి. తేనదైవానుపపత్త్యా గర్భాధానాదేరకరణేపి ఉపనయనం భవత్యేవ తస్యాకరణేతు వివాహాది ష్వనధికార ఇతి సిద్ధమ్.

ఆంధ్రవివరణము—వెనుకటి సూత్రములందుధర్మాధర్మవిషయములందుఁ బ్రమాణముగాఁ గొనఁదగిన వస్తువులను రూపించినాఁడు. ఇటుపైని ధర్మములను వివరింపవలసియున్నది. అనఁగా ఆయాయాశ్రమములవారు ఆయావర్ణముల వారు ఆచరింపవలసినధర్మములను నిరూపింపవలసియున్నదని భావము. అట్టిధర్మములను ఇటుపైని చెప్పఁదలఁచి మున్ముందుగా ఆధర్మములు ఉపనయనపూర్వకములు కాఁబట్టి వర్ణానుసారముగా ఉపనయనమును గుఱించి వివరించుచున్నాఁడు,

బ్రాహ్మణునకు అష్టమవర్షమునందు (అనఁగా నెనిమిదవయేఁట ను) ఉపనయనము చేయవలయునని సూత్రార్థము. ఈసూత్రమునందు "బ్రాహ్మణస్య అని బ్రాహ్మణశబ్దమును పేర్కొనుచున్నాఁడు. బ్రాహ్మణ్యమనునది ఉపనయనమైనపిమ్మటగాని సిద్ధింపదుగదా. ఇట్లుండియును ఉపనయనము కానివానిని పేర్కొనుటలో బ్రాహ్మణశబ్దమును ఎట్టులు ప్రయోగించిరి.?" అని శంక కలుగవచ్చును. కాని ఇచ్చట బ్రాహ్మణ శబ్దమును ప్రయోగించుటలో ఔచిత్యమును గమనించియే పేర్కొన్నారు. జన్మతఃకూడా బ్రాహ్మణుఁడై యున్నవానికే ఉపనయనసంస్కారముకాని ఉపనయనాదిసంస్కారమాత్రముల చేత బ్రాహ్మణ్యము లభించునట్టిది కాదు, అని సూచించుటకొఱకే ఇచ్చట బ్రాహ్మణశబ్దము ప్రయోగింపఁబడినది. ఇంతేకాక ఇఁక నొకవిశేషము కూడాఉన్నది. పైనిచెప్పినయర్థము నంగీకరింపనిచో-(అనఁగా"జన్మతఃకూడా బ్రాహ్మణుఁడైయున్నవానికే ఉపనయనసంస్కారముకాని ఉపనయనాది సంస్కారమాత్రముచేత బ్రాహ్మణ్యము లభించునట్టిది కాదు" అనేవిషయాన్ని ఒప్పుకొననియెడల నని తాత్పర్యము.)అనర్థము కలుగు చున్నది' ఏమందురా? చూడుడు—"బ్రాహ్మణోనహంతవ్యః" "బ్రాహ్మణోనసురాంపిబేత్." ఇత్యాదులగు శ్రుతివాక్యములు కొన్నిగలవు. "బ్రాహ్మణుఁడు చంపఁదగనివాఁడు, బ్రాహ్మణుఁడు సురను(కల్లును) త్రాగరాదు-"అని ఈశ్రుతివాక్యములు లోకమును అధర్మమునుండి నిషేధించుచున్నవి. కనుకనే వీనికి నిషేధశ్రుతులు అని పేరు. అయిన బ్రాహ్మణుఁడు అన్నమాటను పైనిచెప్పినయర్థమును అంగీకరింపక ఉపనయనమును చేసికొనినవానియందే చరితార్థమును చేయునెడల, ఈపైనిచెప్పిననిషేధశ్రుతులు, అనుపనీతునివిషయమునందు వర్తింపకపోవచ్చునుగదా! (అనఁగా బ్రాహ్మణుఁడు చంపఁదగనివాఁడు అనేమాట ఉపనయనమైన బ్రాహ్మణునివిషయములో మాత్రమే అని యర్థము చేసికొనుటయో లేదేని బ్రాహ్మణుఁడు సురను త్రాగరాదు అనేమాట ఉపనయనము చేసికొనినబ్రాహ్మణునికే వర్తించి

ఉపనయనము కానివాఁడు కల్లుత్రాగవచ్చునని యర్థము చేసికొనుటయో కల్గునని భావము.) కాఁబట్టియే జన్మతః కూడా బ్రాహ్మణుఁడైయున్నవానికే ఉపనయనసంస్కారము కాని కేవలమొక్క ఉపనయనాది సంస్కారముచేత బ్రాహ్మణ్యము లభించునట్టిది కాదు”-అని యంటిమి.

బ్రాహ్మణునకు ఎన్మిదవయేఁడు ఉపనయనమును చేసికొనుటకు ముఖ్యకాలము. ఇచ్చట, జన్మించుటకంటె పూర్వమే చేయఁదగినట్టి సంస్కారములలో నెల్లతొలుదొల్లటివిగా కాఁదగినట్టి గర్భాధానాది సంస్కారము లెన్నియో వివరింపబడవలసినవియున్నను వాని నన్నిటిని మించి ఉపనయనమునే తొలుదొల్త జెప్పఁబూనినసూత్రకర్త యొక్కభావము—“ఉపనయనము తక్కిన సంస్కారములలో నెల్ల ప్రధానమైనదని ప్రదర్శించుటకే.” దీనివలన తేలినవిశేషమేమనఁగా దైవాత్తు ఒక్కొక్కప్పుడు గర్భాధానాదులగు నితరసంస్కారములను చేయకున్నను ఉపనయనము చేయుటకు ఎట్టి ప్రత్యవాయము లేదనియును, కాని ఉపనయనమును మాత్రము చేయనిచో తక్కినవివాహాది సంస్కారములకు జరుపుకొనుటకు ఏమాత్రముకూడ నధికారము లేదనియును నిర్ణయింపబడినది.

## 7 సూ. నవమే పంచమే వా కామ్యమ్. [౧—౧—౭]

హారదత్తమితాక్షరా:—కామనిమిత్తంకామ్యం తన్నవమే పంచమే వాభవతి. నవమే తేజస్కామమిత్యాపస్తంబః:—“శ్లో. బ్రహ్మవర్చసకామస్య కార్యో విప్రస్య పంచమే రాజ్ఞోబలార్థినష్షష్ఠే వైశ్యస్యార్థార్థినోష్టమే ఇతి మనుః.

ఆంధ్రవివరణము:— ఉపనయనములు రెండువిధములు. (ఒకటి విహితములైనవి. వీనిని సాకర్యమునకై నిత్యోపనయనము లందురు. ఇఁక రెండవవిధములోనివి ఏదైననొకకామనతో చేయునట్టియుపనయనములు కామ్యోపనయనము లనఁబడును. అనఁగా కామమును నిమిత్తముగాఁ జేసికొని చేయునట్టి యుపనయనము అని భావము. ఈ కామ్యోపనయనము బ్రాహ్మణునకుఁదొమ్మిదవయేఁటనుగాని, ఐదవయేఁటనుగాని విహితమై యున్నది. ఆపస్తంబుఁడుకూడఁ దన ధర్మసూత్రములం దిట్లే చెప్పియున్నాఁడు. “నవమే తేజస్కామం”-అని ఆయనసూత్రము. దొమ్మిదవయేఁట బ్రహ్మవర్చస్సును కోరునట్టి వానికి ఉపనయనము నొనర్పవలయు నని దీనియర్థము. ఇఁకను ఐదవయేఁట కామ్యమగునుపనయనము నొనర్పనగు నను మనుమతము ఉన్నది. ఆయనవచనమిది:—“విప్రుఁడు బ్రహ్మవర్చస్సును కోరుచున్నాఁడో అతనికి ఉపనయనము ఎన్మిదవయేఁట చేయ దగినది. మఱియును బలార్థియగు రాజునకు ఆరవయేఁటను ధనార్థియగు వైశ్యునకు ఎన్మిదవ ఏటను ఉపనయనము చేయతగును అని యర్థము.

## 8 సూ. గర్భాదిసంఖ్యా వర్ణానామ్. [౧—౧—౮]

హారదత్తమితాక్షరా:— వర్షాణాం సంఖ్యా గర్భాదిరేవ భవతి న జననాది.

ఆంధ్రవివరణము:—వర్షము లనఁగా సంవత్సరములు. వెనుక ఉపనయనమును విధించుసందర్భములలో పేర్కొనిన వర్షములకు - అనఁగా సంవత్సరములకు - (లెక్కించుట) సంఖ్యానము గర్భాదిగానే గ్రహింపఁబడుచుండునే కాని జననాదిగా మాత్రము కా దని సూత్రార్థము. అనఁగా బ్రాహ్మణునకు ఎన్మిదవయేఁట నుపనయనము చేయవలయును అని చెప్పినప్పుడు - ఆయెన్మిదవయేఁ డను నది బాలకుఁడు పుట్టినది మొదలుకొని ఎన్మిదవ దగుఏఁడు కా దనియును, మఱేమనఁగా, గర్భము అయినది మొదలుకొని ఎన్మిదవ దగుఏఁ డనియును - అర్థము చేసికొనవలయు ననియును భావము. ఇచ్చట గర్భమను మాట చేత శిశువు తల్లికడుపులో గర్భరూపమున వసించునట్టి పది మాసములును గ్రహింపబడును అనియును, కనుకనే గర్భాదిగా సంవత్సరముల లెక్కింప దగుననియును వ్యాఖ్యాతృల భావము.

## 9 సూ. తద్ద్వితీయం జన్మ.

[౧-౧-౯]

హరదత్త మితాక్షరా:—తదుపనయనం ద్వితీయంజన్మ. అత్రాస్యమాతా సావిత్రీ, పితాత్వాచార్యః తేన ద్విజన్మత్వసిద్ధిః.

ఆంధ్రవివరణము:—ఆయుపనయనము రెండవ దగు జన్మ మే - అని సూత్రార్థము, ఈరెండవజన్మమువందును తల్లిదండ్రులు కలరు. ఇచ్చటను ఇతనికి-(అనఁగా ఉపనయనము చేసికొనినవానికి) తల్లియెవ్వరనఁగా - సాక్షాత్తును వేదమాతయగు సావిత్రీదేవియే. ఇఁక తండ్రియెవ్వరందురా ఆచార్యుఁడే! కావున - అనఁగా తొలుత తల్లిదండ్రులనుండి యొకజన్మమును, పిమ్మటతదుపదేష్టయగు ఆచార్యుఁడు సావిత్రి - వీరినుండి రెండవదగు జన్మమును పొందుచుండుటచేత - ద్విజన్మత్వము సిద్ధించు చున్నది. అనగా నుపనయనముచేత సంస్కరింపబడిననే ద్విజన్మత్వము కల్గునని భావము.

## 10 సూ. తద్యస్మాత్స ఆచార్యః

[౧౦-౧-౧౦]

హరదత్త మితాక్షరా:—తదితి-తత్ ఉపనయనం పితురభావే యస్మాత్పురుషాద్భవతి స ఆచార్యః నతు కేవలా దుపనయనాత్. కస్మాత్తర్హీత్యుక్తౌవక్ష్యతి.

ఆంధ్రవివరణము:—ఇట్టులు వెనుకఁ జెప్పిన యాయుపనయనము కన్నతండ్రియే చేయఁదగినది. తండ్రి లేనప్పుడు ఎవ్వారిచే అయ్యది చేయఁబడు చున్నదో(అనఁగా ఎవ్వరు ఉపనయమును చేయు చున్నారో) ఆయన ఆ వటువునకు ఆచార్యుఁ డనఁబడును. ఆచర్యత ఇత్యాచార్యః— అనఁగా సంస్కారములను పొందించువాఁడు గనుక ఆచార్యుఁ డని యర్థము.

## 11 సూ. వేదానువచనాచ్చ.

[౧-౧-౧౧]

హరదత్త మితాక్షరా:—నతు కేవ లా దుపనయనాత్. కస్మాత్తర్హీతి వేదానువచనాచ్చేతి. అనువచన మధ్యాపనం— అత్రమనుః.— "శ్లో. ఉపనీయతు యశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః, సకల్పం సరహస్యంచ తమాచార్యంప్రచక్షతే." ఇతి.

ఆంధ్రవివరణము:—ఆచార్యుఁ డనగా గురు వని భావము. ఈయాచార్యత్వము కేవలము ఉపనయనాది సంస్కారముల నొనర్చుటవలన మాత్ర మే కాక ప్రకారాంతరమునఁగూడ ఏర్పడు చున్నదని రూపించు చున్నాఁడు వేదమును అనువచనము చేయుటవలనఁగూడ ఆచార్యుఁడనఁబడు చున్నాఁడని సూత్రార్థము. అనువచనము చేయుటయనఁగా అధ్యాపనము. అనఁగా వేదమును శిష్యులను చదివించుటయని భావము. అర్థాత్తు తేలిన దేమనగా ఉపనయనాది సంస్కారముల నొనర్చినగురు వెట్టులు ఆచార్యపదముచేత పేర్కొనఁ బడుచున్నాఁడో అట్లే వేదాధ్యయనమును చేయించినగురువుకూడఆచార్యశబ్దముచేత వ్యవహరింపఁబడు చున్నాఁడని తాత్పర్యము. ఈవిషయమును మనువుకూడ ఇట్లే చెప్పియున్నాఁడు-ఎవ్వాఁడు శిష్యుని ఉపనీతునిచేసి సకల్పమునుగను, సరహస్యమునుగను, వేదమును చదివించుచున్నాఁడో అతనిని ఆచార్యునిగా పల్కుదురు"అని.

విశేషాంశములు— వేదమును సంపూర్ణముగా పఠింపజేసినవాడు ఆచార్యుడనియు, అందులో నేదో యొక కొంత గ్రంథభాగమును మాత్రమే పఠింపఁజేసినవాడు గురువనియును ఆచార్యగురు శబ్దముల భేదమును పెద్దలు చెప్పుదురు. మనువుకూడ నిట్టులనే చెప్పియున్నాడు—"కొలదిగగాని గొప్పగగాని శిష్యునకు ఏయుపాధ్యాయుడు వేదములనధ్యయనమును చేయించుట మూలముగా ఉపకరించునో అట్టి యుపాధ్యాయుని శ్రుతోపకార్యమగు ఆకార్యముచేత గురువని పల్కెదరు" అని.

## 12 సూ. ఏకాదశద్వాదశయోః క్షత్త్రియవైశ్యయోః.

[౧—౧—౧౨]

హరదత్త మితాక్షరా:— నిత్యోయ మన యోః కల్పః కామ్యస్తు మనునైవదర్శితః— "శ్లో. రాజ్ఞోబలార్థినః షష్ఠే వైశ్యస్యార్థార్థి నోష్టమే"–ఇతి.

ఆంధ్రవివరణము:—ఏకాదశ యనఁగా పదునొకండవది. ద్వాదశ యనగా పండ్రెండవది. క్షత్త్రియుల కును, వైశ్యులకును, యథాక్రమముగా పదునొకండవదియును పండ్రెండవదియును, అగునట్టి సంవత్సరములయందు- అనఁగా గర్భాదిగ పదునొకండవయేట రాజునకును, గర్భాదిగ పండ్రెం డవయేట వైశ్యునకు ఉపనయనము విధింపఁబడు చున్నయది. సూత్రమునందు విధింపబడిన యీకల్పము క్షత్త్రియవైశ్యు లకు నిత్యోపనయనమును బోధించునట్టిదిమాత్రమే. వ జీ వీరికి కామ్యోపనయనము లేదా యందు రేని కలదు. ఆ ప్రకారమును మనువిట్టులు ప్రదర్శించు చున్నాఁడు—శ్లో. రాజ్ఞోబలార్థినష్షష్ఠే వైశ్యస్యార్థార్థినోఽష్టమే'అని. అనఁగా బలమును కోరెడిరాజుగా నున్నచో గర్భాదియగు నాఱ వయేఁట నుపనయనమును చేసికొనవలయు ననియును, అర్థమునుకోరెడివాఁడుగానున్న నావైశ్యుఁడు ఎన్మిదవయేట నుపనయనమును చేసికొనవలయు ననియును దీని తాత్పర్యము.

## 13 సూ. ఆషోడశాద్బ్రాహ్మణస్యా [1] పతితాగాయత్రీ

[౧—౧—౧౩]

హరదత్త మితాక్షరా:— అథాపత్కల్పా నాహ – ఆషోడశాదితి–అభివిధావాకారః ఆషోడ శాద్వర్షాద్బ్రాహ్మణస్య సావిత్రీ అపతితా అప్రచ్యుతా సావిత్రీశబ్దేన తదుపదేశనిమిత్త ముపనయనం లక్ష్యతే. తదుపనయనస్య కాల ఇత్యర్థః.

[పాఠాంతరములు (1) స్యానతీతసావిత్రీ-అని చాలప్ర తులలో పాఠమున్నది.]

ఆంధ్రవివరణము—ఇంతవఱకును బ్రాహ్మణక్షత్త్రి యవైశ్యులను త్రైవర్ణిక జనులకును, విధివిహితము లగు నట్టి ఉపనయన కాలములను చెప్పియున్నాడు. ఇటుపైని ఆ పత్కాలములయందు అనుసరింపఁదగిన పక్షములను వివరించు చున్నాడు. వీనినే ఆపత్కల్పము లని యందురు. షోడశ(ష ట్ = ఆఱు. దశ = పది; ఆరధికముగాగలపది. అర్థాత్తు పదునారు ఆషోడశాత్ అనగా పదునాఱవ యేటివఱ కును అని యర్థము] ఆకారము—(అనగా ఆషోడశా త్ అనేమాటలో నుండెడి ఆకారము) ఇచ్చట అభివిధిని తెలుపుచున్నది. అనఁగా హద్దును తెలుపు చున్నదని భావ ము. కాఁగా—ఆషోడశాత్-పదునాఱేండ్ల వయస్సువచ్చు వఱకును, సావిత్రీ- వేదమాత, బ్రాహ్మణునకు అపతితయై (అనఁగా తొలఁగి పోవనిదియై) యుండును-అని సూత్రార్థ ము అనగా బ్రాహ్మణునకు ఆపత్కల్పమునందు పదునాఱేం డ్లు వచ్చునంతదనుక ఉపనయనము చేయకున్నను ఉపనయ నాధికారమున కెట్టికొఱంతయు నుండ దనియును, ఆగడువు కూడ మించిన తరువాతనైనచో నిక నతనికి సావిత్ర్యుపదే శమునకు (అనగా ఉపనయనమున కనిభావము) ఏ విధమై న యర్హతయును ఉండ దనియును చెప్పినట్లైనది. ఇచ్చట మూల సూత్రమునందు "ఆషోడశాద్బ్రాహ్మణస్యోపనయ నం" - అనిచెప్పక - అపతితాసావిత్రీ - అని సావిత్రీశ బ్దమును చేర్కొనుటచేత, సావిత్ర్యుపదేశమునకు నిమిత్తమై న ఉపనయనమే ముఖ్యముగా లక్షింపబడు చున్నయది. అన గా అదియే ఉపనయనకాల మని భావము.

## 14 సూ. [1] ద్వావింశతే రాజన్యస్య ద్వ్యధికాయావైశ్యస్య

[౧—౧—౧౪]

హరదత్త మితాక్షరా:—ఉభయత్రాపి ఆజ నువర్తతే. పూరణప్రత్యయస్య లోపో ద్రష్ట

వ్యః ఆద్వావింశా ద్వర్షా ద్రాజన్యస్య, ఆచ తుర్వింశా ద్వైశ్య స్యాపతితా సావిత్రీ.

[(1) కొన్నిప్రతులలో ఇది రెండు సూత్రములుగా పఠింపఁబడినది.]

ఆంధ్రవివరణము:—వింశతి యనఁగా ఇరువది. ద్వావింశతి యనఁగా ఇరువదిరెండు. వెనుకటిసూత్రమునందు "ఆషోడశాత్" అన్నట్లువలె ఆ అనునది ఈసూత్రములోకిని గూడ అనువదించును. అప్పుడు వింశతేః అనుదానికి "ఆ" చేర్చిన యెడల ఆద్వావింశతేః అని ఏర్పడును. ఆద్వావింశ తేఃఇరువదిరెండవసంవత్సరముపఱకును, రాజన్యస్య, రాజకుమారునకును, ద్వ ర్ధికాయాఆద్వావింశతేః = "రెండెక్కువగాఁగల ఇరువదిరెండవసఁవత్సరముపఱకును (అనఁగా ఇరువదినాల్గవయేఁటివఱకును) వైశ్యస్య = కోమటికిని, సావిత్రీ= వేదమాత, అపతితా=పతితము కానిదై భవేత్=ఉండును అని సూత్రార్థము. అనఁగా రాజులకును, కోమటులకును, ఆపత్కాలములయందు ముఖ్యకాలమున నుపనయనము గాకున్నను, యథాక్రమముగా ఇరువది రెండవ ఇరువదినాల్గవయేడులవఱకును, సావిత్ర్యుపదేశమునకు అర్హత గల దనియును, అంతదనుకపతితత్వము, రాదనియును, తాత్పర్యము.

విశేషాంశములు— ఈసూత్రమునందు రాజకుమారుని సంబోధింపగల ఇతరములగు సాధారణ రాజశబ్దములను వాడక, రాజన్యశబ్దమును వాడుట రాజత్వప్రసిద్ధిని సూచించుట కనియును, కాబట్టియే ఉపనయన ధర్మము గలిగినట్టి వానికే రాజ్యాధికారమనియును సారస్యమును కొందఱు వ్యాఖ్యాతలు చెప్పెదరు.

15 సూ. మౌంజీజ్యామౌర్వీ సూత్ర్యో మేఖలాః క్రమేణ [౧—౧—౧౫.]

హారదత్తమితాక్షరా:— ముంజో దర్భ విశేషః తద్వికారో మౌంజీ. మూర్వా అరణ్యౌషధి విశేషః [* సరళీతి ద్రవిడభాషయాం] తద్వికారో మౌర్వీ. జ్యాచాసౌ మౌర్వీ చేతి కర్మధారయః. జ్యాశబ్దేన ధనుషోగ్రాహ్యేతి యావత్. సౌత్రీ సూత్రవికారః ఏతాః వర్ణక్రమేణ బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యానాం మేఖలా భవంతి.

[పాఠాంతరములు—*ఇది పునహావారి అచ్చుప్రతిలో కుండలీకరణముననున్నది. కాని వ్రాతప్రతులలో తరుచుగాఁ గానఁబడదు. మఱియును సరలీశబ్దము ద్రవిడ భాషాపద మని ఇందుగలదు. కాని ద్రవిడములో (అరవములో) ఆ పేరు లేదని వినుదును.]

ఆంధ్రవివరణము:—ఇంతవఱకును బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులకు ఉపనయనమునకుఁగల ముఖ్యకాలములను ఆపత్కాల్పమునం దనుసరింపఁ దగినకాలపరిణామమును, వివరించి ఇటుపైని ఆయావర్ణములవారికిని విధివిహితము లగు మేఖలాదులను వివరించుచున్నాఁడు. ముంజయనఁగా దర్భజాతిలోఁ జేరినఒక విధ మగు గడ్డి. దీనిని ముంజగడ్డి యని చెప్పెదరు. ముంజగడ్డితో పేనెడిత్రాడు గనుక మౌంజి యనఁబడును. మూర్వయనఁగా అడవిలో నుండెడి ఒకవిధమగు ఓషధివిశేషము. దీనిని తెలుఁగువారు చాఁగచెట్టుఅందురు. మూర్వాసంబంధమైననారతో పేనెడి త్రాడు గనుక మౌర్వి యనఁబడును. దీనిని సాధారణముగ విల్లునకు ధనుస్సునకు అల్లెత్రాడుగా నుపయోగించుచుందురు. కనుక వాడుకను సూచించుచు, జ్యామౌర్వీయని పిల్చుచుందురు. సూత్రమనఁగా దారము. అనఁగా ప్రత్తినివడికి చేసిన నూలని భావము. సూత్రములతో పేనెడిత్రాడుగనుక దీనిని సౌత్రి యని యందురు, మేఖల యనఁగా మొలత్రాడు. బ్రాహ్మణ క్షత్త్రియవైశ్యులను త్రివర్ణములవారికిని వరుసగా మేఖలలు మౌంజీజ్యామౌర్వీ సౌత్రులుగా నుండవలయునని సూత్రార్థము. అనఁగా బ్రాహ్మణునకు మొలనూలు మౌంజియును, క్షత్త్రియునకు జ్యామౌర్వియును, వైశ్యునకు మొలనూలు సౌత్రియును నై యుండవలయు నని తాత్పర్యము.

విశేషాంశములు— ఇచ్చట మనుస్మృతి యందీ విషయమై చెప్పబడిన శ్లోకములు గమనింప తగియున్నవి.

శ్లో॥ మౌంజీత్రివృత్సమాశ్లక్ష్ణా కార్యా విప్రస్యమేఖలా. క్షత్రియస్య తుమౌర్వీజ్యా వైశ్యస్యశణతాంతవీ, ముంజాలాభేతుక ర్తవ్యాఃకుశాశ్మంతక బల్బజైః, త్రివృతా గ్రంథినైకేన త్రిభిః పంచభిరేవవా- అని. ఈశ్లోకముల యర్థమిది-“ బ్రాహ్మణునకు ముంజగడ్డితో చేయుబడినదియును సమానమగు పొడవుగల ముప్పురితో పేనిచినదియును మృదువైనదియును అగు మేఖలయుండవలయును. క్షత్రియునకు మూర్వతో చేసిన అల్లెత్రాడే మేఖలగా నుండదగును. వైశ్యునకు జనపనారతో చేసినమౌంజియుండవలయును. మఱియును, ఆబ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు ముంజమూర్వాశణతంతువులతో (యథాక్రమముగ) చేసిన మౌంజిల భింపనప్పుడు యథాసంఖ్యముగా కుశాశ్మంతక బల్బజములతోటి-[అనగా బ్రాహ్మణునకు దర్భలతో చేసినదియును, క్షత్రియునకు అశ్మంతకవృక్షపునారతో చేసినదియును, బల్బజమను (మొదవగడ్డి యంట ?) తృణజాతి వృక్షము యొక్క నారతో చేసినదియును అగు] మౌంజినిధరింపదగునని అర్థము”. అయితే ఇచ్చట నాకు మాత్రము అశ్మంతక శబ్దమునకును బల్బజ శబ్దమునకును సరియగు తెలుగు పదము లభింపలేదు.

## 16 సూ. కృష్ణరురుబస్తాజినాని

[౧—౧—౧౬]

హరదత్తమితాక్షరా—కృష్ణః కృష్ణసారమృగః రురుర్బిందుమాన్మృగః, బస్తశ్ఛాగః ఏతేషా మజినాని ఉత్తరీయాణి క్రమేణ, అజినం త్వేవోత్తరీయం ధారయే దిత్యా పస్తంబీయే దర్శనాదితిజ్ఞేయమ్.

ఆంధ్ర వివరణము:— ఇటుపైని బ్రాహ్మణాది త్రివర్ణములవారు ధరింపఁదగిన యుత్తరీయములను రూపించుచున్నాఁడు. కృష్ణమృగ మనఁగా కృష్ణసార మను మృగము. అనఁగా నల్లనిచారలు గల ఇట్టి అనిభావము. రురు వనగా; నల్లనిదై యుండి ఒడలి నిండ తెల్లనిచుక్కలు గలఇట్టి బస్తమనఁగా మేఁక. బ్రాహ్మణక్షత్రియవైశ్యజాతులకు జెందినవటువులు (అనఁగా ఉపనీతులగు బ్రహ్మచారులు) క్రమానుసారముగా కృష్ణసార రురు బస్తమృగముల యొక్క అజినములను (చర్మములను) ఉత్తరీయములనుగా ధరింపవలయు ననిసూత్రార్థము. మూలసూత్రమునందు కృష్ణరురుబస్తాజినములను ధరింపవలయు ననియే కలదు. కాని ఉత్తరీయములనుగా ధరింపవలయునని లేదు గదా? ఎట్లీవిశేషమును చెప్పితి వన వచ్చును. కాని ఇది సంప్రదాయసిద్ధము. ఆపస్తంబ మహర్షి కూడా తన ధర్మ సూత్రములయందు—“అజినం త్వేవోత్తరీయంధారయేత్”—అని ఉత్తరీయమునుగా ధరింప వలసి నట్లే నిర్దేశించు చుండుట వలన నిచ్చట కూడ నుత్తరీయములుగా ధరింపవలయు ననియే చెప్పితిమి. [కాని ఈ చర్మముల నుత్తరీయములుగా ధరించునాచారము క్రమముగా సంకుచితమై అన్యథా పరిణమించుచు వచ్చినది. దానిని వేఱొక్కచోట వివరించెదము.]

## 17 సూ. వాసాంసి శాణక్షౌమ చీర కుతపా స్సర్వేషాం

[౧—౧—౧౭]

హరదత్తమితాక్షరా:— శణవికారశ్శాణః; క్షుమా అతసీ తద్వికారః క్షౌమం; శ్వేతపట్ట ఇత్యన్యే దర్భాది నిర్మితంచీరమ్ ఊర్ణా నిర్మితః కంబళః కుతపః, చత్వార్యేతాని వాసాంసిసర్వేషాం వర్ణానామితి.

ఆంధ్ర వివరణము:—శణ మనఁగా జనుపచెట్టు (దీనినుండి నారదీయుదురు.) శణ వికారమైనట్టివస్త్రము ‘శాణ’మనఁబడు చున్నయది, (మఱికొందఱు శణమనఁగా రెల్లులోగల భేదమనిరి. ఇంకఁగొందఱు వేరుపనసచెట్టుఅనిరి. ఈయర్థములు కోశకారులవిమాత్రమే) క్షుమ యనఁగా నల్లఅవిసె చెట్టు. తత్సంబంధము అగునారతో చేసిన వస్త్రముక్షౌమము. (ఈక్షౌమమునకే దుకూల మనియు నింకొక పేరు గలదు.) కొందఱు దీనినే తెల్లపట్టని యందురట దర్భలు మొదలగు తక్కిన నార పదార్థములతో నేసినవస్త్రము చీర మనఁబడును. (దీని నిప్పటికిని వ్యుత్పత్తి సహితముగా నారచీరయను పేర వాడుచున్నారు.) గొఱ్ఱెలు

మున్నగువానియున్నికి ఊర్ణ యని పేరు. ఊర్ణ మున్నగు వానితో నేసిన కంబళ్లు మున్నగునవి కుతపము లనఁబడును. శాణము లగువస్త్రములు, క్షౌమవస్త్రములు చీరలు కుతపములు, అనునీనాల్గువిధము లైనవస్త్రములను వీరు వారను భేదము లేక (తమ తమ శక్తి కొలఁదిగ నార్జించి) అన్ని వర్ణముల వారును ధరించుకొనవచ్చును అని సూత్రార్థము.

విశేషాంశములు—కుతపములకు మామూలుగా గొఱ్ఱెల ఉన్నితో నేయబడినట్టి వస్త్రములర్థము గాదనియును, పర్వతీయ ప్రాంతములందలి గొఱ్ఱెల ఉన్నితో నేయబడినట్టి వస్త్రములుమాత్రమే కుతపములనియును మఱికొందఱు వ్యాఖ్యాతలు వ్రాసిరి. వారి మాటలు ఇవి-"కుతపః పార్వతీయ భాగరోమనిష్పన్నః-అని.

## 18 సూ. కార్పాసంవాఽవికృతం [౧—౧—౧౮.]

హారదత్తమితాక్షరా:— అవికృతంకార్పాసం వాస స్సర్వేషామవికృతం కుసుంభాదిరాగద్రవ్యై ర్వర్ణాంతరకల్పన మవికృతిః తద్రహితమ్.

ఆంధ్ర వివరణము:—కార్పాసమనగా ప్రత్తిచెట్టు. ప్రత్తి చెట్టునందలి ప్రత్తినివిడిచి తెచ్చి వడికి ఆనూలుతో నేయఁబడినవస్త్రముకూడా కార్పాస మనియే అనబడును. కుసుమము మొదలగు రంగుల నద్ది వస్త్రములను మఱియొక రంగు గలవిగా చేయుటకు వికృతియని పేరు. అట్టి వికృతి లేనిబట్టలు అవికృతములు (అనఁగా రంగువేయనివని యర్థము.) అవికృత మగుకార్పాస మైనప్పటికిని (అనఁగా వెనుకటి సూత్రమునందు చెప్పఁబడినట్టి శాణ క్షౌమ చీరకుతపములు లభించినను లభింపకున్నను ఏవిధమైన రంగును అద్దనటువంటి నూలు బట్టయైనను) వికల్పపక్షమున సర్వవర్ణములవారికిని ధరింపఁదగియుండు నని సూత్రార్థము.

## 19 సూ. కాషాయ మప్యేకే. [౧—౧—౧౯]

హారదత్తమితాక్షరా:— ఏకేత్వాచార్యాః కషాయేణ రక్తమపి ధార్యం మన్యంతే.

ఆంధ్ర వివరణము:— కషాయపురంగుతో నద్దిన బట్ట కాషాయమనఁబడుచున్నది. అభావమునందు కాషాయవస్త్రమైనను, ధరింపగా వచ్చునని కొందఱాచార్యులు తలఁచిరని సూత్రార్థము.

## 20 సూ. వార్క్షం బ్రాహ్మణస్యమాంజిష్ఠ హారిద్రే ఇతరయోః [౧—౧౧—౨౦]

హారదత్త మితాక్షరా:—తత్రాపినియమః ప్రకల్ప్యతే వార్క్షమితి-వృక్షకషాయేణరక్తం వార్క్షం. తద్బ్రాహ్మణస్య మంజిష్ఠయారక్తం మాంజిష్ఠం హారిద్రయారక్తం హారిద్రం తే ఇతరయోః క్షత్త్రియవైశ్యయో రితి యావత్.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రములందు [17. 18. 19 సూత్రములలో] ద్విజు లగువారెల్లరును ధరింపవలసిన వస్త్రములను పేర్కొనిరి. ప్రస్తుతము ఈసూత్రమునందు ఆయావర్ణములవారు ధరింపవలసిన వస్త్రములను గుఱించి నియమము చేయబడుచున్నది.

వృక్షము అనగా చెట్టు. వృక్షములయొక్క బెరడుమున్నగువానిని నాన్చి సిద్ధముచేయునట్టి రసమునకు (అనగా కషాయమునకు) వార్క్షమని పేరు. ఇట్టిరసముతో రంగువైచినట్టివస్త్రముకూడ వార్క్ష మనియే యనఁబడును. [చెట్లకషాయములతో బట్టలకు రంగులను అద్దకములను వేయునట్టి యాచారము చాలఁప్రాచీనమైనది.] మంజిష్ఠ అనగా మిక్కిలి ఎఱుపుడాలు గలపీతవర్ణము. కొందఱు దీనిని పసుపుపచ్చరంగని యందురు. మంజిష్ఠయనుపదమును మాంజిష్ఠయనుపదమును పర్యాయములు. మాంజిష్ఠరసముచేత రంగు నేయఁబడిన వస్త్రములుకూడ మాంజిష్ఠము లనియే యనఁ

బడును. హారిద్రమనగా పసుపురంగు. పసపురంగుచేత రంగు వేయఁబడిన వస్త్రములు హారిద్రము లనఁబడును,

బ్రాహ్మణునకు వృక్షకషాయముతో రంగువేయ బడిన వస్త్రమును, క్షత్రియునకు మాంజిష్ఠముతో రంగువేయఁబడిన వస్త్రమును, వైశ్యునకు హారిద్రవస్త్రమును నియమింపఁబడినవని సూత్రార్థము.

## 21. సూ. బైల్వపాలాశౌ బ్రాహ్మణదండౌ [౧-౧-౨౧]

హరదత్త మితాక్షరా:—బైల్వః పాలాశోవా బ్రాహ్మణస్య దండః నపున స్సముచ్చితౌ

ఆంధ్రవివరణము:— ఇంతవరకును బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు ధరింపవలసిన వస్త్రములను గుఱించి వివరించి ఇటుపైని ధరింపవలసిన దండములను నియమించుచున్నాడు-

బిల్వ మనగా మారేడుచెట్టు. బిల్వవృక్షముయొక్క దండము బైల్వము. పలాశ మనగా మోదుగుచెట్టు. పలాశవృక్షముయొక్క దండము పాలాశము. బైల్వముగాని పాలాశదండముగాని బ్రాహ్మణునకు ధరింపవలసినదండములుగా నియమింపబడినవని సూత్రార్థము. ఈసూత్రమునందు బైల్వపాలాశౌ బ్రాహ్మణదండౌ అని వికల్పము తెలుపబడకుండ చెప్పబడినది. దీనినిబట్టి బైల్వదండముగాని పాలాశదండముగాని (ఏదోయొకటిమాత్రమే) బ్రాహ్మణుడుధరింపవలయునని అర్థము చేయవలయునేగాని బైల్వపాలాశ దండములు ఒకటిగా కలిపిధరింపవలయు నని మాత్ర మర్థము చేయరాదు అని యెఱుంగవలయును.

## 22. సూ. అశ్వత్థపైలవౌ శేషే [౧-౧-౨౨]

హరదత్త మితాక్షరా:—పీలుర్వృక్షవిశేషః. ఉతా, ఉతా యీాఇతిప్రసిద్ధః, శేషే క్షత్రియవైశ్యవిషయే.

ఆంధ్రవివరణము:—అశ్వత్థ మనగా రావిచెట్టు పీలువనఁగా (గొలిజచెట్టు అనియునుకొండగోగుచెట్టనియు ను మతభేదములతో బల్కుచుందురు] గొలుగుచెట్టు. శేషే-తక్కినవారి విషయమై, అశ్వత్థపైలవౌ రావి (చెట్టు యొక్క) దండమును గొలుగుదండమును ధరింపవలసినట్లుగా విధింపబడినవి అని సూత్రార్థము, అనఁగా బ్రాహ్మణులుగాక తక్కినద్విజాతులగు క్షత్రియులు వైశ్యులు క్రమముగా అశ్వత్థదండమును పైలవదండమును ధరింపవలయునని సూత్రార్థము. ఇచ్చట హరదత్తుడు పీలుశబ్దమునకు ఉతా అని లోకమునందు ప్రసిద్ధికలదని వ్రాయుచున్నాడు. ఈఉతాఅనుమాట ఏభాషలోని పదమో విచారింపవలసియున్నది. పునహావారి అచ్చుప్రతిలో ఉతా అనుచోట ప్రశ్నగుర్తును వైచి క్రిందను ప్రత్యంతరమునందు ఉతాయీా అని పాఠాంతర మున్నట్లు వ్రాసిరి. కాని వ్రాతప్రతిలోఉతా అని మాత్రమే కలదు. మైసూరిలో ప్రకటితమైన మస్కరీయ భాష్యమునందు “పీలుఃకల్కిః” —అని వ్రాయబడినది. కాని అర్థము ఏమో ?

## 23. సూ. యజ్ఞియోవాసర్వేషాం [౧-౧-౨౩]

హరదత్త మితాక్షరా:—సర్వేషా ముక్తాలాభే యజ్ఞియో యజ్ఞియవృక్షోవా దండస్స్యాత్ యజ్ఞియవృక్షః పాలాశః ఇతి-పాఠాంతరమ్.

ఆంధ్ర వివరణము:— ఇదివఱకు ఆయావర్ణముల వారు ఆయాదండములను ధరింపవలయునని వేఱువేఱు సూత్రములందు చెప్పబడియున్నది. కాని ఆరీతిగా దండములు ఒక్కొక్కప్పుడు లభింపకపోవచ్చును అప్పుడేమిచేయదగును - అని ఆశంకరాగా వారించుచున్నాడు. పైని చెప్పినటులు వర్ణానుసారములగు దండములు లభింపనప్పుడు యజ్ఞియవృక్ష సంబంధమగుదండము అన్నివర్ణముల వారికి ధరింపవలసినట్లు విధింపబడు చున్నదని సూత్రార్థము.

విశేషాంశములు:—ఇచ్చటయజ్ఞియ శబ్దమునకు యజ్ఞియ వృక్ష సంబంధమగు దండమని హరదత్తుడు నిర్దేశించెనే

గాని విశేషించి చెప్పలేదు. యజ్ఞీయవృక్షమనగా తెలుగున అర్థము చెప్పునపుడు మోదుగచెట్టు యని కొందఱును మేడిచెట్టని కొందఱును గంగరావిచెట్టని కొందఱును అర్థమును చెప్పుచున్నారు. కాని మోదుగకు యజ్ఞీయమన్న పేరు వచ్చుటకు వీలుగనబడదు. అయితే ఆనగణములో సర్వసాధారణముగ మోదుగను వాడుచున్నారు. నైఘంటికుల మతమునను సరించినచో ఉదుంబర దండమును (మేడిదండము ను) వాడవలసియున్నది. ఉదుంబరో జగుఫలో యజ్ఞాంగో హేమదుగ్ధకః — అని నిఘంటువున్నది. అందలి యజ్ఞాంగ మను పదముయొక్క సంబంధము ననుసరించునది యజ్ఞీయమనగా మేడిదండమను చున్నారు. కాని ఇంకను ప్రశ్నము దీనిని చర్చింపవలసియున్నయది.

మస్కరీయ భాష్యమునందు యజ్ఞీయమనగా "బిల్వః బిల్వః యూపకాది వృక్షః" — అని యర్థమును నిర్వచించినారు. వీరి నిర్వచనము ప్రకారము కాండ్రము మేడి ము న్నగునవి కావివి యజ్ఞీయములని యర్థమగుచున్నది.

## 24. సూ. అపీడితాః యూపవక్రా స్సశల్కాః [౧—౧—౨౪]

హరదత్త మితాక్షరా: — అపీడితాః కీటాదిభి రదూషితాః యూపవక్రాః యూపవదగ్రేన క్రాః సశల్కాస్సత్వచః ఏవంవిధాః దండా స్సర్వేషామ్.

ఆంధ్రవివరణము: — ఇట్టులు వర్ణానుసారముగా చేపట్టవలసిన దండములను నిరూపించి ఇట్టిపైని దండములకు ముఖ్యముగావలయునట్టి గుణములను నిరూపించుచున్నాడు. ఏవర్ణమునకు సంబంధించిన వారు ఆదండములను గ్రహించినను — అయ్యవి అపీడితములై — [అనగా పురుగులు మున్నగు వానిచేత తొలిచేయబడనవి, నలిపివేయుటను గనిచేయుబడకుండను ఉన్నవై —] యూపములవలె కొంచెముంత వంకర కలవై — అనగా అగ్రభాగమున వంగియున్నవై — సశల్కములై — బెరడుతోయుండవలయునవై [అనగా పైబెరడు తోగూడియున్నవై యని భావము] యుండవలయునని సూత్రమునకు గల అర్థము. ఇచ్చట యూపమనగా యూపస్తంభము నిక్కొందఱును గంగరావికొమ్మయని కొందఱును చెప్పిరి. కాని ఆ యూపస్తంభము అనునది యేయేవృక్షముల వలన వచ్చినదని తెలియరాకున్నది.

మనువు దండగుణముల నిట్టుల చెప్పినాడు — శ్లో. ఋజవస్తేతు సర్వేస్యు రవ్రణా స్సౌమ్య దర్శనాః, అనుద్వేగ కరాన్నౄణాం సత్వచోనగ్ని దూషితాః — అని.

## 25. సూ. మూర్ధ లలాట నాసాగ్ర ప్రమాణాః [౧—౧—౨౫]

హరదత్త మితాక్షరా: — యథాసంఖ్య మత్రేష్యతే. మూర్ధప్రమాణో బ్రాహ్మణస్య దండః. లలాటావధిః క్షత్రియస్య దండః నాసావధిర్వైశ్యస్య గండ ఇతి.

ఆంధ్రవివరణము: — దండములకు గలయు గుణములను నిరూపించి సూత్రమునందు ఆదండములకు వలసిన ప్రమాణములను (పొడవుయొక్క కొలతలు) వివరించుచున్నాడు. మూర్ధమనగా శిరస్సు. లలాటమనగా నుదురు. నాసాగ్రమనగా ముక్కుకొన. బ్రాహ్మణక్షత్రియ వైశ్యులకు యథాసంఖ్యముగా (అనగా వరుసగా) దండములు మూర్ధప్రమాణము గలదిగను లలాటప్రమాణము గలదిగను నాసాగ్రప్రమాణము గలదిగను ఉండవలయునని సూత్రార్థము. అనగా బ్రాహ్మణునకు మూర్ధప్రమాణమగు దండము ఉండవలయునని తాత్పర్యము.

## 26. సూ. ముండజటిల శిఖాజటాశ్చ ✓ [౧—౧—౨౬]

హరదత్త మితాక్షరా: — అత్రాపి యథాసంఖ్యే, ముండాః లూనసర్వకేశాః, జటిలాః కేశధారిణః, జటా కేశసంహతిః శిఖామాత్రే వజటా యేషాం తే శిఖాజటాః, సర్వేషామయం సామాన్యధర్మః ఛందోగానాం కేషాంచి ముండశిఖ గ్రహణ మితిబోధ్యం.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందు వలె ఇచ్చట యథా సంఖ్యమును గ్రహింపనక్కఱలేదు. సర్వవర్ణముల వారు ముండులుగాను [అనగా కొంచెమంత (గోష్పాదమంత) జుట్టుమాత్రముంచికొని తక్కిన వెంట్రుకలనన్నిటిని క్షౌరము చేయించుకొనునట్టివారుగను అనిభావము] లేక జటిలులుగాను-అనగా వెంట్రుకల పెంచుకొనునట్టి వారుగను, శిఖాజటిలులుగను-అనగా సిగమాత్రమే జడగానుంచుకొన్నవారుగను ఉండవచ్చును. అనిసూత్రార్థము. ఈసూత్రమునందు విధింప బడినధర్మము సర్వవర్ణములవారికిని [అనగా బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు ముగ్గురకును] సాధారణమైనట్టిద నియెఱుంగవలయును. ఇచ్చటముండ శబ్దగ్రహణము ఛందోగాపేక్షయానైనదని ఎఱుంగదగును.

27. సూ. ద్రవ్యహస్తశ్చేదుచ్ఛిష్టోనిధాయాచామేత్.

[౧—౧—౨౭]

హరదత్త మితాక్షరా:— మూత్రపురీషయోః కర్మ, భోజనాదిచ ఉచ్ఛిష్టత్వనిమిత్తమ్. ద్రవ్యహస్తస్స న్నుచ్ఛిష్టశ్చేత్ తద్ద్రవ్యమనిధాయైవాచామేత్. ఉచ్ఛిష్టః సన్ద్రవ్యహస్తశ్చేత్ తద్ద్రవ్యమనిధాయాచామేత్. తథాచమనుః శ్లో. ఉచ్ఛిష్టేనతు సంస్పృష్టో ద్రవ్యహస్తః కథంచన, అనిధాయైవతద్ద్రవ్యం ఆచాంతశ్శుచితామియాత్. కించభక్ష్య భోజ్యాదిద్రవ్యవిషయేతద్ద్రవ్యంనిధాయైవమూత్రపురీషయోః కర్మకృత్వాపునస్తత్పాత్రంనిధాయ [పునరుపాత్తం నిధాయేతి కేచిత్.] ఆచామేత్. వస్త్రదండాది విషయేత్వనిధాయైవ ఆచామేత్.

ఆంధ్రవివరణము:—ఇటుపైని శౌచాదులను నిరూపించుచున్నాడు.—శౌచమనగా పరిశుద్ధి గల్గియుండుట. అపశౌచమనగా అపరిశుద్ధిగల్గియుండుట. అనగా మైలపడుట యనిభావము. ఉచ్ఛిష్టుడు అనగా మైలపడినవాడనియర్థము మైలపడినప్పుడు మఱల శౌచము గల్గుటకై స్నానాదులనొనర్పవలయును. కానిఅందుగల గౌరవలాఘవముల ననుసరించి ఆచమనముమాత్రము చేతకూడ శుద్ధుడు కావచ్చును. ఇప్పుడీ సూత్రమునందు ఆచమనమాత్రముచేత శుద్ధుడగువిధమును రూపించుచున్నాడు. (మడుగుకట్టుకొని) శుచియైయుండువాడు ఉచ్ఛిష్టుడగుటకు-అనగా మైలబడుటకు మలబాధకుపోవుట భోజనాదులు చేయుటలు - మున్నగుపనులు మైలపడుటకిచ్చటనాధారములు.

ద్రవ్యహస్తుడైయుండగా నుచ్ఛిష్టుడగుట సంభవించెనేని అప్పుడు దానిని (అనగా ఆద్రవ్యమును) భూమియందుంచకయే ఆచమనము చేయవలయును. (అనగా పవిత్రములగు వస్తువులు మొదలగువానిని చేతబట్టుకొని యుండగా మైలపడుట సంభవించునేని అద్దానిని క్రిందనుంచకయే ఆచమనముచేసినచో శుద్ధుడగునని తాత్పర్యము) అట్లుగాక ఉచ్ఛిష్టుడై యుండగనే ద్రవ్యహస్తుడైనచో అప్పుడద్దానిని క్రిందనుంచియే ఆచమనమును చేయవలయును. మనువుకూడనిట్లే చెప్పియున్నాడు. "ద్రవ్యహస్తుడై ఎటులనో (ప్రమాదము) ఉచ్ఛిష్టముతో సంస్పర్శనము గలవాడగునేని ఆద్రవ్యమును క్రిందనుంచకయే ఆచమించినచో శుచిత్వమును పొందును. ఇది యొకవిధము. ఇంకనొక ముఖ్యవిషయముగలదు- ఈఉచ్ఛిష్టుడగుట (అనగా మైలపడినవాడగుట) భక్ష్యభోజ్యాదివస్తువుల విషయములోనైన యెడల-అప్పుడుఆవస్తువు నచ్చటనుంచియే- ఆపైనిమూత్రపురీషాదులను నిర్వర్తించుకొని మఱల ఆచమన పాత్రమును గైకొని ఆచమనముచేయవలయును. ఇదియేవస్త్రదండాది విషయమైనచో క్రిందనుంచ నక్కఱలేకయే ఆచమనము చేయవచ్చును అని తాత్పర్యము.

28. సూ. ద్రవ్యశుద్ధిః పరిమార్జనప్రదాహతక్షణనిర్ణేజనాని తైజసమార్త్తికదారవతాంతవానామ్

[౧—౧—౨౮]

హరదత్త మితాక్షరా:— అథద్రవ్యశుద్ధిరుచ్యతే. తైజసాదీనాం యథాక్రమం పరిమార్జనా

దిశుద్ధయః. తైజసంకాంస్యాది మార్త్తికంమృణ్మయాది. దారవందారుమయాది. తాంతవంతంతుమయాది. తేషాంక్రమేణమార్జనం పరిమార్జనం తత్రభస్మనాకాంస్యస్య. శకృతాసౌవర్ణరాజతయోః అమ్లేనతామ్రస్య ఇదముచ్ఛిష్ట లిప్తానాం. తైజసానామేవంభూతానాం భస్మాదిభిరితికణ్వాః, రజస్వలా చండాలాది స్పృష్టానాం ఏకదినంపంచగవ్యంనిక్షిప్య ఏకవింశతికృత్వోమార్జనాచ్ఛుద్ధిః మార్త్తికానాం ప్రదాహః ప్రకృష్టోదాహః వర్ణాంతరాపత్తిర్యథాస్యాత్తథాపిధో దాహశ్చోద్ధనమ్. ఇదంస్పర్శోపహతానాం—అత్రవాసిష్ఠః—శ్లో. మద్యమూత్ర పురీషైశ్చ శ్లేష్మపూయాశ్రుశోణితైః, సంస్పృష్టంనైవశుద్ధ్యేత పునర్దాహేనమృణ్మయం, దారవాణాంతక్షణాచ్ఛుద్ధిః. ఇద మమేధ్యాదివాసితానాం, అన్యత్ర ప్రోక్షణ ప్రక్షాళనాది. తాంతవానాం నిర్ణేజనాచ్ఛుద్ధిః. ఇదంస్పర్శదూషితానాం. మలాది దూషితానాం ధావనం తన్మాత్రచ్ఛేదనంవా స్పర్శదూషితానాం బహూనాం ప్రోక్షణాచ్ఛుద్ధిరితివిజ్ఞేయం.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ద్రవ్యశుద్ధి విధానము (అనగా వస్తువులు పరిశుద్ధి నొందునట్టిరీతి) వివరింపబడుచున్నయది. తేజస్సు అనగా వెలుగు. తద్వికారములగునట్టివి తైజసములు తైజసములు మొదలగువాటికి యథాక్రమముగా పరిమార్జనాదులు శుద్ధివిధానములని సూత్రార్థము, కంచు వెండి బంగారు మున్నగు లోహములతో చేయబడిన పాత్రలు తైజసములు. మట్టి మున్నగువానితో చేసినట్టివి మార్త్తికములు. అనగా మృత్తుతో చేయబడినవస్తువులు. దారువులతో (కొయ్యలతో) చేయబడిన వస్తువులు దారవములు. తంతువులతో (అనగా దారములతో) చేయబడినట్టి వస్తువులు తాంతవములు- పరిమార్జనమనగా తోముట. ప్రదాహమనగా కాల్చుట - తక్షణమనగా చెక్కుట - నిర్ణేజనమనగా తడుపుట తైజసములగు వస్తువులకు మార్జనము అనగా పరిమార్జనము (తోముట) శుద్ధివిధానము. ఇందుననుకూడ కంచు వస్తువులైనచో బూడిదతో తోమవలయును, వెండిబంగారములైనచో గోమయముతో తోమవలయును. రాగివస్తువులైనచో పులుసుతో తోమవలయును. ఈశుద్ధివిధానము ఎంగిలి కలసిన పాత్రములకు మాత్రమే. కాని కణ్వర్షి తైజసములకును ఇంకను అట్టి ఇతర వస్తువులకును గూడ భస్మాదులవలననే శుద్ధియగునని చెప్పెను. రజస్వలయైన (ముట్టైన) స్త్రీగాని చండాలురు మున్నగువారు గాని ముట్టుకొన్న పాత్రములకైనయెడల ఒక దినమంతయును ఆపాత్రలలో పంచగవ్యమును (గోమూత్రము గోమయము) నింపియుంచి పిమ్మట ఇరువదియొక్కమారు మార్జనము(తోముట) చేసినచో శుద్ధియగును. ఇంకను మార్త్తికములకు-అనగా మట్టితో చేసిన కుండలు గూనలు మున్నగువానికి- ప్రదాహము అనగా మాఱురంగు ఏర్పడు నట్టులు చక్కగా కాల్చుటయే - పరిశుద్ధి విధానము అగును. ఇయ్యది స్పర్శదోషము గల్గిన వాటి విషయమున మాత్రమే యని యెఱుంగవలయును. ఈవిషయమై వాసిష్ఠస్మృతి ఇట్లు చెప్పుచున్నయది—మద్యమూత్ర పురీషములచేగాని శ్లేష్మపూయాశ్రుశోణితములచేత గాని స్పర్శ చేయబడిన పాత్రము మఱి శుద్ధిని బొందజాలదు. అట్టిమృణ్మయ పాత్రము పునర్దాహము చేతను (అనగా వర్ణాంతరాపత్తి గల్గునట్లు కాల్చుట చేతనని భావము.) మాత్రమే శుద్ధమగుచున్నయది. ఇంకను దారవములగు వానికిచెక్కుటను గాని క్రోవుకు పట్టినను గాని శుద్ధియగును. ఇయ్యది అమేధ్యాదులయందు పడినట్టివాని విషయము. తక్కినవిషయములందైనచో వీనికి ప్రోక్షణప్రక్షాళనాదులవలన (నీళ్లను చల్లుట కడుగుట మున్నగువానివలన) శుద్ధియేర్పడును. తాంతవములకు-అనగా దారములు మున్నగు వానితో నిర్మింపబడిన వస్తువులకు - నిర్ణేజనము చేయుటవలన - అనగా నీటిలో తడుపుటచేత - పరిశుద్ధి గల్గును. కాని యియ్యది స్పర్శ దోషమునకు గుఱియైన వాటికి మాత్రమే, తక్కినవానికి - అనగా దుర్మలము అంటువ్యాధులు మున్నగు దోషము పట్టిన వానికి - చక్కగా గాల్చి ఉతుకుటగాని అదియును గానిచో అంతవఱకు కత్తిరించి వేయుటగాని శుద్ధి విధానమగును. కాని స్పర్శదోషమునకు గుఱి

నైయెనట్టి వస్తువులలో చాలవఱకు (అనేకములకు) ప్రోక్షణ ముచే వలననే శుద్ధియగు ననుట శిష్టాచారసమ్మతము.

ఈసూత్రమున కాకరమగు ప్రాచీన కారిక ఇయ్యది.
శ్లో. నిర్లేపం కాంచనం భాండం అద్భిరేవ విశుద్ధ్యతి. అబ్జ మశ్మమయం చైవ రాజతం చానుపస్కృతం, శంఖశుక్తి మణీనాంచ గోమూత్రేణో దకేనవా—అని.

## 29. సూ. తైజసవదుపలమణి శంఖముక్తానామ్ [౧–౧–౨౯]

హరదత్తమితాక్షరా— ఉపలాదీనాం తైజసవచ్ఛుద్ధిః అర్థాత్ పరిమార్జన మితి.

ఆంధ్రవివరణము:—ఉపలములనగా రాళ్లు రాళ్లతో చేసినట్టి రాచిప్పలు మొదలగున వన్నియును ఉపలములే. కానిఇట రత్నములు. రత్నములు మున్నగునవితాపడము చేసినవి మణులనబడును. శంఖపు చిప్పలతో చేసిన పాత్రములు శంఖమయములు-ముక్తములనగా ముత్యములు, వానితోనైన వస్తువులును ముక్తములే యగును. ఉపల సంబంధములును మణిసంబంధములును శంఖసంబంధములును, ముక్తామణి సంబంధములును అగు వస్తువులకు తైజసములగు వస్తువులకువలెనే శుద్ధి విధానము విధింపబడినదని సూత్రార్థము.

## 30 సూ. దారువదస్థి భూమ్యోః [౧–౧–౩౦]

హరదత్త మితాక్షరా—అస్థి హస్తిదంతాది. భూమిర్గృహాది. తయో ర్దారువచ్ఛుద్ధి స్తక్షణమితి దారవ వదితి వక్తవ్యే దారువదితి నిర్దేశాద్వికారస్య యాశుద్ధి ర్వికారిణోప్యసై వశుద్ధి రిత్యర్థత ఉక్తమితి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందు రాళ్లు రత్నములు మున్నగువానికి చేయదగు శుద్ధి విధానము చెప్పబడినది. ఈ సూత్రమునందు దంతములతోను ఎముకలతోను చేయబడిన వస్తువులను గుఱించిన శుద్ధి విధానము చెప్పబడుచున్నది.

అస్థి అనగా ఎముక. దంతములు ఎముకలు కొమ్ములు మున్నగు వానితో జేయబడిన పాత్రములకు గూడ అస్థులనియే పేరు. భూమి అనగా ఇచ్చట గృహమయములగునవి యని గ్రహింప వలసి యున్నది, అస్థిమయములును భూమిమయములును అగు వస్తువులకు దారు మయములగు వస్తువులకు వలెనే తక్షణము చేత (చెక్కుట లేక త్రోపుడు పట్టుటలచేత) శుద్ధియని సూత్రార్థము. మూలసూత్రమునందు దారవవదస్థిభూమ్యోః - అని చెప్పవలసియున్నది. దారువనగా కొయ్య దారువుతో చేసిన వస్తువులు దారవములు. దీనికి వతు ప్రత్యయము చేర్చినచో దారవవత్-అని యగును. అప్పుడు సూత్రరచనము "దారవవదస్థి భూమ్యోః—అని కావలసి యున్నది. అయితే అట్లు చెప్పక దారువదస్థిభూమ్యోః— అని చెప్పుటచేత విశేషార్థము ఒక్కటి ఇచ్చట కలదు. అది ఏమనగా—వికారమునకు ఏశుద్ధియో వికారికికూడా అదేశుద్ధిఅనుటయే. వికారమనగా అసలు వస్తువు. వికారి యనగా దానితో నిర్మింపబడినట్టి వస్తువు. ఉదా-మృత్తు (అనగా మట్టి) వికారము. దానితో చేసినదగు మృణ్మయ పదార్థము (అనగా మట్టి కుండ మున్నగునది) వికారి. ఇట్టులనే తక్కిన అన్నిస్థలములయందును కూడ నెఱుంగవలయును

## 31 సూ. ఆవపనం చ భూమేః [౧–౧–౩౧]

హరదత్త మితాక్షరా— ఆవపనమితి, ఆవపన మన్యత ఆనీయ పూరణ మధికా శుద్ధిర్భూమేః అత్రవాసిష్ఠః—శ్లో. ఖననా ద్దహనా దద్భిర్గోభిరాక్రమణేనచ, చతుర్భిశ్శుద్ధ్యతే భూమిః పంచమా త్తూపలేపనాత్ —ఇతి.

ఆంధ్రవివరణము:—భూమికి ఆవపనము కూడ శుద్ధి విధానమేయని సూత్రార్థము. ఇచ్చట ఆవపనమనగా మఱియొకచోటనుండి మట్టిని తెచ్చి పైని పోసి పూరించుట. ఇయ్యది వెనుక చెప్పిన శుద్ధి విధానముగాక ఇంకొక శుద్ధి విధానముకూడ హెచ్చుగ చెప్పబడినదని యెఱుంగవలయు

ను. ఈవిషయమున వాసిష్ఠస్మృతికూడ ఇట్టులు చెప్పుచున్నది. - త్రవ్వుట - కాల్చుట - నీళ్లు పారించుట - ఆవులమందలను కట్టి వేయించుట - అను నీ నాల్గు పనులవలనను భూమి శుద్ధమగుచున్నది. ఈ నాల్గునుగాక అయిదవది ఉపలేపనము (పూత లేక అలుకుట) వలన కూడ శుద్ధము అగుచునే యున్నది.

## 32 సూ. చైలవద్రజ్జువిదళ చర్మణాం. [౧—౧—౩౨]

హరదత్తమితాక్షరా:—విదలం వేత్రవేణువిదలాదినిర్మితమ్, పిచ్ఛనిర్మితమిత్యన్యే. రజ్జ్వాదీనాం త్రయాణాం చైలవద్వస్త్రవచ్ఛుద్ధిర్నిర్ణేజనమితి. పైఠీనసిస్తు రజ్జువిదళ చర్మణాంఅస్పృశ్యస్పృష్టానాం ప్రోక్షణాచ్ఛుద్ధిరితి.

ఆంధ్రవివరణము:—రజ్జువులనగా త్రాళ్లుపగ్గములు రజ్జువులతో చేసినట్టి ఉట్టులు పలుపులు - చిక్కములు పగ్గములు మొదలగునవికూడ ఇచ్చట రజ్జుశబ్దముతో వ్యవహరింపబడుచున్నవి, విదళములన వెదురు గణపులను కొట్టి చేయునట్టి పాత్రములు గాని వెదురబద్దలు-చీల్చి అల్లెడిబుట్టలు తట్టలు మున్నగునవి కాని. చర్మము అనగా తోలు. చర్మముతో చేసినట్టివిగూడా చర్మములనియే చెప్పబడును.

రజ్జువిదళ చర్మములకు - అనగారజ్జుమయములగు విదళమయములగు చర్మమయములగు పాత్రములకు-వస్తువులకు చేల (మయ) ములగు వానికివలెనే అనగా వస్త్రములకు వలెనే శుద్ధివిధానమని సూత్రార్థము. అనగా వస్త్రములకు ఎట్టులు నిర్ణేజనమున - (తడుపుట వలన) శుద్ధియగునో అట్టులనే రజ్జు, విదళచర్మమయములగు వస్తువులకు గూడ నిర్ణేజనమున శుద్ధియగును అని తాత్పర్యము. ఇది గౌతముని మతము. కాని పైఠీనసి యను స్మృతికర్త కొంచెము భిన్నముగా చెప్పినాడు. అయన - రజ్జు విదళ చర్మమయములగు వస్తువులకు - అందుకూడ అస్పృశ్యస్పృష్టములగు వానికి - (అనగా తగులకూడని వానిని తగిలి స్పర్శ దోషము నొందినట్టి వానికి)నిర్ణేజనము అక్కరలేకుండ ప్రోక్షణమువలననే (అనగా జలమును చల్లుట చేతనే) శుద్ధియగునని చెప్పెను.

## 33 సూ. ఉత్సర్గో వాత్యంతోపహతానాం [౧—౧—౩౩]

హరదత్తమితాక్షర:—ఇదం వాసిష్ఠేన సమాన విషయం. మద్యమూత్రపురీషైరత్యాదినా. వాశబ్దః పక్షవ్యావృత్త్యై.

ఆంధ్రవివరణము:—మద్యము మూత్రము పురీషము మొదలగువానిచేత అత్యంతము (అనగా మిక్కిలియును) ఉపహతములైనట్టి వస్తువులకు ఉత్సర్గమే (అనగా వదలివేయుట) శుద్ధివిధానము అగునని సూత్రార్థము. ఈసూత్రమునందు చెప్పబడిన శౌచవిధానము 28 వ సూత్రమున దలి వసిష్ఠవాక్య విహితమగు శౌచవిధానముతో సమమైనది. అనగా తత్తుల్యమైనదని యర్థము. ఇచ్చట మూలమునందు గల వా అను శబ్దము వికల్పార్థమునందు ప్రయోగింపబడినదిగాగాక పక్షవ్యావృత్తికై - అనగా వికల్ప పక్షమునుదూరీకరించుటకై - చెప్పబడినది. ఈ సూత్రముతో ఆయా పదార్థములకు గలశుద్ధి విధానములు వివరించుట పూర్తియైనదికాబట్టి ఇటుపైని పురుషుడు ఆచరింపవలసిన శౌచవిధానమును గురించి ముమ్ముందు సూత్రములలో వివరింపబడుచుండును.

## 34 సూ. ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వా శౌచమారభేత [౧—౧—౩౪]

హరదత్త మితాక్షరా:—ఇచ్ఛాతో వికల్పః ఆరభేతేతివచనాత్. పాదప్రక్షాళనాత్ప్రభృతి దిఙ్నియమః. ఆపస్తంబస్తు ప్రత్యక్పాదావనేజనమిత్యాహ:—శౌచగ్రహణం ఆచమనపర్యమాభూన్మూత్రపురీషాదిశౌచేపి దిఙ్నియమజ్ఞాపనార్థమ్.

ఆంధ్ర వివరణము:—ప్రాఙ్ముఖుడైగాని --(అనగా తూర్పుదిక్కునకు మళ్లిగాని) ఉదఙ్ముఖుడైగాని (అన

గా నుత్తరపుదిక్కు వైపునకు మళ్లిగాని) శౌచమును ఆచరించుటకు ఆరంభింపవలయును అని సూత్రార్థము.. మూల సూత్రమునందు వా అనుమాటకు వికల్పమని యర్థము. అందుకూడ ఆరంభింపవలయును అని చెప్పుటచేత ఈ వికల్పము శౌచము నాచరించువాని ఇచ్ఛ ననుసరించియుండును. అనగా శౌచము నాచరించువాడు తన ఇష్టము చొప్పున తూర్పువైపునకో ఉత్తరమువైపునకో మళ్లి శౌచము నారంభింపవలయునని తాత్పర్యము. ఇందులో విధించిన ఈ దిఙ్నియమము పాదప్రక్షాళనము మొదలుకొని యని ఎఱుంగవలయును. అయితే ఇందులో మతభేదము గలదు. ఆపస్తంబుడు పాదావనేజనము ఈ నియమముతో సంబంధించినదిమాత్రము కాదనిచెప్పెను. అనగా పాదప్రక్షాళనమైనపిమ్మటనుండియే ప్రాఙ్ముఖత్వము కాని అంతకుముందునుండి కాదనె నని తాత్పర్యము. శౌచగ్రహణము ఆచమనమునందుమాత్రమే ఇది కాని, మూత్రపురీషాదిశౌచమునందుకూడా ఇల్లా కావుండుకాక అని దిఙ్నియమమును జ్ఞాపనచేయుట కని యెఱుంగవలయును.

విశేషాంశములు:—హరదత్తుడు ఈదిఙ్నియమము పాదప్రక్షాళనాదిగనని చెప్పినట్టి ఈయర్థమును అనేకులు వ్యాఖ్యాతలు (అనగా భట్టరుద్రుడు విజ్ఞానేశ్వరస్వామి మున్నగువారు) ఒప్పుకొనలేదు. వారు తమ వ్యాఖ్యానములందు రాబోవు సూత్రమునందు ఆచామేత్ - అన్నక్రియను చెప్పుటచేతనే ఇచ్చట ఇష్టసిద్ధి యగుచుండగా నీసూత్రమునందు శౌచం - అను మాటనేల పేర్కొనవలయునని ఆశంకించుకొని-"ఇది మూత్రమేగాక ఇంకను ఇట్టి శౌచమునకు సంబంధించిన విషయములలో కూడ ఈదిఙ్నియమమునే యవలంబించుట కిట్టులు చెప్పబడిన దని" సమాధానము వ్రాసిరి.

35 సూ, శుచౌ దేశ ఆసీనో దక్షిణం బాహుం జాన్వంతరా కృత్వా యజ్ఞోపవీ త్యామణి బంధనాత్పాణీ ప్రక్షాళ్యవా గ్యతో హృదయస్పృశ స్త్రి శ్చతుర్వా అప ఆచామేత్ [౧-౧-౩౫]

హరదత్త మితాక్షరా :—శుచావితి. ఇద మేకం వాక్యమ్. ఆచమన కాలే శుచౌ దేశే అనుపహతే ఆసీన స్తిష్ఠన్ప్రహ్వో వేతి. జాన్వంతరా జానునోర్మధ్యే దక్షిణ బాహుం కృత్వా దక్షిణబాహు మిత్యుక్త్వా ద్వావపి హస్తస్య నావశ్యంభావః యజ్ఞోపవీతీతి పూర్వోక్తస్వస్థాన స్థమపి యథాస్థాన నివేశనార్థం, అథవా ఉత్తరీయవిన్యాసార్థమ్, తథాచాపస్తంబః.—ఉపాసనే గురుణాం వృద్ధానామతిథీనాం హోమే జప్యకర్మణి భోజనఆచమనే స్వాధ్యాయేచ యజ్ఞోపవీతీస్యా దపివా సూత్రమేవోపవీతార్థ మితి. ఆమణిబంధాద్యస్మిన్దేశే మణిర్బద్ధ్యతే తస్మాత్పాణీప్రక్షాళ్య వాగ్యతశ్శబ్దమకుర్వన్ హృదయస్పృశః పరిమాణార్థమిదం యావత్యఃపీతాః హృదయంస్పృశంతి యాను మాషో మజ్జతి తావతీరప ఆచామేత్త్రిశ్చతుర్వా. యత్రమంత్రవదాచమనం విహితం తత్ర తేనసహచతుః. అన్యత్ర త్రిరితి వికల్పః.

ఆంధ్ర వివరణము :—వెనుకటిసూత్రమునందు శౌచవిధానమును నిరూపించుటకై యుపక్రమించియుండెను. ఇప్పుడీసూత్రమునందు శౌచవిధానమున ముమ్ముందు ఆచరింపదగినదిఆచమనముగనుక ఆచమనమునుగూర్చివివరించుచున్నాడు. ఆచమనమును చేయునట్టి వేళలలో శుచియగునట్టి(పరిశుద్ధమగునట్టి) ప్రదేశమునందు, (అనగా ఏవిధమగునట్టి స్పర్శాదిదోషములచేతను ఉపహతము కాక యుండినట్టిచోటునని భావము.) ఆసీనుడై దక్షిణబాహువును (అనగా కుడిచేతిని) జానువులమధ్య నుండునట్లు చేసికొనియజ్ఞోపవీతియై(అనగా జన్నిదమును సరిచేసుకొని) యని యర్థము. మణిబంధనము వఱకును [అనగా మణికట్టుదనుక] చేతులను కడిగికొని ఆపైని వాగ్యతుడై — ఏవిధమైన

శబ్దాములనొనగ్నక హృదయ స్పృశములు అగు (అనగా హృదయము దనుకమాత్రమే జారదగినంత కొలదివియగు) ఉదకములను మూడుమారులుగాని నాలుగుమారులుగాని ఆచమింపవలయును అని సూత్రార్థము.

ఇందు మూలసూత్రమునందు శుచియగు ప్రదేశమునందు ఆసీనుఁడై' యన్నచోటున ఆసీనశబ్దము ఉపలక్షణము కాబట్టి ఆసీనుడైకాని (అనగా కూర్చునికాని) ప్రహ్వుడై (వంగినవాడై) గాని ఆచమనము చేయవలయు నని భావము. సాధారణముగా వామబాహువు (ఎడమచేయి) దక్షిణబాహువు (కుడిచేయి) అని బాహుద్వయమున్నను అందు ప్రత్యేకించి దక్షిణబాహువునే పేర్కొనుటచేత ఆచమన విధానమునందు వామహస్తము ముఖ్యముగానుండి తీరవలయు నన్ననియమము లేదని యెఱుంగవలయును. ఇట్టులే ద్విజుడగు ప్రతివాడును సర్వకాల సర్వావస్థలయందును యజ్ఞోపవీతమును (జన్నిదమును) ధరించియే యుండవలసియున్నను, ఇందు "యజ్ఞోపవీతియై" అని పేర్కొన్నపదమును బట్టి ఆచమనమునకు మున్ముందు యజ్ఞోపవీతము స్వస్థానమునం దున్నను చూచుకొని యథాస్థానమున నుంచుకొని జాగ్రత్తపడుటకొఱకై ఇందు యజ్ఞోపవీతియై యని సూత్రమునందు గౌతముఁడు చెప్పెను. (ఇయ్యది కొందఱ వ్యాఖ్యాతలయొక్క భావమును అనుసరించిన సమాధానము. మఱికొందఱు ఈ సారస్యమునకు ఒప్పుకొనక ఇంకొకరీతిగ చెప్పిరి. దానిని అథవా యని యుద్ధరించుచున్నాడు.) అథవా అనగా పైని చెప్పినట్టులుగా గాకున్నను (పక్షాంతరమందు) ఆచమించు కాలమునందు ద్విజుడైన ప్రతివాడును పైని ఉత్తరీయమును ధరించి యుండవలయునన్న నియమము గలదు. గనుక ఉత్తరీయ పన్న్యాసముకొఱకై ఇచ్చట యజ్ఞోపవీతమును ధరింపవలయునని సూచించుటకే గౌతముఁడీ సూత్రమునందు యజ్ఞోపవీతీ అని పేర్కొనె నని యైనఁ జెప్పవచ్చును. అట్టులైనచో ఇందులకు ప్రమాణమేమని యందురా? వినుఁడు—ఆపస్తంబుడుకూడ ఇట్టులనే పేర్కొనియున్నాడు, "గురువులను ఉపాసించునప్పుడును, వృద్ధులను అతిథులను సేవించునప్పుడును, హోమములు మున్నగువానిని నెఱపునప్పుడును, జపములు తపములు మున్నగు జప్యకార్యములయందును, ఆచమనము చేయునప్పుడును, స్వాధ్యాయమును చేయునప్పుడును ద్విజుడు యజ్ఞోపవీతియై యుండవలయును." అని. ఇంతయేల ఈసూత్రమే యజ్ఞోపవీతార్థమని యెఱుంగ నగును. మఱియును ఇట్టులనే మూలసూత్రమునందు గల హృదయస్పృశః అన్నమాటకు (అనగా హృదయస్పృశములు అన్నమాట కని యర్థము.) ఆచమనము చేయవలసిన ఉదకముయొక్క పరిమాణమును నిర్ణయించుటయందు తాత్పర్యమనియును, ఏపాటి ఉదకములు త్రాగినచో హృదయము దనుకమాత్రమే జారిహృదయమును స్పృశించుట కల్గునో ఏపాటియుదకములలో మినపగింజ మునుగ జాలునో ఆపాటియుదకములనే ఆచమింపవలయునని యును ఎఱుంగవలయును. మూడుసారులుగాని నాల్గుమారులుగాని ఆచమింపవలయునని యన్నమాటకు ఇది భావము. ఎచ్చట మంత్రవత్తుగ ఆచమింపవలయునని విధింపబడునో అచ్చట దానితోఁగూడకలసి నాల్గుమారులనియును, తక్కిన స్థలములయందు మూడుమారులనియును వికల్పమునందు గలతత్త్వము నెఱుంగ నగును.

విశేషాంశములు—ఈసూత్రమును గుఱించి కూడ వ్యాఖ్యాతలలో భిన్నాభిప్రాయములు అనేకము గలవు. హరదత్తుఁడు ఆసీనుఁడైగాని ప్రహ్వుఁడైగాని అనియర్థము వ్రాయగా మస్కరి–ఆసీనుఁడయియే ఆచమింపవలయు ననుచున్నాఁడు. ఇందులకు ప్రమాణముగా "వ్రజన్ తిష్ఠన్ శయానః ప్రణతోవానాచామేత్–అను వసిష్ఠ వాక్యము నుదాహరించినాఁడు. ఇట్లే యజ్ఞోపవీతియైయను మాటకు–"ఎప్పుడైన నొక్కప్పుడు అయజ్ఞోపవీతిగానున్నను ఆచమనకాలమునందు తప్పక యజ్ఞోపవీతియైయుండవలయు ననికాని, ఆచమనాంగముగా మఱోయజ్ఞోపవీతమును కూడ ధరింపవలయుననిగాని" – అర్థమని వ్రా

యుచున్నారు. మఱియును మూలమునందుగల "త్రిశ్చతుర్వా"-అను మాటకు-"ఆపః పునంతు మొదలగు మంత్రముల నుచ్చరించి ఆచమించు నప్పుడు నాల్గుమారులని. తదితరకాలములందు మూడు మారులని"-కూడ ఆయనవ్యవస్థచేసి నాడు. ఇంతియే కాకుండ-అపశ్చాచామేత్ అన్న మాటచేత "ప్రకరణాంతరములలో శౌచముకొఱకు గోమూత్రాదులను పానముచేయవలయు నని విధానములున్నను ప్రస్తుత మీ ఆచమన కల్పమునందు మాత్రము ఉదకములనే ఆచమిం పవలయునని"-సూచింపబడుచున్నదని యనెను-పిబేత్తన్నమాటను చెప్పక ఆచమేత్-అన్న మాటచేత మఱియొక విధినికూడ నిందుప సంగ్రహించుట కనియును. ఆ ఇతరవిధియే దనగా "దక్షిణం హస్తతలం గోకర్ణాకారం విన్యస్య బ్రాహ్మేణ తీర్థేనాశబ్దం పిబేదృగ్యజ స్సామవేదాన్ ధ్యాయన్-అను నదియే యనియును వ్రాసిరి.

## ³⁶ సూ. ద్విఃపరిమృజ్య. [౧—౧—౩౬]

హరదత్తమితాక్షరా:— ప్రతియోగం సోదకేన పాణినా ఓష్ఠయోః పరిమార్జనమ్.

ఆంధ్రవివరణము;—ఇట్టులు ఆచమించిన పిమ్మట సోదకమగు పాణితో-అనగా ఉదకసహితమగు చేతితో రెండుమారులు పెదవులందు పరిమార్జనము నొనర్చుకొనవలయును అని తాత్పర్యము.

## 37 సూ. పాదౌ చాభ్యుక్షేత్. [౧—౧—33]

హరదత్తమితాక్షరా:—పాదౌచేతి. చకారాచ్ఛిరశ్చ.

ఆంధ్రవివరణము:—ఏవిధముగా సోదకమగు పాణితో పెదవులయందు రెండుమారులు పరిమార్జనము చేయవలయునో అట్టులనే సోదకమగు పాణితో పాదములను కూడ అభ్యుక్షణము చేసికొనవలయును. అభ్యుక్షణము చేయుట అనగా ఇచ్చట తుడిచికొనుట యని యర్థము. పాదౌ చాభ్యుక్షేత్ -అని చకారమును అందులో చేర్చుటచేత శిరస్సునుగూడ నిట్లే అభ్యుక్షణమును చేసికొనవలయునని సూచించి నట్టులయిన దని తెలియందగును.

## 38 సూ. ఖానిచోపస్పృశే చ్ఛీర్షణ్యాని. [౧—౧—౩౮]

హరదత్తమితాక్షరా:—ఖానిచేతి. శీర్షేభవాని శీర్షణ్యాని శిరోభవానీతి యావత్ అత్ర ఖానిఇంద్రియాణి తాన్యుపస్పృశేత్ ఇతిఅత్ర చకారః ప్రతీంద్రియోపస్పర్శనార్థః.

ఆంధ్రవివరణము:—ఖ శబ్దమునకు ఇంద్రియములనియర్థము. శీర్ష మనగా శిరస్సు అని అర్థము. శిరస్సునందు పుట్టినవి శీర్షణ్యములు. ఈశీర్షణ్యములనుపదము ఖశబ్దమునకు విశేషణము. కాగా శీర్షణ్యము లగునట్టి ఇంద్రియములని యేర్పడును. శీర్షణ్యములగునట్టి ఇంద్రియములను కూడా ఆచమనకాలమునందు స్పృశింప వలయునని సూత్రార్థము. ఈ సూత్రమునందలి చకారమువలన ప్రతీంద్రియోపస్పర్శనము ఇచ్చట విధింప బడుచున్నది యని తెలియంగ వలయును. ఇచ్చట శీర్షణ్యములగు నింద్రియము లనగా చెవులు కన్నులు ముక్కులు మున్నగునవని తెలియందగును.

విశేషాంశములు—ముప్పదియైదవ సూత్రమునం జెప్పబడిన ప్రకారము ఆచమనము చేయునప్పుడు దక్షిణహస్తతలమును ఆవుచెవియాకృతి వచ్చునట్టులు వంచి పట్టుకొని బ్రహ్మతీర్థముతో

నిశ్శబ్దముగా ఋగ్యజస్సామ వేదములను ధ్యానించుచు ఆచమింపవలయు ననియును–ఓష్ఠములను మార్జనము చేసికొనునప్పుడు అథర్వ వేదములను ఇతిహాసములను పురాణములను ధ్యానము చేయుచు బ్రాహ్మతీర్థముతో ఓష్ఠప్రదేశమునందలి సలోమప్రదేశమును త్రేతాగ్నులను ధ్యానముచేయుచు తుడుచుకొనవలయు ననియును, పాదముల నభ్యుక్షణము చేయునప్పుడు విష్ణు ధ్యానము చేయుచుండవలయు ననియును, ఇంద్రియములను స్పృశించునప్పుడు అంగుష్ఠోప కనిష్ఠికలతో నేత్రములను చంద్రసూర్యులను ధ్యానముచేయుచు నుపస్పృశింపవలయు ననియును, ఇట్లేతర్జన్యం గుష్ఠములతో నాసాపుటములను పంచప్రాణములను ధ్యానము చేయుచు నుపస్పృశింపవలయు ననియును, కనిష్ఠికాంగుష్ఠములచేత చెవులను దిగ్ధ్యానముచేయుచు స్పృశింపవలయు ననియును పాణినంతతో హృదయమును స్పృశింపవలయు ననియును–మఱియు నిట్టులనే సర్వాంగుళులతోను శ్రీదేవిని ధ్యానించుచు శిరోభాగమునందు స్పృశింపవలయునని యును విశేషవిధులుగ ఉశనుని ధర్మసూత్రములందు విశేషములు చెప్పఁబడి యున్నవి. ఉశనుఁడు చెప్పిన మూలవాక్యము లియ్యవి–“దక్షిణంహస్తతలం గోకర్ణాకారం విన్యస్య బ్రాహ్మేణతీర్థేన అశబ్దం పిబేదృగ్యజుస్సామ వేదాన్ధ్యాయన్. (2) అథర్వ వేదేతిహాసపురాణాని ధ్యాయన్ బ్రాహ్మేణ తీర్థేనోష్ఠయోస్సలోమప్రదేశంమృజ్యాత్. (3) ఔష్ఠౌ పరిమృజ్యాత్తతో ముఖం పరిమృజేదగ్నీన్ధ్యాయంస్తతః పాదావభ్యుక్షే ద్విష్ణుం ధ్యాయన్ (4) అంగుష్ఠోప కనిష్ఠికాభ్యాంనయనే చంద్రాదిత్యౌ ధ్యాత్వాతత ఉపస్పృశ్యతర్జన్యం గుష్ఠాభ్యాం నాసికావకాశౌ ప్రాణాన్ధ్యాత్వాతత ఉపస్పృశ్యాంగుష్ఠేన కేవలేన హృదయ ముపస్పృశేదాత్మానం ధ్యాయన్. (5) సర్వాంగుళిభి శ్శ్రియంధ్యాత్వా మూర్ధ్ని ప్రక్షిపేత్–అని.

విజ్ఞాపిక:—ఈ ఆచమనకల్పము ముగియక మున్ను మనవారిలోఁ బరమ ప్రామాణికుఁడుగా జెప్పనట్టి కృష్ణమిశ్రుని గ్రంథమునుండి ఆచమన ప్రకారము గల గ్రంథభాగము ఉద్ధరించి ప్రదర్శింప బడుచున్నది:—

అథ ఆచమనప్రకారః. ఆచమనం త్రివిధం—శ్రౌతం, స్మార్తం, పౌరాణం, చేతి. తత్ర ప్రత్యక్షశ్రుతిచోదితం శ్రౌతమ్. సూత్రోక్తం స్మార్తమ్. కేశవాద్యైస్త్రిభిః పీత్వేతి వచనోక్తంపౌరాణమ్. తత్రఆద్యం తైత్తిరీయారణ్యకే ప్రసిద్ధమ్. తచ్చ బ్రహ్మయజ్ఞాఙ్గమ్, తచ్చాశ్వలాయనా నామపి బ్రహ్మయజ్ఞాఙ్గతయాకర్తవ్యమ్ ద్వితీయంపున స్సన్ధ్యాది నిత్యకర్మాఙ్గమ్. తృతీయం పునర్నిష్ఠీవన శౌచాద్యఙ్గమితి వివేకః. శ్లో. ‘శౌచాన్తే (సన్ధ్యాన్తే) చ తథాపానే స్పృష్టాస్పృష్టే (ష్ఠౌ) చ కర్మణి (సర్పణే), పౌరాణాచమనం కుర్యాన్నామభిః కేశవాదిభిః’ ఇతి స్మృతిషు దర్శనాత్, విశేషేణ స్మృత్యాచమనం షట్కర్మచన్ద్రికాయాముక్తమ్—‘దేవ్యాః పాదైస్త్రిభిః పీత్వా అబ్లిఙ్గైర్నవభిః స్పృశేత్, సప్తవ్యాహృతి సంయుక్తా గాయత్రీ త్రిపదాశిరః.’ శి[illegible]తః, ఏతే సమస్య చతుర్వింశ[illegible]న్త్రా) భవ[illegible]తే షాం వినియోగః కేశ[illegible]నా మివ ద[illegible]ః.



ఇదం శ్రౌతాచమనం దర్శపూర్ణమాసాది శ్రౌత కర్మాఙ్గమ్. తథాహాశ్వలాయనః—సూ. 'ప్రాగుదగాహవనీయాదవస్థాయ ప్రాఙ్ముఖో యజ్ఞోపవీత్యాచమ్య' ఇతి. అత్ర వృత్తికారః—'ఆచమ్యేత్యత్రాచమన విధానం శ్రౌతాచమన ప్రాప్త్యర్థమితి గాయత్రీ జపకాలే శ్రౌతాచమనం కృత్వా ప్రాణానాయమ్య గాయత్రీజపం కుర్యాదితిముఖ్యః పక్షః, ఇతి. అన్యచ్ఛ్రౌత్యాచమనం స్మృత్యన్తరే కథితమ్—'తదోఙ్కారేణాచమనం యద్వా వ్యాహృతిభిర్భవేత్, సావిత్ర్యా వాఽపి కర్తవ్యమితి వ్యాసేన భాషితమ్'. ఇతి. 'అబ్లిఙ్గైర్నవభిః స్పృశే'దిత్యాది.పురాణాచమనప్రకారః స్మృత్యన్తరే కథితః—"కేశవాద్యైస్త్రిభిః పీత్వా ద్వాభ్యాం ప్రక్షాళయేత్కరౌ, ద్వాభ్యా మోష్ఠౌచ సంమృజ్య ద్వాభ్యామున్మార్జనంతథా. ఏకేన హస్తం ప్రక్షాళ్య పాదావపి తథైకతః, ఏకేనాపిచ మూర్ధానం తతస్సంకర్షణాదిభిః. సర్వాసామఙ్గుళీనాం వైమూలేన చిబుకం స్పృశేత్. తర్జన్యఙ్గుష్ఠయోగేన ఘ్రాణద్వయముపస్పృశేత్, అఙ్గుష్ఠానామికాభ్యాం చ చక్షుశ్శ్రోత్రం పునఃపునః. కనిష్ఠాఙ్గుష్ఠయోగేన నాభిదేశముపస్పృశేత్, కరమధ్యం హృది స్థాప్య కరాగ్రం శిరసి న్యసేత్. ముకులేనచహస్తేన బాహుమూలే ఉపస్పృశేత్, ఏవమాచమనం కృత్వా స్సాక్షాన్నారాయణో భవేత్'. అథప్రకృతోప యోగిస్మార్తాచమనము చ్యతే. 'యః క్రియాః కురుతే మోహాదనాచమ్యైవనాస్తికః, భవన్తిహి వృథా తస్య క్రియాస్సర్వా నసంశయః." ఇతి వచనాదాచమనం నిత్యతయాఽవగమ్యతే తత్రాయం ప్రయోగః—కృతాప్లవో బద్ధకచ్ఛశిఖోయజ్ఞోపవీతీ పవిత్రకరోభూమౌ పాత్రం ప్రతిష్ఠాప్య స్వేష్ట దేవతాం హృదినిధాయ ప్రకృతిస్థం ఫేనబుద్బుదరహిత మమ్బు సంహతాఙ్గులినాపాణినా గృహీత్వా బ్రహ్మతీర్థేన త్రిస్తూష్ణీం పిబేత్. అత్రశౌనకః—'ద్విజన్మనాం విశుద్ధ్యర్థం స్మార్తాచమనముచ్యతే,శిఖా కచ్ఛనిబద్ధస్తు సోపవీతస్సమాహితః. ఇత్యాది.

## 39 సూ. మూర్ధని చ దద్యాత్.

[౧—౧—౩౯]

హరదత్తమితాక్షరా:—మూర్ధని చేతి. చకారాన్నాభౌ మూర్ధనిచ సర్వాభి రంగుళీభి రుపస్పృశే దిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఆచమనకాలమునందు శీర్షణ్యములగు నింద్రియములను స్పృశించినట్టులుగానే మూర్ధభాగమునందుకూడ ఉపస్పర్శనము చేయవలయు నని సూత్రార్థము. ఈసూత్రమునందుగల చకారమునుబట్టి నాభిప్రదేశమునంమను శిరోభాగమునందునుకూడ నన్నియంగుళములతోడ ఉపస్పర్శనమును ఒనర్పవలయునని అర్థము.

విశేషాంశములు :—ఈసూత్రములో ఆచమన విధానము ముగియుచున్నది. కాని ఒకటి రెండు ముఖ్యాంశములగు విశేషములు నెఱుంగవలసియున్నది. ఆచమనము సాధారణముగా ముత్తెఱగుల నున్నది. (కాని కొందఱి మతములో శ్రోత్రాచమనము అని, నాల్గవది కూడ నున్నది.) ఇందు మొదటిది శ్రుత్యాచమనము. శ్రుతి యనగా వేదము. శ్రుత్యుక్తములగు కర్మముల నొనర్చునప్పు డాచరింపవలసిన ఆచమనము గనుక శ్రుత్యాచమన మనఁబడును. ఇదియాగికమగునర్థము. శ్రుత్యాచమనము చేయవలసిన విధానమును ఈ క్రిందిశ్లోకము సంక్షేపముగా దెలుపగలదు.-శ్లో. దేవ్యాః పాదైస్త్రిభిః పీత్వా అబ్లింగైర్నవభిస్స్పృశేత్, సప్తవ్యాహృతిభిశ్చైవ గాయత్రీశిరసాసహ. [అర్థము. దేవ్యాఃపాదైః=

గాయత్రీ మంత్రము యొక్క మూడుపాదములతోను. (అనగా (1) తత్సవితుర్వరేణ్యం (2) భర్గోదేవస్యధీమహి (3) ధియోయోనః ప్రచోదయాత్ ... అనే మూడుపాదములతోను అని అర్థము.) త్రిభిః= మూడుమారులు, పీత్వా = త్రాగి, అబ్లింగైర్నవభిః= ఆపోహిష్ఠామయోభువః అను మొదలగు తొమ్మిదిమంత్రములతోను తొమ్మిదిస్థలములను స్పృశించి, అటుపైని, సప్తవ్యాహృతిభిశ్చైవ= ఓంభూః ఓంభువః ఇత్యాదులగు ఏడువ్యాహృతులతోను ఉపస్పృశించి, ఇటుపైని, గాయత్రీ శిరసాసహ=ఓమాపోజ్యోతీరసో అను మొదలగు గాయత్రీ శిరస్సుతో గూడా స్పృశింపవలయును. ఇయ్యది శ్రుత్యాచమనమును చేయునట్టి విధానము.

ఇక రెండవదగు స్మృత్యాచమనము:— స్మృత్యుక్తవిధానముతో చేయునట్టి ఆచమనము గనుక స్మృత్యాచమన మనబడును, దీనిని చేయునట్టి విధానము ఇది—"త్రిరాచామేత్. ద్విః పరిమృజ్య, సకృదుపస్పృశ్య శిరః చక్షుషీ, నాసికే శ్రోత్రే హృదయ మాలభ్య దక్షిణోత్తరాపాణీపాదౌకృత్వా—[అని ఇట్టులు ఉరస్స్పర్శనము చేయుచూ] పచ్ఛలు అర్ధర్చలతో స్పర్శనము చేసినచో స్మృత్యాచమనము అగును. పచ్ఛలూ అర్ధర్చలూ అనగా-గాయత్రీమంత్రమును (తత్సవితర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్— అని) మూడుపాదములుగా ప్రత్యేకముగా విడదీసి ఒక్కొక్కపాదముతో ఒక్కొక్కస్థానముచొప్పున స్పృశించుట పచ్ఛలనబడును. ఆ గాయత్రీమంత్రమునే మొదటి రెండు పాదముల ఒకభాగముగాను, తక్కినపాదము ఒకభాగముగాను అర్థములుగా చేసి స్పృశించుట అర్ధర్చలనబడును.

ఇక మిగిలినది మూడవదగుపురాణాచమనము. దీనిని చేయవలసిన విధానమును ఈక్రిందిశ్లోకములు తెలుపుచున్నవి. శ్లో. కేశవాద్యైస్త్రిభిఃపీత్వా ద్వాభ్యాం ప్రక్షాళయేత్కరౌ, ద్వాభ్యామోష్ఠౌచ సంమృజ్య ద్వాభ్యామున్మార్జయేచ్ఛిరః, ఏకేనవామం సంప్రోక్ష్య పాదావపి తథైకతః, ఏకేనాభిమూర్ధ్నిస్యా - త్తతస్సంకర్షణాదిభిః సర్వాసామంగుళీనాంతు మూలేన చుబుకం స్పృశేత్ తర్జన్యంగుష్ఠయోగేన ఘ్రాణద్వయ ముపస్పృశేత్. అంగుష్ఠానామికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రే ఉపస్పృశేత్. అంగుష్ఠేన కనిష్ఠేన నాభిమధ్య ముపస్పృశేత్. కరమధ్యం హృదిస్థాన్యకరాగ్రం శిరసిన్యసేత్. మకుశేతు హస్తేన బాహుమూలే ఉపస్పృశేత్. ఏవ మాచమనంకుర్యాత్సాక్షాన్నారాయణో భవేత్.

ఈశ్లోకముల కిది తాత్పర్యము:— కేశవనారాయణ మొదలగు ఇరువది నామములలోను మొదటి మూడునామముల నుచ్చరించుచు ముమ్మారు ఉదకములను త్రావవలయును. తరువాతి వానిలో క్రమముగా రెండు నామములతో చేతులను కడుగుకొనవలయును. ఆతరువాత రెండు వ్రేళ్లతోను పెదవులను తుడిచికొని ఆతర్వాతి రెండు నామములతో శిరస్సును మార్జనము చేయవలయును. తరువాత ఒక్కదానితో వామహస్తమును ప్రోక్షణ చేసి, అట్లే మఱొక్కదానితోను కాళ్లనుగూడ ప్రోక్షణ చేయవలయును. మఱియొక్కదానితో నాభిప్రదేశమునందును తర్వాత సంకర్షణాదులగు నామములతో అన్నిఅంగుళముల నొక్కటిగా ముడిచి పట్టుకొని చుబుకమును (గడ్డమును) స్పృశింపవలయును. బొట్టనవ్రేలును చూపుడువ్రేలును అనామికను (నాల్గవవ్రేలు) కలిపిపట్టుకొని కన్నులను చెవులను స్పృశింపవలయును. బొటనవ్రేలుతోను చిటికెన వ్రేలుతోను నాభిమధ్యమును ఉపస్పృశింపవలయును. తరువాత అరచేతిని రొమ్ముపైని ఉంచుకొనవలయును. పిమ్మట వ్రేళ్లనన్నిటిని మొగ్గవలె పట్టుకొని బాహుమూలములను (చంకలను) ఉపస్పృశింపవలయును. ఈవిధముగా నెవ్వడు ఆచమనమును చేయుచుండునో వాడు సాక్షాత్తును నారాయణుడు కాగల్గును-అని.

విజ్ఞప్తి:— ఈసూత్రము చివఱవ్రాసిన విశేషాంశములలో వివరింపబడినట్టి శ్రుత్యాచమన స్మృత్యాచమనపురాణాచములు శిష్టులలో వాడుకగ వ్యవహారమున నున్నట్టి విధములేగాని

ప్రత్యేకముగ స్మృతినిర్ణీతములైనట్టి వెంతమాత్రమునుకావు. గనుక సంధ్యావందన భాష్యమునందు చెప్పబడినవిధమున కీవివరణవాక్యములు ఏవిధముగాగూడ విరుద్ధములుకావని యెఱుంగగోరెదను.

## 40 సూ. సుప్త్వా భుక్త్వా క్షుత్వా చ పునః [౧-౧-౪౦]

హరదత్తమితాక్షరా:—సుప్త్వేతి. స్వాపాది నిమిత్తే పునర్ద్విరాచామేదితి యావత్.

ఆంధ్రవివరణము:—ఇంతదనుకను ఆచమనమును చేయవలసిన విధానమును వివరించి ఇటుపైని ఏయేకాలములందు ఆచమనము చేయవలయునో నిరూపించుచున్నాడు. నిద్రించి లేచినవెంటను, భుజించిలేచినవెంటను, తుమ్మికొనిన యప్పుడును, కూడ రెండుమారులు ఆచమనము నొనర్పవలయునని సూత్రార్థము. అనగా స్వాపాదినిమిత్తము గల్గినప్పుడు శౌచార్థమై రెండుమారు లాచమింపవలయునని తాత్పర్యము.

విశేషాంశములు: ఇచ్చట మస్కరీయభాష్యమునందు మూలసూత్రమునందుగల "భుక్త్వాచ పునః"- అనేచోటగల పునశ్శబ్దముచేత స్వాపనభోజనక్షువనకాలములందు ఆదియందును అంతమునందునుకూడ (రెండుమారులు) ఆచమనము చేయవలయునని సూచింపబడినదనియును. కనుకనే వసిష్ఠుఁడు- "సుప్త్వాభుక్త్వాక్షుత్వాచ స్నాత్వాపీత్వా రుదిత్వాచాచాంతః పునరాచామేత్"—అని చెప్పెననియును వ్రాయబడినది. అయితే స్వాపనభోజనములు ముందుగ మనకు తెలియవచ్చుటచేత నాచమించుటకు వీలుగలదనియును, క్షువనమునందు (తుమ్ముటలో) ముందు తెలియక అప్రయత్నముగా సంభవించుటచే ఆచమించుట ఎట్లు?- అని శంకగలుఇ సర్వకాల సర్వావస్థలయందును అప్రయతుఁడై యుండరాదని సూచించుటకే ఇట్టులు చెప్పబడినదని కూడ చెప్పబడినది.

## 41 సూ. దంతశ్లిష్టేషు దంతవ దన్యత్ర జిహ్వాభిమర్శనాత్ [౧-౧-౪౧]

హరదత్తమితాక్షరా:—దంతశ్లిష్టేతి. దంతశ్లిష్టేషు ఉచ్ఛిష్టలేపేషు జిహ్వాభిమర్శనా దన్యత్ర దంతవ న్నాశుచిత్వమ్.

ఆంధ్రవివరణము :—భోజనము చేసినపిమ్మట భుజించునప్పుడు పండ్లసందులకుపోయి చిక్కికొనియుండిన (ఎంగిలిమెతుకులు) ఉచ్ఛిష్టలేపముల విషయమైకూడ దంతములకువలెనే అశుచిత్వము లేదు. (అనగా వీదైనవిరసానటు పండ్లసందున మెతుకుల రేణువులు తనకు తెలియకుండ నుండిపోయినను తావన్మాత్రముననే అశుచిత్వము రాదని భావము) కాని ఈవిధి జిహ్వాభిమర్శనము లేనిచోటులను మాత్రమే యని యెఱుంగవలయును. అనగా నాల్కతో కోరాడుటలేని యప్పుడుమాత్రమే అశుచిత్వము రానట్టులు అర్థమే కాని నాల్కమొదలగువానితో ఆరేణువులను అభిమర్శనము (తాకుట కోరాడుట మున్నగునవి) చేసిన యప్పుడుమాత్రముకాదని తాత్పర్యము. అర్థాత్తు తేలిన దేమనగా భోజనాదులైనపిదప పండ్లసందున మెతుకులు చిక్కుకొన్నట్లు తోచి నాల్కమున్నగువానితో కోరాడుటలు మున్నగువానిని ఒనర్చినప్పటికిని అశుచిత్వము తప్పదనియు, అట్టిసందర్భములు పొసగినప్పుడు తప్పక శౌచము నాచరింపవలసినదే యనియును తేలినది.

# గౌతమధర్మసూత్రములు.

బ్ర. వే. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులు గారు.

## 42 సూ. ప్రాక్చ్యుతేరిత్యేకే. [౧-౧-౪౨]

హరదత్తమిశ్రాః:— తత్రాపి పక్షాంతరే నియమ మాహ-ప్రాగితి. సత్యపి జిహ్వాభిమర్శనే యావల్లేపా స్స్వస్థానా న్నచ్యవంతే తావ న్నాశుచిత్వ మితి.

ఆంధ్రవివరణము:— వెనుక చెప్పిన సందర్భము నందుకూడ - అనగా జిహ్వాభిమర్శనము చేసినప్పుడు అశుచిత్వము కల్గునా కల్గదా యన్న సందర్భమునందుకూడ- మత భేదములు కలవు. ఆమతభేదమునే (పక్షాంతరమునందు కల భిన్నాభిప్రాయమునే) ఈసూత్రమునందు నిరూపించుచున్నాడు.

చ్యుతి అనగా జారుట. జిహ్వాభిమర్శనము చేసినప్పుడు ఉచ్ఛిష్టకణములు తా మదివఱకు చిక్కుకొనియున్న స్థలమునుండి ఎంతసేపటివఱకు చ్యుతిని పొందవో(అనగా కదలవో లేక జారిరావో) అంతవఱకును అశుచిత్వము రా జాలదు అని కొందఱు ధర్మశాస్త్రప్రవర్తకులగు పెద్దలు పల్కిరని సూత్రార్థము. అనగా పండ్లతో కొరాడినను సందులలో చిక్కుకొనిన మెతుకులు ఊడివచ్చుదనుక అశుచిత్వము కల్గదనియును, కావున అంతదనుక శౌచము నాచరింప నక్కఱలేదనియును ఆపైని తప్పక శౌచము నాచరింపవలసినదే యనియును మతికొంద ఱని రని తాత్పర్యము.

## 43. సూ. చ్యుతే ష్వాస్రావవద్విద్యా న్నిగిర న్నేవ తచ్ఛుచిః [౧-౧-౪౩]

హరదత్తమిశ్రాః:— చ్యుతేష్వితి.ఆస్రావః ఆస్యజలమ్. నిగరణం అంతః ప్రవేశనం చ్యుతేషు నిగిర న్నేవ తచ్ఛుచిరితి వక్తవ్యే, ఆస్రావవద్విద్యా దితి వచనం—ఆస్రావేన నిగిరణాదేవ శుచి రితి సూచనార్థ మిత్యర్థః.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు నుడివిన మతమునందుగల నియమమును గూర్చి ఇప్పుడు స్వాభిప్రాయమును వివరించుచున్నాడు. ఉచ్ఛిష్టకణములు (అనగా మెతుకులవలనివి) అవి ఇదివఱకున్న స్థలమునుండి చ్యుతములు కాగానే ఆస్రావమునందువలె శౌచవిధానము కలుగవలయును. ఏమనగా అకణములు చ్యుతములు అగుచుండగానే శుచిత్వము కలుగును. ఇచ్చట ఆస్రావమనుమాటకు ఆస్యజలము అర్థము. నిగిరణము అనగా అంతఃప్రవేశనము మూలసూత్రమునందు ఆస్రావవద్విద్యాత్ - అన్నమాటను బట్టి ఆస్రావము కల్గినప్పుడు నిగిరణము మాత్రము చేతనే శౌచము కల్గుననియును, అట్లే ఇచ్చటకూడ (అనగా ఎంగిలిమెతుకులు పండ్లసందులనుండి ఊడిపడినప్పుడుకూడ నిర్బాధము) నిగిరణము మాత్రానచే శౌచము కల్గుననియు గ్రహింపవలయును.

## 44. సూ. న ముఖ్యా విప్రుష ఉచ్ఛిష్టం కుర్వంతి నచే దంగే నిపతంతి. [౧-౧-౪౪]

హరదత్తమిశ్రాః:— నేతి. ముఖేభవాః ముఖ్యాః విప్రుష ఆస్రావబిందవః భూమ్యాదిషు పతితా న ఉచ్ఛిష్టతాం నయంతి. పరంతు అవయవాదిషు పతితా శ్చే దుచ్ఛిష్టతాం నయం త్యేవేతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— ముఖశబ్దముచేత నిచ్చట నోటిని గ్రహింపవలయును. ముఖమునందు కలుగునట్టివి ముఖ్యములు. విప్రుట్ అనగా నీటిబిందువు- కాని ఇచ్చట ఆస్రావబిందువని తెలియవలయును. అనగా తుంపురులు మన్న

గునవి. ముఖ్యములగునట్టి విప్రుట్టులు (అనగా మాటలాడునప్పుడు నోటినుండి చెదరిపడునట్టితుంపురులు మొదలగునవి) ఉచ్ఛిష్టత్వమును కలిగింపజాలవు అని సూత్రార్థము. కాని ఇయ్యది సామాన్యనియమము. ఇటుపైని తక్కినసగములో విశేషమును విధించుచున్నాడు. ఆబిందువులు (అనగా ముఖ్యము లగు బిందువులు) శరీరమునందు (లేదా శరీరావయవములయందు) పతితములు కావేని-శరీరము మీద పడకుండ నుండునేని- అప్పుడుమాత్రమే ముఖభవము లగు బిందువులు ఉచ్ఛిష్టత్వమును కలిగింపజాలవు. అనగా నోటినుండి తుంపురులు మున్నగునవి చెదరి నేలమున్నగువానిపై పడిన యెడల హానిలేదనియును, శరీరమునందుగాని తదవయవములయందుగాని పడినచో అశుచిత్వము తప్పదనియును తత్పరిహారమునకై అవశ్యముగా శౌచమును ఆచరింపవలసినదే యనియును తాత్పర్యము.

## 45. సూ. లేపగంధాపకర్షణం శౌచమమేధ్యాక్తస్య [౧—౧—౪౫]

హారదత్తమితాక్షరా:— లేపేతి. శ్లో "వసా శుక్ర మసృ జ్మజ్జా మూత్రవిట్కర్ణవిణ్ణఖాః, శ్లేష్మాశ్రుదూషికాస్వేదో ద్వాదశైతే నృణాం మలాః—ఇతి మనుః. ఏతత్సర్వం అమేధ్యశబ్దేన వివక్షితమ్, అస్యయావతాగంధోలేపశ్చాపకృష్యతే అపనీయతే తావతా శౌచమితి.తత్ర యస్యమలస్య గంధమాత్రం తస్య తదపకర్షణమ్. యస్యగంధో లేపశ్చ తస్య తదుభయాపకర్షణమ్.

ఆంధ్రవివరణము:—మేధ్య మనగా పవిత్రమైనవస్తువు. మేధృశుద్ధౌ అను ధాతువువలన నీశబ్దమేర్పడుచున్నది. మేధ్యముకానిది అమేధ్యము. అనగా అపవిత్రమైనవస్తువు. ఏవస్తువులను స్పృశించినంతనే చేతికి అంటుకొనివదలక యుండునో, వేని సంస్పర్శనమున దుర్గంధము (చెడు వాసన) సంక్రమించుచుండునో అవియన్నియును అమేధ్యములగు వస్తువులు. అమేధ్యము అను మాటకు ఇవియన్నియును అర్థములేయైనను కేవలము మలమూత్రాదుల యందు మాత్రమే ఇప్పుడు ఈమాటనువాడెదము. మనుష్యునిశరీరమే ఒకవిధముగా మలాదులకు నిలయము, అయినను సాముదాయికబుద్ధ్యా ప్రతివాని శరీరమునను పండ్రెండువిధములగు మలము లుండునని ధర్మశాస్త్ర కర్తలందఱును పల్కుచుందురు. అందులో మనువు ఇట్లు చెప్పెను—వస, శుక్రము నెత్తురు, మజ్జ, మూత్రము, (ఉచ్చ) మలము, (అమేధ్యము,) చెవిగులిలి, గోళ్లసందులనుండు మట్టి, కళ్లె (శ్లేష్మము), కన్నీరు కంటిపుసి చెమట అని ఈపండ్రెండును మనుజులకు గల్గుచుండెడి మలములు అగునని. [అయిన నియ్యవి బాహ్యములగు మలములు. వైద్యశాస్త్రజ్ఞులును వేదాంతులును ఇంకను అనేకవిధములగు మలములను విభజించి ప్రదర్శించియున్నారు.]

అమేధ్యములగు వస్తువులచేత అక్తములగు అంగములకు (అనగా అమేధ్య వస్తువులలో పడిన వానికని భావము.) ఆయమేధ్యము యొక్క లేపమును, గంధమును [రూపుమాసిపోవునట్టులు అనగా బొత్తుగాలేకట్టులుగ] అపకర్షణము చేయుటయే- అనగా తొలగించుటయే-శౌచము అనంబడును అని సూత్రార్థము. అనగా అమేధ్యము చేత స్పర్శదోషముకల్గిన వాటికి ఆయమేధ్యము యొక్క లేపము పోవునట్టులు కడుగుటయును, వాసనపోవునట్టులుగా రుద్దుటయును శౌచమని యనంబడును. అనగా అట్టివస్తువులను అలేపనము పోవువఱకును, [ఆవాసనపోవువఱకును] చక్కగా తోమి శుభ్రముచేసికొనవలయునని తాత్పర్యము. మఱియును ఈపైని చెప్పినపండ్రెండువిధము లగు అమేధ్యవస్తువులలోనూ కేవలము వాసనమాత్రమేకలవానిని ఆవాసనపోవువఱకును, వాసనయును లేపనమునుకూడకలవానిని ఆరెండునుకూడ పోవువఱకును కడిగి శుద్ధిచేయవలయునని ఎఱుంగవలయును,

[విజ్ఞాపిక- నేనుచూచినంతవఱకును వ్రాతప్రతులలో మూలమునందు అమేధ్యాక్తస్య అనియుండుటచేతనూ అచ్చుప్రతులలో అమేధ్యస్యయనియేయున్ననూ పైపాఠమునే నేనును గ్రహించితిని. కాని పునహాప్రతిలో అమేధ్యాక్తస్య అని పాఠాంతరమున్నట్టులు క్రిందను వ్రాసియున్నారు.]

## 46. సూ. తదద్భిః పూర్వం మృదాచ [౧-౧-౪౬]

హరదత్తమితాక్షరా:—త దితి. తత్పూర్వం మలం గంధవన్మలాపకర్షణ మద్భిర్లేపగంధవన్మలాపకర్షణం మృదాచాద్భిశ్చేతి. ఇదం హస్తపాదాదే రమేధ్యాలిప్తస్య శౌచమ్. తైజసాదిషు విశేషస్యాపూర్వ ముక్తత్వాత్.

ఆంధ్రవివరణము:—ఇట్టులు వెనుక జెప్పిన ద్వివిధము లగు మలములలోనూ, మొట్ట మొదటి దగు గంధవన్మలమును, (అనగా వాసన గల మలమును) నీటితోను, రెండవదానిని-అనగా లేపనముగ గంధముగలమలమును- మట్టితోను నీటితోను తొలగి-పవలయు నని సూత్రార్థము. అనగా కేవలమును వాసనమాత్రమే గలమలమును నీటితో కడిగిపోగొట్టుకొనవలయు ననియును, వాసనయును లేపనము రెండును గలమలమును మున్ముందుగా మట్టితో రుద్ది పోగొట్టుకొని ఆపైని నీటితో గూడ కడిగి పోగొట్టుకొనవలయు ననియును తాత్పర్యము. ఈసూత్రమునందు చెప్పబడిన శౌచవిధానము అమేధ్యవస్తువుల చేత లిప్తములగు చేతులు కాళ్లు మున్నగు నవయవములకు సంబంధించినది మాత్రమే యనియును తైజసాదు లగువానియందు గలవిశేషము ఇదివఱకే చెప్పబడిన విధమున నొనర్పవలయు ననియును, ఎఱుంగవలయును.

## 47. సూ. మూత్ర పురీష స్నేహ విస్రంసనాభ్యవహార సంయోగేషు చ [౧-౧-౪౭]

హరదత్తమితాక్షరా— మూత్రేతి. చకారః పూర్వోక్తసముచ్చయే. స్నేహా రేతః మూత్రపురీషస్నేహానాం విస్రంసనం నిరసనం అభ్యవహార్యద్రవ్యం తేన సంయోగః, ఏషు నిమిత్తేషు పూర్వవన్మృదాచ శౌచ మితి.

ఆంధ్రవివరణము:— మూత్ర పురీషముల కర్థము ఇదివఱకే చెప్పబడినది. స్నేహమనగా ఇచ్చట రేతస్సు అర్థాత్తు పురుషునియొక్క శుక్రము. మూత్రము-పురీషము (మలము) స్నేహము - అనునీమూడింటిని విస్రంసనము చేసినప్పుడును (అనగా విసర్జించినప్పుడు అర్థాత్తు విడిచినప్పుడని భావము) అభ్యవహారముతో సంయోగమును పొందినప్పుడును కూడ వెనుకటిసూత్రమునందు చెప్పబడినట్టి శౌచమునే-(అనగా మట్టితోను నీటితోను నగుశౌచమునే) ఒనర్పవలయును. అనిసూత్రార్థము. అనగా మూత్రవిసర్జనము చేసినప్పుడును, మలవిసర్జనము చేసినప్పుడును, రేతస్సును, అభ్యవహార్య ద్రవ్యములతోడి సంయోగము కలిగినప్పుడును, కూడ శౌచమును చేసికొని పిమ్మట ఆచమనమును చేయవలయునని తాత్పర్యము.

## 48. సూ. యత్ర చామ్నాయో విదధ్యాత్ [౧-౧-౪౮]

హరదత్తమితాక్షరా:—యత్రేతి.యత్రవిషయే యచ్చౌచ మామ్నాయో విదధ్యాత్తత్ర తదేవభవతి. యథా చమసానాం ఉచ్ఛిష్టలిప్తానాం మార్జాలియాద్భిః ప్రక్షాళన మితి.

ఆంధ్రవివరణము:— ఈసూత్రములో శౌచవిధానమును గుఱించిన సందర్భములను ముగించదలచినవాడై మహర్షి గౌతముడు సంక్షేపముగ శౌచకర్తవ్యమును రూపించుచున్నాడు. ఏయేవిషయమునందు ఏయేవిధముగా శౌచమును ఆచరింపవలయు నని ఆమ్నాయము (శాస్త్రము) విధించుచున్నదో తదనుసారముగా ఆయావిషయములయందు శౌచమును నిర్వర్తించుచుండవలయును. ఇందులకు ఉదాహరణము- యాగమందు సోమశాస్త్రమునందు ఉచ్ఛిష్టలిప్తములగు చమసములకు శుద్ధికై మార్జాలీయాదకముల చేత ప్రక్షాళనము నొనర్పవలయు నని చెప్పబడియున్నది. కావున నచ్చట తక్కిన ధర్మశాస్త్రానుసారము లగు శౌచము లన్ని యున్నను వదలి తద్విషయమునకు సంబంధించిన- అనగా ఆమ్నాయనుసారములగు-శౌచములనే చేయవలయును అని సూత్రా

ర్థము. ఇచ్చట చమసము మార్జాలీయోదకములు-అనునివి మీమాంసాశాస్త్రవిహితములగు పారిభాషిక పదములు. యజ్ఞకాలములందు సోమపానమును చేయునట్టిపాత్రలకు చమసములని పేరు.

49. సూ. అథ గురూపసదనవిధిం వ్యాఖ్యాస్యామః, పాణినా సవ్య ముపసంగృహ్యానంగుష్ఠ మధీహి భో! ఇత్యామంత్రయే ద్గురుం, తత్ర చక్షుర్మనః ప్రాణోప స్పర్శనం దర్భైః [౧—౧—౪౯]

హరదత్తమితాక్షరా:—అథేతి. పాణినేతి. పాణినాస్వేన దక్షిణేన సవ్య మితివిశేషగ్రహణా ద్దక్షిణే నేతి గమ్యతే. గురోస్సవ్యం పాదం అనంగుష్ఠ మంగుష్ఠవర్జం గృహీత్వా అధీహిభో ఇతి గురు మామంత్రయేత్. తత్ర గురౌ మన శ్చక్షుషీ చ నిధాయ అవహిత స్స్యాదితి. ప్రాణాశ్శీర్షణ్యా స్సేంద్రియాణి తేషా మాత్మీయానా మాచమ నోక్తక్రమేణ దర్భై రుపస్పర్శనం కర్తవ్యం మాణవకేన.

ఆంధ్రవివరణము:— ఇంతదనుక వటువునకు వలసినట్టి శౌచవిధానమును నిరూపించి ఇటుపైని గురువును ఉపసదనము చేయునట్టితెఱంగును నిరూపింప నున్నారము. వటువు (అనగాగురువునొద్దచేరి శ్రుతులనుస్మృతులను శాస్త్రములను ఆగమములు మున్నగువానిని చదువుకొనదలంచినట్టిబ్రహ్మచారి యని భావము.) తనయొక్క కుడిచేతితో- గురువుగారియొక్క సవ్య మగు(కుడిదగు)కాలిని- అనంగుష్ఠముగ (బొటనవ్రేలు తగులకుండునట్టులుగ) పట్టుకొని- అర్థాత్తు గురువుయొక్క కుడికాలిని సంవాహనము(పిసుగుటను)చేయుచు "అయ్యా ! చదివింపుడు"—అని గురువును ఆమంత్రణము చేయవలయును.(అనగా పిలువవలయు నని భావము.) అట్టులు ఆమంత్రణము చేయునప్పుడు- గురువునందే తనయొక్క మనస్సును కన్నులను నిలిపి అవహితుడనగా స్థిర మగునట్టిచిత్తము కలవాడై-యుండవలయు. మఱియును తనయొక్క ప్రాణమునుగూడ దర్భలతో జెప్పినట్టు లుపస్పర్శనము చేయదగు నని సూత్ర... అనగా ఇట్టివిధులతో గురువునొద్దజేరి చదువ దొరకొనవలయును అని భావము.

50. సూ. ప్రాణాయామా స్త్రయః పంచదశమాత్రాః. [౧—౧—౫౦]

హరదత్తమితాక్షరా:— ప్రాణాయామా... కార్యా ఇతి శేషః. జానుపార్శ్వతః పరి... త్రుటి మేకాంకుర్యాత్సైకామాత్రా, పంచదశపూర్యంతే యావతాకాలేన... తం కాలం ప్రాణవాయుం ధారయే త్... ప్రాణాయామః తే త్రయః కార్యాః, త... మనుః—శ్లో. "సవ్యాహృతికాంసప్రణ... గాయత్రీం శిరసాసహ, త్రిః పఠేదా... ప్రాణః ప్రాణాయామ స్స ఉచ్యతే. ఇతి

ఆంధ్రవివరణము:— ప్రాణము లనగా శీర్షణ్యము లగు(శిరోభవములగు)నింద్రియములు. ప్రాణములు దీని... నియమింపబడును. గనుక ప్రాణాయామ మని చెప్పబడుచున్నది. వెనుక జెప్పినరీతిగా ప్రాణోపస్పర్శనము పిమ్మట వటువు పదునైదేసిమాత్రలు గల్గినట్టిప్రాణాయామములను మూడింటిని చేయవలయునని సూత్రార్థము. మోకాలిపార్శ్వము తుడిచికొని ఒక్క-చిటుక వేయుట... కాలముపట్టునో అంతకాలమునకు మాత్ర అనిపేరు. మాత్రలను పదునైదింటిని ఎంతకాలములో పూర్తిచేయుదురో అంతకాలము (అనగా ఆపాటిసేపు అని అర్థము.) చనువఱకును ప్రాణవాయువులను నిరోధించి (అనగా ...ధించి) యుంచవలయును. ఇట్లుచేసినచో ఒకప్రాణాయామ మగును. అట్టిప్రాణాయామములను మూడింటిని ప్రాణోపస్పర్శనమునందు చేయవలయు నని తాత్పర్యము. మ...

కూడ నిట్టులనే చెప్పియున్నాడు — "వ్యాహృతిసహితమును ప్రణవసహితమును అగుగాయత్రిని శిరస్సుతోకూడా [గాయత్రీశిరస్సుతోకూడా] ఆయతప్రాణుడై (ప్రాణములను నిరోధించినవాడై) ముమ్మారు పఠించినచో అయ్యది ప్రాణాయామము కాగలదు"—అని. ఇందు ప్రణవ మనగా ఓంకారమనియును వ్యాహృతు లనగా ఓంభూః ఓంభువః ఓగ్ంసువః అను నియ్యవియనియును, శిరస్సు అనగా ఓమాపోజ్యోతీరసోమృతంబ్రహ్మ భూర్భువస్సువరోం - అనునదియనియును, వ్యాహృతిసహితమును ప్రణవసహితమును అగుగాయత్రిని శిరస్సుతోకూడా పఠించుట యనఁగా- "ఓంభూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి ధియోయోనఃప్రచోదయాత్ ఓమాపోజ్యోతీరసోమృతంబ్రహ్మ భూర్భువస్సువరోం"-అనుట యనియును ఎఱుంగవలయును.

## 51. సూ. ప్రాక్కూలేష్వాసనంచ [౧—౧—౫౧]

హరదత్తమితాక్షరా:—ప్రాగితి. ప్రాగగ్రేషు దర్భేష్వాసనం. చకారాత్కర్తవ్యమితిశేషః.

ఆంధ్రవివరణము:— కూల మనగా అంచు లేక కొన. ప్రాక్ అనగా తూరుపు. తూర్పుదిక్కునకు కొనలు వచ్చునట్టులుగా పరుపబడినవియగు దర్భలు (అనగా దర్భాసనములు) ప్రాక్కూలము లనఁబడును ప్రాక్కూలములగు దర్భలపైని కూర్చుండుటనుగూడా వటువు గురూపసదనాది సమయములం దొనర్పదగు నని యర్థము.

## 52. సూ. ఓంపూర్వాః వ్యాహృతయః పంచ సత్యాంతాః [౧—౧—౫౨]

హరదత్తమితాక్షరా—ఓంపూర్వేతి. ఓంపూర్వాః ఓంకారపూర్వాః వ్యాహృతిసామ భూర్భువస్సుస్సత్యంపురుషఇతి. పంచ. అత్రతు పురుషవ్యాహృతిస్స్థానే సత్యవ్యాహృతిః పంచమీతివక్తవ్యా. తాశ్చ ప్రత్యేకం ప్రణవపూర్వా వక్తవ్యాః.

ఆంధ్రవివరణము :—ప్రాణాయామకాలమునందు ఓంకారపూర్వకములును సత్యాంతములునగు అయిదువ్యాహృతులను చెప్పదగును అని సూత్రార్థము. భూః భువః స్వః సత్యం, పురుషః -అనిఈ యైదును వ్యాహృతు లనియును వ్యాహృతిసామ లనియును చెప్పబడు చున్నవి. కాని మూలసూత్రమునందు పేర్కొనుటలో ఓంపూర్వాస్సత్యాంతాః అని చెప్పుటచేత పురుషవ్యాహృతిని నాల్గవదానిగాను సత్యవ్యాహృతిని అయిదవదిగాను పఠించుకొనవలసియున్నది. కాగా తాత్పర్యమే మనగా ప్రాణాయామము నొనర్చు ఓం, భూః, ఓంభువః ఓగ్ంస్వః సత్యం ఓగ్ంపురుషః- అని ఇట్లు అయిదువ్యాహృతులను చెప్పవగు ననభావము.

## 53. సూ. గురోః పాదోపసంగ్రహణం ప్రాతః [౧—౧—౫౩]

హరదత్తమితాక్షరా:—గురోరితి. అహరహః ప్రాత ర్గురోః పాదోపసంగ్రహణం కార్యమ్. తథాచ మనుః:—శ్లో."వ్యత్యస్తపాణినాకార్య ముపసంగ్రహణం గురోః, సవ్యేనసవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన తు దక్షిణః—ఇతి.

ఆంధ్రవివరణము:— దినదినమునందు ప్రాతఃకాలమునందు గురువులకు పాదోపసంగ్రహణము నొనర్పవలయునని సూత్రార్థము. మనువుకూడ నిట్టులనే చెప్పియున్నాడు. "అధ్యయనము చేయునట్టివటువుచేత గురువులకు పాదోపసంగ్రహణము నొనర్పబడవలయును. అందుకూడ (వ్యత్యస్తపాణియై) చేయవలయును. సవ్యహస్తముతో సవ్యమును దక్షిణహస్తముతో దక్షిణమును స్పృశింపవలయును.- అని

## 54. సూ. బ్రహ్మానువచనేచ ఆద్యంతయోః [౧—౧—౫౪]

హరదత్తమితాక్షరా:—బ్రహ్మేతి. బ్రహ్మ వేదః అనువచన మధ్యాపనమ్. తత్రాద్యంతయో శ్చ గురోఃపాదోపసంగ్రహణంకార్యమ్.

ఆంధ్రవివరణము:— బ్రహ్మము అనగా వేదము. అనువచన మనగా చదివించుట. ప్రాతఃకాలమునందు ఏవిధముగా గురువులకు పాదోపసంగ్రహణమును చేయదగునో ఆవిధమునవే బ్రహ్మానువచనమును చేయునట్టికాలమునందు కూడ-అనగా వేదాధ్యయనమును (గురువులు తనకు) చేయించుసందర్భమునందుకూడా - ఆద్యంతములయందు (అనగా అధ్యయనమును ఆరంభించునప్పుడును ముగించునప్పుడు) గురువులకుపాదోపసంగ్రహణము చేయవలయును.

## 55. సూ. అనుజ్ఞాత ఉపవిశే త్ప్రాఙ్ముఖో దక్షిణతశ్శిష్య ఉదఙ్ముఖోవా. [౧—౧—౫౫]

హరదత్తమితాక్షరా:—అనుజ్ఞాతఇతి. అనుజ్ఞాతః ఆచార్యేణానుజ్ఞాతః తద్దక్షిణతః ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖోవా ఉపవిశేత్. కార్యానుగుణో వికల్పః

ఆంధ్రవివరణము:— ఆచార్యులచేత- (అనగా తనను చదివించునట్టిగురువులచేత ననిభావము.) అనుజ్ఞాతుడై (అనగా అనుమతినిపొందినవాడై) ఆయాచార్యులకు దక్షిణ భాగమునందు తూర్పుమొగమైకాని - అనగాతూర్పు దిక్కువైపు మఱలిగాని లేక ఉత్తరపుమొగమైకాని-అధ్యయనము చేయుటకై శిష్యుడు కూర్చుండవలయునని సూత్రార్థము. ఈసూత్రమునందు చెప్పబడినట్టివికల్పము- అనగా తూర్పుమొగమైకాని కూర్చుండవలయు నన్నట్టివికల్పము- కార్యానుగుణము అయినదని తెలియంగవలయును.

## 56. సూ. సావిత్రీ చానువచనమ్. [౧—౧—౫౬]

హరదత్తమితాక్షరా:—సావిత్రీతి. తత్సవితుర్వరేణ్యమిత్యేషాత్రసావిత్రీ సత్యస్యా సవితృదేవత్వాత్. సానానువచనంప్రత్యధ్యయనం పఠనీయేతి.

ఆంధ్రవివరణము:— సావిత్రి యనగా గాయత్రీ మంత్రము. అసలు సవిత యనగా సూర్యుడు. సూర్యుడు అధిష్ఠానదేవతగా గలమంత్రముకూడ సావిత్రియనియే యనవచ్చును. కాని ఇచ్చట సావిత్రి యనుపదముచేత తత్సవితుర్వరేణ్య మనుమంత్రముచేత నుద్దిష్టయగుగాయత్రీదేవతయే కాని సవితృదేవతయగునట్టిఇతర మెంతమాత్రముకాదు. ఆ సావిత్రిని ప్రత్యధ్యయనమునను పఠించుచుండ వలయును.

## 57. సూ. ఆదితో బ్రహ్మణఆదానే [౧—౧—౫౭]

హరదత్తమితాక్షరా:— పాణినాసవ్య ముపసంగృహ్యేత్యాదిసావిత్రీవచనాంతం యదుక్తం తదిదంబ్రహ్మణోవేదస్య గురోస్సకాశాదాదితఆదానకాలే కర్తవ్యం. ఉపనయనాదనంతరం సావిత్ర్యుపదేశకాలేచ, ప్రత్యహంతు తత్ర చక్షుర్మనస్స్పర్శనం, ప్రాతరధ్యయనాద్యంతయో శ్చ గురోఃపాదోపసంగ్రహణ మనుజ్ఞాతోపవేశనం చ కర్తవ్యమ్.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రములందు— అనగా 49వ సూత్రముమొదలుకొని ఇంతవఱకును చెప్పబడినదంతయును గురువులయొద్దనుండి వేదము నధ్యయనము చేయునట్టిసమయమునందును ఉపనయనానంతరము గాయత్రి నుపదేశించు కాలమునను చేయతగినది. ఇంక ప్రత్యహమన్ననోచక్షుర్మనస్స్పర్శనమును, ప్రాతఃకాలమునందు అధ్యయనముచేయునప్పుడు ఆద్యంతములయందును గురువులకు పాదోపసంగ్రహణము నొనర్చుటయును, గురువులచే ననుజ్ఞాతుడై కూరుచుండుటయును, ఒనర్ప దగిన దని సూత్రమునకు తాత్పర్యము.

## 58. సూ. ఓంకారోఽన్యత్రాపి [౧—౧—౫౮]

హరదత్తమితాక్షరా:—ఓంకార ఇతి. సావిత్ర్యనువచనాదన్యత్రాపి ఓంకారో వక్తవ్యః, ప్రత్యహ మధ్యయనకాల ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:—సావిత్ర్యనువచనము మాత్రమేకాక తక్కినసందర్భములయందు కూడ (అనగా ప్రతిదినము వేదాధ్యయనము చేయుపట్టులకూడ) ఓంకారము చెప్పదగినదియని యెఱుంగఁదగును.

## 59. సూ. అంతరాగమనే పునరుపసదనం [౧—౧—౫౯]

హరదత్తమితాక్షరా:—అంతరేతి. గురోశ్శిష్యస్య చ మధ్యే గమన మంతరాగమనం, యస్య కస్యాప్యంతరాగమనే పున రుపసదనం కర్తవ్యమ్. పాణినాసవ్య మిత్యాద్యోంకారోఽన్యత్రాపీత్యంతముపసదనమ్.

ఆంధ్రవివరణము:—గురువులకును శిష్యునకును నడుమను వెళ్లుట అంతరాగమనము అనబడును. అధ్యయనకాలమునందు అంతరాగమనము నొనర్చినచో మరల నుపసదనమును చేయతగును. ఉపసదనమనగా 49వ సూత్రము మొదలుకొని 58వ సూత్రమువఱకు చెప్పినట్టి విధాన మని యెఱుంగవలయును.

## 60. సూ. శ్వనకుల సర్ప మాండూక మార్జారాణాం త్ర్యహముపవాసోవిప్రవాసశ్చ. [౧—౧—౬౦]

హరదత్తమితాక్షరా:—శ్వనకులేతి. శ్వాదీనామంతరాగమనే త్ర్యహ ముపవాసో విప్రవాసశ్చ కర్తవ్యః, విప్రవాస ఆచార్యకులాదన్యత్రవాసః,మనుస్తు:—శ్లో. "పశుమండూక మార్జారశ్వసర్పనకులేషుచ, అంతరాగమనే విద్యాదనధ్యాయమహర్నిశమ్."ఇతి. తద్ధారణాధ్యయనవిషయమ్. గౌతమీయంతు గ్రహణాధ్యయనవిషయమ్.

ఆంధ్రవివరణము:—శ్వఅనగా శునకము.(కుక్క.) నకులము=ముంగిస; సర్పము=పాము; మండూకము=కప్ప మార్జారము= పిల్లి. శ్వనకులసర్పమండూకమార్జారములయొక్క అంతరాగమనము కలిగినయెడల [అనగా గురుశిష్యులొక్కచోఁగూర్చుండి అధ్యయనమును చేయునట్టి సమయములందు వారినడుమను కుక్కగాని ముంగిసగాని పాముగాని కప్పగాని పిల్లి గాని వెళ్లుట తటస్థించినచో నని భావము.] శిష్యుడుమూడుదినములు ఉపవసించుటయును, ఆచార్య గృహమును వీడి మఱియితర స్థలమునందు ఈమూడు రోజులు (విప్రవాసము) నివసించుటయును చేయతగిన దని భావము. అయి తే ఈవిషయమున మనువు కొంచెము భిన్నముగా చెప్పుచున్నాడు:—ఆయన యేమనెననగా— పశువులు, కప్పలు, పిల్లులు, కుక్కలు, పాములు, ముంగిసలు, అనునివి అధ్యాపనాధ్యయనముల చేయుచున్న గురుశిష్యుల నడుమ వెళ్లుట తటస్థించునేని ఒకరాత్రియు, నొకపవలును, అనధ్యాయము నాచరింపదగు నని యెఱుంగ వలయును అని. కాని ఈమనువుచెప్పిన ఈఅనధ్యాయవిషయము ధారణాధ్యయనవిషయ మనియును గౌతముఁడు చెప్పిఁది గ్రహణాధ్యయనవిషయ మనియు తెలుంగవలయు నని భావము.

## 61. సూ. ప్రాణాయామా ఘృతప్రాశనంచేతరేషాం [౧—౧—౬౧]

హరదత్తమితాక్షరా:—ఇతరేషాం శ్వాదివ్యతిరిక్తానాం పశ్వాదీనా మంతరాగమనే ప్రాణాయామాస్త్రయః కార్యాః. ఘృతప్రాశనంచ కార్యమ్. ఏతత్సర్వం శిష్యస్యప్రాయశ్చిత్తం నగురోః,ఉభయో రిత్యపరే.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు చెప్ప బడినకుక్కలు మున్నగునవి గాక తదితరములగుపశువులు అధ్య యనకాలమునందు గురుశిష్యులనడుమనుండి పోవుటకల్గినేని అప్పుడు ముమ్మారుప్రాణాయామమును జేయుటయును కొంచె మంత నేతినిభక్షించుటయును చేయదగును. ఈరెండు (60-61) సూత్రములందును వర్ణింపబడినట్టి ప్రాయశ్చిత్తము శిష్యునికి సంబంధించినట్టిదియే కాని. గురువునకు సంబంధించినదిట్టి మాత్రముకాదని కొందఱనిరి. [ఇది హరదత్తునిభావము.] కొంద ఱుభయులదిగూడ నని యనిరి.

62. సూ. శ్మశానాభ్యధ్యయనే చైవం [౧—౧—౬౨]

హరదత్తమితాక్షరా:— శ్మశానేతి. అభిరుపరిభావే శ్మశానస్యోపర్యధ్యయనే చైవం ప్రాయశ్చిత్తం ప్రాణాయామాఘృతప్రాశనం చేతి. ద్విరుక్తిరధ్యాయపరిసమాప్త్యర్థా.

ఇతిగౌతమీయవృత్తౌ హరదత్తవిరచితాయాం మితాక్షరాయాం ప్రథమప్రశ్నే ప్రథమోధ్యాయః.

ఆంధ్రవివరణము:— శ్మశానముపైని అధ్యయనము చేసినప్పుడుకూడను ఈవిధముగానే ప్రాయశ్చిత్తము నెఱుంగవలయునని సూత్రార్థము. అనగా పశ్వాదులు అంతరాగమనము చేసినప్పుడెట్టులు ప్రాణాయామములు మూటినిచేయుటయును కొంచెమంత నేతినిభక్షించుటయును ప్రాయశ్చిత్తముగా నెట్టులువిధించబడినదో అట్టులనే శ్మశానముపైని అధ్యయనముచేసినను కూడను ప్రాయశ్చిత్తమును చేసికొనతగునని తాత్పర్యము. ఈసూత్రమునందుగలద్విరుక్తి అధ్యాయపరిసమాప్తినెఱింగించుకొఱకై చేయబడిన దని యెఱుంగవలయును.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును, యజుశ్శాఖాధ్యాయియును, ఆపస్తంబసూత్రుడును, అధిగత కావ్యతీర్థాదిబిరుదుడును, పంచాగ్ని వంశ్యుడును, అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమీయ ధర్మసూత్రాంధ్ర వివరణమునందు ప్రథమప్రశ్నమునందు ప్రథమాధ్యాయము.



# గౌతమధర్మసూత్రములు.

## ద్వితీయ ప్రశ్న ప్రారంభము.

63. సూ. ప్రాగుపనయనాత్కామచారః కామవాదః కామభక్షః [౧—౨—౧]

హారదత్తమిశ్రితాక్షరా:— ఉపనీతప్రసంగేన అనుపనీతధర్మా ఉచ్యంతే— ప్రాగితి. ఆషోడశాద్బ్రాహ్మణస్య త్వాపత్కల్పోపనయనవిషయమ్. కామచార ఇచ్ఛాచరణమ్. అపణ్యాన్యపి విక్రీణీయాచ్ఛ్వవృత్త్యాపి జీవేదితి. కామవాదోఽశ్లీలానృతాదివచనమ్. కామభక్షో లశునపర్యుషితాన్నాదిభక్షణం చతుఃపంచకృత్వో వా భోజనమిత్యేతావద్యస్య స తథోక్తః నతు బ్రహ్మహత్యాసురాపానాద్యతిప్రసంగ ఇతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— వెనుకటి యధ్యాయమునందు బ్రాహ్మణ క్షత్రియాదులగు చాతుర్వర్ణములలోఁగల మాణవకుల ధర్మమును రూపించుటలోఁ ఉపనీతులగువారికి విహితములగునట్టి ధర్మములు మాత్రమే వివరింపబడినవి. ఇప్పుడు ఉపనీతుల ప్రసంగముచేత అనుపనీతుల ధర్మము లెవ్వియని శంక కలుగగా తన్నివారణమునకై అనుపనీతులయొక్క ధర్మములు ఈయధ్యాయమునందు చెప్పబడుచున్నవి. కామమనగా స్వేచ్ఛ. అనగా నియమరహితమగు ఆచరణము. కామముగ (స్వేచ్ఛగ) చరించుట గనుక కామచారము అనబడును. ఇట్లులనే కామవాదమనగా స్వేచ్ఛగ మాటలాడుటయును కామభక్షమనగా స్వేచ్ఛగ (నియమవిహీనముగ) భక్షణాదులను చేయుటయును అని అర్థములు. వటువు (అనగా బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునకు చెందిన ఉపనయనాధికారమును కల్గియున్నబాలుడని భావము) ఉపనయనమునకు ముందు- అర్థాత్తును ఉపనయనమగునంతదనుక- కామచారుడుగను కామవాదుడుగను కామభక్షుడుగను నుండవచ్చునని సూత్రార్థము. అనగా ఉపనయనము మొదలుకొనియే వెనుకటి యధ్యాయమునందు చెప్పబడినట్టి నియమములు విహితములగును గాని ఉపనయనము కాకమునుపు ఈనియమములు బాలకునకు వర్తింపవని తాత్పర్యము. అట్లైనచో పదునారేండ్లదనుక ఉపనయనమునకు గడువు కలదుగదా. ఈలోపున (అనగా పదునారేండ్లవఱకు) బాలుఁడు కామచారుడై కామభక్షుడై యుండవచ్చునా?"— యని ప్రశ్నింపగా రాదు. పదునారేండ్లదనుక ఉపనయనమునకు గడవుకలదన్నమాట ఆపత్కల్పమునందు చేయదగిన యుపనయనమును గుఱించినదేగాని సామాన్య ఉపనయనము గూర్చినదికాదు అనియెఱుంగదగును. ఇచ్చట కామచారమనగా స్వేచ్ఛగా చరించుట యని యర్థము సెప్పితిమి. దానిభావమేమనగా వటువు తమతమ వర్ణములకు విహితమైన వృత్తి లభించనిచో అపణ్యములనైనను విక్రయించి బ్రదుకవచ్చును. లేదేని శ్వవృత్తితో (సేవకవృత్తితో) నైనను బ్రదుకవచ్చును అని. ఇటులనే సంభాషణాదులయందు అశ్లీలములును అనృతములును ప్రమాదమున వచ్చినను హానిలేదనియును భోజనాదులయందు ధర్మశాస్త్రరీత్యా అభక్ష్యములను సూచించుటకై సూలమాత్రమునందు కామచారుడై కామవాదుడై కామభక్షుడై యుండవచ్చునని చెప్పబడినది. [కొందఱిచ్చట కామభక్షుడను మాటకు నియమములేకుండ దినమునకు నాలుగైదుమారులైనను భుజింపవచ్చునని భావమును వర్ణించిరి.] ఇచ్చట కామచార కామవాద కామభక్ష శబ్దములచేత పైని పేర్కొన్నవిధమగు కామచార కామవాద కామభక్షాదులను సయితము అతిక్రొనర్పవచ్చునని చెప్పరాదు అట్టులయిన నతిప్రసంగము కల్గి ధర్మవిప్లవము కల్గునని భావము.

విశేషాంశములు:— ఇచ్చట మస్కరీయ భాష్యమునందు ఈసూత్రమును ఆరంభించుటకు ప్రయోజనములు చాల వర్ణింపబడినవి... అందు ఈక్రిందివి ఒకటిరెండు పొందుపరుపబడుచున్నయవి. 1 ఉపనయనాది ర్నియమః- అని(72)వ సూత్రము మున్ముందు చెప్పబోవుచున్నారుగదా. దాని

వలననే అనుపనీతునకు నియమాదులు లేవని తేలుచుండగా ఈసూత్రమేల? అని ఒక శంక. ఈశంకకు ప్రత్యుత్తరముగా ఇయ్యది అనువాదకసూత్రమనియును, ఉపనీతునకు నియమాతిక్రమణముచేత సాధారణముగా ప్రాప్తించెడి ప్రాయశ్చిత్తముగాని రాజదండనముగాని ఇతనికి (అనుపనీతునకు) లేదనియును సూచించుటకు ఇయ్యది ఆరంభింపబడినది అని దీనికి సమాధానము. ఈసమాధానముమీద మఱొక ప్రశ్న. రాజదండముగాని ప్రాయశ్చిత్తముగాని సాధారణముగా తమకుతమకు విహితములైన పనులను చేయనప్పుడును నిషిద్ధములైనవానిని చేసినప్పుడును మాత్రమే గదా సంభవించుచుండును. మఱియిచ్చట అనుపనీతునకు విధిప్రతిషేధములు రెండును లేదనివిందుము. ఒక వేళ ఎప్పుడైనను ప్రాయశ్చిత్తాదులు విధింపవలసివచ్చుచో అతని తల్లిదండ్రులకేచెప్పియున్నారుకదా! ఇట్టిస్థితిలో ఈసూత్రమువలని ప్రయోజనమేమున్నది అని ప్రశ్నమేర్పడినది. దీనికి— విహితమును చేయనప్పుడును నిషిద్ధమును చేసినప్పుడును అగు ప్రాయశ్చిత్తరాజదండాదులు ఇతనికిగూడ తప్పనివేయనియును, నిజమునకు విధిప్రతిషేధములు ఇతనిని ఉద్దేశించియే చెప్పినట్టులు లేకున్నను అహింసాదులు వర్ణధర్మములగుట నితనికిని సంభవించుననియును, వానినతిక్రమించుటచేత వారి దండ ప్రాయశ్చిత్తాదులు కూడ కలుగుననియును, కాబట్టి ఈదోషములను వారించుటకై ఈసూత్రమును అనువాదకరూపమున నారంభించిరనియును చెప్పబడినది.

(2) ఉపనయనాదిర్నియమః:...అనుసూత్రముచేక విధింపబడిన ధర్మముల నుల్లఘించినప్పుడే ప్రాయశ్చిత్తాదులు కల్గునని చెప్పబోవుచుండుటచేతను ఆసూత్రముచేతనే ఇతనికి (అనుపనీతునకు) ప్రాయశ్చిత్త రాజదండములు లేవని యేర్పడు చుండుటచేతను గతార్థమగుచుండగా మఱల నీసూత్రమేలయని ఇంకొక యాక్షేపము. అగును. అట్టులు గతార్థమగుచున్నను ఇచ్చట మఱలజెప్పుట నిత్యోపనయనకాలాతీతుడై భిన్నబుద్ధియై శక్తుడై యున్న వానికి పదునొకండేండ్లు మొదలుకొని పదునారేండ్లు నిండనివయసులోనున్న వానికి, ప్రాయశ్చిత్తార్థప్రవేశనార్థమనిన్నీ, అంతకు తరువాత అయిదేండ్లు దాటినవానివిషయములో అతని తలిదండ్రులకు ప్రాయశ్చిత్తము విధింపవలయునని: సూచించుటకనిన్నీ సమాధానము చెప్పబడియున్నది.

## 64 సూ. అహుతాత్. [౧—౨—౨]

హరదత్తమితాక్షరా:— హుతశేషం పురోడాశాదికం తదత్తీతి హుతాత్ అహుతాత్ తద్విపరీతః అనుపనీతః హుతం నాద్యా న్నాశ్నీయా దిత్యర్థః

ఆంధ్రవివరణము:— బ్రాహ్మణాదులు అగ్నులయందు హోమముచేయునట్టి పురోడాశము మున్నగు వస్తువులకు హుతమని పేరు. హుతమును భక్షించెడివాడు హుతాత్తు అనబడును, అనుపనీతుఁడు అనగా నుపనయనము కానివాడు- హుతాత్తుగా నుండరాదని సూత్రార్థము. అనగా అనుపనీతుడు హోమశిష్టద్రవ్యమును భక్షింపకూడదని తాత్పర్యము.

## 65 సూ. బ్రహ్మచారీ [౧—౨—౩]

హరదత్త మితాక్షరా:—కామచారాదేరయమపవాదః ఆషోడశా దిత్యుక్తత్వా స్త్రీషు ప్రసంగయోగ్యతా స్త్యతో బ్రహ్మచారీ జితేంద్రియ స్స్యాదితి. తథాచ స్మృత్యంతరే- ప్రాయశ్చిత్తం విలుప్త మవకీర్ణివ్రతేన శుద్ధముపనయే న్న సప్తదశ మతఊర్ధ్వం ప్రాత్యావకీర్ణివ్రతాభ్యా మితి.

ఆంధ్రవివరణము:—ఇయ్యది అనుపనీతుడు కామచారుడై యుండవచ్చునన్న సూత్రమునకు అపవాద సూత్రము. అనగా అందు బోధితమైన ధర్మము దీనిచే బాధింపబడునని భావము. అనుపనీతుఁడు బ్రహ్మచారియై- అనగా స్త్రీసాంగత్యాదులను వర్జించినవాడై- యుండవలయునని సూత్రార్థము. ప్రత్యేకముగా నీసూత్రమును చెప్పవలసిన యావశ్యకత యేమనగా- ఉపనయనము పదునారేండ్లదనుక ను విహితమై యుండుట వలనను. బాలకుడు పదునారేండ్ల ప్రాయము వచ్చునప్పటికే స్త్రీసాంగత్యమునకు తగియుండు

టచేతను [ధర్మతః ఉపనీతుడు కాక] అనుపనీతుడై యున్నప్పటికిని ఉపనీతునివలె జితేంద్రియుడై బ్రహ్మచర్యమునతడు కాపాడుచు నుండవలయునని సూచించుటకై ప్రత్యేకముగా నీసూత్రము చెప్పబడినదని యెఱుంగవలయును. స్మృత్యంతరమునందుకూడ ఈవిధి? అధారములు గలవు. చూడుడు- విలుప్తుని (అనగా బ్రహ్మచర్యావ్రతలను లోపింపజేసుకొన్నవానిని) అవకీర్ణివ్రతముచే ప్రాయశ్చిత్తము నొనర్చి శుద్ధునిగావించి ఉపనయనము నొనర్పవలయును. ఇయ్యది పదునేడేండ్లలోపున మాత్రమే. పదునేడేండ్లవానినికూడ నిట్టులొనర్పరాదు. అంతకుపైబడినను వ్రాత్యావకీర్ణివ్రతము చేత నుపనయనము చేయరాదు.

విశేషాంశములు.... మస్కరీయ భాష్యమునందు 64,65.వ సూత్రములు రెండును ఏకసూత్రముగ పఠింపబడినది. మఱియును హుతమనగా హోమశిష్టద్రవ్యములగు చరుపురోడాశములేయగును గాని వైశ్వదేవము చేసినపిమ్మట మిగిలినట్టిద్రవ్యము అని అర్థము చేయరాదనియును, చరుపురోడాశాదులవలెగాక ఇయ్యదిఅనగా- వైశ్వదేవశిష్టములగునవి భక్షింపదగినదేనైయుండుననియును, కనుకనే... ర్వాన్ వైశ్వదేవే భాగినః కుర్వీత- [అందఱను వైశ్వదేవము చేయగా మిగిలినట్టి అన్నాదిద్రవ్యమును అనుభవించుటలో భాగస్థులనుగా చేయవలసినది] అనియునుకూడ వైశిష్ట్యము చెప్పబడియున్నయది.

66 సూ. యథోపపాదితమూత్ర పురీషో భవతి [౧—౨—౪]

హరదత్త మితాక్షరా:—యథేతి, మూత్రపురీషే యథా ఉపపద్యేతే యస్య స తథోక్తః ప్రాఙ్ముఖాదిరపి కుర్యాత్. న భూమావసనం తర్ధాయేత్యాది స్థానని యమోపి నాస్తి.

ఆంధ్రవివరణము:—అనుపనీతుడు [మూత్రపురీషములను విడుచునప్పుడు] యథోపపాదిత మూత్రపురీషుడై యుండవచ్చును. అని సూత్రార్థము. అనగా ఉపనీతునకు చెప్పబడినట్టు అనుపనీతునకు నియమము చెప్పలేదనియును అతడు తనకిచ్చవచ్చిన చోస్పున నెక్కడనైనను ఏస్థానమునందైనను మలమూత్రములను వదలవచ్చుననియును ఉపనీతుని నియమముల నితడుపాటింపవలసిన నియమము లేదనియును [పాటించిన దప్పులేదనియును కూడ] తాత్పర్యము.

విశేషాంశములు.— ఈ సూత్రము మొదలుకొని కామచారమునకు ఉదాహరణములుగా చెప్పుచున్నాడని మస్కరీయలమతము.

67 సూ. నాస్య ఆచమనకల్పో విద్యతే [౧—౨—౫]

హరదత్త మితాక్షరా:—నాస్యేతి. కల్పనిషేధా దాచమన మనుజ్ఞాతః స్త్రీశూద్రవదితి.

ఆంధ్రవివరణము:—ఈయనుపనీతునకు ఉపనీతునకువలె ఆచమనకల్పముకూడ అక్కఱలేదని సూత్రార్థము. ఇచ్చట ఆచమనకల్పమక్కఱలేదని నిషేధించుటవలన అనుపనీతునికూడ స్త్రీలకు శూద్రులకు మున్నగువారివలె ఆచమనము చేయవచ్చునని అంగీకరించినట్టైనదని భావము.

68 సూ. అన్యత్ర అపమార్జన ప్రధావనావోక్షణేభ్యః [౧-౨-౬]

హరదత్త మితాక్షరా:—అన్యత్రేతి. అపమార్జనాదీని వర్జయిత్వా ఆచమనకల్పో నాస్తి అపమార్జనాదికమస్త్యేవేతి. యద్యప్యపమార్జనాదీని ఆచమనకల్పే నాంతర్భవంతి తథాపి పర్యుదాసముఖేన తాని విధీయంతే. అత్ర మార్జనం నామ ఆర్ద్రేణ పాణినా పరిమార్జన ముచ్ఛిష్టాదిలిప్తస్య ప్రధావనం అమేధ్యాదిలిప్తస్య అద్భి ర్మృదా ప్రక్షాళనమ్. అవోక్షణం రజస్వలాదిస్పృష్టస్య ఇవ మత్యంత బాలవిషయమ్. షడ్వర్షా దూర్ధ్వం

స్నాన మిచ్ఛంతి. అస్యానుపనీత స్యైతావ దుక్తమాత్ర కామచారాదివ్యతిక్రమే ప్రాయశ్చిత్త మస్త్యేవ తథాచ స్మృత్యంతరే—శ్లో. అశీతి ర్యస్య వర్షాణి బాలో వా ప్యూనషోడశః, ప్రాయశ్చిత్తార్థ మర్హంతి స్త్రియో వ్యాధిత ఏవచ. ఊనైకాదశవర్షస్య పంచవర్షాత్పరస్యచ. చరేద్గురుస్సుహృచ్చైవప్రాయశ్చిత్తంచనేష్యతే-ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రములయందు అనుపనీతుడు యథోపపాదిత మూత్రపురీషుఁడుగా నుండవచ్చుననియును ఆతనికి ఆచమనకల్పము లేదనియును (కాని స్త్రీశూద్రాదులరీతి నాచరింపదగునని భావము.) వివరించి ప్రస్తుతమీసూత్రమునందు అపమార్జనాదులందు తప్ప తక్కిన విషయములలో మాత్రమే ఆచమనకల్పము లేదని రూపించుచున్నాడు. అపమార్జనాదులందుతప్ప తక్కినవిషయములలో అనుపనీతునకు ఆచమనకల్పము లేదని సూత్రార్థము. —గా అపమార్జనాదులందు కలదని భావము. నిజమునకు అపమార్జనాదులు ఆచమనకల్పమున చేరవు. అయినను పర్యుదాసద్వారా ఇచ్చట విధింపబడుచున్నది. (ఇచ్చట అపమార్జనాదుల కర్థములు వ్రాయఁబడుచున్నవి.) ఎంగిలి మున్నగు వాని చే లిప్తుడగువానికి నీళ్ళుబోసి కడుగుటయే ఇచ్చట మార్జనము. మార్జనమే అపమార్జనము. అమేధ్యము (మలమూత్రాదులు) చేత లిప్తుడగువానికి నీటితో కడిగి మట్టితో శుద్ధి కడగుట యేదిగలదో అయ్యది ప్రధావనము అనఁబడును. మృతైన స్త్రీలు మున్నగువారి చే తాకబడినట్టివానిని మంత్రోదకముల చేత ప్రోక్షించుట అవోక్షమనబడును. అపమార్జనము ప్రధావనము అవోక్షణమునను వీనియందు తప్ప తక్కినవిషయములలో అనుపనీతునకు ఆచమనకల్పము లేదని తాత్పర్యము. ఈసూత్రమునందు చెప్పబడినవిధానము అయిదారేండ్లు యీడుఁగల అనుపనీతులగు బాలురవిషయమున చెప్పబడినట్టిది మాత్రమే. ఆ రేండ్లకు మించినవానికన్నను స్నానము చేయువలయునని పెద్దలు కోరుచురు. అనుపనీతునకు మాత్రమే ఇది. ఇందు చెప్పబడీనదానికంటె వ్యతిక్రమముగల్గినచో అప్పుడు ప్రాయశ్చిత్తము తప్పదని స్మృత్యంతరమునందు (ఇతరస్మృతులలో) చెప్పబడియున్నదీ.- "ఎనుబదియేండ్ల వృద్ధుడును పదునారేండ్లలోపలి బాలుడును స్త్రీలును వ్యాధితులును ప్రాయశ్చిత్తమునకై తగియేయున్నారు. అయిదేండ్లకు మించియున్న అనుపనీతునకును పదునొకండేండ్లలోపునను్న అనుపనీతునకును అతనియొక్క గురువుగాని (గురుశబ్దముచేత తంద్రులు మున్నగువారు) స్నేహితుడుగాని శౌచముకొఱకు ప్రాయశ్చిత్తమును ఆచరింపవలయును అని. కాన (అనగా తననిమిత్త మితరులు ప్రాయశ్చిత్తము నాచరింము వారలుఁడుటవలన) అత్యంతము బాలుడగునట్టి అనుపనీతునకు అపరాధముగాని పాతకముగాని రాజదఁడముగాని లేదు. కాబట్టియే అతనికి ప్రాయశ్చిత్తముకూడ నక్కఱలేదని యే పెద్దలు అభిప్రాయపడిరి అని తాత్పర్యము.

విశేషాంశములు.— ఇయ్యది అత్యంతము బాలుడుగానున్నట్టివాని విషయమై చెప్పబడినట్టిదని మస్కరి యభిప్రాయము. అనగా అయిదేండ్లలోపు బాలునిగుఱించినదని భావము.

## 69 సూ. న తదుపస్పర్శనాదశౌచమ్ [౧—౨—౭]

హరదత్త మితాక్షరా:—నేతి. తదుపస్పర్శనాత్తస్య అకృతోపనయనస్య ఉదక్యాదిస్పృష్టస్యాప్యుపస్పర్శనాదశౌచం న స్యాత్. స్పృష్టాస్పృష్టి రుపస్పర్శనం తేన స్నానం నకర్తవ్యం భుక్తోచ్ఛిష్టస్య కృతమూత్రపురీషాదిస్పర్శస్య స్పర్శనాదపి నైవాచమనమ్. ఇదమపి షడ్వర్షాత్ప్రాగేవ. కిమర్థం తర్హీదం శౌచం విహితమ్. నతావ దనుష్ఠానార్థం నాపి స్పర్శయోగ్యతార్థం, అకృతశౌచస్యాపి స్పర్శయోగ్యత్వాత్. రక్షణార్థ మితి బ్రూమః తథాచ స్మృత్యంతరమ్—బాలస్య పంచమా ద్వర్షా ద్రక్షార్థం శౌచ మాచరేత్ ఇతి.

ఆంధ్రవివరణము:—ఇచట సూత్రకారుడు అత్యంతము బాలుర గు ననుపనీతులంగూర్చియే వివరించుచున్నాడు. తదుపస్పర్శన మువలనగూడ అశౌచము లేదు అని సూత్రమున కర్థము. తచ్ఛబ్దముచేత నిచ్చట అనుపనీతుడు పేర్కొనబడుచున్నాడు. ఉపస్పర్శనమన్న మాటచేత (ఉపస్పర్శనమనగా తాకుట) ఉదక్యమున్నగు-వారిచేనైన స్పర్శనమని యర్థము గ్రహింపబడుచున్నది. ఉదక్యఅనగా ముట్టైనస్త్రీ. ఉపనయనము కాని (మిక్కిలి చిన్నవయసుగల) బాలునకు ముట్టైనస్త్రీలు మొదలగువారి కారణమున నుపస్పర్శనము సంభవించిన ప్పటికిని అశౌచములేదని తాత్పర్యము. స్పృష్టాస్పృష్టియే ఉపస్పర్శనము. కాబట్టి అంతమాత్రముచేత స్నానము చేయనక్కఱలేదు. అన్నమతిని యెంగిలితో నున్నట్టిగాని మూత్రవిసర్జనము పురీష విసర్జనము చేసియున్నట్టి గాని బాలకునిస్పృశించుట వలనగూడ ఆచమనము చేయనక్కఱలేదు. ఈవిధి కూడ ఆఅయిదారేండ్ల లోపుపిల్లడిని గురించినదియే యని యెఱుంగదగును. అయిదారేండ్ల(ప్రాయపుఅనుపనీతునకు)శౌచమేలవిధింపబడినదన వచ్చును. కాని ఈవిధానము నాతడను ష్ఠించుటకొఱకుగాని స్పర్శయోగ్యతకల్గుటకొఱకుగాని ఎంత మాత్రమును కాదు. ఏమందురా ? అకృతశౌచుడైన బాలకుని సైతము స్పృశించుటకు ధర్మశాస్త్రములు ఒప్పుకొంచునే యున్నవి. ఇట్టిస్థితిలో ఈశౌచవిధాన మెందులకందురా ? రక్షణార్థమని యెఱుంగవలయును. అట్లే ఇతరస్మృతికూడ నుడువుచున్నది. చూడుడు. "అయిదవయేడు మొదలుకొనియే బాలకునికి రక్షార్థమై శౌచమును ఆచరింపవలయును." అని.

70 సూ. నత్వేవైన మగ్నిహవన బలిహరణయో ర్నియుంజ్యాత్ [౧—౨—౮]

హరదత్త మితాక్షరా:—నత్వేవేతి. ఏన మనుపనీతం అగ్నిహవనే ఔపాసన హోమాదౌ బలిహరణే వైశ్వదేవాదౌ న నియుంజ్యాన్నియుంజీతేతి యావత్. తుశబ్దాదుక్తాదన్యత్రాపి సమంత్రకే కర్మణి న నియుంజీతేత ర్థః ఏవకారస్తావధారణే. అథాహాశ్వలాయనః—"పాణిగ్రహణాదిగృహ్యం పరిచరేత్స్వయం పత్న్యపివా పుత్రః కుమార్యంతేవాసీవా" ఇతి. ఛందోగాశ్చ పత్నీ జుహుయా దితి. పత్నీకుమార్యాద్యనుజ్ఞాతేష్మి న్నపి నత్వేవైన మిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ఇతనిని అనగా నుపనయనము కాని బాలకుని అగ్నిహవనము బలిహరణము అను కార్యములందు నియోగింపరాదని సూత్రార్థము. అనగా ఉపనయనముకాని పిల్లడికి అగ్నిహవనము చేయుటకును బలిహరణము నొనర్చుటకును అధికారములేదని తాత్పర్యము. ఇచ్చట అగ్నియనగా ఔపాసనముచేయునట్టి అగ్నియని భావము. అగ్నియందు హవనముచేయబడును (అనగా వేల్చబడును) గనుక అగ్నిహవనమనబడును. ఔపాసనహోమాది కార్యములన్నియు అగ్నిహవనమన్న మాటచేత నిచ్చట గ్రహింపబడును. బలిహరణమనగా వైశ్వదేవాదికార్యములని భావము. అగ్నిహవన బలిహరణములయందు అనుపనీతుని నియోగింపరాదని సూత్రతాత్పర్యము. మూలసూత్రమునందు నత్వేవైనం అని తుశబ్దమును చేర్చి చెప్పుటచేత కేవలము అగ్నిహవన బలిహరణ కార్యములు మాత్రమేగాక వైదికమంత్రములతో మంత్రవత్తుగ చేయు ప్రతికార్యమునందును అనుపనీతుని నియోగింపరాదని అర్థమేర్పడుచున్నది. ఏవకారమిచ్చట అవధారణార్థమని యెఱుంగవలయును.

"అయ్యా! విధివాక్యమున్నదగదా ఇట్టులు ఖండితముగా నిషేధమును చెప్పవలయును". అనిప్రశ్నింతురేని ఆట్టివాక్యములు లేకపోలేదు. జూడుడు. ఆశ్వలాయనముని చెప్పినాడుగదా. యజమానియగువాడు పాణిగ్రహణమైనది మొదలుకొని గార్హపత్యాగ్నిని స్వయముగా నుపచరింపవలయును. యజమాని ఏదైనను కార్యాంతరమున అనుపస్థితుడైనచో ఆయనయొక్క భార్యగాని, కుమారుడుగాని కుమార్తెగాని శిష్యుడుగాని ఉపచరింపవలయును అని. కేవలము అశ్వలాయను డొక్కడుమాత్రమేగాక ఛాందోగులుకూడ పత్నీజుహుయాత్ [భార్యహోమము చేయ

లయును] అని విధించుచున్నవి. కాబట్టి అగ్నిహవనాదులు పత్నీకుమారాదులుగూడ నాచరింపవచ్చునను ఈపక్షమునందుకూడ అనుపనీతుడగు వానిని నియోగింపనే నియోగింపగా రాదని తెలుపుటకై ఇచ్చట ఈనిషేధసూత్రము చెప్పవలసినదని యెఱుంగవలయును.

విశేషాంశములు:—ఈసూత్రము ఉపనీతుని మాత్రమే అగ్నిహవనాదులయందు నియోగింపవలయు నని సూచించుట కారంభింపబడిన దనియును, విద్వానగ్నిహోత్రం జుహు యాత్తను శ్రుతివాక్యము బహుశ్రుతుడైన వాడే అగ్నిహోత్రాధికారియని చెప్పుచున్నను-కొలదిపాటి విద్య వచ్చినట్టి యుపనీతునిగూడఅగ్నిహోత్రాదులయందు నియోగింపవచ్చునని మనువు మొదలగువారి వాక్యములవలన తెలియబడుచున్నదనియును, ఎట్లనగా... శ్లో. నైవకన్యాన యువతి ర్నాల్పవిద్యోనబాలిశః, హోతాస్యాదగ్నిహోత్రస్య నార్తోనా సంస్కృత స్తథా—[పెండ్లికాని కన్యకగాని యువతిగాని అల్పవిద్యుడుగానిబాలిశుడుగాని ఆర్తుడుగాని అసంస్కృతుడుగాని అగ్నిహోత్రమునకు హోతగానుండగా రాదు] అనిచెప్పుటలో అల్పవిద్యునిప్రతిషేధించుటచేతనే ప్రతిషేధము సిద్ధించుచున్నను మఱలనాసంస్కృతః - అని చెప్పుటచేత విద్వద భావముగల్గినప్పుడు అల్పవిద్యుడగు సంస్కృతుడైనప్పటికిని అగ్నిహవనమున కర్హుడై యుండునని సూచింపబడుచున్న దనియును కాబట్టి ఇయ్యది ఉపనీతుని మాత్రమే అగ్నిహవనాదులందు నియోగింపవలయునని సూచించుట కారంభింపబడినదనియును, మస్కరీయభాష్యమునందున్నది.

## 71సూ. న బ్రహ్మాభివ్యాహారయే దన్యత్ర స్వధానినయనాత్

[౧—౨—౬]

హరదత్తమితాక్షరా:— న బ్రహ్మేతి. బ్రహ్మ వేదః. ఏవ మనుపనీతం బ్రహ్మ నాభివ్యాహారయే న్నోచ్చారయేత్. కిమవిశేషేణేతి నేత్యాహఅన్యత్ర స్వధానినయనాత్. పిత్ర్యస్య సర్వస్య కర్మణ ఉపలక్షణమ్ అన్యత్ర ఉదక కర్మస్వధాపితృసంయుక్తేభ్య ఇతి వాసిష్ఠే దర్శనాత్ ఽగృహీతాక్షరః పుత్రః పిత్రోస్సంస్కార మర్హతీత్యాదిచ అన్యస్యాసంభవే సర్వం పిత్ర్యం కర్మ తదానీం మంత్రాన్గ్రాహయిత్వా సా కారయితవ్యఇత్యర్థః

ఆంధ్రవివరణము:—బ్రహ్మము అనగా వేదము. ఈఅనుపనీతుని (అనగా నుపనయనము కాని వానిని) వేదము నుచ్చరింపజేయగా రాదు అని సూత్రమునందలి సగభాగమున కర్థము. ఈయర్థభాగమునందు విధించినధర్మము అవిశేషముగనేనా? యన్న ప్రశ్నమురాగా కాదని (తక్కిన యర్థభాగముతో) వారించుచున్నాడు. స్వధానినయనాదులందుతప్ప తక్కినవిషయములందు అనుపనీతుని వేదమును ఉచ్చరింపజేయగా రాదని సూత్రమున కర్థము. స్వధానినయనమనగా స్వధా స్వాహా ఇత్యాది పదములతో వైదిక కార్యములందు దేవతలను గుఱించియును పితృదేవతలను గుఱించియును హవిరాదులను అర్పించుట. కాని ఈమాట పితృసంబంధములగు కార్యములకన్నిటికి ఉపలక్షకము. [అనగా పితృకార్యములన్నియును ఈస్వధానినయమన్నమాటచేత గ్రహింపబడుచుండునని భావము.] ఇందులకు ప్రమాణమేమందురా? వాసిష్ఠస్మృతి యందు "ఉదకకర్మలు స్వధా పితృక్రియలు వీటితో సంబంధించిన కార్యములలోతప్ప తక్కిన విషయములందు అనుపనీతుడు వేదమును నుచ్చరింపగారాదు "అని యుండుటవలనని యెఱుంగదగును. కేవలమిదిమాత్రమేగాక అనూచానమునుండి వచ్చు పెద్దల వాక్యముకూడ అట్టులున్నది. "కుమారుడు అగృహీతాక్షరుడుగ నున్నను (అనగా ననుపనీతుడై వేదాక్షరస్వీకారము నొనర్పకుండ నున్నప్పటికిని) పితృసంస్కారమున కర్హుడగుచున్నాడు. అని. అనగా పితృసంస్కారమును చేయవలసివచ్చి చేయుట కితరులెవరును లేకపోయినచో (కర్మలోపములగునంతటి స్థితివచ్చినచో) తత్క్షణమే నతనిని మంత్రములను చదివింపజేసి పైతృకకర్మను యావత్తును అతనిద్వారా చేయింపవచ్చునని తాత్పర్యము.

72 సూ. ఉపనయనాది ర్నియమః. [౧-౨-౧౦]

హరదత్తమితాక్షరా:— ఉపనయనేతి. అగ్నీంధనాదిర్యో నియమో వక్ష్యతే స ఉపనయనాదిరేవ అనుపనీతాధికారేణ విచ్ఛిన్నత్వాదుపనీతాధికారార్థ మిదమ్.

ఆంధ్రవివరణము:—మున్ముందు సూత్రములలో ఉపనీతుడాచరింపదగిన విధులను అగ్నీంధన భిక్షాచరణాదులను (చూడుము 74 సూ.) నిరూపింపదలచి ఆవిధులను అనుపనీతునకుకూడ ఆచరింపవలయునా యని శంకించుకొని తత్సమాధానముగా ఈసూత్రమును ఆరంభించుచున్నాడు- ఉపనయనము ఆదిగాగల నియమము ఉపనయనాది యని చెప్పబడుచున్నది. నియమము (అనగా ఉపనీతునకు విధించినట్టి సమిద్ధోమము భిక్షాచరణము మొదలగు నియమములన్నియును) ఉపనయనాదియే యగును. అనగా ఆవిధులును నియమములును ఉపనయనము అయిన దినమునుండియే వటువు ఆచరింపవలసినట్టులుగా ఏర్పడుచున్నవేగాని ఉపనయనము కానిదే (అనుపనీతునకు) ఆచరింపదగినట్టివి ఎంతమాత్రమును కాజాలవని తాత్పర్యము. ఈసూత్రము అధికారసూత్రము. ఇదివఱలో ఉపనీతుడగు మాణవకుని ధర్మములను రూపించుచు నడుమ అనుపనీతుని గుఱించిన ప్రసంగముచేత విచ్ఛిన్నము కలుగగా- మఱల ఉపనయనాధికారార్థమై ఈసూత్రము ఆరంభింపబడినదని యెఱుంగవలయును.

73 సూ. ఉక్తం బ్రహ్మచర్యమ్. [౧-౨-౧౧]

హరదత్తమితాక్షరా:— అనుపనీతస్య యదుక్తం బ్రహ్మచర్యం తదతీతస్యాపి సమానమ్ ననుచ స్త్రీప్రేక్షణాలంభనే ఇతి నిషేధో వక్ష్యతే తథాపి స్మరణకీర్తనాదినిషేధార్థ మిదం.

ఆంధ్రవివరణము:—అనుపనీతునకు ఏబ్రహ్మచర్యము ఆచరింపదగినదిగా నిరూపింపబడినదో అయ్యదియే ఉపనీతునకు సయితము ఆచరింపదగినదిగా నిరూపింపబడినదని సూత్రార్థము. మున్ముందు స్త్రీప్రేక్షణాలంభనాదులను నిషేధించుట చెప్పబడుచునే యున్నదికదా! అట్టిస్థితిలో ప్రత్యేకముగా మఱల నీసూత్రమేల ?- యని అనగారాదు. అయ్యది నిషేధపరమేయైనను ఇది స్మరణకీర్తనాదిరూపము గు అష్టవిధమైథునమును నిషేధించుటకని యెఱుంగవలయును.

విశేషాంశములు:—శాస్త్రకర్తలు అష్టవిధములగు మైథునముల నిట్లు వివరించుచున్నారు. శ్లో. స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం సంకల్పో ధ్యవసాయశ్చ క్రియా నిష్పత్తిరేవచ. అని. స్త్రీపురుషులు ఒకరి నొకరు తలంచుకొనుటయును కొని యాడుకొనుటయును, క్రీడించుటయును ఒకరి నొకరు చూచుకొనుటయును రహస్యముగ మాటలాడుకొనుటయును, సంగమార్థమై సంకల్పించుటయును నిశ్చయించుకొనుటయును చివఱకు కార్యమును ముగించుకొనుటయును అను నీ ఎనిమిదియును మైథునమునందలి భేదములు అని తాత్పర్యము.

74 సూ. అగ్నీంధనభైక్షచరణే [౧-౨-౧౨]

హరదత్తమితాక్షరా:— అగ్నీతి. అగ్నీంధనం సమిద్ధోమః భిక్షాణాం సమూహో భైక్షం తదర్థం ప్రతిగృహం చరణం భైక్షచరణం తే ప్రత్యహం కర్తవ్యే తత్ర మనుః. -శ్లో. దూరాదాహృత్య సమిధః సన్నిదధ్యాద్విహాయసి, సాయం ప్రాతశ్చ జుహుయాత్తాభిరగ్ని మతంద్రితః, అకృత్వా భైక్షచరణ మసమిధ్య చ పావకమ్. అనాతురస్సప్తరాత్ర మవకీర్ణివ్రతం చరేత్- ఇతి. ఆపస్తంబస్తు - సాయమేవ అగ్నిపూజేత్యేకే-ఇతి.

ఆంధ్రవివరణము:—ఇంధనములగా కట్టెలు అగ్ని హోత్రమునందు సమిధలతో (అనగా ఇంధనములతో) చేయునట్టి హోమము అగ్నీంధనము అనబడును, అనగా స

మిక్షోదకము. భిక్షులయొక్క సమూహము భైక్షము అనబడును. భైక్షము నిమిత్తమై ఇంటింటికిని సంచరించుట భైక్షచరణ మనఁబడును. ఉపనీతుడైన వటువు అగ్నీంధనమునున్నూ (అనగా సమిద్హోమమునున్నూ) భైక్షచరణమునున్నూ అనగా భిక్షార్థమై ప్రతిగృహమునకు చరించుటయును ప్రతిదినమును చేయుచుండవలయు నని సూత్రార్థము. ఈవిషయమునందు (అనఁగా ఉపనీతుడగువటువు దినదినమును అగ్నీంధనభైక్షచరణములను చేయవలయును అనునట్టి విషయమునందు) మనువు ఇట్లు చెప్పియున్నాడు ఉపనీతుడగువటువు దూరమునుండి సమిధలనుకొనివచ్చి భూస్పర్శ లేకుండ అంతరాళమున నే సమిధలను చేర్చియుంచుకొనవలయును. పిమ్మట అతం్రితుడై ప్రతిదినమునను ఆసమిధలతో సాయంకాల ప్రాతఃకాలములయందు వానితో హోమమును చేయుచుండవలయును. ఎవ్వఁడిట్టులు భైక్షచరణము నొనర్పకయును అగ్నిని ప్రజ్వలింపకయు నుండునో వాడు ఏడుదినములవఱకు అవకీర్ణివ్రతమును చేయవలయును అని మనువు చెప్పినాడు. ఇఁకను ఆపస్తంబుడన్ననో కేవలమొక్క సాయంకాలమునందు మాత్రమే అగ్నిపూజ నొనర్పదగునని కొందఱు పల్కెదని పక్షాంతరమును సూచించినాడు.

విశేషాంశములు:— ఇచ్చట అగ్నీంధనభైక్షచరణములను సహానిర్దేశముచేయుట అనంతరానుష్ఠానార్థమనియును, బ్రహ్మచారికి సాయంప్రాతః కాలముల రెండింటియందును భుజింప దగునని(సాయంప్రాతః స్త్వన్నమభిపూజితమనిందన్ భుంజీత) అనిచెప్పుటచేత అగ్నీంధనముకూడ రెండుమారులును ఆచరింపవలసినదేయని తేలుచున్నదనియును మస్కరీయ భాష్యము చెప్పుచున్నది.

## 75 సూ. సత్యవచనమ్.

౧—౨—౧౩

హరదత్తమితాక్షరా—సత్యేతి. ఉపనీతేన సత్యమేవ వక్తవ్యమ్.

ఆంధ్రవివరణము:—ఉపనీతుడైన వటువు సర్వదా సత్యవాక్యమునే చెప్పవలయును అనిభావము.

## 76 సూ. అపాముపస్పర్శనమ్.

[౧—౨—౧౪]

హరదత్తమితాక్షరా—అపామితి. అపా ముపస్పర్శనం ఉదకోపస్పర్శనం- అర్థాత్స్నానమిత్యర్థః ఏతద ప్యహన్యహని తేన అహరహః కర్తవ్యమ్

ఆంధ్రవివరణము:—ఉపనీతుడైన వాడు ఉదకోపస్పర్శనమునుకూడ దినదినము చేయుచుండవలయునని సూత్రార్థము. ఉదకోపస్పర్శనమనగా ఇచ్చటనీటితో స్నానముచేయుట యేయని యెఱుఁగతగును.

విశేషాంశములు:—ఇచ్చట అపాముపస్పర్శనమ్ - అని అప్పబ్దముతో ఉదకములను పేర్కొనుటనుబట్టి భస్మస్నానము మున్నగు నైదువిధములగు స్నానములనుగూడ గ్రహింపవలయుననియును, అపాంస్పర్శనం— అనిచెప్పినంతమాత్రముచేత నే ఇష్టసిద్ధియగుచున్నను ఉపస్పర్శనం-అని ఉపశబ్దము చేర్చిచెప్పుటచేత విజ్ఞాతజలములను మాత్రమే గ్రహింపదగును అని సూచించుటకనియును 74వ సూత్రమునుగూడ కలుపక వేఱ్వేరుగా చెప్పుటచేత ఉపనీతునకు నిత్యస్నానమునకు తప్ప నైమిత్తిక స్నానమునకు ప్రతిషేధము లేదని సూచించుట కనియును అనిఇట్టులు కొందఱు పరిపరి విధములుగా వ్యాఖ్యానములను చేసియున్నారు. కాని వీరి మతభేదములనన్నింటిని మనువు ఒక్కముక్కలో చెప్పియున్నాడు—శ్లో. నస్నానమాచరే ద్భుక్త్వానాతురోనమహానిశి, నవాసోభిస్సహాజస్రంనావిజ్ఞాతేజలాశయే— (అనగా భుజించికాని ఆతురుడైయుండిగాని అర్ధరాత్రమునగాని వస్త్రములనిండుగ ధరించికాని, అవిజ్ఞాత జలాశయమునందుగాని స్నానము చేయరాదు) అని.

మఱియును పైనిచెప్పినట్టిఅయిదువిధములగు స్నానములు ఇయ్యవి—౧ ఆగ్నేయస్నానము. ౨ వారుణస్నానము. 3 బ్రాహ్మ్యస్నానము. ౪ వాయవ్యస్నానము. ౫ దివ్యస్నానము అని. ఇందులో భస్మతో చేయుస్నానము ఆగ్నేయస్నానము. నీటితోమునిగి చేయునట్టిది వారుణస్నానము.

ఆపోహిష్ఠామయోభువః - అనేమార్జన మంత్రములతో చేయుస్నానము బ్రాహ్మ్యస్నానము. గోవులపాదధూళిలో నిల్వబడుట వాయవ్యస్నానము. ఎండకాయుచుండగా గురిసెడు వర్షములో చేయునట్టిస్నానము దివ్యస్నానము. ఈ యైదుస్నానములలోను వారుణస్నానము చాలముఖ్యము. వారుణస్నానమును చేయజాలనివాడు తక్కిన నాల్గింటిలో దేనినైనను చేయవచ్చునని తాత్పర్యము.

## 77 సూ. ఏకే గోదానాది.

[౧—౨—౧౫]

హారదత్త మితాక్షరా:— ఏకఇతి గోదానం నామ షోడశేవర్షే కర్తవ్యం వ్రతం, తద్వ్రతేషు ద్వితీయమ్. ఛందోగానామేక ఆచార్యా గోదానాది స్నాన మిచ్ఛంతి. నతతః ప్రాక్, దీక్షితవదస్యాపి బ్రహ్మచర్యదీక్షాని యుక్తత్వాత్ నిత్యస్నానస్యాయంప్రతిషేధః నైమిత్తికంతు కర్తవ్యం తత్ర దండవదాప్లవనమ్. నాప్సు శ్లాఘమాన స్స్నాయా దిత్యాపస్తంబస్మరణాత్.

ఆంధ్రవివరణము:—ఉపనీతుడు నిత్యమును ఉదకోపస్పర్శనము చేయవలయుననుటలో మతభేదమున్నందున ప్రస్తుతము ఈసూత్రమునందు దానిని-అనగా ఆమతభేదమును-రూపించుచున్నాడు.

గోదానమునది ఉపనీతు డాచరింపవలసినట్టి వ్రతములలో నొక్కటి. ఇయ్యది పదునారవయేటను ఆచరింపవలసి యుండును. ఉపనీతున కియ్యది రెండవదగునట్టి వ్రతము. గోదానవ్రతము ఏనాడు ఉపనీతుడాచరించునో ఆనాటినుండియే స్నానముచేయు నధికారమును (అనగా ఉదకోపస్పర్శనయోగ్యతను) పొందునని కొందఱు ఆచార్యులు పల్కిరని సూత్రార్థము. అనగా ఉపనీతుడగు వటువు బ్రహ్మచర్య దీక్షనవలంబించి (యొకరీతిగా) దీక్షితుడగుచున్నాడు కాబట్టి సాధారణముగా దీక్షానియుక్తులగు వారెల్లరును ఏవిధముగా వ్రతాంతమునందు స్నానముచేయుటకు అర్హులగుచున్నారో అట్లులనే ఉపనీతుడైన వటువుకూడ గోదానవ్రతము నాటినుండియే స్నానమునొనర్పవలయును గాని అంతకుముందు కూడదు. అని ఛందోగులలో కొంద ఱాచార్యులు పల్కిరని తాత్పర్యము.

స్నానములు సాధారణముగా రెండువిధములు. ౧ నిత్యస్నానములు. ౨ నైమిత్తికస్నానములు. అని. ఈరెండు విధములగునట్టిస్నానములలోనూ ఈసూత్రమునందు చెప్పబడినట్టి నిషేధము నిత్యస్నానమునకే వర్తించును గాని నైమిత్తికమగు స్నానమున కెన్నటికిని వర్తింపదు. కాబట్టి ఉపనీతుడు నైమిత్తికమగు స్నానమును చేయవలసినదని యే ముఖ్యాభిప్రాయము. అయితే అట్టులు నైమిత్తికమగు స్నానమును చేయునప్పుడు దండాకారముగా నీటిలోమునిగి లేవవలసినదేగాని శ్లాఘమానుడై స్నానముచేయగా రాదని భావము. ఏమనగా "నాప్సుశ్లాఘ మాన స్స్నాయాత్తని ఆపస్తంబులు స్మరించియున్నారు. కాబట్టి యని యెఱుంగునది. నైమిత్తిక స్నానమన్నమాటచేత. ఏవియైన ఆశౌచాదులు మున్నగువానివలన తటస్థించునట్టి స్నానములను గ్రహింప దగునని తాత్పర్యము.

## 78 సూ. బహిస్సంధ్యత్వం చ.

[౧—౨—౧౬]

హారదత్తమితాక్షరా— బహిరితి. సాయంప్రాతర్ద్వే సంధ్యే యస్య గ్రామా ద్బహి ర్భవతః స బహిస్సంధ్యః తస్యభావః బహిస్సంధ్యత్వమ్. గ్రామా ద్బహి రేవ సంధ్యోపాసనం కర్తవ్యమితియావత్.

ఆంధ్రవివరణము:—సాయంసంధ్యయును ప్రాతస్సంధ్యయును అనునీరెండును ఎవ్వనికి గ్రామమునకు వెలుపల చేయవలసినట్టులు విధింపబడినవో వాడు బహిస్సంధ్యుడని భావము. బహిస్సంధ్యత్వము అనబడును. ఉపనీతుడగువానికి ఉదకోపస్పర్శనమువలెనే బహిస్సంధ్యత్వము కూడ విధింపబడుచున్నదని అనగా గ్రామమునకు వెలుపలనే ఈయన సంధ్యల నుపాసింపవలయునని తాత్పర్యము.

79 సూ. తిష్ఠేత్పూర్వా మాసీతోత్తరాం సజ్యోతిష్యాజ్యోతిషో దర్శనాద్వాగ్యతః. [౧-౨-౧౮]

హరదత్తమితాక్షరా— తత్కదా కథం చేత్యాహ— తిష్ఠేదితి. ప్రాతస్సంధ్యాం తిష్ఠేత్సాయంసంధ్యా మాసీత. అత్యంతసంయోగే ద్వితీయా. స్థానాసనయో రుపక్రమోపసంహారౌ కథయతి సజ్యోతిషి కాలే సమారభ్య అజ్యోతిరంతరదర్శనాత్. ప్రాత ర్నక్షత్రజ్యోతి రారభ్య ఆసూర్యజ్యోతిర్దర్శనాత్సాయ మాదిత్యజ్యోతి రారభ్య ఆనక్షత్రదర్శనాదితి. తావంతం కాలం వాగ్యతశ్చస్యాత్. తథాచ మనుః-శ్లో. పూర్వాం సంధ్యాంజపం స్తిష్ఠే త్సావిత్రీ మార్కదర్శనాత్. పశ్చిమాయాం సమాసీత సమ్యగృక్షవిభావనాత్-ఇతి.

ఆంధ్రవివరణము:—సంధ్య నుపాసింపవలయునని వెనుకటి సూత్రమునందు చెప్పినాడు. కాని ఆసంధ్యను ఏయే వేళల నెట్టిరీతుల నుపాసింపవలయు ?— అని ప్రశ్నము రాగా ప్రస్తుతసూత్రమున సమాధానమును చెప్పుచున్నాడు. ప్రాతస్సంధ్య యనియును సాయంసంధ్య యనియును చెప్పబడు నీసంధ్యలలో తొట్టతొలిదానిని- అనగా పూర్వసంధ్యను (అర్థాత్తు ప్రాతస్సంధ్య యనిభావము.) ఉపాసించునప్పుడు నిలుచుండవలయును. ఇట్లులనే ఉత్తరసంధ్యను అనగా సాయంసంధ్యను- ఉపాసించునప్పుడు కూరుచుండవలయును— అని సగము సూత్రమునకు అర్థము. మిగిలిన సగముసూత్రమునందును ఎప్పటినుండి ఎప్పటిదనుక నిలుచుండవలయునో కూర్చుండవలయునో వివరించుచున్నాడు. జ్యోతియనఁగా వెలుగు. వెలుగుతోకూడినట్టిది (కాలము) గనుక సజ్యోతి యనబడును. సజ్యోతియగు కాలమున ప్రారంభించి అజ్యోతి యంతరించుదనుక వాగ్యతుడై (వాఙ్నియమమునవలంబించి) సంధ్యనుపాసింపవలయునని తక్కినసూత్రమున కర్థము. అనగా ప్రాతస్సంధ్యను సజ్యోతియగు కాలమున (అనగా నక్షత్రములయొక్క వెలుగుమాసిపోవకమున్న) ఆరంభించి జ్యోతిర్దర్శనము అగువఱకును, (అనగా సూర్యునియొక్క వెలుగువచ్చుదనుక నున్నూ) సాయంసంధ్యను సూర్యజ్యోతియుండగనే ఆరంభించి నక్షత్రదర్శనమగువఱకునున్నూ ఉపాసింపవలయునని తాత్పర్యము. సంధ్యను ఉపాసించునంత సేపును వాఙ్నియమము కలవాడైకూడ నుండవలయునని యెఱుఁగునది. మనువుకూడ నిట్లులనే చెప్పినాడు— "పూర్వసంధ్యను సూర్యదర్శనమగు నంతదనుక గాయత్రి నుపాసించుచు నిలుచుండవలయు నని పశ్చిమసంధ్యను నక్షత్రరాశిచక్కగా తెలియవచ్చుదనుక గాయత్రి నుపాసింపవలయు నని" చెప్పెను. ఇయ్యది మనువు చెప్పిన శ్లోకమునకుఁ దాత్పర్యము.

80 సూ. నాదిత్య మీక్షేత. [౧-౨-౧౯]

హరదత్తమితాక్షరా:— నాదిత్యేతి. బ్రహ్మచారిణోయం సదాదిత్యదర్శనే ప్రతిషేధః స్నాతకస్యతు-మానవే యోక్తమేవ. యథా-శ్లో. నేక్షేతోద్యంత మాదిత్యం నాస్తం యాంతం కదాచన, నోపరక్తం నవారిస్థం నమధ్యం నభసోగతమ్ ఇతి.

ఆంధ్రవివరణము:బ్రహ్మచారియగువాడు సూర్యుని వీక్షింపగారాదు అని సూత్రార్థము, ఇయ్యది నిషేధపరమగు సూత్రము. ఈసూత్రమునందు చెప్పబడిన నిషేధము బ్రహ్మచారియగు వానికి సర్వదా ఆదిత్యదర్శనము పనికిరాదనియే చెప్పును. కాని స్నాతకునికి చెప్పఁబడినట్టి నిషేధమును మనువిట్టులు చెప్పినాడు- "ఉదయించుచున్న సూర్యునిగాని అస్తమించుచున్న సూర్యునిగాని ఉపరక్తుడైన (అనగా రాహువు కేతువు మున్నగువారిచేత గ్రహింపబడి గ్రహణమధ్యమునన్నట్టి) సూర్యుని గాని నీటియందు ప్రతిఫలించిన సూర్యునిగాని నభోమధ్యగతుడగునట్టి సూర్యునిగాని వీక్షింపగారాదు- అని తాత్పర్యము.

81 సూ. వర్జయే న్మధుమాంస గంధమాల్యా దివాస్వప్నాంజ నాభ్యంజన యానోపాన చ్ఛత్ర కామక్రోధ లోభ మోహ వాదవాదన స్నాన దంతధా వన హర్ష నృత్య గీతపరివాద మదభయాని. [౧—౨—౧౬]

హరదత్తమితాక్షరా:— వర్జయేదితి. మధ్వాదీని వర్జయేత్. మధుమాక్షికమ్ మాంసం మృగాదేః గంధశ్చందనాదిః మాల్యాని పుష్పాణి, దివాస్వప్నో దివానిద్రా. అంజన మక్ష్ణోః అభ్యంజనం తైలాభ్యంగః యానం శకటాది. ఉపానచ్ఛత్రే ప్రసిద్ధే. కామఃస్త్రీ సంగః క్రోధ.కోపః లోభోద్రవ్యాభిలాష: మోహోవివేకశూన్యతా వాదోబహుజల్పః వాదనంవీణాదీనాం స్నానంసుఖార్థ ముష్ణతోయాదినా కంఠా దధఃప్రక్షాళనమ్. దంతధావనం దంతమలాపకర్షణమ్, హర్షోభిమత లాభా చ్చిత్తోద్రేకః నృత్యగీతే ప్రసిద్ధే, పరివాదః పరదోషకథనమ్. భయంభయ హేతుః కాంతారప్రవేశాదిః మదం హర్షేపి ద్రష్టవ్యమ్.

ఆంధ్రవివరణము:—బ్రహ్మచారి యగువాడు మధుమాంసాదులగు నిరువదినాలుగు వస్తువులను వర్జింపవలయును అనిసూత్రార్థము 1. మధువు=అనగా (తెనెటీగలుకూర్చిన తెనె పట్టులనుండి తీయబడిన) తెనె. 2. మాంసము లు మృగములు (లేళ్లు మొ॥) మున్నగువానియొక్క మాంసము. 3. గంధములు చందనము అత్తరువు పన్నీరు మొదలగు సుగంధద్రవ్యము. 4. మాల్యములు=పూవులు మున్నగువానితో గట్టిన దండలు మొదలగునవి. 5. దివాస్వప్నము= పగటినిద్ర. 6. అంజనము = కన్నులకు పెట్టుకొనుటకైన కాటుక 7. అభ్యంజనము=తైలము మొదలగువానితో నైన తలంటుమున్నగునది. 8. యానము=గుఱ్ఱములు బండ్లు మున్నగు వానినెక్కి ప్రయాణముచేయుట ౧. ఉపానహము= కాళ్లకు తొడుగుకొనెడి చెప్పులు పాదుకలు మున్నగునవి. 10. ఛత్రము = గొడుగు 12. కామము=స్త్రీలతోడి దైన సాంగత్యము. 12. క్రోధము = కోపము 13. లోభము= ధనము మొదలగు వానియెడలగల పేరాస. 14. మోహము = యుక్తమిది అయుక్తమిది యను వివేకములేక మెలంగుట. 15 వాదము = వితండ వాదముచేయుట 16. వాదనము = వీణలు తంబురలు మున్నగు వానిని వాయించుట 17. స్నానము=సౌఖ్యమునకై వేడినీరు మున్నగుదానితో స్నానముచేయుటయును, శిరస్స్నానముచేయక కంఠస్నానము చేయుటయు మొదలగునవి. 18. దంతధావనము= పండ్లయందు చిక్కికొన్న పాచిమొదలగు మురికిని గీచివేయుట లేకతోముట మున్నగునవి. 19. హర్షము=ఇచ్ఛవచ్చిన వస్తువు లభించుటచేత గల్గెడి సంతోషము యొక్క ఉద్రేకము. 20. నృత్యము = నాట్యముచేయుట 21. గీతము = సంగీతములు తీయుట 22. పరివాదము=ఇతరులపై తప్పులను మోపుటయును, ఇతరుల తప్పులను వెలికిదీసి చెప్పుచుంటయును మున్నగునట్టివి 38 భయము = అడవులు మొదలగు భయంకరదేశములలో సంచరించుటవలన గలుగు భీతి. 24. మదము=సంతసము మితిమీరినప్పుడు కల్గునట్టి మత్తత. - ఈఇరువదినాల్గింటిని వర్జింపవలయు నని సూత్రమునకు తాత్పర్యము.

విశేషాంశములు:—మస్కరీయభాష్యమునందు ఈమధుమాంసాదుల భక్షణ నిషేధ విషయమై నియములుకొన్ని చెప్పబడినవి—(1) మధువు ఇది అబుద్ధిపూర్వకమైనచో దోషము లేదనియును, బుద్ధిపూర్వకముగా భక్షించుటకే ఈసూత్రనిషేధము వర్తించుననియును ఇందులకు అకామోపనతం మధువాజసనేయ కేనదుష్యతి—అని ప్రమాణముకలదనియు చెప్పబడినది. (2) మాంసము— రోగపీడితునకు ఔషధముకొఱకై గురూచ్ఛిష్టమగు మాంసమును భక్షించుట

క్కే నిషేధము వర్తింపదనియును, ఇందులకు— సచేద్వ్యాధీయీత కామంగురోరుచ్ఛిష్టం భైషజ్యార్థేసర్వం ప్రాశ్నీయాత్- అను సూత్రము ప్రమాణమనియు చెప్పబడినది. (3)గంధము— సుఖార్థము గ్రహించెడి గంధమునకే ఈ నిషేధముకాని దేవతానివేదనా వశిష్టమగుదానికి మాత్రము కాదు. ఇందులకు దేవతాశిష్టమేవగృహ్ణీయాద్బ్రహ్మచారీ- అనునది ప్రమాణము. (4) మాల్యము విషయమునగూడ నిట్టులనే యెఱుంగవలయును. 5. దివాస్వప్నము— ఆతురుడు (రోగపీడితుడు) కాని వానికిమాత్రమే ఈనిషేధము. 6. అంజనము— ఇచ్చట ఔషధార్థము ఈ నిషేధములేదు. కాని ఉపభోగార్థమైనచో కలదు. 8. అభ్యంజనము... సుగంధితైలముతో అభ్యంజనముచేసి కొనుటకు మాత్రమే ఈనిషేధము. 8. యానము—ఇదికూడ అనాతురుని విషయమునసేచెల్లును 9.-10. ఉపానచ్ఛత్రములు— సెవులి ఈ కలతో అల్లినగొడునకైన నీ నిషేధము వర్తింపదు.

## 82 సూ. గురుదర్శనేకంఠప్రావృతావసక్థికాపాశ్రయణ పాద ప్రసారణాని. [౧—౨—౨౦]

హారదత్తమితాక్షరా:—గుర్వితి. గురవః పితాచార్యాదయః తేషాం దర్శనయోగ్యే దేశే కంఠప్రావృతాదీని వర్జయేత్. కంఠప్రావృతం కంఠప్రావరణం వస్త్రాదినా.అవసక్థికా గురౌ పాద మారోప్య అవస్థాపనమ్ అపాశ్రయణం కుడ్యస్తంభాద్యాశ్రిత్యాసనమ్ పాద ప్రసారణం ప్రసిద్ధమ్ గురుజనసకాశే వినయ సంకోచేన సంస్థాన మిత్యర్థః.

ఆంధ్రవివరణము:— తనను గనిన తండ్రి తల్లి శ్రౌతలు చదువుచెప్పించినవారు మున్నగు పెద్దలందఱును గురువులని పేర్కొనబడుచుందురు. గురుదర్శనమునందు - అనగా గురువులు మున్నగువారి సందర్శనము చేయునట్టి చోటుల కంఠప్రావృతమును అవసక్థికను అపాశ్రయణమును పాదప్రసారణమును వర్జింపవలయునని సూత్రార్థము. ఇందుకంఠప్రావృతమనగా - ఏదైనను వస్త్రము మొదలగు వానితో కంఠము మొదలగు నవయములను కప్పుకొని యుండుట. అవసక్థికయనగా గురువునైపు కాళ్లను జాచి కూర్చుండుట. అపాశ్రయణ మనగా గోడతో లేక స్తంభమునతో లేకమఱి ఏదియైనదిండు మొదలగువానితో చేరగిలబడి కూర్చుండుట. పాదప్రసారణ మనగా గురువులయెదుట కాళ్లను పొడుగుచాచుకొని కూర్చుండుట. ఈపైనిచెప్పిన కంఠప్రావృతాదులను వర్జింపవలయు నని తాత్పర్యము.అనగా గురుజనముల యెదుట వినయగ్రహణముతో మెలగవలయు నని యర్థము.

## ౮౩ సూ. నిష్ఠీవిత హసిత విజృంభితావస్ఫోటనాని [౧-౨-౨౦]

హారదత్తమితాక్షరా:— నిష్ఠీవితేతి. వర్జయేదిత్యర్థః. నిష్ఠీవితం కంఠాచ్ఛ్లేష్మణః సశబ్దం బహిర్నిరసనమ్. హసితంహాసః విజృంభితం జృంభికా. అవస్ఫోటనం అంగుళీనాం సశబ్దముపమర్దనం.

ఆంధ్రవివరణము:— బ్రహ్మచారి గురువులయెదుట నిష్ఠీవితము మొదలగు నాల్గింటిని సైతము వర్జింపవలయును.. (అనగా నియ్యది బ్రహ్మచారికి పనికి రావు.) -అని సూత్రమున కర్థము. నిష్ఠీవితమనగా (దగ్గినట్లు గొంతును సకిలించి) తెమడవచ్చునట్లుగా ధ్వనిచేయుచు -అనగా కేకరించుచు- ఉమ్మివేయుట యనియర్థము. [వినువారికి ఏవగింపు కల్గునట్టులుగా దగ్గుట కేకరించుట సకిలించుట ఉమ్మివేయుట మున్నగునవి యన్నియును నిష్ఠీవిత శబ్దముచేత నిచ్చట సూచింపబడుచున్నవి. కావున వీనిని పరిత్యజింపవలయునని భావము.] హసితము అనగా - నవ్వుట. విజృంభితమనగా ఆవులించుటయును ఒడలు విరుచుకొనుటయును మున్నగునవి యని యర్థము. అవస్ఫోటనమనగా- వ్రేళ్లతో చిటికెలు వేయుటయు పుష్పకములు పిఱిదిభాగములు మున్నగు

వానిపై దరువులు తాళములు మున్నగువానిని వేయుటయు నని యెఱుంగవలయును.

84 సూ. స్త్రీప్రేక్షణాలంభనే మైథునశంకాయామ్. [౧-౨-౨౨]

హరదత్త మితాక్షరా:—స్త్రీప్రేక్షణేతి. స్త్రీణాం ప్రేక్షణం అవయవశో నిరూపణమ్. న యాదృచ్ఛికం దర్శనం ఆలంభనం కామిత భావేన సంస్పర్శనం న యాదృచ్ఛికస్పర్శనం తదేత దుభయమపి వర్జయేత్. మైథునశంకాయా మితి వచనా ద్బాలవృద్ధాతురాసు స్వయంచ తథావిధస్య న దోష ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:— ప్రేక్షణమనగా సాధారణముగా చూచుట. ఇట్టులే ఆలంభనమనగా స్పృశించుట. అనగా తాకుట. స్త్రీలయొక్క ప్రేక్షణాలంభనములు స్త్రీప్రేక్షణాలంభనము లనబడును. స్త్రీ ప్రేక్షణాలంభనములన్న మాటలచేత నిచ్చట వరుసగా స్త్రీలను ప్రతి అవయవమును తేరిపారజూచుట, కామిత భావముతో స్పృశించుట,అను నర్థములు గ్రహింపబడవలయునేగాని యాదృచ్ఛికముగా చూచుటగాని యాదృచ్ఛికముగా తాకుటగాని గ్రహింపబడగా రాదు. మిథున మనగా దంపతులు లేక జంటలు. మిథునము యొక్క ధర్మము మైథునము. అనగా దాంపత్యము. మైథునశంక కల్గునప్పుడు- (అనగా మిథునభావము శంకితమగునప్పుడు.) స్త్రీల యొక్క ప్రేక్షణమున్ను స్త్రీల యొక్క ఆలంభనమున్ను పరిత్యజింపవలయునని సూత్రార్థము. ఈసూత్రమునందు మైథున శంకకల్గినప్పుడు"- అనిచెప్పుటవలన బాలురు వృద్ధులు ఆతురులు మున్నగు వారి యెడల అట్టులుండుటయును దోషము కాదని అర్థమగుచున్నది.

85 సూ. ద్యూతం హీనసేవాం అదత్తాదానం హింసాం. [౧-౨-౨౩]

హరదత్తమితాక్షరా:—ద్యూతమితి. ద్యూతాదీని వర్జయే దిత్యన్వయః. ద్యూతం ద్వివిధం ప్రాణిద్యూతభేదాత్. ప్రాణిద్యూతం మేషయుద్ధాది. అప్రాణిద్యూతః అక్షక్రీడాది. హీనసేవాం హీనస్య సేవా మన్గోజాతిప్రభృతేః. హీనాచారా సేవాచ శౌచాదిజలాహరణ మితి కేచిత్. అదత్తాదానం కేనాప్యదత్త స్యోత్సృష్ట స్యాప్యస్వామిక స్యాదానమ్. హింసా ప్రాణినాం పీడా.

ఆంధ్రవివరణము:— ద్యూతము హీనసేవ అదత్తాదానము హింస- అను నీ నాల్గింటినికూడ వర్జింపవలయునని సూత్రార్థము. ద్యూతము అనగా జూదము. (పందెము అని తెలుగు నుడుం.) జూదము సాధారణముగా ప్రాణిద్యూతమనియును అప్రాణిద్యూతమనియును రెండువిధముల నుండును. ప్రాణముగల జంతువులను కూర్చి వానితో నాడెడి జూదము ప్రాణిద్యూతము. మేషయుద్ధము (పొట్టేళ్లపందెములు) కుక్కుటద్యూతము (కోడిపందెములు) మున్నగునవి ఈప్రాణిద్యూతమునందు చేరును. పాచికలు మున్నగువానితో ఆడెడి అక్షక్రీడ మొదలగునవి అప్రాణిద్యూతములలో చేరును. జాత్యాదికుల వారు గా నుండెడి వారు హీనులు. అనగా అధోజాతులు. ఈహీనులను సేవించుట హీనసేవయనబడుచున్నది- బ్రహ్మచారి పైనిచెప్పినట్టి జూదమును హీనసేవను వర్జింపవలయును. కొందఱిచ్చట హీనమైనట్టిసేవ హీనసేవయనియును శౌచార్థమై వెంట నీళ్లనుతీసికొనిపోయి అందిచ్చుట మున్నగునవి యన్నియును ఇదు చేరుననియును అందురు. దత్తమనగా వాఙ్మనఃక్రియలచేత తనకు ఇతరులు ఇచ్చినట్టి వస్తువు. అదత్తమనగా తద్భిన్నము. అనగా ఎవ్వరిచేతను ఏవిధముననుగూడ నీయబడనట్టిది. అదత్తమగు వస్తువును తెచ్చుకొనుట అదత్తాదానము అని యనబడును. అనగా ఎవ్వరిచేతను ఏవిధముననుగూడ నీయబడనట్టి వస్తువును- అస్వామికమైనట్టిదైనను సరియే-తీసికొనగారాదని భావము. హింసయనగా ప్రాణులకు కలుగచేయునట్టిబాధ. ఇయ్యది త్రివిధము -కాయికము వాచికము మానసికము అని. బ

హ్మచారి ఈపైని పేర్కొన్నవానినన్నిటిని వర్జింపవలయు నని తాత్పర్యము.

౮౬ సూ. ఆచార్యతత్పుత్రస్త్రీదీక్షితనామాని. [౧—౨—౨౪]

హరదత్త మితాక్షరా:—ఆచార్యేతి. ఆచార్యస్య తత్పుత్రస్య తత్స్త్రియా దీక్షితస్య నామాని వర్జయేత్. పరోక్షేపి(1) ఔపాధికనామగ్రహణం కర్తవ్య మితి భావః.

(పాఠాంతరములు— (1) ఔపచారిక నామగ్రహణం)

ఆంధ్రవివరణము.— పైసూత్రములనుండి ఇచ్చటికి గూడవర్జయేత్తన్నమాట అనువర్తించుచున్నది. ఆచార్యుల నగాఅధ్యయనము చేయించినవారు. తనకు అధ్యయనము చేయించిన ఆచార్యునియొక్కయును, వారి కుమారులయొక్కయును, ఆచార్యుల భార్యయొక్కయును, దీక్షితులయొక్కయును పేరులను (గ్రహించుటను) వర్జింపవలయును. అనగా తనయొక్క ఆచార్యులనుగాని వారి పుత్రదారాదులనుగాని యజ్ఞయాగాదులనుచేసి దీక్షితులైయున్న పెద్దలనుగాని పేరుతో పిల్వగా రాదని తాత్పర్యము. ఇట్టులు పిల్వకూడనిది ఆచార్యాదుల యెదట తానున్నప్పుడు మాత్రమే గాక పరోక్షమునందుకూడ వారిని పేరుబెట్టి నిర్దేశింపగా రాదనియు నెఱుంగవలయును. అట్లైనచో మఱి ఆయాచార్యాదులను గుఱించి వ్యవహరించుటయెట్లందురేని ఔపాధికములగునట్టి పేర్లతోగాని ఔపచారికములగునట్టి పేర్లతో గాని వ్యవహరించుచుండవలయునని తెలియ వలయును. ఉపాధి యనగా బిరుదము. ఉపాధి వలన వచ్చినట్టి పేరు ఔపాధికము. ఉదాహరణమునకై— ఉపాధ్యాయులవారు, శైనులవారు, భట్టాచార్యులువారు మహామహోపాధ్యాయులు వారు—అనుమున్నగురీతులనని ఎఱుంగవలయును. ఉపచార మనంగా పెద్దల యెడలఁ జూపునట్టి మర్యాద. లేక గౌరవము. ఉపచారమువలన వచ్చినట్టిపేరు ఔపచారికము అనఁబడును. గురువులవారు నాన్నగారు అమ్మగారు బాబుగారు మున్నగువాక్యములు నిందులకు ఉదాహరణములనుగా నెఱుంగవలయును.

87 సూ. శుక్లా వాచో మద్యం నిత్యం బ్రాహ్మణః. [౧—౨—౨౫]

హరదత్త మితాక్షరా:—శుక్లేతి. బ్రాహ్మణః శుక్లా అశ్లీలాః పరోద్వేగకారిణ్యః మద్యం మదకరం ద్రవ్యం తాశ్చ తచ్చ నిత్యం వర్జయేత్. నిత్యం బ్రాహ్మణఇతి వచనాత్ క్షత్రియవైశ్యయో ర్గృహస్థయోః పైష్టీవ్యతిరిక్త మద్యోపయోగే న ప్రత్యవాయ ఇతి.

ఆంధ్రవివరణము.—బ్రాహ్మణుఁడు శుక్లములగు వాక్యములనున్న [అనగా సంభాషించునప్పుడు ఇతరుల మనస్సునకు ఉద్వేగమును కల్గించునట్టివి యగు మాటలనున్నా] మత్తును కల్గించునట్టి పదార్థముల (సేవించుట) నున్నా సర్వదా వర్జింపవలయును అని సూత్రమునకు తాత్పర్యము. ఇచ్చట మూలసూత్రమునందు బ్రాహ్మణుఁడు మద్యాదులను వర్జింపవలయు నని చెప్పుటచేత బ్రాహ్మణభిన్నులగు క్షత్రియ వైశ్యులకు పిష్టసంబంధమగు మద్యముతప్ప తక్కిన విధమగునట్టి మద్యమును సేవించుటవలన ఏవిధమగు ప్రత్యవాయము ఉండజాలదనియును వ్యాఖ్యాతయగు హరదత్తుడు విశేషార్థమును వ్రాసియున్నాడు. ఇది మిగుల చింత్యము.

88 సూ. అధశ్శయ్యాసనీ పూర్వోత్థాయీ జఘన్యసంవేశీ [౧—౨—౨౬]

హరదత్త మితాక్షరా:—అధశ్శయ్యేతి. అస్యార్థో మానవే స్పష్టః, శ్లో. నీచం శయ్యాసనం చాస్య నిత్యం స్యాద్గురుసన్నిధౌ, ఉత్తిష్ఠే త్ప్రథమం చాస్య చరమం చైవ సంవిశేత్, ఇతి.

ఆంధ్రవివరణము.—శయ్యఅనగా ప్రక్క (అనఁగాపరుండెడిబల్ల మొదలగునవి) ఆసనమనగా కూర్చుండునట్టి పీఠము మొదలగునది. బ్రహ్మచారి తనయొక్క గురువుల

ర్యాం దీక్షితంగురుం, పితరంచ పితృవ్యంచమాతరం మాతు లంతథా హితైషిణంతు విద్వాంసంశ్వశురం పతిమేవచ, న బ్రూయాన్నామతో విద్వాన్మాతుశ్చభగినీంతథా, యది బ్రూయద్ధరింభ్యాత్వానమస్కృత్వావదేదథ.— అని.

## 91 సూ. అర్చితే శ్రేయసి చైవం [౧—౨—౨౯]

హరదత్త మితాక్షరా:—అర్చితఇతి అర్చితః లోకే పూజితః. శ్రేయాన్విద్యాదిభి రధికః తయో రప్యేవమేవ సమ్యగానతఇతి. అత్ర స్మృత్యంతరమ్. శ్లో. ఆచార్యం చైవ తత్పుత్రం తద్భార్యాం దీక్షితం గురుం, పితరం వా పితృవ్యంచ మాతరం మాతులం తథా, హితైషిణంచ విద్వాంసం శ్వశురం పతి మేవచ, న బ్రూయాన్నామతో విద్వాన్మాతుశ్చ భగినీం తథా. ఇతి అర్చితే శ్రేయసిచేత్యేవం శబ్దో యచ్చ యావచ్చ గురావుక్తం తత్సర్వ మతిదిశతి. తేన శయ్యాసనాదికమపి తయో స్సన్నిధౌ నీచం భవతీతి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—అర్చనమనఁగా పూజ.(అనఁగానేకవిధమగు మర్యాద)అర్చన చేయబడినట్టివాడు అర్చితుడనఁబడును. అనగా లోకమునకు మహోత్కృష్టములగు కార్యముల నాచరించుటద్వారా సేవల సల్పి వారిచేత (అనగా లోకముచేత) గొప్పవాడని పూజింపబడినట్టి వాడని భావము. విద్యమొదలగు వానిచేత నధికుడని పొగడ్తనుగన్నవాడు శ్రేయాంసు డని యనబడును. అర్చితుని విషయమునను శ్రేయాంసుని విషయమునను కూడ (ఈ వెనుకటివారియందు చెప్పినరీతిగనే) ఈవిధముగనే మాణవకుడు వర్తింపవలయునని సూత్రార్థము. ఈవిధముగా ననఁగా వెనుకటి సూత్రమునందు గురువులయెడ నేయేవిధముగా మెలంగవలయునని చెప్పబడెనో ఆవిధముగా వర్తింపదగునని భావము. ఈవిషయమునందు ఇతరములగు స్మృతులుకూడ నిట్టులనే చెప్పుచున్నయవి— ఏమనఁగా— తనకు అధ్యయనమును చెప్పినట్టి ఆచార్యునిన్ని -ఆయన కుమారునిన్ని ఆయన భార్యనున్నూ దీక్షితునిన్ని గురువునున్నూ తండ్రిని పినతండ్రినిన్ని మేనమామనున్నూ కన్నతల్లినిన్ని తనయొక్క హితమును ఆకాంక్షించెడివానినిన్ని విద్వాంసునిన్ని పిల్లనిచ్చినట్టి మామగారిని తనను పోషించునట్టి ప్రభువునున్నూ తన తల్లియొక్క తోఁబుట్టువులనున్నూ విద్వాంసుడగువాడు పేరు పెట్టి పిల్వగారాదు అని. ఇచ్చట మూలసూత్రమునందు అర్చితుని విషయమునందును శ్రేయాంసుని విషయమునందునుకూడ ఈవిధముగనే— అని చెప్పుటచేత గురువు విషయమున నెయ్యదెయ్యది ఎంతెంతదనుక చేయవలసినట్టులుగా విధింపబడినదో అయ్యది అంతయును వీరివిషయమునందుకూడ నాచరింపవలయునని అతిదేశము చేయఁబడుచున్నది. కాబట్టి దీనివలన వారిసన్నిధినున్నప్పుడు శయ్యాసనాదికముగూడ తగ్గుగనే యుండవలయునని ఏర్పడుచున్నది.

## 92 సూ. శయ్యాసనస్థానాని విహాయ ప్రతిశ్రవణమ్. [౧—౨—౩౦]

హరదత్త మితాక్షరా:—శయ్యేతి. గురా వాజ్ఞాపయతి సతి ప్రతిశ్రవణం ప్రతివచనం కుర్వన్ శయ్యాసనస్థానాని విహాయ అభిగచ్ఛన్కుర్యాత్.

ఆంధ్రవివరణము:—ప్రతిశ్రవణమనగా ప్రతివచనము. అనగా ఒకరడిగినమాటకు జెప్పెడునట్టి బదులుజవాబు అనిఅర్థము. గురువులయెదుట తాను (అనగా శిష్యుడు) ప్రతివచనమును చెప్పవలసి వచ్చినప్పుడు- అది వఱకు తానుకూర్చుండునట్టి లేక పరుండినట్టి శయ్యను ఆసనమును వదలి- ప్రతివచనమును చేయవలయునని సూత్రార్థము. (ఇది యొకపక్షముది.) గురువు తనకు ఏదైనను కార్యమును చేయవలసినట్టులుగా ఆజ్ఞనొసంగినప్పుడు- వెంటనే "అయ్యా! ఆజ్ఞేయని బదులుచెప్పుచు" తానదివఱకున్నట్టి శయ్యాసనస్థానములను వదలి వెళ్ళి ఆయన ఆజ్ఞాపించినపనిని చేయవల

యనని మఱియొకవిధమగు సూత్రార్థము. (ఇది హరదత్తుని మతానుసారమైనది.) ఈరెండునుగూడ నుత్తమములు నను కార్యము లగునట్లివే యగును.

## 93 సూ. అభిక్రమణం వచనా దదృష్టేన. [౧—౨—౩౧]

హరదత్త మితాక్షరా:—అభిక్రమణమితి. యది బహిస్స్థితో గురు రహస్యస్థ్నేవ శిష్యం బ్రవీతి తదా శిష్యేణ అభిక్రమణ ముప సర్పణం కర్తవ్యం నపున రదృష్టోస్మీ త్యనాదరః కర్తవ్యః.

ఆంధ్రవివరణము:—అదృష్టుడు అనగా చూడబడని వాడు. శిష్యుడు తాను గృహమునందున్నప్పుడు గురువులు వెలుపలికి వెళ్లి వచ్చి వెలుపల నుండియే లోనున్న శిష్యుని గాంచకయే ఆజ్ఞాపించుచేని, అప్పుడు శిష్యుడు 'తనను గురువులు చూడలేదుగదా' యని నిర్లక్ష్యముచేసి యూరకొనక వెంటనే గురువులయెదుటికి ఉపసర్పణము నొనర్ప వలయునని సూత్రమునకు తాత్పర్యము.

## 94 సూ. అధస్స్థానాసన స్తిర్యగ్వాతసేవాయాం గురుదర్శనే చోత్తిష్ఠేత్. [౧—౨—౩౨]

హరదత్తమితాక్షరా:—అధస్థానాసనేతి. యదా గురు ర్దీప్తైస్థాన మాసనం చాధితిష్ఠతి స్వయ ముచ్చైస్స్థానాసనస్థః తదా గురుం దృష్ట్వా ఉత్తిష్ఠేత్. తిర్యగ్వాతసేవాయాం మూత్రపురీషోత్సర్గాదౌ చ గురుం దృష్ట్వా ఉత్తిష్ఠేత్. చకారః పూర్వాపేక్షయా సముచ్చయార్థః.

ఆంధ్రవివరణము:—అధస్స్థానమనగా ఎత్తు తక్కువగా నున్నచోటు. ఆసనము అనగా కూర్చుండునట్టి పీఠము మొదలగునవి. గురువులు అధస్స్థానస్థితులై యున్నప్పుడుగాని (అనగా తానున్నచోటుకంటె యెత్తు తక్కువదైయున్నట్టి- అధస్థానమని తనకంటె క్రిందైన-చోటునం గూరుచున్నప్పుడు గాని) లేక తాను వసించిన పీఠముకంటె తక్కువదియగు పీఠమునం గూరుచుండి యున్నప్పుడుగాని తిర్యగ్వాత సేవనమునగాని తాను గురువును చూచినవెంటనే లేచి నిలువబడవలయునని తాత్పర్యము.

విశేషాంశములు— ఇచ్చట సూత్రమునందున్న గురుదర్శనేచ అనుదానిని నానావిధములుగా సామర్థ్యమునుబట్టి "అధస్స్థానాసనస్థ గురుదర్శనము అయినప్పుడు కేవలము ఒక్కలేచి నిలువబడుట మాత్రమే గాక, తన మొగమును అవలకు త్రిప్పుకొనవలయును గూడ"—అని విశేషార్థము మస్కరీయభాష్యమునందున్నది. ఇందులకు ప్రమాణముగా ఈ శ్లోకము ఉదాహరింపబడినది. శ్లో. నీచ స్థిత-గురుందృష్ట్వా తతోన్యస్థితస్తథైవచ. తిష్ఠేదన్యముఖో భూత్వా శిష్యోనాన స్తస్థైవచ—అనగా గురువులను గావమునకై దిగుడుబావిలో దిగియున్నప్పుడును చెరువులో నిలచి యున్నప్పుడును శిష్యుడు గురువులకు అభిముఖుడై యుండక అన్యముఖుడుగా నుండవలయుననియును ఇది కేవలమొక్క శిష్యునకేగాక దానునికిగూడ నాచరింప దగినదనియును తాత్పర్యము. మఱికొందఱు వ్యాఖ్యాతలు ఈయర్థము సంగీకరింపక చకారమునకు అపనయనమర్థమని. అనగా అధస్స్థానాసన తిర్యగ్వాత సేవలందు నిలువబడి క్రమముగా నటునుండి తప్పికొని నిల్చవలయునని తాత్పర్యమును వర్ణించిరి.

## 95 సూ. గచ్ఛంత మనువ్రజేత్. [౧—౨—౩౩]

హరదత్తమితాక్షరా:—గచ్ఛంతమితి. గచ్ఛంతం గురుం శిష్యః అనువ్రజే దనుగచ్ఛే దిత్యర్థః.

ఆంధ్రవివరణము:—గురువులు నడచి పోవుచున్న యెడల శిష్యుడతనిని అనుసరించి వెళ్లవలయునని భావము.

విశేషాంశములు—74వ సూత్రమునుండి ఈసూత్రము నకును చకారము అనువృత్తివచ్చునని యును దాన వెళ్లుచున్నప్పుడుఅనుప్రజనముచేయుట మాత్రమే గాక,కూర్చునియున్నప్పుడు లేచినిలువబడుటయును పరుండియున్నప్పుడు తాను కూర్చుండుటయునుగూడ చేయదగునని అర్థమేర్పడునని యును భిక్షువు వ్రాసినాడు.

96 సూ. కర్మ విజ్ఞాప్యాఖ్యాయ [౧—౨—౩౪]

హరదత్తమితాక్షరా:— కర్మేతి. యత్కించి దస్య శిష్యస్య కర్తవ్యం తస్య నిష్కృతి రిదం కరిష్యామీత్యాచార్యాయ విజ్ఞాప్య యచ్చాచార్యోపయుక్త ముదకుంభాహరణాది తత్స్వయమేవ జ్ఞాత్వా కృత్వాచ తస్మై కృత మిత్యాఖ్యాయ వర్తితవ్య మిత్యర్థః

ఆంధ్రవివరణము:—గురుకులమునందు వసించునట్టి కాలమునందు శిష్యుడు— తనకు గురువులు ఈపనిని చేయుమని దేనిని ఆజ్ఞాపించెదరో శిష్యుడాపనిని అట్లే చేసెదనని చెప్పి చేసినపిమ్మట చేసితిననికూడ ఎఱింగింపవలయును. ఈసూత్రమునకు మఱికొందఱు— గురువులవిషయమున శిష్యుడు తానొనర్పవలసినట్టిపని నెఱింగి ఈపనిని చేసెదనని వారి కెఱింగించియును తానాపనిని స్వయముగా గుర్తించి చేసియును చేసినట్టులుగా గురువులకు నివేదింపవలయునని యర్థ- మనిరి.

97 సూ. ఆహూతోఽధ్యాయీ. [౧—౨—౩౫]

హరదత్తమితాక్షరా:...ఆహూతఇతి. గురుణాహూత స్సన్నధీయీత. నతు స్వయంచోదయేదితి.

ఆంధ్రవివరణము:—గురువులు తనను (శిష్యుని) పిలచి చదువుటకు ఆజ్ఞయిచ్చినవెంటనే తాను చదువుట కుపక్రమింపవలయునేగాని తనంతతాను గురువులను ప్రేరేపించి చదువగారాదు అనిసూత్రార్థము.

98 సూ. యుక్తః ప్రియహితయోః [౧—౨—౩౬]

హరదత్తమితాక్షరా:—యుక్తఇతి. ఆచార్యస్య యత్ప్రియం హితంచ తత్ర యుక్త స్తత్పర స్స్యాత్ ప్రియం తత్కాలప్రీతికరమ్ హితం కాలాన్తరే తత్కరమ్ ప్రియంకర మిత్యర్థః.

ఆంధ్రవివరణము:—ప్రియము హితము అనుమాటలు సాధారణముగా పర్యాయములు. కాని ఈరెండిటికిని అర్థమునందు కొంతభేదము గలదు. ప్రియమనగా తాత్కాలికముగా ప్రీతిని కల్గింపజేయునది. అప్పటికిప్పుడుగాక కాలాంతరమునకు ప్రీతిని కల్గించునట్టిది హితమనబడును. ఆచార్యులకు ఎయ్యెది ప్రియమనియును హితమనియును తనకుతోచునో అద్దానిని సాధించి యొసగుటయందు శిష్యుడు సర్వదా యుక్తుడై- అనగా తత్పరుడై- యుండవలయునని సూత్రార్థము.

99 సూ. తద్భార్యాపుత్రేషుచైవమ్. [౧—౨—౩౭]

హరదత్తమితాక్షరా:—తద్భార్యేతి. తస్యఆచార్యస్య భార్యా పుత్రాశ్చ తేషు చైవ మాచార్యవ ద్వర్తితవ్యమ్.

ఆంధ్రవివరణము:— ఆయాచార్యునియొక్క భార్యా పుత్రుల విషయమున గూడ నిట్టిధమునందే- అనగా ఆచార్యులయెడ వర్తించినవిధముననే- వర్తింపవలయునని సూత్రార్థము.

100 సూ. నోచ్ఛిష్టాశనస్నాపనప్రసాధన పాదప్రక్షాళనోన్మ

ర్ధనోపసంగ్రహణాని. [౧-౨-౩౮]

హరదత్తమితాక్షరా:—నోచ్ఛిష్టేతి. ఉచ్ఛిష్టాశనం భుక్తావశిష్టాన్నం, స్నాపనం స్నానీయాదిభిశ్శిరోంగ మర్దన పూర్వకమభిషేకః. ప్రసాధన మలంకరణమ్. పాదప్రక్షాళనం ప్రసిద్ధమ్. ఉన్మర్దనం అభ్యంగ శరీర సంవాహనాది. ఉపసంగ్రహణం వ్యత్యస్త పాణినేత్యాది పూర్వోక్తమ్. ఏతాని గురోర్భార్యాపుత్రాదిషుచ న కర్తవ్యాని. అతఏవాచార్యే కర్తవ్యానీతి సిద్ధ మిత్యాహుః.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు ఆచార్యుల భార్యా పుత్రుల విషయములలోగూడ నాచార్యుల యందువలెనే మెలగవలయునని చెప్పబడినది కదా! ఇట్లైనచో అన్ని విషయములలోగూడ నాచార్యులయందు వలెనే వర్తింపవలయునా ?- అన్న ఆశంక రాగా వారించుచు నీసూత్రమును చెప్పుచున్నాడు.

ఉచ్ఛిష్టాశనము స్నాపనము ప్రసాదనము పాదప్రక్షాళనము ఉన్మర్దనము ఉపసంగ్రహము అనునట్టి ఈ కార్యములను మాత్రము వారియెడల (అనగా ఆచార్యుల భార్యాపుత్రుల యెడల) తాను -(శిష్యుడు) ఆచరింపగా రాదని సూత్రార్థము. ఉచ్ఛిష్టమనగా భుజింపగా మిగిలిన ఎంగిలి యన్నము. స్నాపనమనగా స్నానయోగ్యములగు తైలచూర్ణములను శరీరము మున్నగునవయవములకు మర్దించి నలుగిడి స్నానముచేయించుట. ప్రసాధనమనగా అలంకరించుట. పాదప్రక్షాళనము సుప్రసిద్ధమే కదా ? ఉన్మర్దన మనగా తలంటు మున్నగువానియందు చేసికొనెడి శరీరసంవాహనాదికము. ఉపసంగ్రహమును ఇదివరలో 53 వ సూత్రమునందు చెప్పియే యున్నాము. ఆచార్యుల దారాపుత్రాదుల యందు ఉచ్ఛిష్టాశనాదులు కూడవని నిషేధించు ఈసూత్రమువలననే గురువులవిషయమున నివి కూడునని సిద్ధమగుచున్న దని కొందఱందురు.

101 సూ. విప్రోష్య ఉపసంగ్రహణం గురుభార్యాణాం. [౧-౨-౩౯]

హరదత్తమితాక్షరా:—అథోప సంగ్రహణస్య ప్రతిప్రసవః - విప్రోష్యేతి. విప్రోష్య ప్రవాసం గత్వా ప్రత్యాగతేన గురుభార్యాణాముపసంగ్రహణం కార్యమ్.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు చెప్పబడిన నిషేధమునకు -[అనగా ఆచార్యుల భార్యాదుల యెడల నుపసంగ్రహణాదుల నాచరింపరాదనునట్టి నిషేధమునకు] ఈసూత్రమునందు ప్రతిప్రసవమును చెప్పుచున్నాడు. ప్రతిప్రసవమనగా మున్ముందు చేసినట్టినిషేధమును బాధించి మఱల విధినిచెప్పెడునట్టి సూత్రమని యర్థము.

గురువులయొక్క భార్యల విషయమునను గూడ ఉపసంగ్రహణము నొనర్పదగును కాని ఆఉపసంగ్రహణమెప్పుడనగా - శిష్యుడు తాను ప్రవాసమునకేగి చిరకాలమునకు మరలివచ్చినప్పుడు మాత్రమే. అనగా తాను ప్రవాసము నుండి వచ్చినవెంటనే గురుభార్యలకుగూడ శిష్యుడుపాదోపసంగ్రహణము నొనర్పదగు నని సూత్రార్థము.

102 సూ. నైకేయువతీనాం వ్యవహారప్రాప్తేన. [౧-౨-౪౦]

హరదత్తమితాక్షరా:—నేతి. ఏకేత్వాచార్యాః యువతీనాం గురుభార్యాణాం వ్యవహారప్రాప్తేన షోడశవర్షప్రాయేణ శిష్యేణ విప్రోష్యాప్యుపసంగ్రహణంనకార్య మితిమన్యతే.

ఆంధ్రవివరణము:— మఱికొందఱు ఆచార్యులు (అనగా ధర్మశాస్త్రములను ప్రవచించి[illegible] నని భావము.) గురుభార్యలలోగూడ య[illegible] యమునందు వ్యవహారప్రా[illegible]యందునట్టి శిష్యుని



ఉపసంగ్రహణము -ప్రవాసమునకు వెళ్లివచ్చినప్పుడుకూడ చేయబడరాదని చెప్పిరని సూత్రమునకు తాత్పర్యము.

## 103 సూ. సార్వవర్ణిక భైక్ష్యచరణ మభిశస్త పతితవర్జమ్. [౧-౨-౪౧]

హరదత్త మితాక్షరా :— అగ్నీంధనభైక్షచరణ ఇత్యుక్తమ్. తత్రాగ్నీంధనం ప్రతిగృహ్యం వ్యవస్థితత్వాత్, సాధారణ భైక్ష్యచరణే విధిమాహ—సార్వవర్ణి కేతి. సర్వేషు వర్ణేషుభవం సార్వవర్ణికమ్ అభిశస్తాన్పతితాంశ్చ వర్జయిత్వా సర్వేషు వర్ణేషు భైక్ష్యం చరితవ్యమ్. అభిశస్తా ఉపపాతకినః.

ఆంధ్రవివరణము:— ఇదివరకు 74వ సూత్రమునందు బ్రహ్మచారి అగ్నీంధనభైక్షచరణముల నాచరింపవలయునని చెప్పబడియున్నది. ఆసూత్రమునందు విధింపబడిన వానిలో అగ్నీంధనము ప్రతిగృహ్యముగ వ్యవస్థితమై యుండుటవలన ప్రస్తుతమిచ్చట రెండవది-భైక్ష్య చరణమునందు ఆచరింపవలసినట్టి సాధారణమగునట్టి విధానమును చెప్పుచున్నాడు. అనగా భిక్షాచరణమును గూర్చిన విశేషముల తెల్పుచున్నాడని భావము.

సర్వవర్ణములయందును -అనగా ఈవర్ణమువారు ఆవర్ణమువారు అను వివక్షతలేకుండ నన్నివర్ణములవారియందును కాదగినట్టి భిక్షాచరణము సార్వవర్ణికమని యనబడును. అభిశస్తులనగా ఉపపాతకములను ఆచరించినట్టివారు. పతితులనగా ధర్మచ్యుతిని పొందినట్టివారు. అభిశస్త పతితవర్జముగా -(అనగా అభిశస్తులు అయినట్టి పతితులయినట్టివారిని వదలిపెట్టి తక్కినవారిలో) సార్వవర్ణికమగునట్టి - అనగా అన్నివర్ణములవారియందైనయట్టి-భైక్ష్యచరణము బ్రహ్మచారులకు ఆచరింపదగినదని సూత్రార్థము.

విశేషాంశములు—ఈసూత్రమునందు బ్రహ్మచారి సార్వవర్ణికముగా భిక్షాచరణమును చేయవలయునని అర్థము చెప్పబడినది- కాని ఇయ్యది శిష్టాచారములో నంతగాగాన రాదు. పైగా మనువుయున్నగువారు—శ్లో. శూద్రాన్నరసపుష్టాంగో యోధీయానోపి నిత్యశః, జుహ్వన్నపి జపన్వాపి గతిమూర్ధ్వాంనవిందతి- అని నిషేధమును చెప్పినారు. అనగా బ్రాహ్మణుడు తాను ఎంతగా వేదము నధ్యయనము చేయుచున్నను సర్వదా అగ్నులను వ్రేల్చుచున్నను జపించుచున్నను శూద్రాన్నమును భుజించి తద్రసముచేత పరిపుష్టమైన శరీరము కలవాడైనచో వాడు ఊర్ధ్వలోకములను పొందజాలడు అని అర్థము. అయితే ఈవిధానమునకును అనిషేధనమునకును సమన్వయమెట్టులను ప్రశ్నరాకపోదు. కాని ధర్మసూత్రకారులు విధించిన ఈనిర్ణయము సర్వవర్ణములవారును స్వస్వవర్ణాచరణమునందు నిరతులైయుండిన కాలమునాటిది. ఒకానొక స్మృతికర్తచెప్పినట్టులు ఈకాలమున బ్రాహ్మణేతరులగు ద్విజాతులేలేవుగనుకను ఇయ్యది ఆపత్కాలాదులందు అనుసరింపదగినట్టిది కావునను విరోధములేదని ఒకరు సమాధానము చెప్పియున్నారు. కాని ఇయ్యది అంతగ దృఢమైనదికాదు. కాబట్టి ఇచ్చట విజ్ఞానభిక్షువు వ్రాసిన వ్యాఖ్యానమే సమంజసముగ నున్నది. ఆయనచెప్పిన వ్యాఖ్యానమిట్టులు — సర్వవర్ణములకును అర్హమైనట్టిది గనుక సార్వవర్ణికము. అభిశస్త పతితవర్జముగా (అనగా అభిశస్తులను పతితులను వదలిపెట్టి) భిక్షాచరణము సర్వవర్ణములకు నర్హమైనట్టిదిగా విధింపబడినదని సూత్రార్థము. అనగాభిక్షాచరణమును అన్నివర్ణముల వటువులు చేసికొనుటకు అర్హతగలదనియును, కాని అట్టులు చేసికొనునప్పుడు అభిశస్తులను పతితులను మాత్రము వదలిపెట్టవలయుననియును భావము. అర్థాత్తు లోకమునందు ప్రతిగ్రహాధికారము కేవలమొక్క బ్రాహ్మణులకే ఉండుటవలన బ్రాహ్మణేతరులగు వారికినిగురుకులము నున్నగువానియందు వర్తన మెట్లన్నచో వారు నీరను భేదములేక భిక్షాచరణము అన్నివర్ణములవారికిని నర్హత నిచ్చుచున్నదని భావము.

## 104 సూ. ఆదిమధ్యాంతేషు భవచ్ఛబ్దః ప్రయోజ్యో వర్ణానుక్రమేణ. [౧-౨-౪౨]

హరదత్తమితాక్షరా:—ఆదిమధ్యేతి. భిక్షాం దేహీతి. పదద్వయస్య ఆదిమధ్యాంతేషు వర్ణక్రమేణ భవచ్ఛబ్దః సంబుద్ధ్యంతః ప్రయోక్తవ్యః. స్త్రీషు స్త్రీలింగః. బ్రాహ్మణస్య భవన్భిక్షాం దేహి బ్రాహ్మణ్యాః భవతి భిక్షాం దేహి క్షత్రియస్య భిక్షాంభవన్దేహి, క్షత్రియాణ్యాః భిక్షాంభవతిదేహి వైశ్యస్య భిక్షాం దేహిభవన్. వైశ్యాయాః భిక్షాం దేహిభవతీతి.

ఆంధ్రవివరణము:— బ్రహ్మచారియగువాడు భిక్షాచరణమును చేయువేళలలో భిక్షాందేహి -(భిక్షను ఒసగుము) అని అడుగవలసియున్నది. ఇట్టులు అడుగుటలో గల నియమమును ఈసూత్రమునందు నిరూపించుచున్నాడు.

భిక్షాందేహి -అనుమాటలో ఆదియందును మధ్యమందును చివఱయందును బ్రాహ్మణాది వర్ణములయొక్క క్రమము ననుసరించి - భవచ్ఛబ్దము సంబోధనాంతముగా ప్రయోగింపబడుచుండవలయునని సూత్రముయొక్క యర్థము. అనగా భిక్షను యాచించెడునప్పుడు భవచ్ఛబ్దమును పురుషులయందు పుల్లింగముగను స్త్రీలయందు స్త్రీలింగముగను మార్చికొని, సంబోధనవిభక్తి చేర్చి బ్రాహ్మణాది వర్ణముల క్రమముగ (1) బ్రాహ్మణులలో పురుషులకైనచో భవన్ భిక్షాందేహి యనియును స్త్రీలకైనచో భవతి భిక్షాందేహి యనియును, క్షత్రియులలో పురుషులకైనచో భవన్ దేహి యనియును స్త్రీలకైనచో భవతి భిక్షాం దేహి యనియును, వైశ్యులలో పురుషులకైనచో భిక్షాం దేహి భవన్ యనియును స్త్రీలకైనచో భిక్షాందేహి భవతి - అనియును భిక్షాచరణము నొనర్చుకొనవలయు నని తాత్పర్యము.

విశేషాంశములు—ఇచ్చటగృహ్యసూత్రమునందు మరియొక విధముగానున్నది. బ్రాహ్మణుడైనచో భవతి భిక్షాందేహి అని భిక్షను చేసికొనవలయునని యును, రాజన్యుడైనచో భవన్మధ్యముగా "భిక్షాంభవతిదేహి" యనియును, వైశ్యుడైనచో భవదంత్యముగా "భిక్షాందేహిభవతి"యనియును భిక్షను జేసి కొనవలయును అనియును చెప్పబడియున్నది, ఇందువలన హరదత్తుడు చెప్పినట్టులుగా ఏయే వర్ణముల వారికి భిక్షకువెళ్లునో వారి వర్ణమునను సరించి అడుగవలసియుండుటకాదనియును భిక్షను తెచ్చుకొనుటకు ఏయే వర్ణపు బ్రహ్మచారివెళ్లునో ఆయాబ్రహ్మచారి తన యొక్క కులము బోధపడునట్టులుగా మార్చి భిక్షనడుగవలయునని యును తెలిసినది. ఇంతియగాక భిక్షనుఅడుగునప్పుడు 'క్షా'కారమును 'హీ' కారమును పొడిగించి దీర్ఘంతీస్తూ అడుగగూడదని కూడచెప్పబడి యున్నది. చదువరులకు ఈవిషయమున ప్రామాణ్యబుద్ధిగల్గుటకై అగృహ్యసూత్రకారుల వాక్యముల నుదాహరించుచున్నాను—"బ్రాహ్మణోభిక్షేతభవతి భిక్షాందేహీతి, భవన్మధ్యయా రాజన్యో భిక్షాం భవతి దేహీ. భవదంత్యయా వైశ్యోభిక్షాందేహిభవతి. క్షాంచ హించ న వర్ధయేత్" అని.

105 సూ. ఆచార్యజ్ఞాతి గురుష్వలాభే ఽన్యత్ర [౧-౨-౪౩]

హరదత్తమితాక్షరా—ఆచార్యేతి. ఆచార్య ఉక్తః జ్ఞాతిః పితృవ్యాది సపిండః. గురుర్మాతులాదిః స్వమాత్మీయగ్రహణం. అన్యత్ర భిక్షాయాఅభావే ఆచార్యాది గృహేషు భైక్షం చరితవ్యమ్.

ఆంధ్రవివరణము—ఆచార్యులనగా నెవ్వరో ఇదివరకే నిరూపించియున్నాము. జ్ఞాతి సపిండుడగునట్టి పినతండ్రి మున్నగువారు. గురువులనగా మేనమామలు మున్నగువారు. స్వ లనగా తనకు చుట్టాలుగా నున్న ఇతరాదులు. వటువు భిక్షాచరణమును చేయునట్టివేళలలో ఇతరులయిండ్లలోభిక్ష లభింపనపుడు- తనకు ఆచార్యులుగా సుండువారియొక్క గృహములందుగాని, సపిండులగునట్టి జ్ఞాతులయిండ్లలోగాని మేనమామ మొదలగు గురువులయొక్క యిండ్లలోగాని బంధుత్వమునుబట్టి తనవారుగా నున్నవారియిండ్లలోగాని భిక్షాచరణమును చేయవలయునని సూత్రార్థము.

106 తేషాం పూర్వం పూర్వం పరిహరేత్. [౧-౨-౪౪]

హరదత్తమితాక్షరా :—తేషామితి. తేషాం ఆచార్యాదీనాం యోయః ప్రథమనిర్దిష్టః తంతం పరిహరేత్ అన్యత్రాలాభేష్వగృహే తత్రాలాభే గురుషు తత్రాప్యలాభే ఆచార్య గృహ ఇతి.

ఆంధ్రవివరణము—వెనుకటిసూత్రమునందు చెప్పబడినఆచార్యాదులలో తొలుదొల్త నిర్దేశింపబడిన వారిని పరిహరించి తక్కినవారినుండి భిక్షను గొనవలయునని సూత్రార్థము. అనగా ఇతరస్థలమునందెక్కడను లభింపనప్పుడు తన యింటను, అచ్చట లభింపనిచో గురువులయిండ్లను అచ్చట లేనిచో జ్ఞాతులగృహమునను, అచ్చటకూడ లభింపనిచో ఆచార్యుల గృహమునందును భిక్షను గ్రహింపవలయునని సూత్రార్థము.

## 107 సూ. నివేద్య గురవేనుజ్ఞాతో భుంజీత. [౧—౨—౪౫]

హరదత్తమితాక్షరా—నివేద్యేతి. ఇదమానీతం భైక్షమితిగురవే నివేద్య తదనుజ్ఞాతో భుంజీత యది గురుస్స్వయం గృహ్ణీయాత్తతోన్య దాహరేత్.

ఆంధ్రవివరణము—"అయ్యా!—నేడు భిక్షాచరణమునకై పోయి ఇదిగో దీనిని తెచ్చితిని."—అని తాను తెచ్చినట్టి భైక్ష్యమును గురువునకు నివేదించి ఆయనచేత ననుజ్ఞను పొందినవాడై అనంతరము ఆభిక్షాన్నమును శిష్యుడు భుజింపవలయును. ఒకప్పుడు శిష్యుడు తెచ్చిన ఆభిక్షాన్నమును గురువు స్వయముగా గ్రహించునేని శిష్యుడు దానిని గురువునకు అర్పించి తాను మరల మరికొంతను తెచ్చుకొని భుజింపవలయును అని తాత్పర్యము.

## 108 సూ. అసన్నిధౌ తద్భార్యాపుత్రసబ్రహ్మచారిభ్యః [౧—౨—౪౬]

హరదత్త మితాక్షరా—అసన్నిధావితి. ఆచార్యాసంనిధానే తద్భార్యాదిభ్యో యథాసంభవం నివేద్య తైరనుజ్ఞాతో భుంజీత.

ఆంధ్రవివరణము—ఒకప్పుడు గురువులు మున్నగువారు లేకుండుట తటస్థించును. అట్టి సందర్భములందు తాను తెచ్చినట్టి భిక్షాన్నమును- ఆయాచార్యులయొక్క- భార్యకుగాని కుమారునకుగాని, లేదా ఆతనితో సహాధ్యాయితను నెఱపుచున్నట్టి వానికిగాని - నివేదించి అటు తరువాత భుజింపవలయును.

## 109 సూ. వాగ్యతః తృప్యన్నలోలుప్యమానః సంనిధాయోదకమ్. ✓ [౧—౨—౪౭]

హరదత్తమితాక్షరా—వాగితి. వాగ్యతః యావద్భుక్తి వాచంయమః. తృప్య న్నన్నదర్శనేన హృష్యన్. అలోలుప్యమానః అతిస్పృహామకుర్వన్. సంనిధాయ (అంతర్భావితణ్యర్థః) సంనిధాప్యేతి. ఉదక ముదకభాజన మితి.

ఆంధ్రవివరణము:—బ్రహ్మచారి ఈరీతిగా భిక్షాన్నమును తెచ్చుకొనిన పిమ్మట భుజింపవలసినప్పటి నియమములను ఈసూత్రమునందు చెప్పుచున్నాడు.— వాక్కు- అనగా మాట. యతుడనగా నియమముగల్గి వర్తించువాడు. వాగ్యతు డనగా వాఙ్నియమము నవలంబించిన వాడు. లోలుప్య మానుడనగా మిక్కిలి లాలసగలవాడు. భిక్షాన్నమును భుజించునప్పుడు— బ్రహ్మచారి భోజనము ముగియు నంతవఱకును వాగ్యతుడై - అనగా వాఙ్నియమము నవలంబించి నిశ్శబ్దముగా గూర్చున్నవాడై- అలోలుప్యమానుడై- అనగా పదార్థములను జూచి లోపలనుండి బయలు వెడలిన ఆశతో లొట్టలు వేయుట చప్పరించుట మున్నగు లాలసత్వ చిహ్నములు లేనివాడై- జలపాత్రను దగ్గఱనుంచుకొన్నవాడై- ఆపిమ్మట యథావిధిగ భుజింపవలయునని సూత్రార్థము.

విశేషాంశములు—ఈసూత్రమునందు చెప్పబడిన నియమములు ఆరోగ్యవిధులకును ఆచారవిధులకును సంబంధించినట్టివియును సర్వులకు నాచరణయోగ్యములయినవియును గా నెఱుంగవలయును. భోజనవిధిని నిర్వర్తించునప్పుడు వాఙ్మనః క్రియలం బరిశుద్ధుడై సంతుష్టుడై సుప్రసన్నతతో నుండవలయుననియును మౌనముగా భుజింపదగుననియును వైద్యులును స్మృతికర్తలును చెప్పినవాక్యములున్నవి- (1) దృష్ట్వాహృష్యేత్ప్రసీదేచ్చప్రతినందేచ్చ సర్వశః. (2) అనాయుష్యమనారోగ్య మస్వర్గ్యం చాతిభోజనం, అపుణ్యంలోకవిద్విష్టంతస్మాత్తత్పరివర్జయేత్ అని. అనగా భోజమునకుం కూర్చొనకముందు ఎట్టులున్నను భోజనమునకుం గూర్చున్న పిమ్మట అన్నమును చూచినవెంటనే అయ్యది అమృతమని ధ్యానించి సంతసమునొందుటయును, నిర్మలమగు హృదయముతో ప్రసన్నుండైయుండుటయును ముఖ్యమనియును, భుజించునప్పుడు ఎంతవఱకు క్షుత్తుశాంతించునో అంతదనుక మాత్రమే భుజింపదగుననియును, అంతియేకాని అతిభోజనము సర్వథా పనికి రాదనియును అతిభోజనమువలన ఆయుష్యముతఱుగుటయును ఆరోగ్యము లోపించుటయును స్వర్గసాధనము కాకపోవుటయును, అపుణ్యమును తిండిపోతు అనిలోకముచే ద్వేషింపబడుటయును, గూడకలుగును అని తాత్పర్యము. ఇయ్యది ఆరోగ్యవిధులగుఱించినది. ఇకను ఆచారవిధులను గుఱించిన వాక్యములు మనలో వేలున్ననూ- ముఖ్యముగా- ప్రతిదినమును బ్రాహ్మణులు భుజించుటకు ముందు చేయు పరిషేచనాపోశనాదిక్రియలందే సంగ్రహముగా ఇమిడియున్నవి. సత్యంత్వర్తేన పరిషించామి [సత్యమును ఋతముతో పరిషేచించుచున్నాను] అని ప్రాతఃకాలములందును, ఋతంత్వా సత్యేన పరిషించామి [ఋతమును నిన్ను సత్యముతో పరిషేచించుచున్నాను] అనిసాయంకాలములందును అన్నమును గాయత్రితో ప్రోక్షించి ఉదకములను "అమృతమస్తు—" అని ప్రాశనము చేసి (దీనినే ఆపోశనము అందురు.) పంచాహుతులను తీసికొని తర్వాత భుజింపవలయుననియు భోజనాంతమున అమృత! పిధానమసి (ఓయమృతమా నీవు నాహృదయమునం బిధానమునొందితివి) అని ఉత్తరాపోశనమునందును చెప్పెడి యాచారము ఇప్పటికిని మనలో నున్నది. ఇయ్యవియే మన ఆరోగ్యవిధులయొక్కయును ఆచారవిధులయొక్కయును ఉత్కర్షతను తెలుపజాలి యున్నవి.

## 110 సూ. శిష్యశిష్టిరవధేన [౧—౨—౪౮]

హరదత్తమితాక్షరా—శిష్యశాసన ప్రకారమాహ—శిష్యేతి. వధస్తాడనం. అతాడ్యతా గురుణా భర్త్సనాదిభి శ్శిష్యశ్శాస్యః.

ఆంధ్రవివరణము.—ఇటుపైని గురువులు ఆచార్యులు నున్నగువారు శిష్యుని శాసింపవలసిన విధానమును ఈసూత్రమునందు వివరించుచున్నాడు— వధ అనగా తాడనము. అనగా కొట్టుట. అవధు డనగా తాడనాదులను చేయనట్టివాడని యర్థము. శిష్టియనగా శాసించుట. శిష్యశిష్టి యనగా శిష్యుని శాసించుట. గురువు అవధుడై- [అనగా తాడనాదుల చేయనివాడై భర్త్సనము (బెదిరించుట మున్నగువానిద్వారా] శిష్యశిష్టిని ఒనర్పవలయు నని సూత్రార్థము. (ఇది హరదత్త మతానుసారము.)

ఇచ్చట మఱికొందఱు వ్యాఖ్యాతలు విభిన్నరీతిని వ్యాఖ్యానము చేసిరి: — వధమనగా హననము. అనగా చంపుట (వధః యథా నస్యాత్తథా అవధం తేన అవధేన) వధముకానిరీతికి అవధమని పేరు. అవధమగురీతిగా —(అనగా శిక్షించుకాలమునందు శిక్షాధిక్యముచేత ప్రాణము పోవునట్లుగాకుండనని యర్థము.) శిష్యశాసనమును ఒనర్పవలెనగు నని సూత్రార్థమును చెప్పిరి. (ఇది మహీధరుని అనుసరించినవారి వ్యాఖ్యానము అని యెఱుంగునది.)

## 111 సూ. అశక్తౌ రజ్జువేణువిదళాభ్యాం తనుభ్యాం [౧—౨—౪౯]

హరదత్తమితాక్షరా—అశక్తావితి. యదిభర్త్సనాదిభిః శాసితుమశక్యస్తతో రజ్జ్వా తన్వా తనునా వేణువిదళేన వేతి. ద్వంద్వ నిర్దిష్టయో రపి వికల్పోరజ్జ్వా వేణుదళేన వేతి...

ర్శనాత్. తాభ్యాం దుర్బలాభ్యాం తాడయిత్వాపి, శాసనీయః శిక్షణీయ ఇత్యర్థః

ఆంధ్రవివరణము.—వెనుకటిసూత్రమునందు చెప్పిన విధముగా శిష్యుని శాసించుటకు వీలుకలుగనియప్పుడు మిగులసూక్ష్మములైనట్టి రజ్జువేణువిదళములతో శిష్యశాసనము నొనర్పవలయునని సూత్రార్థము. రజ్జువనగా పగ్గము వేణువనగా వెదురు. విదళము అనగా సన్ననివెదురు. (పేము అని కొందఱుఅనిరి.) ఇచ్చట రజ్జువుతోగాని లేక వేణువిదళముతోగాని శిక్షించవలయునని వికల్పము తెలుంగ వలయును. అనగా ఈచెప్పినట్టివానిలో నేయొక్కదానితోనైనను- [దుర్బలముగానున్నట్టి దానితో] తాడనము చేసినయైనను శిష్యశిక్షణము నొనర్పవలయునేగాని మిక్కుటముగా కొట్టగారాదని తాత్పర్యము.

శిష్యులను శిక్షించుట యనునది గురువులందుగల బోధన విషయమునగల శక్తియుక్తులు తగ్గదుకొలదియును బోధన యొక్క పరమార్థ దృష్టిని వీడనాడెడి కొలదియును ఏర్పడుచు వచ్చినట్టి యాచారమే కాని వేఱుకాదు. మనసంప్రదాయములననుసరించి ప్రాచీనకాలమునందలి బోధనక్రమమెట్టిదియో ఈ క్రింద నుదాహరించిన ఋక్కుఒక్కటియే చక్కగా తెల్పజాలియున్నది.

శ్రు. య ఆతృణత్త్యవితథేన కర్ణావదుఃఖం
కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్,
తం మన్యేత పితరం మాతరంచ
తస్మైన ద్రుహ్యేత్కతమచ్చనాహ.

[అనగా ఏగురువు శిష్యుని దయతో దగ్గఱకు దీసి అతనికి ఏవిధమైనట్టి కష్టముగాని ఆయాసముగానిగలుగకుండని విధమున, తానుచేసెడి బోధనలను వినెడి కొలది అతనికి ఒకవిధమగు [ఆదరమును] అభిరుచిని కలిగించుచు శిష్యుని కర్ణములను బోధనలచేత నించునో, అట్టిగురువునే తల్లినిగాను తండ్రినిగాను తలచవలయును. అట్టిగురువులకు ఎప్పుడును ద్రోహమును ఆచరింపగారాదు-అని అర్థము.] దీనినిబట్టి అసలు శిష్యశాసనమే చేయ నవసరము లేదనుట తేలుచున్నదిగదా!

112 సూ. అన్యేనఘ్నన్ రాజ్ఞా శాస్యః [౧-౨-౪౦]

హరదత్తమితాక్షరా—అన్యేనేతి. అన్యేన హస్తాదినా క్రోధవశేన తాడయన్ రాజ్ఞా శాస్య ఆచార్యః ఏవంశిష్యస్య గురుకులే వాస ఉక్తః,

ఆంధ్రవివరణము.—పైసూత్రమునందు పేర్కొనబడినట్టి సాధనములతోగాక క్రోధవివశుడై ఇతరరీతుల- (అనగా చేయిరాయి మున్నగువానితో) శిష్యశాసనము చేయునేని అట్టి ఆచార్యుడు రాజుచేత దండింపదగినవాడగుచున్నాడని సూత్రార్థము. ఈసూత్రముతో శిష్యుడు గురుకులమునందు వసించుచు అనుష్ఠింపదగినరీతిని పూర్ణముగా వివరించినట్లులయినదని యెఱుంగవలయును.

113 సూ. ద్వాదశ వర్షాణ్యేకవేదే బ్రహ్మచర్యం చరేత్. [౧-౨-౪౧]

హరదత్తమితాక్షరా—అథ. కియంతంకాలమేవం గురుకులేవస్తవ్య ఇత్యతఆహ—ద్వాదశేతి. యద్యప్యేకైకస్య వేదస్య బహ్వ్యశ్శాఖాః ఏకవింశతిధా బహ్వృచః ఏకశతం యజుశ్శాఖాః సహస్రవర్త్మా సామవేదః నవధాథర్వణో వేద ఇతి. తథాపి తత్రతత్ర వేదే పూర్వైరధ్యయనానుష్ఠానాభ్యాం పరిగృహీతా యావతీశాఖా తావత్యత్ర వేదశబ్దేన వివక్షితా. య ఏకంవేద మధీతే స ద్వాదశవర్షాణి గురుకులే బ్రహ్మచర్యం చరేత్.

ఆంధ్రవివరణము.—గురుకుల వాసమును చేయవలసినందులకు కాలనియమమును ఈసూత్రమునందు చెప్పుచున్నాడు. ఒక్కొక్కవేదము నధ్యయనముచేయుటలో

పండ్రెండేసి సంవత్సరములు బ్రహ్మచర్యమును అవలంబింప వలయు నని సూత్రార్థము. నిజమును పరికించినచో ఒక్కొక్క వేదమునకు అనేక శాఖలున్నవి. బహ్వృచశాఖలు ఇరువదియొక్కటి. యజుశ్శాఖలు నూటఒక్కటి. సామవేదము వేయిశాఖలుగలది. అథర్వణవేదము తొమ్మిది తెఱగులు. ఇంత బాహుళ్యమును పొందియున్నను పూర్వులు సంప్రదాయసిద్ధముగా ఏయే వేదమునందు ఎన్నెన్నిశాఖలు అధ్యయనానుష్ఠానములద్వారా చేకొనియున్నారో అన్నిశాఖలు అన్నియును ఇచ్చట వేదశబ్దముచే వివక్షితము లగుచున్నయవి. అందులో ఎవ్వరు ఒక్క వేదము నధ్యయనముచేయుదురో వారు పండ్రెండుసంవత్సరములు గురుకులవాసము చేయవలయునని తాత్పర్యము.

## 114 సూ. ప్రతిద్వాదశవా సర్వేషు [౧—౨—౫౨]

హరదత్తమితాక్షరా:—యస్తుచతురో వేదానధ్యేతుంశక్తః సప్రతిద్వాదశ ప్రతివేదే ద్వాదశవర్షాణీత్యర్థః. యథాహాపస్తంబః —ఉపేతస్యాచార్యకులే బ్రహ్మచారివాసో ష్టచత్వారింశద్వర్షాణీతి.

ఆంధ్రవివరణము:—సమస్తవేదముల నధ్యయనముచేయు విషయమున ఒక్కొక్కదానికిని పండ్రెండేసియేండ్లచొప్పున గురుకులవాసము చేయవలయునని సూత్రార్థము. ఆపస్తంబుని భావముకూడ నిట్టులనేయున్నది.

## 115 సూ. గ్రహణాంతం వా [౧—౨—౫౩]

హరదత్తమితాక్షరా:—గ్రహణేతి. యావతాకాలేనైకో వేదో ద్వావాగ్రహీతుం శక్యాస్తావంతం కాల మితి కేచిత్.

ఆంధ్రవివరణము:—ఒక వేదముగాని రెండులేక మూడు నాలుగు వేదములుగాని ఎంతకాలమునుండినయెడల విద్యార్థికి గ్రహింపశక్యమగునో అంతదనుక గురుకులవాసము చేయవలసినదే యని కొందరనిరని భావము.

## 116 సూ. విద్యాంతేగురురర్థేన నిమంత్ర్యః [౧—౨—౨౪]

హరదత్త మితాక్షరా—విద్యాంతఇతి. విద్యాసమాప్తౌ గురు రర్థేన ప్రయోజనేన నిమంత్ర్యః ప్రష్టవ్యః గురో ఇదంధన మాహరాణీతి.

ఆంధ్రవివరణము:— విద్యాసమాప్తియైనపిమ్మట గురువులను ఏదియైన నొకయర్థముతో (ప్రయోజనముతో) నిమంత్రణము చేయవలయును. అనగా ఫలానా ధనాదికమును తమ కర్పించెదనని చెప్పి తెచ్చియొసంగవలయును.

## 117 సూ. కృత్వానుజ్ఞాతస్య వా స్నానమ్ [౧—౨—౫౫]

హరదత్తమితాక్షరా:—కృత్వేతి. తతః కృత్వా ఆహరేత్యాచార్యోక్తం కృత్వాస్నానం కర్తవ్యమ్ స్నానం నామాత్రసమావర్తనం, వత్స త్వద్గుణై రేవాహమస్మితోషితః ధనేనాలమితి తేనానుజ్ఞాతస్యవా స్నానంకర్తవ్య మితి శేషః.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునందు చెప్పిన విధమున గురువులను అర్థముద్వారా నిమంత్రణము చేసి వారు ఆజ్ఞాపించినవిధమున వారియిష్టమును తీర్చిన యనంతరము-(అనగా గురుదక్షిణను సమర్పించినపిదప యని భావము.) వారిచేత- అనగా గురువులచేత ననుజ్ఞాతుడై అనంతరము స్నానమును (అనగా సమావర్తనమును) చేసికొనవలయును. లేదేని— అనుజ్ఞాతః అన్నమాటకు గురువులచేత ధనమును తీసుకొనిరాబని లేదు. నీగుణములచేత సంతుష్టుడ నైతిని' అని ఇత్యాదులచేత ననుజ్ఞాతుడైగాని స్నానము నొనర్పవలయు నని యర్థము చేయవచ్చును.

## 118 సూ. ఆచార్యశ్శ్రేష్ఠో గురూణాం. [౧—౨—౫౬

హరదత్తమితాక్షరా—ఆచార్య ఇతి. గురూణాం పిత్రాదీనాం మధ్యే ఉక్తలక్షణ ఆచార్యశ్శ్రేష్ఠః సహి విద్యాతస్తం జనయతి తచ్ఛ్రేష్ఠం జన్మ. తేనానేకగురుసమవాయే సఏవ ప్రథమ పూజ్య ఇతి వదంతి.

ఆంధ్రవివరణము:—అయ్యా! - విద్యా సమాప్తియైనపిమ్మట గురువునిక్లెల నిమంత్రణముచేసి ఆయన చేత ననుజ్ఞను పొందవలయును?—అని ఆశంకరాగా వారించుచున్నాడు—తనను కనినట్టి తల్లి తండ్రి మున్నగునట్టి వివిధులగు గురువులలోనికెల్లను- పైని నిరూపింపబడినట్టి ఆచార్యుడే సర్వవిధముల శ్రేష్ఠుం డగుచున్నాడు. కాబట్టి అట్టిఆచార్యుని ఉక్తరీతిగా నిమంత్రించి ఆయనచే ననుజ్ఞాతుడై నపిమ్మటనే సమావర్తనము చేసికొనవలయునని సూత్రార్థము. ఆచార్యునియొక్క శ్రేష్ఠతనుగురించి—" ఆచార్యుడే విద్యనొసంగుటద్వారా అతనిని (అనగా శిష్యుని) జనింపచేయుచున్నాడు. తక్కిన జన్మములలోనికెల్ల నిట్టిజన్మమే శ్రేష్ఠమగునట్టి జన్మము. కావుననే గురువులు పెక్కండ్రున్నను మున్ముందుగ నతడే- అనగా విద్యాప్రదాతయగునట్టి గురుడే- తొలుదొల్త పూజింపదగినట్టి వాడగుచున్నాడు- అని పల్కుచున్నారు పెద్దలు.

## 119 సూ. మాతేత్యేకే మాతేత్యేకే [౧—౨—౫౭]

హరదత్తమితాక్షరా—మాతేతి. ఏకేత్వాచార్యాః మాతా శ్రేష్ఠేతి మన్యంతే. తథాచ వాసిష్ఠః-శ్లో. ఉపాధ్యాయా ద్దశాచార్యః, ఆచార్యాణాం శతం పితా, పితుర్దశ గుణం మాతా గౌరవేణాతిరిచ్యతే. ఆపస్తంబోపి-"మాతాపుత్రత్వస్య భూయాంసి కర్మాణ్యారభతే తస్యాం శుశ్రూషానిత్యాపతితాయా మపీతి." ద్విరుక్తి రధ్యాయ పరిసమాప్త్యర్థా.

ఇతి శ్రీగౌతమీయవివృతౌ హరదత్త విరచితాయాం మితాక్షరాయాం ద్వితీయాధ్యాయ స్సమాప్తః.

ఆంధ్రవివరణము:— ఆచార్యుడే సమస్తగురువులలో శ్రేష్ఠుడన్న విషయమునగల వికల్పపక్షమును ఉదాహరించుచున్నాడు—"మతికొందఱాచార్యులు వివిధులగు గురువులలోనికెల్లను తల్లియే శ్రేష్ఠురాలు తల్లియే శ్రేష్ఠురాలు' అని చెప్పిరని అర్థము. ఈవిషయమున వాసిష్ఠస్మృతికూడ నిట్టులనే చెప్పుచున్నయది—" గౌరవమునుబట్టి ఉపాధ్యాయునికంటె నాచార్యుడు పదింతలుగను, ఆచార్యులకంటెనూరింతలుగ తండ్రియును తండ్రికంటె పదింతలుగ తల్లియును ఆధిక్యమును పొందుచున్నారు"—అని. ఆపస్తంబుడుకూడ నిట్టులనే చెప్పెను."తల్లి పుత్రత్వమునకై అనేకముగ పుణ్యకర్మలను ఆరంభించు చేయుచున్నది, అట్టితల్లియెడల- పతితురాలైనప్పటికిని- శుశ్రూష సర్వదా చేయతగినదియేకాని మానరానట్టిది ఎంతమాత్రమును కాదు. సూత్రమునందు మాతేత్యేకే మాతేత్యేకే [తల్లియే శ్రేష్ఠురాలు తల్లియే శ్రేష్ఠురాలు] అని ద్విరుక్తము జేయుట ఈయధ్యాయమును పరిసమాప్తి చేయుటకని యెఱుంగునది.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడును అధిగత కావ్యతీర్థాదిబిరుదుడును పంచాగ్ని వంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మసూత్రముల ఆంధ్రవివరణమునందు ప్రథమప్రశ్నమున రెండవదియగు నధ్యాయము ముగిసినది.

# గౌతమ ధర్మసూత్రములు.

## తృతీయాధ్యాయారంభము.

### 120 సూ. తస్యాశ్రమ వికల్పమే కే బ్రువతే. [౧—3—౧]

హరదత్తమితాక్షరా:—తస్యేతి. తస్యైవమధీత వేదస్య బ్రహ్మచారిణో వక్ష్యమాణాశ్చత్వార ఆశ్రమా వికల్ప్యంత ఇత్యేక ఆచార్యా బ్రువతే. అన్యేతు సముచ్చీయంత ఇతి. తత్రాపస్తంబః - తేషు సర్వేషు యథోపదేశ మవ్యగ్రో వర్తమానః క్షేమంగచ్ఛతీతి. బుద్ధ్వాకర్మాణి యత్కామయేత తదారభేతేతి చ. తథాచ బ్రహ్మచర్యాశ్రమముక్త్వా-అతఏవ బ్రహ్మచర్యవాన్ప్రవ్రజతీతి బోధాయనః. మనునాతు సముచ్చయోదర్శితః - శ్లో ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్, అనపాకృత్య మోక్షంతు వ్రజమానః పతత్యధః, సర్వేపి క్రమశస్త్వేతే యథాశాస్త్రంనిషేవితాః, యథోక్తకారిణం విప్రం నయంతి పరమాం గతిమ్ ఇతి.

ఆంధ్రవివరణము:— తచ్ఛబ్దముచేత నిచ్చట వెనుక జెప్పబడినట్టి - అధీతవేదుడగు (అనగా వేదమును పూర్తిగ చదివిన) బ్రహ్మచారి వివక్షితు డగుచున్నాడు. అతనికి - అనగా వెనుక జెప్పినట్టి బ్రహ్మచారికి మున్ముందు చెప్పబడబోవునట్టి నాలుగాశ్రమములు వికల్పముగ జేయదగినవని కొందఱు ఆచార్యులు పల్కిరని సూత్రార్థము. అనగా ఒకదానితరువాత నొకటిచొప్పున క్రమముగా నాల్గు ఆశ్రమములును విధింపబడినవని తాత్పర్యము. ఇట్లు గాక మఱికొందఱు సముచ్చయముగా నగునని పల్కిరి. ఈవిషయమున ఆపస్తంబు డిట్టులుచెప్పెను. - "వెనుక జెప్పినట్టి ఆయాశ్రమములందన్నింటను ఉపదేశానుసారముగా అవ్యగ్రుడై వర్తించెడివాడు క్షేమము పొందుచున్నాడు. చక్కగా సంప్రదాయమును తెలిసికొని కార్యములయందు దేనిని కోరునో దాని నారంభింపదగును" అని ఇట్టులనే బ్రహ్మచర్యాశ్రమ విధానమును వర్ణించి అనంతరమందు - "కనుకనే బ్రహ్మచర్యవంతుడై ప్రవ్రజించుచున్నాడు"-అని బోధాయనుడనెను. మనువుచేతగూడ సముచ్చయము ఇట్టులు ప్రదర్శింపబడియున్నయది - "దేవతలయొక్క ఋణములను తరువాత ఋషుల ఋణమును ఆపిమ్మట పితృదేవతల ఋణము - అను మూడు ఋణములను తీర్చి తొలగించుకొన్న పిమ్మట మనుజుడు తనమనస్సును మోక్షమునందు ప్రవేశపెట్టవలయును. ఎవ్వాడు ఈపైనిచెప్పబడినట్టి ఋణములను తీర్చి తొలగించుకొనకయే మోక్షమును గూర్చి వెళ్లుచూ వాడు అధఃపతితు డగును. ఈచెప్పబడినట్టి ఆశ్రమములన్నియును క్రమముగా శాస్త్రానుసారముగా సేవింపబడినట్టివి అగుచో యథోక్తకారియగునట్టి బ్రాహ్మణుని ఉత్తమోత్తమమగు గతిని ఉత్తమలోకములను పొందింపగల్గుచున్నయవి.—అని

### 121 సూ. బ్రహ్మచారి గృహస్థభిక్షు వైఖానసః [౧—3—౨]

హరదత్తమితాక్షరా:— కేపునస్త ఆశ్రమాః ఇత్యతఆహ - బ్రహ్మచారీతి. యద్యప్యసౌ పూర్వమపి బ్రహ్మచర్యాశ్రమయుక్తః తథాపి ప్రసిద్ధనైష్ఠికబ్రహ్మచారిత్వమత్ర వివక్షితమ్. భిక్షుస్సన్యాసీ వైఖానసో వానప్రస్థః. వైఖానసప్రోక్తేన మార్గేణ వర్తత ఇతి. తేన స ఆశ్రమః ప్రాధాన్యేన దర్శితః. శాస్త్రాంతరేషు వైఖానస స్మృతౌ యో భిక్షుశ్చతుర్థ ఆశ్రమః. ఇహతు క్రమభేదః ప్రాగుక్తాత్త్రయ ఆశ్రమిణ ఇత్యత్ర వైఖానసవర్జనార్థమ్.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు ఆశ్రమవికల్పముగనని చెప్పబడినది. కాని ఆశ్రమము

లనగా నెయ్యవి ? - అని ప్రశ్నమురాగా ఈసూత్రమున వారించుచున్నాడు. బ్రహ్మచర్యాశ్రమము గృహస్థాశ్రమము సన్యాసాశ్రమము వైఖానసాశ్రమము అని ఆశ్రమములు నాలుగని సూత్రార్థము. నిజమునకింతకు పూర్వముకూడ బ్రహ్మచర్యాశ్రమము రూపింపబడియున్నది. అయినను ప్రసిద్ధమగునట్టి నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమము ఇట వివక్షితమగుచున్నయది. ఇందు వైఖానసము అన్ని ఆశ్రమములలోనికి ని ప్రాధాన్యమని సూచించుటకై చివర పేర్కొనబడినది. ఇందు వైఖానసము మూడవ ఆశ్రమమనియును సన్యాసము నాల్గవ ఆశ్రమముగను చెప్పబడుచుండును. కాని ఇచటన్నను క్రమభేదము రూపింపబడినయది. ఏమనగా - వెనుక జెప్పినట్లు త్రయః - ఆశ్రమిణః - అన్నప్పుడు [అనగా ముప్వురు ఆశ్రములు] వారినుండి వైఖానసుని వేర్పరచుటకే అట్టులు చెప్పబడియున్నదని యెఱుంగవలయును.

122 సూ. తేషాంగృహస్థో యోనిరప్రజనత్వాదితరేషాం [౧—౩—౩]

హరదత్తమితాక్షరా:— తేషామితి. తేషాంచతుర్ష్వపి ఆశ్రమేషు వర్తమానానాం గృహస్థో యోనిరుత్పత్తి స్థానమ్. గృహస్థేనైవోత్పాదితా శ్చతుర్భిరాశ్రమైరధిక్రియంతే. గృహస్థవ్యతిరిక్తాశ్రమస్థానాం ప్రజోత్పాదనస్యనిషిద్ధత్వాత్. తత్ర శాతాతపః—చండాలాః ప్రత్యవసితాః పరివ్రాజక తాపసాః; తేషాం జాతాన్యపత్యాని చండాలైస్సహవాసయేత్ —ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రములలో చెప్పబడినట్టి ఆనాలుగాశ్రమములలో వర్తించునట్టివారిలో గూడ- గృహస్థాశ్రమమున వర్తించునట్టివాడే- తక్కిన ఆశ్రమములవర్తించునట్టివారికందరికిని మూలభూతుడగుచున్నాడు. ఏలయనగా - గృహస్థునికంటె భిన్నులయిన తక్కినఆశ్రమముల వారెవ్వరునుకూడ సంతానోత్పాదన కార్యము విషయమై అర్హతలేనివారు గనుక- అని సూత్రార్థము. తక్కిన ఆశ్రమములవారికి సంతానోత్పాదన కార్యము విషయమై అర్హతలేనందులకేమి ప్రమాణమందురా ? వినుడు - ఆవిషయమున శాతాతపుడిట్టులు చెప్పుచున్నాడు- పరివ్రాజకులు తాపసులు ప్రత్యవసితులైనచో చండాలురుగా గణింపబడుదురు. కావున వారికి పుట్టినట్టి సంతానములను చండాలురతోనే కూర్చి నివసించునట్లు చేయవలయును - అని.

123 సూ. తత్రోక్తం బ్రహ్మచారిణః [౧—౩—౪]

హరదత్తమితాక్షరా:— ఇదానీమాశ్రమధర్మాన్వర్ణయన్ ప్రథమనిర్దిష్టస్య బ్రహ్మచారిణ ఆహ—తత్రేతి. తత్ర తేషాంమధ్యే బ్రహ్మచారిణః నైష్ఠికబ్రహ్మచారిణః యదుపకుర్వాణస్య ఉపనయనాదిర్నియమ ఇత్యారభ్య ఉక్తం తదేవాస్యాపీత్యుక్తం భవతి.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ఆయా ఆశ్రమముల వారి ధర్మములను వివరింపదలంచుచు మున్ముందుగా తొలుదొల్త నిర్దేశింపబడినట్టి బ్రహ్మచారియొక్క ధర్మములను రూపించుచున్నాడు -అందు-అనగా వెనుక చెప్పినట్టి ఆనాల్గు ఆశ్రమముల వారినడుమ- నైష్ఠికుడగునట్టి బ్రహ్మచారికి ఉపకుర్వాణుడగు బ్రహ్మచారికి చెప్పినట్టి నియమములే- చెప్పబడినట్టులు ఎఱుంగవలయునని అర్థము. అనగా ఉపనయనాదులగు నియమములన్నియు నతనికివలెనే ఇతనికిగూడ నని ఎఱుంగవలయునని భావము.

124 సూ. ఆచార్యాధీనత్వమాంతమ్. [౧—౩—౫]

హరదత్తమితాక్షరా:— తత్రాపి విశేషః— ఆచార్యేతి. ఆంతం ఆ దేహపాతం ఆచార్యకులఏవ తచ్ఛుశ్రూషాపరః వర్తేత.

ఆంధ్రవివరణము:—అయితే నైష్ఠికబ్రహ్మచారికి ఉపకుర్వాణునికంటె కొన్ని కొన్ని నియమములు విశేషముగా గలవు. ఆనియమముల నిచ్చట చెప్పుచున్నాడు- దేహపతనమగువఱకును నితఁడు (అనగా నైష్ఠికబ్రహ్మచారి) గురుకులమునందే వారికి శుశ్రూష చేయుచు గురువుల యాధీనత్వమునొంది యుండవలయునని సూత్రార్థము. అనగా గురువులకు నధీనుడై యుండవలయు నని భావము.

125 సూ. గుర్వోః కర్మశేషేణ జపేత్. [౧-౩-౬]

హారదత్తమితాక్షరా:—గుర్వోరితి. ఆచార్యప్రకృతో గురుశబ్దః పిత్రోరపి గ్రహణార్థః, తతశ్చాచార్యం పితరౌ చ శుశ్రూషమాణస్తద్వ్యతిరిక్తే కాలే జపేత్. వేద మధీయీత. నతు స్వాధీనో భవేత్.

ఆంధ్రవివరణము —గురువులను శుశ్రూషించుచు మధ్య తీరుబడిగలప్పుడు వేదాధ్యయనము సేయుచు ఆనైష్ఠికబ్రహ్మచారి జపముసేయుచు వర్తింపవలయు నని తాత్పర్యము.

126 సూ. గుర్వభావే తదపత్యే వృత్తిః తదభావే వృద్ధే సబ్రహ్మచారిణ్యగ్నౌ వా. [౧-౩-౭]

హారదత్తమితాక్షరా:— గుర్వభావ ఇతి. ఆచార్యే యా ప్రవృత్తిరభిహితా తదభావే తత్పుత్రే. తత్పుత్రాభావే వృద్ధే విద్యయా చ వయసా చాధికే. వృద్ధాభావే తథాభూతే సబ్రహ్మచారిణి సబ్రహ్మచార్యభావే అగ్నౌ వా కర్తవ్యా. సమిదాధానాదిభిరగ్నౌ వృత్తిః.

ఆంధ్రవివరణము:— వెనుకటిసూత్రమునందు చెప్పబడినట్టి ఆచార్యాధీనత్వము (అనగా శుశ్రూషావృత్తియని భావము.)గురువులు లేనప్పుడు వారి (అనగా ఆగురువులయొక్క) పుత్రుల విషయమునను, వారును లేనిచో విద్యచేతను వయస్సుచేతను పెద్దయైయుండెడి వారియెడలను, వారును లేనిచో సతీర్థ్యులయెడలను వారును లేనిచో అగ్నులయెడలను నెఱపదగినదని తాత్పర్యము. ఇచ్చట అగ్నియందు వృత్తియనుమాటచేత సమిదాధానాదులద్వారా నగ్నులపరిచర్య చేయుటయని భావము.

127 సూ. ఏవంవృత్తో బ్రహ్మలోకమవాప్నోతి జితేంద్రియః [౧-౩-౮]

హారదత్తమితాక్షరా:— ఏవమితి. స్పష్టస్సూత్రార్థః. జితేంద్రియత్వం మనునా దర్శితం-
శ్లో. శ్రుత్వా స్పృష్ట్వా చ దృష్ట్వా చ భుక్త్వా ఘ్రాత్వాపి యో నరః, నహృష్యతి గ్లాయతి వా సవిజ్ఞేయో జితేంద్రియః-ఇతి.

ఆంధ్రవివరణము:— ఈవిధముగా (నైష్ఠికబ్రహ్మచర్యమును) వర్తించునట్టివాడు ఆముష్మికమున బ్రహ్మలోకమునుపొందగల్గుటయేగాక ఐహికముగ జితేంద్రియుడుగాకూడ కాగల్గుచున్నాడని సూత్రార్థము. జితేంద్రియత్వమనుమాటకు మనువు విశేషార్థమును ఈరీతిగా ప్రదర్శించుచున్నాడు - ఎవ్వాడు ఇంద్రియార్థములను వినియును స్పర్శించియును చూచియును అనుభవించియును ఆఘ్రాణించియును కూడ సంతసింపక యుండునో గ్లానినొందకయుండునో అట్టివాడే జితేంద్రియుడని యెఱుంగదగును.

128 సూ. ఉత్తరేషాం చైతదవిరోధి. [౧-౩-౯]

హారదత్తమితాక్షరా:— ఉత్తరేషామితి. ఉత్తరేషామప్యాశ్రమాణాం అస్మిన్వృత్తే యదవిరుద్ధం వేదతత్త్వమానం యథాద్యాత్మాద్ధి పరివర్జనమ్. విరుద్ధం యథా- అగ్నికార్యం

ప్రవ్రజితస్య. గురుకులవాసో వైఖానసస్య బ్రహ్మచర్యం గృహస్థస్యేత్యు పరావృత్తిః. ఉత్తరేషాం చాశ్రమాణాం ధర్మజాతమేతస్య ద్రష్టవ్యమ్. కిమవిశేషేణేత్యాహ. నతథా. ఏతదాశ్రమధర్మవిరోధి నమ్లేచ్ఛాద్యు చ్యధార్మికైః సహాసనంవసేతేత్యేవమాద్యస్యాపిభవతి.

ఆంధ్రవివరణము:— మున్ముందటి ఆశ్రమములకు గూడ ఈవృత్తమునందు అవిరుద్ధముగా నెయ్యది గలదో అయ్యది సమానముగా విహితమని యెఱుంగదగునని సూత్రార్థము. అవిరుద్ధమనుమాట చేత ద్యూతము మున్నగువానిని వర్జించుటలను విరుద్ధము లనుమాటచేత - ప్రవ్రజితునకు అగ్నికార్యము వైఖానసునకు గురుకులవాసము గృహస్థులకు బ్రహ్మచర్యము - అనునీ మున్నగునవి లక్షింపదగును.

ఈసూత్రమునందు మఱికొంద ఱింకొకవిధముగ వృత్తిని (వ్యాఖ్యానము) చెప్పిరి. "మున్ముందటి ఆశ్రమముల యొక్క ధర్మజాతము ఇతనికి గూడ విహితముగా నెఱుంగదగును. అయితే ఆయాశ్రమములయొక్క ధర్మజాతమంత యునా? యందురేని కాదు. ఈయాశ్రమమునకు విరుద్ధము గానంతవఱకుమాత్రమే" - అని అనిరి. ఇట్టులర్థముచేయుటచేత మ్లేచ్ఛులు అపవిత్రులు అధార్మికులు మున్నగువారితో సహాసన సహసంభాషణాదులు ఇతనికిగూడ త్యాజ్యములే యని యేర్పడుచున్నది.

## ×129 సూ. అనిచయో భిక్షుః [౧—౩—౧౦]

హరదత్తమితాక్షరా:— బహువక్తవ్యత్వాత్క్రమప్రాప్త మపి గృహస్థ ముల్లంఘ్య భిక్షోర్ధర్మా నాహ - అనిచయఇతి, నిచయోద్రవ్యసంగ్రహః తద్రహితస్స్యాత్.

ఆంధ్రవివరణము:— ఇంతవఱకును బ్రహ్మచర్యాశ్రమముయొక్క ధర్మములను నిరూపించి, అటుతరువాతిదగునట్టి గృహస్థాశ్రమముయొక్క ధర్మములను నిరూపింపవలసియుండగా - ఈగృహస్థాశ్రమమును గుఱించి చాల విస్తరించి చెప్పవలసి యుండుటచేత ప్రస్తుతము దానినివదలి తదనంతరస్థమగునట్టి సన్న్యాసాశ్రమమును గుఱించినట్టి ధర్మములను వివరించుచున్నాడు - భిక్షువు - (అనగా సన్న్యాసి) అనిచయుడై యుండవలయునని సూత్రార్థము. నిచయమనగా ద్రవ్యముయొక్క సంగ్రహము. అనగా ధనార్జనము. సన్న్యాసి ధనసంగ్రహణము చేయక యుండవలయునని తాత్పర్యము.

## 130 సూ. ఊర్ధ్వరేతాః [౧—౩—౧౧]

హరదత్తమితాక్షరా:— ఊర్ధ్వేతి. ఉత్తరేషాం చైతదవిరోధీతి సూత్రేణైవ జితేంద్రియత్వే సిద్ధేపి పున రూర్ధ్వరేతా ఇతి. రేతసస్స్త్రీతో భంగో యథా న భవేత్తథా ప్రయతేతేత్యేవమర్థమ్.

ఆంధ్రవివరణము:— సన్న్యాసి యూర్ధ్వరేతుడై యుండవలయునని సూత్రార్థము. 128 వ సూత్రమువలననే జితేంద్రియత్వము సిద్ధించుచున్నను మఱల నీసూత్రము నారంభించుట - ఏవిధముగాగూడ రేతోభంగము కాగూడదని రూపించుటకై యారంభింపబడినదని యెఱుంగవలయును.

## 131 సూ. ధ్రువశీలో వర్షాసు [౧—౩—౧౨]

హరదత్తమితాక్షరా:— ధ్రువశీలఇతి - వర్షాశబ్దో నిత్యం బహువచనాంతః వర్షాసుధ్రువశీలస్స్యాదేకత్ర తిష్ఠేదితి.

ఆంధ్రవివరణము:— సన్న్యాసి వర్షకాలమందు ధ్రువశీలుడై (అనగా గ్రామైకరాత్రముగా చరింపక ఏదో యొక్క ప్రదేశమునందు మాత్రమే స్థానమేర్పఱచుకొని యున్నవాడై) వర్తింపవలయునని తాత్పర్యము.

## 132 సూ. భిక్షార్థీ గ్రామమియాత్ [౧—౩—౧౩]

హరదత్తమితాక్షరా:— భిక్షార్థీతి - భిక్షాకాల ఏవగ్రామం ప్రవిశేత్. శేషకాలం దేవాలయాదౌ వృక్షమూలేషువా వసేత్.

ఆంధ్రవివరణము:— భిక్షార్థియై నప్పుడు మాత్రమే గ్రామమును ప్రవేశింపవలయును. అని సూత్రార్థము. తక్కిన కాలములందు ఏదైన దేవాలయము మున్నగునట్టి చోటు లందుగాని ఉండవలయునని తాత్పర్యము.

## 133 సూ. జఘన్యమని వృత్తించరేత్. [౧—౩—౧౪]

హరదత్తమితాక్షరా:— జఘన్యమితి. భిక్షాకాలే యద్గృహం అనుపపత్త్యా విలంబితం నత ద్భూయస్తదహం ప్రవిశేత్. తత్రమనుః - విధూమే సన్నముసలే వ్యంగారే భుక్తవజ్జనే, వృత్తే శరావసంపాతే భిక్షాం నిత్యం యతిశ్చరేత్.

ఆంధ్రవివరణము:— జఘన్యమగు గృహము (అనగా ఆనాటికివెనుకనొకమారు భిక్షార్థమై చరించినట్టి గృహము) మరల ప్రవేశింపక యుండునట్టి విధమున సన్యాసి భిక్షాటనము చేయవలయు నని సూత్రార్థము. అనగా భిక్షాకాలమునందు సన్యాసి ఏదైన నొక గృహమునకు వెడలిపోయినప్పుడు ఇతరములగు అనుపపత్తులద్వారా ఆలస్యము జరిగి లభింపనియెడల - ఆనాటికి మరల తాను ఆయింటిని భిక్షార్థియై ప్రవేశింపగా రాదని తాత్పర్యము. మనువుకూడ నిట్టులనేచెప్పెను - విధూమమగునట్టిదియును అసన్నముసలమగునట్టిదియును వ్యంగారమును అభుక్తవజ్జనము నైనదియును శరావసంపాతముకలదియు నగు ఇంటియందే యతి సర్వదా భిక్షను ఆచరించుచుండవలయు నని సూత్రార్థము.

## 134 సూ. నివృత్తాశీః [౧—౩—౧౫]

హరదత్తమితాక్షరా:— నివృత్తాశీరితి. అధికభిక్షాలాభార్థం గృహేష్వాశీర్వాదపరో న స్యాత్.

ఆంధ్రవివరణము:— సన్యాసియగునట్టివాడు అధికముగా భిక్షదొరకు నిమిత్తమై భిక్షార్థమేగిన గృహస్థుల ఇండ్లయందు ఆశీర్వచనములు చేయునట్టి స్వభావము గలవాడు గా కారాదని తాత్పర్యము.

## 135 సూ. వాక్చక్షుఃకర్మసంయమః [౧—౩—౧౬]

హరదత్తమితాక్షరా:— వాగితి. వాక్సంయమో మౌనం, చక్షుస్సంయమః పాదవిక్షేపాదన్యత్ర చక్షుషో రప్రవర్తనమ్. కర్మసంయమో భిక్షోశ్చోదితకర్మానతిక్రమః, అత్ర వాక్సంయమవిరోధేతు స్మృత్యంతరమ్— ధర్మయోగం పథి ప్రశ్నం స్వాధ్యాయం చ తథైవ చ, భిక్షార్థం దేహివచనం న నిందతి యతేరపీతి.

ఆంధ్రవివరణము:— సంయమమనగా నియమము. వాక్కుయొక్క సంయమము వాక్సంయమము. చక్షువనగా కన్ను. చక్షువుయొక్క సంయమము చక్షుస్సంయమము. కర్మ యనగా కార్యము కర్మయొక్క సంయమము కర్మసంయమము. సన్యాసి (అనగా భిక్షువు.) వాక్సంయమము గలవాడై చక్షుస్సంయమము కలవాడై కర్మసంయమము కలవాడై యుండవలయునని సూత్రార్థము. ఇచ్చట వాక్సంయమమనగా మౌనము వహించుట చక్షుస్సంయమమనగా నడచునప్పుడుభూమిమీద కాలు పెట్టదగినంత ప్రదేశమును తప్ప తక్కిన విషయములను చూడక యుండుట. కర్మసంయమమనగా సన్యాసాశ్రమమున కర్తృకృత్యములుగా విధింపబడిన కర్మలు తప్ప తక్కినవానిని చేయక యుండుట. ఈచెప్పిన నియమములలో వాక్సంయమ విరోధవిషయమున ఇతర

ర్థమగు స్మృతివచనముకూడ గలదు. ఏమనగా - ధర్మాను యోగమును పక్షిప్రశ్నమును స్వాధ్యాయమును భిక్షకొఱకై యాచించుటయును అను నీనాలుగును యతికైనను నిం దింపతగినవై యుండవు, అని.

## 136 సూ. కౌపీనాచ్ఛాదనార్థో వాసోబిభృయాత్. [౧–౩–౧౭]

హరదత్తమితాక్షరా:—కౌపీనమితి గుహ్యప్రదేశస్యనామ. తదాచ్ఛాద్యతే యావతా తావదేవవాసో భిభృయాత్. అధికంతు ప్రావరణాదిన బిభృయాత్.

ఆంధ్రవివరణము:—కౌపీనమనగా గుహ్యప్రదేశము. అట్టి గుహ్యప్రదేశమును కప్పిపుచ్చుకొనుటకు ఏమాత్రపు వస్త్రముండిన చాలునో ఆపాటి వస్త్రమును (అనగా కేవలము మానమును కప్పగల్గినంతటి పేలికను గోచిగా) సన్యాసి యగువాడు ధరింపవలయునని సూత్రార్థము.

## 137 సూ. ప్రహీణ మేకే నిర్ణిజ్య [౧–౩–౧౮]

హరదత్త మితాక్షరా:—ప్రహీణమితి. ఏకే మన్యంతే తదపి కౌపీనాచ్ఛాదనం ప్రహీణం జీర్ణం తథాన్యైస్త్యక్తం ప్రక్షాళ్య బిభృయాత్.

ఆంధ్రవివరణము:—సన్యాసి కౌపీనాచ్ఛాదనార్థమై వస్త్రమును ధరించుటలో కొంత భిన్నాభిప్రాయము గలదని రూపించుచున్నాడు - కొందఱు ఆచార్యులు ఆకౌపీనాచ్ఛాదన వస్త్రముగూడ ప్రహీణమై యున్నదానిగా చూచి - (అనగా జీర్ణమై (చినిగి) ఇతరులు అక్కఱలేదని పారవైచినట్టి పేలికగా చూచుకొని యనిభావము) దానిని తీసికొని చక్కగా నుదికి - ఆపైని ధరింపవలయు నని తాత్పర్యము.

## 138 సూ. నావిప్రయుక్తం ఓషధి వనస్పతీనా మంగం ఉపాదదీత. [౧–౩–౧౯]

హరదత్తమితాక్షరా:—వృక్షలతాదీనామంగం ఫలపత్రాద్యవిప్రయుక్తం తతోఽప్రచ్యుతం నోపాదదీత నగృహ్ణీయాత్. స్వయం పతితంతు గృహ్ణీయాత్.

ఆంధ్రవివరణము:—వస్త్రము నిమిత్తమై చెట్ల బెరడును వలిచి (అనగా నారదీసి) దానితో కౌపీనాచ్ఛాదనాదులను సిద్ధము చేసికొను ఆచారము ప్రాచీనకాలమునుండెడిది. ఓషధులు వనస్పతులు మున్నగువానియొక్క అవయవము (వస్త్రార్థమై) గ్రహించునప్పుడు అవిప్రయుక్తముగానున్నచో (అనగా పండ్లు ఆకులు మున్నగువానితో నిండియున్నచో) అట్టిదానిని గ్రహింపరాదని తాత్పర్యము స్వయముగా - అనగా తనంతతాను విప్రయుక్తమై యున్నయెడల - నట్టిదానిని గ్రహింపవచ్చును అనియు గ్రహింపదగును.

## 139 సూ. న ద్వితీయా మపర్తు రాత్రిం గ్రామే వసేత్. [౧–౩–౨౦]

హరదత్తమితాక్షరా:—న ద్వితీయా మితి. యత్ర వర్షరా త్రివశీలతో క్తా తమృతుం వర్జయిత్వా ఋత్వంతరేషు యస్మిన్ గ్రామే ఏకాం రాత్రి ముషితః తస్మిన్ గ్రామే న ద్వితీయాం వసేత్. గ్రామైకరాత్ర స్స్యా దిత్యర్థః.

ఆంధ్రవివరణము.—సన్యాసాశ్రమమునందు వర్తించువారికి వర్షర్తువునందు ధ్రువశీలురై యుండవలయునని నియమము చెప్పబడియున్నయది. కాబట్టి ధ్రువశీలతను చెప్పినట్టి ఆయొక్క (వర్ష)ఋతువునందు తప్ప తక్కిన

ఋతువులలో ఒకరాత్రిని గడపినట్టి గ్రామమునందు రెండవరాత్రిని గడపుటకై వసింపగూడదని యర్థము. అనగా సన్న్యాసి గ్రామైకరాత్రుఁడై (ఒక్కొక్కరాత్రి ఒక్కొక్కయూరియందు గడపునట్టి నియమముగలవాడై) వర్తింపవలయు నని తాత్పర్యము.

## 140. సూ. ముండ శ్శిఖీ వా [౧-౩-౨౧]

హరదత్తమితాక్షరా:— ముండ ఇతి. సర్వానేవ కేశా న్సహశిఖయా వాపయేత్. శిఖావర్జం వాపయేద్వా ముండశ్శిఖీ నేతి వికల్పేన ఏకదండ త్రిదండగ్రహణ వికల్పోపి ఉక్తః. అత్ర శ్రుతిస్మృతీ- అగ్నేరివ శిఖా నాన్యా యస్య జ్ఞానమయీ శిఖా, సశిఖీ త్యుచ్యతే విద్వా న్నేతరే కేశధారిణః ఇతి. అన్యచ్చ- సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజే ద్బుధః, ఏకదండం గృహీత్వా చ భిక్షుర్ధర్మం సమాచరేత్. శిఖీ యజ్ఞోపవీతీచ యద్వా సమ్యక్ప్రబోధితః, త్రిదండగ్రహణం కృత్వా భిక్షుధర్మం సమాచరేత్. ఇతి.

ఆంధ్రవివరణము:— తలయంతయును మున్నగా (ఏమి జుట్టు మిగులకుండ) క్షురకర్మమును చేయించుకొన్నట్టి వాడు ముండు డనబడును. శిఖనుమాత్రము (జుట్టువఱకు మాత్రము) ఉంచికొని తక్కినదానిని క్షురకర్మము చేయించుకొన్నవాడు శిఖి యనబడును. సన్న్యాసి ముండుడుగాగాని శిఖిగాగాని ఉండవలయు నని సూత్రార్థము. అనగా జుట్టుతోగూడ కలిపి తలపైనున్న కేశములను (వెంట్రుకలను) అన్నింటిని క్షౌరము చేయింపనైనను చేయింపవచ్చును. లేదా శిఖ నొక్కదానినే వదలి తక్కినదానినైనను క్షౌరము చేయించుకొనవచ్చు నని తాత్పర్యము. "ముండుడుగాగాని శిఖిగాగాని" అని ఇందు వికల్పము చెప్పుటచేత ఏకదండ సన్న్యాసమునుగాని లేదా త్రిదండ సన్న్యాసమునుగాని (తనకిష్టమువచ్చినటులుగా) సన్న్యాసి గ్రహింపవచ్చును-అని వికల్పము చెప్పబడినది. ఈవిషయమున శ్రుతి స్మృతులు కూడ నిట్టులు చెప్పుచున్నయని- అగ్నియొక్క జ్వాలవలె ఎవ్వనికి జ్ఞానస్వరూపమున నున్న శిఖతప్ప మఱి యితరముండదో అట్టివాడే శిఖిగా (శిఖకలవాడుగా) పెద్దలచేత చెప్పబడుచుండునేగాని తక్కినట్టి కేశధారులందరును శిఖగలవారుగా చెప్పబడరు. అని మఱియును సన్న్యాసి శిఖాసహితముగా వపనము (క్షౌరము) చేయించుకొని బహిస్సూత్రమును (జందెమును) త్రెంపి పారవైచి ఏకదండమును గ్రహించి ధర్మాచరణమును చేసికొనవలయును. లేని చో శిఖావంతుడై యజ్ఞోపవీతములను ధరించినవాడై చక్కగా ధర్మవిధులచేత ప్రబోధితుడై త్రిదండసన్న్యాసమును గ్రహించిగాని ధర్మాచరణమును భిక్షువు చేయవలయును- అని తాత్పర్యము.

## 141 సూ. వర్జయే ద్బీజవధమ్ [౧-౩-౨౨]

హరదత్తమితాక్షరా:— వర్జయేదితి. బీజాని వ్రీహ్యాదీని తేషాం వధః ముసలాదినా అవఘాతః తం న కుర్యాత్. తేన తండులస్యాదనీకరణ మప్యత్ర ఉపలక్షితం కుత ఇతిచే త్పక్వాన్నస్యైవ స్వామిత్వా దస్య.

ఆంధ్రవివరణము:— బీజములనగా వి త్తనములు. వడ్లు మొదలగు ధాన్యరాశియంతయును ఇచ్చట బీజశబ్దముచేత గ్రహింపబడుచున్నయది. బీజములయొక్క వధ బీజవధ. అనగా రోకళ్లు మొదలగువానితో వడ్లు మొదలగు ధాన్యబీజములను దంచుటయే ఇచ్చట బీజవధ యన్నమాటకు అర్థము. సన్న్యాసి యగువాడు ఉదరపూరణమునకై బీజవధమును (అనగా వడ్లుమున్నగు ధాన్యరాశిని దంపించి బియ్యముచేయుట మున్నగు కార్యమును) వర్జింపవలయును అని సూత్రార్థము. బీజవధము కూడ దన్నందున స్వయముగా అన్నాదులను వండుట మున్నగునవికూడ సన్న్యాసిచే వర్జింపతగినదే యని యెఱుంగవలయును. ఏలయందు రేని

ఈతడు ఇతరులు పక్వముచేసినట్టి అన్నమును యాచించికొని పోవుటకే అధికారము గలవాడుగాని శాస్త్రవిధులననుసరించిస్వయముగా పక్వముచేసికొనుట కర్హతలేనివాడుగనుక.

142 సూ. సమో భూతేషు హింసానుగ్రహయోః [౧—౩—౨౩]

హరదత్తమితాక్షరా :— సమఇతి. హింసాయాం అనుగ్రహేచ భూతేషు సమః, యో హినస్తి యోవానుగృహ్ణాతి తత్రతత్ర నిర్వికారస్స్యా దిత్యర్థః

ఆంధ్రవివరణము:—మఱియును ఈసన్న్యాసను నవలంబించునట్టివాడు భూతములవిషయమున సంభవించుచుండెడి హింసానుగ్రహములయందు సముడై (అనగా సమభావుడై) వర్తింపవలయు నని సూత్రార్థము. అనగా తనను ఏప్రాణియైనను హింసించినను లేదా ఏప్రాణియైనను అనుగ్రహించినను ఈవిధములగు కార్యములను చేయునట్టి ప్రాణికోటియందు తాను [ఆగ్రహానుగ్రహాదులు గాని దుఃఖసంతోషములు గాని లేక] సమానమగునట్టి ప్రీతిని గనబరచుచున్నట్టివాడై వర్తింపవలయునని తాత్పర్యము అనగా నిర్వికారుడై యుండదగు నని భావము.

143 సూ. అనారంభీ [౧—౩—౨౪]

హరదత్తమితాక్షరా:— అనారంభీతి. ఐహికం పారత్రికంచ న కంచి దారంభం కుర్యాత్ యథా హాపస్తంబః అనీహైవానముత్ర శ్చ రేదితి.

ఆంధ్రవివరణము:— సన్న్యాసి యగునట్టివాడు ఐహికమగునట్టి కార్యముగాని అముష్మికమగునట్టి కార్యమునుగాని దేనిని ఆరంభించరాదని తాత్పర్యము. ఆపస్తంబుడుకూడ నిట్టులనే పల్కెను - అనీహుడును అనముత్రుడునై యతి చరింపవలయును, అని.

విశేషాంశములు— మస్కరీ యభాష్యమునందు 142-143వ సూత్రములను 'సమోభూతేషు' 'హింసానుగ్రహయోరనారంభీ' అని రెండుసూత్రములుగా విభజించి వ్యాఖ్యానముచేసిరి. ఈవ్యాఖ్యానము ననుసరించినచో సమస్తములగు ప్రాణులయందును తాను (సన్న్యాసి) సముడై అనగా స్వపక్ష పరపక్షాది భేదము లేనివాడై యుండవలయును' అని మొదటిసూత్రమునకును, హింసానుగ్రహరూపములగు కార్యములను తాను ఆరంభింపక మెలగెడివాడుగా నుండవలయు నని రెండవసూత్రమునకును అర్థము ఏర్పడుచున్నయది. ఇదియును సమంజసముగానే యున్నది.

144 సూ. వైఖానసో వనే మూలఫలాశీ తపశ్శీలః [౧—౩—౨౫]

హరదత్తమితాక్షరా:— ఇదానీం వైఖానసస్య ధర్మమాహ—వైఖానసఇతి. వైఖానసో వానప్రస్థః వసన్వనే మూలానిఫలానిచ పక్వాని వా అశ్నీయా న్నపునరోదనం. తపః కాయపరిశోషణమ్. తతశ్చ మూలఫలాన్యపి స్వల్పాన్యేవాశ్నీయా దితి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— ఇటుపైని వైఖానసుడాచరింపవలసినట్టి ధర్మములను వివరించుచున్నాడు - వైఖానసుడనగా అరణ్యములయందు వసించుచు తపసు చేయునట్టి ఒక ఆశ్రమమువాడు. వైఖానసుడు అరణ్యమునందే వసించుచు కందమూలములనున్నూ పక్వములై చెట్లనుండి తమంత రాలినట్టి పండ్లనున్నూ భక్షించుచు తపశ్శీలుడై వర్తింపవలయునే గాని అన్నమును వండికొని తినరాదు అనియును, ఆకందమూలఫలములుగూడ కొలదిగనే భక్షింపవలయు ననియును తాత్పర్యము.

145 సూ. శ్రావణకేనాగ్ని మాధాయ [౧—౩—౨౬]

హారదత్తమితాక్షరా:— శ్రావణకేనేతి. శ్రావణకం నామ వైఖానసం శాస్త్రమ్ తదుక్తేన ప్రకారేణ అగ్ని మాధాయ సాయంప్రాత ర్జుహుయా దితి శేషః

ఆంధ్రవివరణము:— మఱియును ఆవానప్రస్థుడు శ్రావణక శాస్త్రము (అనఁగా వైఖానసుఁ డాచరింపవలసిన విధులను బోధించు శాస్త్రమునకు శ్రావణకమని పేరు) చెప్పినచొప్పున సాయంకాల ప్రాతః కాలములయందు ఆగ్నులను వ్రేల్చుచుండగా వలయు నని సూత్రార్థము.

## 146 సూ. అగ్రామ్యభోజీ [౧—౩—౨౭]

హారదత్తమితాక్షరా:— అగ్రామ్యేతి. ఫలమూలాన్యపి గ్రామ్యాణి న భుంజీత.

ఆంధ్రవివరణము:— ఆఫలమూలాదులను గూడ గ్రామములయందు పుట్టినవిగా నున్నచో నట్టివానిని భుజింపనివాడై యుండవలయు నని తాత్పర్యము.

## 147 సూ. దేవపితృమనుష్యభూతర్షిపూజకః [౧—౩—౨౮]

హారదత్తమితాక్షరా— దేవేతి. వన్యైరేవ ఫలమూలై రహరహః పంచ మహాయజ్ఞాన్కుర్యాత్. అత్ర మనుః— ఆరణ్యై ర్వివిధై ర్మేధ్యైః శాకమూలఫలాదిభిః, ఏతానేవ మహాయజ్ఞా న్నిర్వపే ద్విధిపూర్వకమ్.

ఆంధ్రవివరణము:— మఱియును ఈవానప్రస్థుడు అరణ్యమునందు పుట్టెడి కందమూలఫలాదులచేత నే దినదినమును దేవపూజపితృపూజ,మనుష్యపూజ భూతపూజ ఋషిపూజఅనునీ అయిదు మహాయజ్ఞములను నిర్వర్తింపవలయునని భావము. మనువుగూడ నీవిషయమున నిట్లులనే చెప్పినాడు:- పవిత్రములై ఆరణ్యకములై యున్న వివిధములగు శాకమూలఫలాదులచేత ఈపంచమహాయజ్ఞములను యథావిధిగా చేయుచుండవలయును -అని. ఈపంచమహాయజ్ఞములను గ్రామ్యాన్నములతోనే చేయ నగు నని మస్కరిభావము.

## 148 సూ. సర్వాతిథిప్రతిషిద్ధవర్జమ్ [౧—౩—౨౯]

హారదత్తమితాక్షరా:— సర్వాతిథీతి. య ఏవ ముపాగచ్ఛంతి తే సర్వే ప్యస్యాతిథయః న పున ర్బ్రాహ్మణస్య చనాతిథి ర్బ్రాహ్మణ ఇత్యయం నియమోనాస్తి. తత్రాపి స్తేనపతిత ప్రభృతీ న్వర్జయిత్వా ప్రతిషిద్ధ వర్జమితి.

ఆంధ్రవివరణము:— మఱియును వానప్రస్థుడు సర్వాతిథియై-[అనఁగా వారు వీ రనునట్టి భేదము లేకుండ తనను గుఱించి వచ్చినట్టి వారందఱిని అతిథులనుగా చేకొని సత్కరించువాడుగానుండి యని యర్థము,) వర్తింపవలయును. అందుననుకూడ ధర్మశాస్త్రముల ననుసరించి ఎవ్వరిని ప్రతిషిద్ధులుగా పరిగణింతురో వారు తప్ప తక్కినవారిలో సర్వాతిథియై వర్తింపలయునని సూత్రార్థము. అనఁగా బ్రాహ్మణునకు బ్రాహ్మణుడే అతిథి గావలయునేగాని అబ్రాహ్మణుడు కారాదు అనునట్టి నియమముల నుంచుకొనక వానప్రస్థుడు సర్వాతిథియై యుండవలయునని భావము. అందునను కూడ స్తేనులు (దొంగతనము చేయువారు పతితులు (ధర్మచ్యుతులు) మున్నగువారిని వర్జింపగా వలయునని యును ఎఱుంగవలయును.

## 149 సూ. వైష్కమప్యుపయుంజీత. [౧—౩—౩౦]

హారదమిత్తమితాక్షరా:— వైష్కమితి. విష్కాః దుష్ట మృగాః వ్యాఘ్రాదయః తైర్హతం మాంసం వైష్కం తదప్యభావే ఉపయుంజీత. అపిశబ్దాత్ గౌణార్థః. ఫలమూలాద్యభావే

ఈదపి భక్ష్యమితి. తత్రాపి పంచ పంచన ఖా భక్ష్యా ఇత్యేతద్వ్యతిరిక్తంవర్జయిత్వా ప్రతిషిద్ధవర్జమితి పదం కాకాక్షిన్యాయేన ఉభయత్ర సంబధ్యతే.

ఆంధ్రవివరణము:— విష్కములనగా దుష్టమృగములగు పులులు మొదలగునట్టి జంతువులు. ఇట్టి విష్కములు చంపి పడవైచినట్టి మాంసము వైష్కమని యనఁబడును. అతిథులు మున్నగువారు రాఁగు దెంచినప్పుడు గాని, కొందఱి మతముచొప్పున తనకే ఫలమూలాద్యభావమైనప్పుడుగాని తక్కిన కందమూలాదులు లేనిచో తుదకు దుష్టమృగాదులద్వారా చంపబడినట్టి జంతువుల మాంసమైనను సరియే తెచ్చి అతిథ్యమునకై యుపయోగించుకొనవచ్చునని సూత్రార్థము. వెనుకటిసూత్రమునందు చెప్పబడినట్టి ప్రతిషిద్ధవర్జం అనుమాట ఈసూత్రమునందు కూడ కాకాక్షిన్యాయ్యము ననుసరించి సంబంధించుచున్నయది.

150 సూ. న ఫాలకృష్ట మధితిష్ఠేత్ [౧—౩—౩౧]

హరదత్తమితాక్షరా:— నేతి. అరణ్యే వసన్హాలేన కృష్టం ప్రదేశం నాధివసేత్.

ఆంధ్రవివరణము:— వానప్రస్థుడు అరణ్యమునందే వసించినను గూడ నితరులు నాగలితో దున్ని [వ్యవసాయ యోగ్యముగా చేసియుంచి]నట్టి ప్రదేశమునందు నివాసమును చేయగా రాదని తాత్పర్యము.

151 సూ. గ్రామంచన ప్రవిశేత్. [౧—౩—౩౨]

హరదత్తమితాక్షరా:— గ్రామమితి. వనే వసతోఽపి యాదృచ్ఛికోఽపి గ్రామప్రవేశో నిషిద్ధః

ఆంధ్రవివరణము:— మఱియును అతడు అరణ్యములందు వసించువాడయ్యును యాదృచ్ఛికముగా నైనను సరియే గ్రామమును ప్రవేశింపగారాదు. అని సూత్రార్థము.

152 సూ. జటిలశ్చీరాజినవాసాః [౧—౩—౩౩]

హరదత్తమితాక్షరా:— జటిలఇతి. జటిలః కేశశ్మశ్రులోమనఖధారీ, చీరం దర్భాదినిర్మితం వాసః అజిన ముత్తరీయం తథాచ స్మృత్యంతరే వ్యవస్థాదర్శనాత్.

ఆంధ్రవివరణము:— మఱియును ఆవానప్రస్థుడు జటిలుడుగను చీరాజినాదులను ధరించినవాడుగను నై యుండవలయు నని తాత్పర్యము. కేశములు (వెంట్రుకలు) శ్మశ్రులు (మీసములు) లోమములు (ఒడలియందలి రోమములు) నఖములు (గోళ్లు) వీనిని తీయక అట్లే పెంచుకొని యుంచుకొనెడివానికి జటిలుడని పేరు. దర్భలు మున్నగువానితో నిర్మితమైనట్టిది వస్త్రమునియును, తోలుతో నైనది ఉత్తరీయమనియును కూడ నిట్టులనే విశేషార్థములును ఎఱుంగునది. ఇతరస్మృతులలోని వ్యవస్థయే యుండవలెను తాత్పర్యము.

153 సూ. నాతిసంవత్సరం భుంజీత [౧—౩—౩౪]

హరదత్తమితాక్షరా:— నాతిసంవత్సర మితి. సంవత్సర మతిక్రాంతమతిసంవత్సరం. తదారణ్యమపి నాశ్నీయాత్. అత్ర మను రాహ:—

శ్లో. త్యజే దాశ్వయుజేమాసి మున్యన్నం పూర్వసంచితం, జీర్ణాని చైవ వాసాంసి పుష్పమూలఫలాని చేతి.

ఆంధ్రవివరణము:— ఒక్కయేడాదికి పైగాఁబ్రాతపడినట్టి ధాన్యమునకు అతిసంవత్సరమని పేరు. వానప్రస్థుడగువాడు అతిసంవత్సరమగునట్టి ధాన్యాదికమును భుజింపగా రాదు అని సూత్రార్థము. ఈవిషయమును మనువుకూడ అన్నాడు:— పూర్వసంచితమై యున్నట్టి (భోజనార్థము సిద్ధముచేయఁబడిన) ధాన్యమును ఆశ్వయుజమాసమునందు పరిత్యజింపవలయును. ఇట్టులనే జీర్ణములైన వస్త్ర

ములు పుష్పములు ఫలములు మున్నగువానిని సైతము త్యజింపవలయును అని.

154. సూ. ఐకాశ్ర్యం త్వాచార్యాః ప్రత్యక్షవిధానాద్గార్హస్థ్యస్య గార్హస్థ్యస్య. [౧-౩-౩౫]+

హరదత్తమితాక్షరా:— ఉక్తా ఆశ్రమాః తేషాం వికల్పసముచ్చయావపి దర్శితౌ, ఇదానీం తేషాం ప్రాధాన్యం దర్శయతి ఐకాశ్ర్యమితి:- తుశబ్దో విశేషవాచీ. సర్వేషు వేదశాస్త్రేతిహాసపురాణాదిషు గృహస్థధర్మవవ అగ్నిహోత్రాదయః ప్రాచుర్యేణ విధీయంతే. తత స్సర్వఏవాచార్యాః గార్హస్థ్యస్య ఐకాశ్రమ్యం ప్రాధాన్యం మన్యంతే. తత్రాశక్తానా మితరాశ్రమధర్మా విధీయంతే. ప్రత్యక్షవిధానా దితరాశ్రమాణాం ప్రత్యక్షేణోపజీవ్యత్వాత్. ద్విరుక్తి ర్వ్యాఖ్యాతా.

ఇతి శ్రీహరదత్తవిరచితాయాం గౌతమీయసూత్రవివృతౌ మితాక్షరాయాం ప్రథమప్రశ్నే తృతీయోధ్యాయ స్సమాప్తః.

ఆంధ్రవివరణము:—ఇంతవరకు ఆశ్రమధర్మములును అందుగల వికల్పసముచ్చయములును ప్రదర్శింపబడినవి. కాన నిటుపైని ఆయాశ్రమములలో ప్రాధాన్యమును ప్రదర్శించుచున్నాడు. సమస్తములగునట్టి వేదములు శాస్త్రములు ఇతిహాసములు పురాణములు మున్నగువానియందు గృహస్థధర్మమునకే ప్రత్యక్ష విధానమును బట్టి ప్రాధాన్యమును ధర్మశాస్త్రప్రవక్తలగునట్టి ఆచార్యులందరును విధించుచున్నారని సూత్రార్థము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడును అధిగత కావ్యతీర్థాది బిరుదుడును పంచాగ్నివంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మసూత్రాంధ్రవివరణమునందు ప్రథమప్రశ్నమునందు మూడవదగు నధ్యాయము.

## గౌతమధర్మసూత్రములు

### నాల్గవయధ్యాయము ప్రారంభము

155 సూ. గృహస్థ స్సదృశీం భార్యాంవిందే తానన్యపూర్వాం యవీయసీం [౧-౪-౧]

హరదత్తమితాక్షరా:— అథగృహస్థధర్మా ఉచ్యంతే. గృహస్థేతి. గృహస్థ ఇతి భావినం జ్ఞాప్యవదేశః. అథవా గృహస్థస్య యే ధర్మాస్తే వివాహాత్ప్రాగపి స్నాతకస్యాపి సమా ఇతి దర్శనార్థంచ. జాత్యాకులేనచ సదృశీం, అన్యస్మై వాచాప్యదత్తాం, అవరవయసీమేవం భూతాం భార్యాం విందేతోద్వహేత్.

ఆంధ్రవివరణము:—ఇటుపైని గృహస్థధర్మములు చెప్పబడియున్నవి. ఇచ్చట గృహస్థుడను మాట స్నాతకునికి మున్ముందు రాబోవునట్టి సంజ్ఞను వ్యపదేశించుటకై యని యెఱుగునది. లేదా గృహస్థునకు విధింపబడినట్టి ధర్మములే స్నాతకునికిని వివాహము నిర్వర్తితము కాకముందుకూడ ఆచరింపదగునని సూచించుటకని యైనను ఎఱుంగవచ్చును. గృహస్థుడు, తనయొక్క జాతికిని కులమునకును అన్నివిధముల సమానరాలై యుండునట్టి దానిని, ఇతరులకు వాచాపి దానము చేయబడి యుండనట్టిదానిని-తనకంటెను వయస్సునం జాలచిన్నదిగా నుండునట్టిదానిని -భార్యనుగా (పెండ్లి చేసి) కొనవలయునని సూత్రార్థము,

విశేషాంశములు— ఇచ్చట సదృశీభార్య యనగా జాతిచేత సదృశురాలైనట్టి భార్యయనియే యర్థము చేయవలయునుగాని కులముచేత సదృశురాలు అని అర్థము

చేయుగారాదనియును, కాబట్టియే శాస్త్రములయందు- విద్యా ప్రణష్టా పునరభ్యుపైతి జాతిప్రణాశేత్విహ సర్వనాశః, కులాపదేశేన యథాభిపూజ్యా తస్మాత్కులీనాం స్త్రియ ముద్వహేత- [విద్యనశించిపోయినచో మరల నార్జించుకొనగావచ్చును. కానిజాతి నశించినచో దానితో పాటు సర్వమును నాశనమగుచున్నది కాబట్టి కుల మనునపదేశముచేత జాతినశింపక పూజ్యారాలుగా నెట్టులు కాగలదో అట్టి కన్యకను వివాహమాడవలెను. కాబట్టియే కులీనురాలగు స్త్రీని పెండ్లాడవలెననిరి.] అనియును మస్కరి వ్రాసినాడు.

156. సూ. అసమాన ప్రవరైర్వివాహః [౧-౪-౨]

హరదత్తమితాక్షరా:— అసమానప్రవరైరితి- సమానఃఏకః ప్రవరో యేషాం తైస్సహానవివాహః తద్యథా—హారితకుత్స పింగశంఖ దర్భ హైమకభవానాం ఆంగిరసాంబరీష యౌవనాశ్వేతి. హారీతః కౌత్సీం నోద్వహేదిత్యాది ప్రవర ప్రపంచ ఆపస్తంబీయే ద్రష్టవ్యః

ఆంధ్రవివరణము:—మఱియు నతడు సమానమగు ప్రవరగలదానితో వివాహమును నెఱపుకొనగారాదని సూత్రమునకర్థము. హారిత, కుత్స పింగ శంఖ దర్భ హైమకభవులకు అంగిరస అంబరీష యౌవనాశ్వులు సమానప్రవరలు గలవారలు. వీరే ప్రవరలవారికి సమానప్రవరలయ్యెదరో ఆవిషయము సమగ్రముగా "హారీతుడు కౌత్సగోత్రయగు దానిని పెండ్లాడగారాదు" అను మున్నగు ఆపస్తంబీయ ప్రవరకాండమునందు చూడవచ్చును.

157. సూ. ఊర్ధ్వం సప్తమాత్పితృబంధుభ్యో బీజినశ్చ మాతృబంధుభ్యః పంచమాత్. [౧-౪-౩]

హరదత్తమితాక్షరా— ఊర్ధ్వమితి. పితరమారభ్య తద్బంధువర్గే గణ్యమానే సప్తమాచ్ఛిరస ఊర్ధ్వంజాతా ముద్వహేత్. మాతరమారభ్య తద్బందువర్గే గణ్యమానే పంచమాచ్ఛిరసఊర్ధ్వంజాతా ముద్వహేత్. బీజినశ్చసప్తమా దూర్ధ్వమితి చకారాత్సిద్ధ్యతి. యథాక్షేత్రీ వంధ్యోరుగ్ణోవా దేవరం ప్రార్థయతే మమక్షేత్రే పుత్త్ర ముత్పాదయేతి. యద్వా సంతానక్షయే విధవాం గురవోనియుంజతే. దృష్టంవిచిత్ర వీర్యక్షేత్రే సత్యవతీ వాక్యాద్వ్యాసోధృతరాష్ట్రాదీనుత్పాదితవానితి. యథాహ యాజ్ఞవల్క్యః- శ్లో. అపుత్రేణపరక్షేత్రేని యోగోత్పాదితస్సుతః, ఉభయోరప్యసౌ రిక్థీ పిండదాతాచ ధర్మతః- ఇతి. తద్విషయ మేతద్బీజినశ్చేతి వచనమ్.

ఆంధ్రవివరణము:—తండ్రి మొదలుకొని తద్బంధువర్గము లెక్కించినప్పుడు ఏడవతరము తర్వాత పుట్టినట్టి కన్యకనున్నూ తల్లి మొదలుకొని తద్బంధువర్గమును లెక్కించినపుడు అయిదవతరముకు తర్వాతపుట్టినట్టికన్యకనున్నూ బీజసంబంధులలో ఏడవతరమునకు పిమ్మట జనించిన కన్యకనున్నూ వివాహమాడవలయునని సూత్రార్థము. క్షేత్రియగువాడు (అనగా శాస్త్రతః భర్తయైనవాడు) వంధ్యుడుగాగాని రోగిగాగాని అయియుండుటచేత "నాభార్యయందు సంతానము నుత్పాదింపజేయుమని దేవరుని ప్రార్థించినప్పుడు." గాని, సంతానక్షయము కల్గినప్పుడు [విచిత్రవీర్యక్షేత్రమున సత్యవతీవాక్యము వలన వ్యాసుడు ధృతరాష్ట్రాదులను ఉత్పాదించిన విధమున] గురువులు విధవయగు స్త్రీని పుత్రార్థమై సమర్పింపగా గాని, కల్గునట్టి సంతానము బీజాలని చెప్పబడును. ఇట్టివీరు ఎవ్వరియందు పుట్టుచున్నారో ఎవ్వారికి పుట్టుచున్నారో ఆయుభయుల ద్రవ్యమునకు వారసులుగా మాత్రమేగాక

వారికి ఉదకపిండాదుల నొసంగ నర్హత గలవారుగా గూడ నయ్యెదరని యాజ్ఞవల్క్యు డనియెను.

## 158 సూ. బ్రాహ్మో విద్యాచారిత్ర బంధు శీల సంపన్నాయ దద్యాదాచ్ఛాద్య అలంకృతామ్. [౧—౪—౪]

హరదత్తమితాక్షరా:— అథవివాహభేదాః— బ్రాహ్మ ఇతి. విద్యా వేదవిద్యేత్యర్థః, చారిత్రం చోదితకర్మానుష్ఠానమ్. బంధవో జ్ఞాతయశ్చ మాతులాదయః శీలంవిహితేషు శ్రద్ధా. ఏతైర్గుణైస్సంపన్నాయ వస్త్రయుగళేనాచ్ఛాద్య యథావిభవ మలంకృతాం కన్యాం దద్యాత్. ఏవంవిధస్య వివాహస్య బ్రాహ్మసంజ్ఞా.

ఆంధ్రవివరణము:—ఇటుపైని వివాహములలో గల భేదములు నిరూపింపబడుచున్నవి -విద్యాచారిత్ర బంధు శీల సంపన్నుడగునట్టి వరునకు -అనగా విద్యాసంపన్నుడును చారిత్రసంపన్నుడును బంధుసంపన్నుడును శీలసంపన్నుడును అగునట్టి వరునకు-ఉన్నంతలో కన్యకను వస్త్రాభరణాదులచే నలంకరించి ఒసంగవలయును. ఇట్లు ఒసంగి చేయునట్టి వివాహము బ్రాహ్మవివాహమని యనఁబడునని సూత్రార్థము. ఇచ్చట విద్యాసంపన్నుడనగా వేదవిద్యచేత సంపన్నుడై యుండునట్టి వరుడనియును, చారిత్రసంపన్నుడనగా శ్రుతిచోదితమగు నిజకులోచితమగు ధర్మమును అనుష్ఠించు గుణముకలవాడై యుండవలయుననియును, బంధుసంపన్నుడనగా జ్ఞాతులు మేనమామలు మున్నగు బంధువులతో నిండియుండునట్టి వాడనియును, శీలసంపన్నుడనగా ధర్మతః విహితము లైనట్టి కార్యములను చేయువాడుగా నుండవలయుననియును సూచిత మగుచున్న యది.

## 159. సూ. సంయోగమంత్రః ప్రాజాపత్యే సహధర్మశ్చర్యతామితి. [౧—౪—౫]

హరదత్తమితాక్షరాః—సంయోగ ఇతి. ప్రాజాపత్యసంజ్ఞకే వివాహే సహధర్మశ్చర్యతామితి ప్రదానమంత్రః. యద్యపి బ్రాహ్మాదిష్వపి సహధర్మచర్యా భవతి తథాప్యాంతావదనయా సహధర్మశ్చరితవ్యః, నాశ్రమాంతరం ప్రవేష్టవ్యం నాపి స్త్ర్యంతర ముపయంతవ్య మితి మంత్రేణ సమయః క్రియతే. ఏష బ్రాహ్మాదేః ప్రాజాపత్యస్య విశేషః ఆచ్ఛాద్యాలంకృతామితి సమానమ్.

ఆంధ్రవివరణము:— [ఈ స్త్రీతో గూడ కలసి ధర్మమును చరింతువుగాక యని సంయోగమంత్రమును చెప్పి అలంకృతను చేసి కన్యక నొసంగుట ప్రాజాపత్య వివాహము అనఁబడును. ] ప్రాజాపత్య వివాహమునందు సహధర్మశ్చర్యతామని సంయోగమంత్రమును చెప్పి కన్యకను ఒసంగవలయునని సూత్రార్థము. అయితే బ్రాహ్మాది వివాహములలోగూడ ఇట్టి సహధర్మచర్య కలదు. మఱివానికిని దీనికిని గల భేదమేమనవచ్చును. కాని అందు సహధర్మచర్యయున్నను "చిట్టచివఱవఱకును ఈస్త్రీతో సహధర్మము చరింపవలసియున్నది. ఆశ్రమాంతరమును ప్రవేశింపనూరాదు. మఱియొక స్త్రీని పొందనూరాదు." అని ఇత్యాద్యర్థముగల మంత్రముతో నిందు విశేషముగా సమయము (శపథము) చేయింపబడుచుండును. ఇదియే బ్రాహ్మాది వివాహమునకును ప్రాజాపత్యవివాహమునకును గల విశేషము అని యెఱుంగునది. తక్కిన ధర్మములు అనగా కన్యక నలంకరించి యొసంగుట మున్నగునవి అన్నింటియందును సమములే యై యున్నవి.

## 160. సూ. ఆర్షే గోమిథునం కన్యావతే దద్యాత్. [౧—౪—౬]

హరదత్తమితాక్షరా:—ఆర్షఇతి. ఆర్ష సంజ్ఞకే వివాహేగోమిథునంస్త్రీపుంరూపం కన్యావతే దద్యా ద్వరస్త ద్బంధుర్వాకశ్చిత్. ఆచ్ఛాద్యాలంకృతామిత్యా ద్యత్రాపి సమాసమేవ.

ఆంధ్రవివరణము:— ఆర్ష వివాహమునందు వరుడుగాని ఆతని బంధువులలో నెవ్వరైన నితరుడుగాని కన్యక గలవానికి (అనగా కన్యక తండ్రికి) గోమిథునము నొసంగవలయునని సూత్రార్థము. అనగా ఇట్టులు చేయబడి అలంకరింపబడిన కన్యకను ఇచ్చుట ఆర్షవివాహమనబడును అనితాత్పర్యము. ఇందు కూడ కన్యక నలంకరించుట మున్నగునవి వెనుకటి వివాహములందువలెనే యొనర్పదగునని యెఱుంగవలయును.

161. సూ. అంతర్వేద్యృత్విజే దానం దైవోలంకృత్య. [౧—౪—౭]

హరదత్తమితాక్షరా:—అంతర్వేదీతి. అంతర్వేది. వేద్యాదక్షిణాకాలే ఋత్విజేకర్మకుర్వతే యదలంకృత్య కన్యాయాదానం సదైవోవివాహః. ఆచ్ఛాద్యాలంకృతామితి. ప్రకృతేపు నరలంకృత్యేతివచనం వరస్యా ప్యంగుళీయాదిభిరలంకారార్థమితి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—యజ్ఞవేదికయందు ఆర్త్విజ్యమును నెఱపుచుండినట్టి యోగ్యుడగు ఋత్విక్కునకు దక్షిణాప్రదానసమయమున కన్యకను అలంకరించి యొసంగుట దైవ వివాహ మనబడునని సూత్రార్థము. వెనుకటి సూత్రమునందువలె నిచ్చుటకుగూడ అలంకృతాం అన్న మాట అనువర్తించి వచ్చుచున్నను మరల నిందు "అలంకృత్య" యని చెప్పుట కేవలము వధువునకు మాత్రమే కాకుండ వరునకుగూడ అంగుళీయకాదులద్వారా అలంకారమును చేయింపవలయునని తెల్పుటకని భావము.

162 సూ. ఇచ్ఛంత్యాస్స్వయం సంయోగో గాంధర్వః [౧—౪—౮]

హరదత్తమితాక్షరా:—ఇచ్ఛంతీతి.ఇచ్ఛంత్యా వధ్వాః ఇచ్ఛతోవరస్య సంయోగో గాంధర్వోవివాహః, స్వయమితివచనాద్వరేచ్ఛాగమ్యతే.

ఆంధ్రవివరణము:— వరునియందు ఇష్టముకల్గి కన్యకను అట్టివాడేయగు వరునకును (అనగా ఒకరిపై నొకరికి అనురాగముగల్గి ఒకరినొకరు ఇచ్ఛయించుకొని నట్టి కన్యకకూ వరునకూ అని అర్థము.) స్వయముగా ఏర్పడి సంయోగమే గాంధర్వ వివాహమని చెప్పబడుచున్నయది. ఈసూత్రమునందు స్వయముగానని చెప్పుటచేత వరేచ్ఛ (అనగా నొకరినొకరు వరించు కోరిక) ముఖ్యముగా నుండవలయునని సూచితమగుచున్నయది.

163 సూ. విత్తేనానతిస్త్రీమతామాసురః [౧—౪—౯]

హరదత్తమితాక్షరా:—విత్తేనేతి. యత్ర స్త్రీమతాం కన్యావతాం పిత్రాదీనాం విత్తేన ధనప్రదానేన ఆనతిరార్జనం క్రియతే స ఆసురోవివాహః. అత్రయాజ్ఞవల్క్య ఆహ. శ్లో. ఆసురోద్రవిణాదానాదితి. మనురపి శ్లో. జ్ఞాతిభ్యోద్రవిణందత్వా కన్యాయైచ స్వశక్తితః, కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే-ఇతి. స్త్రీమతామితి వచనాన్న కేవలం కన్యాయై ధనప్రదానమాసురత్వేనిబంధనమితిజ్ఞేయమ్. తథాచ స్మృత్యంతరం శ్లో. యాసాం నాదదతే శుల్కం జ్ఞాతయోన సవిక్రయః అర్హణం తత్కుమారీణాంఆనృశంస్యాన్న కేవలమ్.ఇతి.

ఆంధ్రవివరణము:—శ్రీమంతులనగా పెండ్లికానట్టి (కన్యకలు) వారగు ఆడుపిల్లలు గల గృహస్థులని భావము. శ్రీమంతులగునట్టి గృహస్థులకు ధనద్రవ్యాదుల నొసంగి తద్ద్వారా వారిని అంగీకరింపజేసి కన్యకను తెచ్చుకొనుటగల వివాహము అసురవివాహ మనబడునని సూత్రార్థము. అనగా కన్యకయొక్క తల్లిదండ్రులకు ధనమొసంగి కన్యకను కొనితెచ్చికొని చేసికొనునట్టి వివాహము అసురవివాహమని తాత్పర్యము. ఈవిషయమునందు యాజ్ఞవల్క్య డిట్లుచెప్పినాడు "ద్రవిణము నొసంగి కన్యకను తెచ్చికొనుట ఆసురమనబడును" అని. మనువు కూడ చెప్పుచున్నాడు:- కన్యకయొక్క జ్ఞాతులకు (అనగా తల్లిదండ్రులకు) ధనమునొసంగి కన్యకకుగూడ తనశక్తిననుసరించి ధనమునొసంగి స్వేచ్ఛననుసరించి చేసికొనువివాహము ఆసురమని చెప్పబడుచున్నది అని. ఈసూత్రమునందు "శ్రీమంతులకు" అని చెప్పుటచేత, కన్యకయొక్క తల్లిదండ్రులకేమియు నీయక కేవలము కన్యకకు మాత్రము ఏదైన ధనమును ఒసగినయెడల అట్లొసంగుట ఆసురమని చెప్పబడదగియుండదనియును ఎఱుంగవలయును. ఏమనగా మఱొక్క స్మృతికూడ నిట్టులనే చెప్పుచున్నది "కన్యకయొక్క జ్ఞాతులు, ఏకన్యకలకు ప్రీతిదాయముగా వరపక్షము వారొసంగిన ధనాదులను తీసికొనక యుందురో, అట్టిశుల్కము విక్రయమని యనిపించుకొనజాలదు. మఱేమనగా అట్టిద్రవ్యము కన్యకలకు ఇచ్చినట్టి అర్హణముగానే (అనగా అరణముగా) యగుచున్నది. అనితాత్పర్యము.

## 164 సూ. ప్రసహ్యాదానా ద్రాక్షసః [౧-౪-౧౦]

హరదత్తమితాక్షరా:—ప్రసహ్యేతి. ప్రసహ్య బలాత్కారేణ కన్యావతః కన్యాం నిర్జిత్య యదాదానం స రాక్షసో వివాహ ఇతి.

ఆంధ్రవివరణము:—కన్యకయొక్క తల్లిదండ్రులయొద్దినుండి బలాత్కారముగా కన్యకను లాగికొని తెచ్చి చేయునట్టి వివాహము రాక్షస మనబడు నని సూత్రార్థము.

## 165 సూ. అసంవిజ్ఞాతోపసంగమాత్పైశాచః [౧-౪-౧౧]

హరదత్తమితాక్షరా:— అసంవిజ్ఞాతేతి. సుప్తా మత్తా ప్రమత్తా వా యత్రాసంవిజ్ఞాతముపగమ్యతే, స పైశాచో వివాహ, ఇతి.

ఆంధ్రవివరణము:— సుప్తురాలై గాని మత్తురాలై గాని ప్రమత్తురాలై గాని యుండునట్టి కన్యకతో అసంవిజ్ఞాతముగా జరుగునట్టి ఉపసంగమమే పైశాచ వివాహమని చెప్పబడుచుండు నని సూత్రార్థము.

## 166 సూ. చత్వారో ధర్మ్యాః ప్రథమాః [౧-౪-౧౨]

హరదత్తమితాక్షరా:— చత్వార ఇతి. ఆదితశ్చత్వారో వివాహాస్సవర్ణానాం ధర్మ్యాః ధర్మాదనపేతాః ప్రశస్తా భవంతి.

ఆంధ్రవివరణము:— ఇట్టులు వెనుకటి సూత్రములలో (అనగా 158 సూత్రము మొదలు 165 వఱకు) చెప్పబడినట్టి ఎనిమిది వివాహములలోను [అనగా బ్రాహ్మ వివాహము ప్రాజాపత్య వివాహము ఆర్షవివాహము దైవ వివాహము గాంధర్వవివాహము ఆసురవివాహము రాక్షస వివాహము పైశాచ వివాహము అను నీయెన్మిది వివాహములలోను] మొట్టమొదటి నాల్గువివాహములున్నూ [అనగా బ్రాహ్మ ప్రాజాపత్యార్ష దైవ వివాహములు] ధర్మ్యములై ప్రశస్తములైనవిగా యుండునని సూత్రార్థము.

## 167 సూ. షడిత్యేకే [౧-౪-౧౩]

హరదత్తమితాక్షరా:— షడితి. ఏకేస్మర్తారః ఏషామాదితష్షట్ ధర్మ్యా ఇత్యాహుః గాంధర్వాసురయోరపి ధర్మ్యాపేతత్వమిచ్ఛంతి.

ఆంధ్రవివరణము:—మఱికొందఱు స్మృతికర్తలు ఈచెప్పినట్టి వివాహములలో తొలుదొల్లటి ఆరును ధర్మ్యములగు వివాహములని సూత్రార్థము. అనగా వీరు గాంధర్వవివాహము ఆసురవివాహము ఈరెండుకూడ ధర్మ్యములే యని తలంచిరని తాత్పర్యము.

164 సూ. అనులోమాఽనన్తరైకాన్తరద్వ్యన్తరానుజాతాః సవర్ణామ్బష్ఠోగ్రనిషాదదౌష్యన్తపారశవాః [౧-౪-౧౪]

హరదత్తమితాక్షరా:—అనులోమాఇతి. క్రయవివాహే క్షత్త్రియాదిషు స్త్రీషు బ్రాహ్మణాదిభ్యోజాతానాం పుత్త్రాణాం శాస్త్రేషు. సంకేతితం సంజ్ఞాభేదమాహ-అనులోమా ఇతి. బ్రాహ్మణస్యానన్తరాక్షత్త్రియా. తస్యాంజాతస్సవర్ణ ఇత్యుచ్యతే. క్షత్త్రియస్య వైశ్యాఅనన్తరా, తస్యాంతస్మాజ్జాత అంబష్ఠః, వైశ్యస్యఅనన్తరాశూద్రా తస్యాం తస్మాజ్జాతఉగ్రః బ్రాహ్మణస్యైకాన్తరా వైశ్యా. తస్యాంతస్మాజ్జాతః పుత్త్రఃనిషాదః, క్షత్త్రియస్యైకాన్తరా శూద్రా. తస్యాం తస్మాజ్జాతః దౌష్యన్తః బ్రాహ్మణస్యద్వ్యన్తరాశూద్రా. తస్యాం తస్మాజ్జాతః పారశవః, ప్రపంచోజాతినిర్ణయస్య స్మృత్యన్తరేద్రష్టవ్యః

ఆంధ్రవివరణము:—పైనిచెప్పిన వివాహములలో క్రయమిచ్చి చేసికొనునట్టి వివాహములు అసుర రాక్షసాదులు గలవు. ఇట్టి క్రయవివాహములలో క్షత్త్రియులు మున్నగు జాతులవారి (అనగా అనులోమ జాతులవారి) స్త్రీలయందు బ్రాహ్మణులు మున్నగుఅగ్రవర్ణపు పురుషులవలన బుట్టుచుండెడి పుత్త్రులకు ధర్మశాస్త్రములందు కొన్ని సాంకేతికములగు పేరులుంచబడియున్నవి. వివాహప్రస్తావన వచ్చుటవలన, దాని ననుసరించి వివాహఫలమగు సంతానముయొక్క ప్రస్తావనకూడరాగా అట్టి సంతానమును గుఱించిన శాస్త్రసంకేతములను వివరించుటకై ఈసూత్రమును ఆరంభించుచున్నాడు. సంతానము సాధారణముగా రెండు విధములు. అనులోమజాతివారియందు పుట్టిన సంతానము అని విలోమజాతివారియందు పుట్టిన సంతానమని (అర్థాత్తు అనులోమసంతానము విలోమసంతానము) ఈరెండువిధములగు సంతానములోను న్నూ ప్రస్తుతమిచ్చట అనులోమసంతానమును గుఱించి చెప్పుచున్నాడు.

అనులోమపుత్త్రులెవ్వరెవ్వరనగా బ్రాహ్మణక్షత్త్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణ్యము వారికిని క్రమముగా అనంతరలు,ఏకాంతరలు, అధ్వ్యంతరలు, అగు స్త్రీలయందుపుట్టినటివారు.ఇట్లుఅనంతరజాతివారలగుస్త్రీలయందును,ఏకాంతరలగుస్త్రీలయందును, ద్వ్యంతరలగు స్త్రీలయందును, కల్గిన అపుత్త్రులుక్రమముగా సవర్ణ అంబష్ఠఉగ్ర నిషాద దౌష్మంత పారశవ నామములతో సంకేతింప బడుచుందురని సూత్రార్థము. అనగా బ్రాహ్మణునకు అనంతరజాతి స్త్రీ క్షత్త్రియ జాతి స్త్రీయగు ననియును, ఆవిడయందు ఆబ్రాహ్మణునకు జనించెడి పుత్రుడు సవర్ణుడని పిలవబడు చుండుననియును, 1. ఇట్లే క్షత్త్రియునకు అనంతరజాతిస్త్రీ వైశ్యస్త్రీ యనియును ఆమెకు అక్షత్త్రియునివలన పుట్టెడు పుత్త్రుడు అంబష్ఠుడనియును, వైశ్యునకు అనంతరజాతిస్త్రీ శూద్రస్త్రీ 2. యనియును ఆమెకు ఆవిడయందు పుట్టెడి పుత్త్రుడు ఉగ్రుడనియును, 3. బ్రాహ్మణునకు ఏకాంతరజాతిస్త్రీ [అనగా తనజాతికి ఆవిడజాతికి నడుమ ఒక్కజాతి అంతరము గలట్టివారిని ఏకాంతరజాతిస్త్రీలని యందురు] వైశ్యస్త్రీ యగునని యును ఆవిడకు అతనివలన బుట్టెడు పుత్త్రుడు నిషాదుడని 4 యును, క్షత్త్రియునకు, ఏకాంతరజాతిస్త్రీ శూద్రస్త్రీ యనియును ఆవిడకు అతనివలన పుట్టెడికుమారుడు దౌష్మంతుడనియును,ఇంకను బ్రాహ్మణునకుద్వ్యంతరజాతిస్త్రీ 5. శూద్రస్త్రీ యనియును, ఆవిడ యందతనికి గల్గినపుత్త్రుడు పారశవుడనియును శాస్త్రములలో సంకేతములను చెప్పు 6.

చుందురని తాత్పర్యము. శాస్త్రసంకేతితులగు జాతులింకను గలవు. కాని ఆనిర్ణయము మిగుల విస్తరమైనదగుటవలన ఇతరస్మృతులను చదివి వానినుండి గ్రహింపదగునని యెఱుంగవలయును.

## 169 సూ. ప్రతిలోమాస్తు సూతమాగధా యోగవకృతవైదేహక చండాలాః [౧—౪—౧౫]

హరదత్తమితాక్షరా:—ప్రాతిలోమ్యేన జాతాన్పుత్త్రానాహ—ప్రతిలోమాఇతి. అనంతరైకాంతద్వ్యంతరాసుజాతా ఇత్యనువర్తతే. క్షత్త్రియస్యానంతరాబ్రహ్మణీ. తస్యాం తస్మాత్సంజాతస్సూతః. వైశ్యస్యానంతరా క్షత్త్రియా. తస్యాం తస్మాజ్జాతఃమాగధః, శూద్రస్యానంతరావైశ్యా తస్యాం తస్మాజ్జాత ఆయోగవః. వైశ్యస్యైకాంతరా బ్రాహ్మణీ తస్యాం తస్మాజ్జాతః కృతః, శూద్రస్యైకాంతరాక్షత్త్రియాతస్యాం తస్మాద్వైదేహకః శూద్రస్య ద్వ్యంతరాబ్రాహ్మణీ. తస్యాం తస్మాచ్చండాల ఇతి.

ఆంధ్రవివరణము:—ఇటుపైని ప్రతిలోమ విధానము ననుసరించి పుట్టినట్టి పుత్త్రులను చెప్పుచున్నాడు:— ఈసూత్రమునందుకూడ వెనుకటిసూత్రమునందువలెనేఅనంతరజాతి ఏకాంతరజాతి ద్వ్యంతరజాతి స్త్రీలని కూర్చుకొనవలయును. సూతమాగధాయోగవకృత వైదేహకచండాలురు ప్రతిలోమ పుత్త్రులని సూత్రార్థము. అనగా ప్రతిలోమరీతియందు (అనగా క్రిందినుంచిపైకి) క్షత్త్రియునకు ప్రతిలోమరీతిని అనంతరజాతి స్త్రీ బ్రాహ్మణస్త్రీ యగును. ఆవిడ యందతనికి జనించిన పుత్త్రుడు
1· సూతుడనబడును. వైశ్యునకు ప్రతిలోమరీతిని అనంతర జాతిస్త్రీ క్షత్త్రియ జాతిస్త్రీఅగును. ఆవిడయందు
2· అతనికి జనించిన పురుషుడు మాగధుడనబడును. శూద్రునకు ప్రతిలోమరీతిని అనంతరజాతిస్త్రీ వైశ్యస్త్రీయగును. అతనికి ఆవిడయందు జనించువాడు ఆయోగవు డనబడును. ఇట్టులనే వైశ్యునకు ఏకాంతరజాతిస్త్రీ బ్రాహ్మణస్త్రీ యగును. ఆవిడకు అతనిద్వారా పుట్టినవాడు కృతుడనబడును. శూద్రునకు ఏకాంతరజాతిస్త్రీ క్షత్త్రియస్త్రీ యగును. ఆవిడయందతనికి జనించినవాడు వైదేహకు డనబడును. శూద్రునకు ద్వ్యంతరజాతిస్త్రీ బ్రాహ్మణస్త్రీ యగును. ఆవిడయందతనికి జన్మించినవాడు చండాలుడని యనబడును -అని తాత్పర్యము.

## 170 సూ. బ్రాహ్మణ్యాజీజనత్పుత్త్రాన్వర్ణేభ్య ఆనుపూర్వ్యాత్ బ్రాహ్మణసూతమాగధ చండాలాన్ [౧—౪—౧౬]

హరదత్తమితాక్షరా:—బ్రాహ్మణేతి. స్పష్టోర్థః, అత్ర ఆనుపూర్వ్యగ్రహణం వర్ణక్రమ వివక్షాపరం నత్వానులోమ్య పరమితిజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—బ్రాహ్మణజాతిస్త్రీ -ఆనుపూర్వ్యముగా అనగా వర్ణక్రమమునననుసరించి బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రు లనునాల్గుజాతులపురుషుల నుండి సంతానమును కనెనని సూత్రార్థము. ఇచ్చట అజీజనత్- అన్నక్రియ భూతకాలికమగుసంసారానాదిత్వమును ప్రదర్శించుచున్నదనియును నెఱుంగునది. కాగా బ్రాహ్మణస్త్రీ బ్రాహ్మణునివలన బ్రాహ్మణుని, క్షత్త్రియునినుండి సూతుని, వైశ్యునినుండిమాగధుని శూద్రునుండి చండాలుని కనెనని తాత్పర్యము ఏర్పడు చున్నది.

## 171 సూ. తేభ్యఏవక్షత్త్రియా మూర్ధావసిక్తక్షత్త్రియధీవరపుల్కసాంస్తేభ్య ఏవవైశ్యా భృజ్జ

కంఠమాహిష్య వైశ్య వైదేహాన్ పారశవయవన కరణశూద్రాం చ్ఛూద్రేత్యేకే. [౧-౪-౧౭]

హరదత్తమితాక్షరాః—తేభ్య ఇతి. ఏకేస్మర్తార ఇత్యుక్త క్రమేణ బ్రాహ్మణ్యాదీజనదిత్యారభ్య బ్రాహ్మణీక్షత్త్రియా వైశ్యాశూద్రాసు బ్రాహ్మణాదివర్ణేభ్యః క్రమేణజాతానాం సంజ్ఞాభేదాన్మన్యంతే.

ఆంధ్రవివరణము:— క్షత్త్రియజాతిస్త్రీ అనులోమ్యముగా ఆచాతుర్వర్ణ్యములలోని వారినుండి పుత్త్రులను కనునేని అట్టిపుత్త్రులను క్రమముగా మూర్ధావసిక్త క్షత్త్రియ ధీవర పుల్కసులనుగా పల్కెదరు. ఇట్టులనే వైశ్యస్త్రీ ఆచాతుర్వర్ణ్యమువారినుండి కనునేని వారిని క్రమముగా భృజ్జకంఠ మాహిష్య వైశ్య వైదేహులను గాను, శూద్రజాతిస్త్రీ చాతుర్వర్ణ్యమువారినుండి కనునేని వారిని క్రమముగా పారశవ యవనకరణ శూద్రులనుగాను కొందఱు ఆచార్యులు పల్కిరి అని సూత్రార్థము.

172 సూ. వర్ణాంతరగమన ముత్కర్షాపకర్షాభ్యాం సప్తమేపంచమేవాఽఽచార్యాః [౧-౪-౧౮]

హరదత్తమితాక్షరాః—వర్ణాంతరేతి. మన్యంత ఇతి వాక్యశేషః తేషామేవ సవర్ణాదీనా మనులోమజాతానా ముత్కర్షేణ పితృద్వారా సప్తమపురుషా దుత్కృష్టవర్ణాంతర ప్రాప్తిర్భవతి. అపకర్షేణ మాతృద్వారా పంచమపురుషా దపకృష్టవర్ణాంతరప్రాప్తిర్భవతి. తద్యథా—బ్రాహ్మణే నోఢాయాం క్షత్త్రియాయాముత్పాదితా సవర్ణా సాపి బ్రాహ్మణేనోఢా తస్యాముత్పాదితా చేతి ఏవమాసప్తమ్యాః. సప్తమీతు బ్రాహ్మణే నోఢా యదపత్యంసూతే తద్బ్రాహ్మణ జాతీయమేవభవతి. ఏవం బ్రాహ్మణేన క్షత్త్రియాయాం ఉత్పాదితః పుత్త్రః సవర్ణః, సోపి క్షత్త్రియాముద్వాహ్య పుత్త్రముత్పాదయతి సోపిక్షత్త్రియామిత్యేవం ఆపంచమాత్. పంచమస్తు క్షత్త్రియాయాం యదపత్యం ఉత్పాదయతి తత్క్షత్త్రజాతీయమేవభవతి. వికల్పస్త్వేవంచార్థః తత్రాపి వర్ణాంతరగమనే వృత్తస్వాధ్యాయ బాహుళ్యే సతిపంచమేనోత్కృష్టం భవతి. హీనవృత్త్యా పంచమేనాపకృష్టంచ భవతీతి. ఏవం క్షత్త్రియస్య వైశ్యాయాం వైశ్యస్య శూద్రాయామపి ద్రష్టవ్యమ్.

ఆంధ్రవివరణము:— సవర్ణాదులగు అనులోమజాతులకు ఉత్కర్షముగా తండ్రిద్వారా ఏడుపురుషాంతరములకును, అపకర్షముగా మాతృద్వారా అయిదుపురుషాంతరములకును, వర్ణాంతరప్రాప్తి [అనగా ఇతరవర్ణముగా మారిపోవునట్టి స్థితి] కలుగ గలదని సూత్రార్థము. ఎట్లనగా బ్రాహ్మణునిచే పెండ్లాడబడినక్షత్త్రియస్త్రీ యందు పుట్టిన కన్యక తానుకూడ సవర్ణయగుచున్నది. ఆసవర్ణ మఱల నింకొక బ్రాహ్మణునిచేత పెండ్లాడబడి కన్యకను గని- ఆమెమఱల నిట్లే బ్రాహ్మణుని పెండ్లాడి కన్యకను గని- ఈవిధముగా ఏడుపురుషాంతరములు (తరములు) అగునప్పటికి, ఏడవపురుషాంతరపు కన్యకకు పుట్టినసంతానము బ్రాహ్మణ జాతీయమైనట్టి సంతానమే కాగల్గును. ఇట్టులనే బ్రాహ్మణునిచేత క్షత్త్రియజాతిస్త్రీ యందు కనబడిన సంతానమును సవర్ణమే. ఆసవర్ణసంతానముకూడ మఱల క్షత్త్రియస్త్రీని పెండ్లాడి సంతానము కని- ఆసంతానముకూడ ఇట్టులనే కని- ఇట్టులు అయిదుతరములగునప్పటికి ఆఅయిదవతరము సంతానము క్షత్త్రియజాతీయమే

ఆంధ్రవివరణము:— అనులోమ విధానమునకైనను, శూద్రస్త్రీయందు పుట్టినవాడు (పారశవుడు మున్నగువాడు) కూడ ధర్మహీనుడగుచున్నాడు. ఏవంచ సవర్ణాదులగు అనులోమజులకు ధర్మాంగీకారమే సంసిద్ధమగుచున్నది. మనువుకూడ నిట్టులనే చెప్పినాడు - స్వజాతిజాత్యంతరజ్ఞులగు ఆర్యులపుత్రులును బ్రాహ్మణధర్మము గలవారలే యగుచున్నారు. ఇకను శూద్రులందన్నను సధర్మలందరును అపధ్వంస జనితులుగా స్మరింపబడుచున్నారు, అని.

ధీవరుడనియును శూద్రునినుండి పుట్టినవాడు పుల్కసుడనియును అనబడును. ఇట్టులనే వైశ్యస్త్రీయును ఆచాతుర్వర్ణ్యమువారినుండి కనినట్టివారు క్రమముగా - భృజ్జకంఠులని మాహిష్యులని వైశ్యులని వైదేహకులని యనబడుదురు. బ్రాహ్మణీ క్షత్రియా వైశ్యాస్త్రీలవలనే శూద్రస్త్రీయును చాతుర్వర్ణ్యమువారినుండి సంతానమును బడయుచో వారు క్రమముగా పారశవ, యవన, కరణశూద్రులని చెప్పబడుదురనియును తెలియగునది.

## 176 సూ. అసమానాయాంతు శూద్రాత్పతితవృత్తిః

[౧—౪—౨౨]

హరదత్తమితాక్షరా:— శూద్రాదసమానాయాం వైశ్యాదిస్త్రీయాముత్పాదిత ఆయోగవాదిః పతితవృత్తిః పతితవద్దర్శన ప్రతిగ్రహాదావర్జనీయః. ఏవంచ వైశ్యాత్క్షత్రియాయాం క్షత్రియాద్బ్రాహ్మణ్యాం జాతోన పతితవృత్తిః.

ఆంధ్రవివరణము:— శూద్రునివలన- అతనికి అసమాన జాతిస్త్రీయగు వైశ్యాదిస్త్రీయందు జనించినట్టి సంతానము- [అనగా ఆయోగవుడుమున్నగు పుత్రులు] పతితులతో సమముగా దర్శన ప్రతిగ్రహణాది వర్తనములయందు వర్జింపదగినట్టి వాడుగా అగుచున్నాడని సూత్రార్థము. ఈ సూత్రమునందు అసమానజాతిస్త్రీయందు శూద్రునికి జనించినట్టి సంతానము పతితవర్తియగును అని చెప్పుటచేత, వైశ్యునివలన క్షత్రియస్త్రీయందుగాని క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీయందుగాని పుట్టిన వాడు పతితవృత్తికాజాలడు. అనగా బ్రాహ్మణి చాతుర్వర్ణ్యము వారినుండి పుత్రులను కనినట్టులనే క్షత్రియస్త్రీయును చాతుర్వర్ణమునుండి కనెననియును, అందులో క్షత్రియస్త్రీకి బ్రాహ్మణునుండి పుట్టినవాడు మూర్ధాభిషిక్తుడనియును ఆమెకే క్షత్రియునుండి పుట్టినవాడు క్షత్రియుడనియును వైశ్యునినుండి పుట్టినవాడు

## 177 సూ. అంత్యః పాపిష్ఠః

[౧—౪—౨౩]

హరదత్తమితాక్షరా:— అంత్యఇతి. శూద్రాదసమానాజ్జనితేషు తేషు యోన్త్యో బ్రాహ్మణ్యాం జాతశ్చండాలః పాపిష్ఠో అత్యంతం వర్జనీయోభవతి. తథాచస్మృత్యంతరం–శ్లో॥ చండాలమాజగోవాల వ్యజనాన్పరిహారేదితి.

ఆంధ్రవివరణము:—శూద్రునినుండి అసమానస్త్రీలయందు జనించిన పుత్రులలో ఎవ్వడు అన్త్యుడున్నాడో (అనగా బ్రాహ్మణస్త్రీయందు చండాలునివలన జనితుడు) వాడు మిక్కిలి పాపిష్ఠుడుగా అగుచున్నాడని అర్థము. ఈవిషయమునందితరస్మృతులుకూడ నిట్లే చెప్పుచున్నది. - చండాల మాజ గోవాలవ్యజనులను (దర్శనస్పర్శనాదులనుండి) పరిహరింపవలయును,-అని.

## 178 సూ. పునంతిసాధవః పుత్రాః

[౧—౪—౨౪]

హరదత్తమితాక్షరా:— అథప్రకృతాన్వివాహాన్తౌతి స్వచ్ఛానుజాతాః పుత్రాః సాధనస్సాధువృత్తయః జనయితౄః కులంపునంతి

ఆంధ్రవివరణము:—జాతిని బట్టియును కులమును బట్టియును శాస్త్రమర్యాదల ననుసరించియును స్వచ్ఛులుగా (దూష్యులుగాగాని నింద్యలుగాగాని పరిగణింపబడనట్టి స్త్రీలయందు) పరిగణింపబడినట్టి స్త్రీలయందున్నె జనించినట్టి

పుత్త్రులు జననీ జనకులయొక్క వంశమును పవిత్రము చేయువారుగ నయ్యెదరని సూత్రమునకు అర్థము. అనగా శాస్త్రీయ వివాహ జనిత సంతానము చాల పవిత్రమైనదని తాత్పర్యము.

179 సూ. త్రిపురుష మార్షాత్. [౧-౪-౨౫]

హరదత్తమితాక్షరా:— తత్రాపివిశేషః త్రిపురుషేతి. ఆర్ష వివాహోఢాయాం జాతః పుత్త్రః త్రీన్పురుషాన్పునాతి నరకాదుద్ధరతి.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు ధర్మ్యములగు వివాహములను గుతించి స్తుతించి- ఆవివాహములలోగూడ కొన్నివిశేషములు గలవని (అనగా ఆధిక్యములు గలవని) రూపించుటకై ఈసూత్రమును ఆరంభించుచున్నాడు - ఆర్షవివాహరీతిని వివాహముచేసికొనబడినట్టి స్త్రీయందు జనించిన పుత్త్రుడు తల్లిదండ్రులయొక్క మూడు తరములను పవిత్రము చేయునట్టి వాడుగా కాగలుగుచున్నాడని సూత్రార్థము. అనగా తక్కినవివాహము లన్నిటికంటె ఆర్షవివాహ ముత్తమమైనట్టిదని తాత్పర్యము.

180 సూ. దశదైవాద్దశైవప్రాజాపత్యాత్. [౧-౪-౨౬]

హరదత్తమితాక్షరా:— దశేతి. ఉపసమస్తమపి పురుషపదం అత్రదశ శబ్దేన సంబధ్యతే ఏవకారో నిర్ధారణపరః.

ఆంధ్రవివరణము:—దైవవివాహమువలన పెండ్లాడిన స్త్రీయందు జనించిన పుత్త్రుడును ప్రాజాపత్య వివాహమువలన పెండ్లాడినట్టి స్త్రీయందు జన్మించినట్టి పుత్త్రుడును పదేసి పదేసి తరములను పవిత్రముచేయునట్టి వారుగా నయ్యెదరని సూత్రార్థము.

181 సూ. దశపూర్వాన్ దశాపరాన్ ఆత్మానంచ బ్రాహ్మీపుత్రో బ్రాహ్మీపుత్త్రః [౧-౪-౨౭]

హరదత్తమితాక్షరా:— బ్రాహ్మ వివాహేనోఢా బ్రాహ్మీ తస్యాంజాతః పుత్త్రః పితాదీన్ దశపూర్వాన్ పరానపిదశ భవిష్యతః పుత్త్రాదీంశ్చ ఆత్మానంచైక వింశంపునాతి. తస్మాద్బ్రాహ్మో వివాహః ప్రశస్తతమః

ఇతిశ్రీ గౌతమ వివృతౌ హరదత్త విరచితాయాం మితాక్షరాయాం చతుర్థోధ్యాయః.

ఆంధ్రవివరణము:— బ్రాహ్మ వివాహముచొప్పన పెండ్లిచేసికొనినట్టి స్త్రీయందు కల్గిన పుత్త్రుడు బ్రాహ్మీపుత్రుడని యనబడును. బ్రాహ్మీపుత్రుడు తనతండ్రి తాత ముత్తాత మొదలగువె నుకటి పదితరములవారినిన్ని ముమ్మందు కలుగబోవు కొడుకు మనుమడు మునిమనుమడు మున్నగు పదితరములవారినిన్ని తననున్ను (మొత్తముకలసి) ఇరువదియొక్క తరములవారిని పవిత్రము చేయువాడుగా కాగలడని సూత్రార్థము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడును అధిగత కావ్యతీర్థాది బిరుదుడును పంచాగ్ని వంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్త్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మసూత్రాంధ్ర వివరణమునందు ప్రథమ ప్రశ్నమునందు చతుర్థాధ్యాయము.

## గౌతమధర్మసూత్రములు

పంచమాధ్యాయ ప్రారంభము

# 182 సూ. ఋతావుపేయాత్.

[౧—౫—౧]

హరదత్తమితాక్షరా:— గర్భాధానకాలం ప్రస్తౌతి ఋతావితి. రజోదర్శనాదారభ్య షోడశాహోరాత్రాః ఋతుః స్త్రీణాం గర్భగ్రహణకాలః తత్రోపగచ్ఛేద్భార్యామ్. తత్రాప్యాపస్తంబీయే విశేషః:- చతుర్థీప్రభృత్యా షోడశీముత్తరాముత్తరాంయుగ్మాం ప్రజానిశ్శ్రేయసం ఋతుగమన మిత్యుపదిశంతి. మానవంతు—శ్లో. ఋతుస్స్వాభావికస్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః చతుర్భిరితరైస్సార్థమహోభిస్సద్విగర్హితైః తాసామాద్యాశ్చతస్రస్తునింద్యా ఏకాదశీతుయా. త్రయోదశీచ శేషాస్తుప్రశస్తా దశరాత్రయః అమావాస్యా మష్టమీంచ పౌర్ణమీంచ చతుర్దశీం బ్రహ్మచారీ భవేన్నిత్య మప్యృతౌస్నాతకోద్విజః—ఇతి. యాజ్ఞవల్క్యస్తు—శ్లో. ఏవంగచ్ఛన్స్త్రియం క్షామాం మఘాంమూలం చవర్జయేత్. యుగ్మాసుపుత్రాజాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు — ఇతిచ. తదిహ షోడశసురాత్రిష్వాది తస్తిస్రస్సర్వధావర్జ్యాః ఇతరాసుగచ్ఛేదితి సర్వస్మృతి చోదిత నిషేధాత్పరిత్యజ్యగచ్ఛన్నుత్కృష్టం పుత్రం జనయతి. ద్వేషాదినాఋతావనుపయన్నిత్య వేయాదితి. తథాచ దేవలః— శ్లో. యస్స్వదారాన్నతుస్నాతాన్స్వస్థస్సన్నోపగచ్ఛతి. భ్రూణహత్యా మవాప్నోతి గర్భం ప్రాప్తవినాశ్యసఃఇతి. స్మృత్యంతరంచ— శ్లో. ఋతుస్నాతాంతు యోభార్యాం సన్నిధానోపగచ్ఛతి. తస్యారజసి తంమాసం పితరస్తస్యశేరతే—ఇతి. అయంతురాగతః ప్రాప్తత్వేసత్యప్యకరణే ప్రత్యవాయ శ్రవణాద్విధిశ్చభవతి—ఋతావేవోపేయాదేవేతి కస్యచిన్మతేన నియమశ్చభవతీతి విజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— ఇటుపైని గర్భమును ఉంచదగినట్టి కాలమును [అనగా గర్భాధానమును చేయవలసినట్టి సమయమును చెప్పుచున్నాడు. అనగా బ్రహ్మచర్యాశ్రమమును వీడి గృహస్థాశ్రమమును స్వీకరించిన పిమ్మట సహధర్మిణితో సంచరింపవలసిన విధమును వివరింప నుపక్రమించుచు మున్ముందుగా గర్భాధానకాలమును గుఱించి ప్రస్తావనము చేయుచున్నాడని భావము.

గృహస్థుడగువాడు ఋతుకాలమునందు భార్యను పొందవలయును -అని సూత్రార్థము. ఋతుకాలమనగా - స్త్రీలకు రజోదర్శనమైనది మొదలుకొని [అనగా ముట్టైనది మొదలు] పదునారు రాత్రులు గడచునంతకును ఋతుకాలమని చెప్పబడుచుండును. అట్టిఋతుకాలమునందు మాత్రమే గృహస్థుడగువాడు భార్యను పొందవలయునని తాత్పర్యము. ఈ ఋతుకాల గమనమును గుఱించి ఆపస్తంబులవారి గ్రంథమునందు విశేషముగలదు.—" ఋతుమతి యైనది మొదలు నాల్గుదినములు కడచునంతకు నుండి అతర్వాత -అనగా నాల్గవనాటినుండి పదునారవరాత్రివఱకును గల దినములలో - సరిసంఖ్యగల దినములలో ఋతుగమనమును చేయదగిన దనియును, అయ్యది ప్రజానిశ్శ్రేయస మనియును, చెప్పెను.

ఇకను మనుధర్మశాస్త్ర మేమనినదనఁగా— స్త్రీలకు ఋతుకాలము స్వభావజనితమైనది. అయ్యది పదునారు రాత్రులువఱకు నని చెప్పబడినది. అందులో ఏకాదశియు త్రయోదశియునుకలసి ఇతరరాత్రులతోబాటు తొల్లటినాల్గురోజులును నింద్యములు. తక్కిన పదిరాత్రులును ప్రశస్తములు. అయితే ఈ చెప్పినట్టి పదిప్రశస్తదినములలోనూ అమావాస్య అష్టమి పౌర్ణమి చతుర్దశి -అను నీతిథులు సంభవించినచో ఋతుకాలమై యున్నప్పటికిని ద్విజుఁడు బ్రహ్మచారియై (అనగా సంగమింపక బ్రహ్మచర్యము నవలంబించినవాడై) యుండవలయును, అని,

ఇక యాజ్ఞవల్క్యుడేమనె ననగా — ఈవిధముగా స్థుడగు వాడు దారసంగమనము చేయుచు మఘానక్షత్రము మూలానక్షత్రమును పరిత్యజింపవలయును. సరిసంఖ్యగల తిథులయందు సంగమించినచో పుత్త్రులును, బేసిసంఖ్యగలతిథులయందు సంగమించినచో, స్త్రీలును -అనగా పుత్త్రికలును కల్గుదురు,అని.

కాబట్టి సూత్రమునందు చెప్పబడినట్టి ఋతుకాలములో -అనగా- తొలి పదునారురోజులలోను -తొలు దొల్లటి మూడురాత్రులును సర్వథా పరిత్యజింపవలసియే యుండును, ఇక తక్కినవానిలో భార్యలను పొందవచ్చు నను నది సమస్త స్మృతి కర్తలు నొప్పుకొనినదే. గనుక ఇట్టి నిషేధ దినములను వదలిపెట్టి తక్కినదినములలో సంగమించు వాడు ఉత్కృష్టమగు పుత్రుని పుట్టింపగల్గుచున్నాడు అని ఎఱుంగవలయును.

అయితే ఇచ్చట మఱియొక్క విషయము గుర్తింపదగినది కలదు —ఏమనగా, ధర్మశాస్త్రము స్వదారలను ఋతుకాలమునందు పొందవలయునని ఎట్టులు విధించుచున్నదో అట్టులనే దారలపైగాని కామముపైగాని గలద్వేషముచేత ఋతుకాలమునందు పొందక త్యజించినను గూడ ప్రత్యవాయము గలదని ధర్మశాస్త్రము విధించుచున్నది. ఇందులకు ప్రమాణము గూడ గలదు— దేవలుడు ఇట్లు చెప్పుచున్నాడు —ఎవ్వాడు స్వస్థుడై యుండియును తనభార్యలను పొందకయుండునో వాడు ప్రాప్తమైన గర్భమును నశింపజేసినవాడై భ్రూణహత్యను చేసినవాడగుచున్నాడు అని.

మఱియును ఇతరస్మృతులు కూడ చెప్పుచున్నవి — ఎవ్వడు ఋతుస్నాతయై యున్న భార్యను సన్నిధియందుండియును పొందకయుండునో. ఆస్త్రీయొక్క రజస్సునందు (ముట్టు రక్తమునందు) వానియొక్క పితరులు ఆనెలయందు అంతయును శయనించుచుందురు అని. ఇత్యాది రాగతః ప్రాప్తత్వమున్నను, చేయనిచో ప్రత్యవాయమున్నట్టులు చెప్పుటవలన ఒకవిధముగా విధి వాక్యముగూడ నగుచున్నది. —ఏమనియనగా—ఋతుకాలమునందు మాత్రమే పొందతగును అని. మఱికొందఱ మతముచొప్పున నియమము గూడ నగునని యెఱుంగవలయును.

183 సూ. సర్వత్ర వా ప్రతిషిద్ధవర్జమ్ [౧-౫-౨]

హరదత్తమితాక్షరా:—ఆచార్యస్తు పరిసంఖ్యానం చ ప్రతిపాదయతి—సర్వత్రేతి. సర్వేషు వా కాలేషూపేయాదృతావనృతౌ చ. ప్రతిషిద్ధదివసాన్ వర్జయిత్వా. యథాకామీభవేద్వాపి స్త్రీణాంవరమనుస్మరన్ -ఇతి. వరశ్చ-కామమావిజనితోస్సంభవామేతి. యద్యప్యాత్మనో జితేంద్రియత్వే సత్యపి ధర్మదారాస్సర్వదా రక్షణీయాస్స్మర్యతే. అప్రమత్తారక్షతతంతుమేనం మా నః క్షేత్రే పరబీజాని వాప్సుః— ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటిసూత్రమునందు ఋతుకాల గమనమును గుఱించిన సిద్ధాంతములను చెప్పి ఇప్పుడీ సూత్రమునందు ఆచార్యులు పరిసంఖ్యానమును నిరూపించుచున్నాడు—ఋతుకాలములు అయియున్నను లేక ఋతుకాలములు కాకయున్నను [స్త్రీసంగమమునకు బొత్తుగా కూడదని చెప్పిన] ప్రతిషిద్ధదినములను వదలి తక్కిన దినములయందెల్లను, భార్యలను పొందవచ్చునని—ఆచార్యులు పల్కిరని సూత్రార్థము. అనగా వరానుస్మరణము చేయుచు కామానుసారముగా వర్తింపవలయునని భావము. ఇచ్చట వరానుస్మరణమనగా ఇయ్యది—స్వేచ్ఛగా విజనితలనుండి పుట్టుదము అని యనుకొనుట యనియందురు. మఱియును గృహస్థుడు తాను జితేంద్రియుడై యున్నప్పటికిని ధర్మసంచరణార్థమై పరిగ్రహించినట్టిభార్యలను-అనగాధర్మభార్యలను- సర్వకాల సర్వావస్థలయందును ఏవిధమైన ప్రమాదములుకూడ పొరయకుండునట్టులుగా -రక్షింపవలసి యున్నది. అని పెద్దలు చెప్పుచుందురు. ఈవిషయమునందు శ్రుతికూడ ఇట్టులు చెప్పుచున్నది.—“ఓగృహస్థులారా! మీరు అప్రమత్తులరై ఈతంతువును పరిరక్షించుకొనవలయును. [ఏమనగా] మీయొక్క క్షేత్రములందు-

అనగా భార్యలయందు పరబీజములను వెదజెట్టక యుందురుగాక, అని

ఈసూత్రమునందు అప్రతిషిద్ధముగానున్నట్టి తిథులయందు దారసంగ్రహణము చేయదగు నని చెప్పఁబడినది. అప్రతిషిద్ధములగుతిథులేవియో దు లేని పరిశేషన్యాయము ననుసరించి ప్రతిషిద్ధములను తెలిసికొన్నచో అప్రతిషిద్ధము లేర్పడగలవు, ప్రతిషిద్ధములగు తిథులు మనుస్మృతి యం దిట్టులు చెప్పఁబడియున్నవి— శ్లో. అమావాస్యామష్టమీంచ పౌర్ణమాసీం చతుర్దశీం, బ్రహ్మచారీభవేన్నిత్యం, అప్యృతౌస్నాతకోద్విజః— అనగా అమావాస్యను అష్టమిని పున్నమిని చతుర్దశిని గృహస్థుడగువాడు భార్యను సంగమింపక వదలవలయును. ఒక్కవేళ ఈతిథులు ఋతుస్నానదివసములుగా నున్నప్పటికిని (అనఁగ ఋతుస్నాన దివసములైయుండి-ఆనాడు సంగమింపనిచో భ్రూణహత్యాపాపమువచ్చునని శాస్త్రాంతరము చెప్పినప్పటికిని) ప్రతిషిద్ధములుగా లెక్కింపబడవలయునని తాత్పర్యము.

## x 184 సూ. దేవపితృమనుష్య భూతర్షి పూజకః [౧—౫—౩]

హరదత్తమిశ్రులు:— అథపంచమహాయజ్ఞా ఇతి. దేవేతి. అత్రపూజకశబ్దో దేవాదిషు ప్రత్యేకం సంబధ్యతే, ద్వంద్వాంతం శ్రూయమాణంప్రత్యేక మభిసంబధ్యతే. గృహస్థోనిత్యం దేవాదిపూజకస్స్యాత్. తత్రదేవపూజా వైశ్వదేవసకలహోమాద్యగ్నికార్యంచ. పితృపూజాంమనురాహ— శ్లో. ఏకమప్యాశయేద్విప్రంపిత్రర్థేపాంచయజ్ఞికే, నచైవాత్రాశయేత్కించి ద్వైశ్వదేవం ప్రతిద్విజమ్-ఇతి. శ్లో.దద్యాదహరహశ్శ్రాద్ధం అన్నాద్యేనోదకేనచ. పయోమూల ఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్-ఇతిచ. మనుష్యపూజాఅతిథిపూజా. భూతపూజాబలిహరణమ్ ఋషిపూజాబ్రహ్మయజ్ఞః-ఇతిపర్యాయా ఉక్తాః. తేచాప్యగ్రేప్రతిపాద్యంతే. అత్రక్రమో న వివక్షిత ఇతిజ్ఞేయః.

ఆంధ్రవివరణము:—ఇటుపైని గృహస్థుడగు ద్విజుడు చేయవలసినట్టి పంచమహాయజ్ఞములను వివరింప బోవుచున్నాడు -దేవులనగా దేవతలు. పితరులు అనగా పితృదేవతలు. [అనగా లోకాంతరగతులైనట్టి తల్లి తండ్రి మొదలగువారిచ్చోట పితృశబ్దము చేత గ్రహింపబడుదురు.] మనుష్యులు సుప్రసిద్ధులే. భూతములు జీవకోటులు. ఋషులు అనగాకులగోత్రప్రవర్తకులై లోకానుగ్రహార్థము ధర్మములను శాసించినట్టి మునులు. పూజచేయువాడు పూజకుడనబడును. ఇచ్చట పూజకః అన్నమాట దేవపితృమనుష్యభూతర్షి శబ్దములతో ప్రత్యేకముగా సంబంధించును. కాగా దేవపూజకుడు పితృపూజకుడు మనుష్యపూజకుడు భూతపూజకుడు ఋషిపూజకుడు అని యేర్పడును.

గృహస్థుడగు వాడు —దేవపూజకుడును పితృపూజకుడును మనుష్యపూజకుడును భూతపూజకుడును ఋషిపూజకుడును నై యుండవలయునని సూత్రార్థము. అనగా గృహస్థుడు ఈచెప్పినట్టి అయిదుపూజలను (వీనినే పంచమహాయజ్ఞములందురు)చేయుచుండవలయునని తాత్పర్యము.

ఈచెప్పినట్టి యైదుపూజలలోను -దేవపూజయను మాట చేత -వైశ్వదేవము మున్నగు సమస్తములగునట్టి హోమకార్యములును అగ్నికార్యములును గ్రహింపబడవలయును. ఇకను పితృపూజను గుఱించి మనువు ఇట్టులు చెప్పుచున్నాడు -గృహస్థుడగువాడు పితృదేవతలను గుఱించి చేయునట్టి పాంచయజ్ఞిక కార్యమునందు -చివఱకు ఒక్క విప్రునినైనను భుజింపజేయవలయును. ఇట్టులే వైశ్వదేవమునందు కూడబ్రాహ్మణుని భుజింప చేయవలయునా యన్న నక్కఱలేదు. మఱియును గృహస్థుడగువాడు దినదినమును అన్నాద్యములచేతనుగాని ఉదకము చేతనుగాని లేదాపయస్సు (పాలు-లేక నీళ్లు) కందమూలములు పండ్లు మొదలగు నట్టి

హాని తోఁగాని పితృదేవతలకు సంతృప్తిని గల్గించుచు వర్తింపవలయును. ఇక మనుష్యపూజ యనగా అతిథి పూజ. భూతపూజ యనగా బలిహరణము. ఋషిపూజయనగా బ్రహ్మ యజ్ఞము. అని ఈయైదుపూజలకు పర్యాయముల నెఱుంగవలయును.

## 185 సూ. నిత్యస్వాధ్యాయః

[౧-౫-౪]

హరదత్తమితాక్షరా — బ్రహ్మయజ్ఞప్రకారమాహ-నిత్యేతి. బహువ్రీహిరయం. తత్ప్రకారశ్చ బ్రహ్మయజ్ఞేన యక్ష్యమాణ ఇత్యారభ్య తైత్తిరీయకేభిహితః. అత్రనిత్యశబ్దాద్బ్రహ్మయజ్ఞ వ్యతిరిక్తకాలేపి యథావసరమధీయీతేతి.

ఆంధ్రవివరణము: —ఇటుపైని బ్రహ్మయజ్ఞము చేయతగురీతిని వివరించుచున్నాడు -గృహస్థుడు నిత్యస్వాధ్యాయుడై వర్తింపవలయునని సూత్రార్థము. అనగా బ్రహ్మయజ్ఞమును, ఆచరింపవలయునని సూత్రార్థము. బ్రహ్మయజ్ఞము చేయవలసినరీతి తైత్తిరీయారణ్యకమునందు చెప్పబడినది. ఈసూత్రమునందు కేవలము స్వాధ్యాయుడై అని చెప్పిన మాత్రాననే గృహస్థునకు వేదాధ్యయనము నిత్యము చేయవలయు నని అర్థమగుచుండగా నిత్యస్వాధ్యాయుడై యని విశేషించి చెప్పుటచేత -కేవలము బ్రహ్మయజ్ఞ కాలమునందు మాత్రమే గాక. తదతిరిక్తములగు సమయములందు కూడ వీలు ననుసరించి వేదమును అధ్యయనము చేయుచుండవలయునని సూచింపబడుచున్నదని యెఱుంగవలయును.

## 186 సూ. పితృభ్యశ్చోదకదానంయథోత్సాహమన్యత్.

[౧-౫-౫]

హరదత్తమితాక్షరా:— పితృయజ్ఞమాహ పితృభ్యశ్చేతి. పితృభ్యఃనిత్యముదకందద్యాత్ అన్యదోభజన ఫలమూలాది యథోత్సాహం యథాశక్తి దద్యాత్. అత్రచకారాన్నిత్యం దేవర్షీణామపి తర్పణంకర్తవ్య మితిదర్శితమ్. తత్రమనుర్బ్రహ్మచారిణం ప్రకృత్యాహ-శ్లో. నిత్యంస్నాత్వా శుచిఃకుర్యాద్దేవర్షి పితృతర్పణమ్-ఇతి. కాత్యాయనః శ్లో. దేవతానాంపితౄణాంచజలేదద్యాజ్జలాంజలిం. అసంస్కృతప్రమీతానాంస్థలే దద్యాజ్జలాంజలిమ్-ఇతి. భృగురప్యాహశ్లో. నోదకేషు న పాత్రేషునక్రుద్ధోనైకపాణినా. నోపతిష్ఠతితత్తోయం యద్భూమ్యాం నప్రదీయతే-ఇతి. ఉశనాఅపి-శ్లో. ఆపో దేవగణాస్సర్వే ఆపఃపితృగణాస్స్మృతాః, తస్మాదప్సుజలం దేయం పితౄణాందత్తమక్షయమ్-ఇతి. భృగుః ప్రకారాంతరమాహ-శ్లో. నాభిమాత్రేజలేస్థిత్వాచింతయన్నూర్ధ్వమానసః, ఆగచ్ఛంతుమేపితర ఇమంగృహ్ణంత్వపోంజలిమ్. త్రీంస్త్రీనంజలిమా కాశముచ్చైరుచ్ఛ్రతరంబుధః. ఉక్త్వాచోక్త్వాక్షిపన్వారి వాగ్యతో దక్షిణాముఖః-ఇతి.

ఆంధ్రవివరణము:— పితృదేవతలకుకూడ ఉదకదానమును (అనగా తర్పణమును) మాత్రమునిత్యమును ఈయవలయును. తక్కినదానిని [అనగా తర్పణము తప్ప తక్కిన భోజనఫలమూలాదులను] తనకుగల ఉత్సాహము ననుసరించి ఈయవచ్చును అని సూత్రార్థము. ఇచ్చట మూల సూత్రమునందు పితృభ్యశ్చ -అని [పితృదేవతలకు గూడా] అని] చకారమును సముచ్చయార్థమున వాడుట వలన -నిత్యమును దేవర్షులకు కూడ తర్పణమును చేయవలయునని విశేషార్థము ఏర్పడుచున్నయది. ఈవిషయమునందు మనువు ఇట్టులు అరంభించి చెప్పుచున్నాడు -ప్రతినిత్యమును బ్రాహ్మణుడు స్నానముచేసి దేవఋషిపితృతర్పణములను చేయవలయును -అని. కాత్యాయనుడు కూడ ఇట్లు చెప్పు

చున్నాడు -"బ్రాహ్మణుడగు వాడు దేవతలకును పితృదేవతలకును జలమునందే జలాంజలిని (అనగా తర్పణమును) ఒసంగవలయును. అసంస్కృత ప్రమీతులగు వారికి మాత్రము స్థలమునందే జలాంజలిని ఈయవలయును"- అని. భృగువు ఇట్టులు చెప్పిరి -"ఉదకములయందుగాని పాత్రములయందుగాని క్రుద్ధుడైగాని ఏకపాణియైగాని జలాంజలిని నొసంగగా రాదు. మఱియును [అసంస్కృత ప్రమీతు లగు వారికి] భూమిపైని జలాంజలి నొసంగిరేని అయ్యది పితరులకు చెందజాలదు -అని. శుక్రు డిట్టులని యెను: :సమస్తములైన ఆపస్సులు [నీళ్లు- లేక- ఉదకములు] దేవగణములుగాను సమస్తములైన ఆపస్సులు పితృగణములు గాను పెద్దలచేత స్మరింపబడియున్నవి కాబట్టి ఆపస్సులయందు పితృదేవతలకిచ్చిన జలమెయ్యది గలదో అయ్యది అక్షయమై రాజిల్లగలదు -అని. భృగుమహాముని ఇంకను మఱొకవిధముగా చెప్పుచున్నాడు -నాభి ప్రమాణముగల [అనగా బొడ్డునునుగునంతటి లోతుగల] నీటియందు నిలిచి పితృదేవతలను ధ్యానించుచు ఊర్ధ్వమానసుడై -నాయొక్క పితరులు విచ్చేయుదురుగాక. నేనిచ్చుచున్నట్టి ఈజలాంజలిని గ్రహింతురుగాక- అని మూడేసిమారులు ఆకాశము వైపుచూచుచు పెద్దగా పల్కిపల్కి ఆయంజలులను దక్షిణమువైపునకు తిరిగి నీళ్లయందు చల్లుచు జలాంజలులను పితరులకు ఒసంగవలయును-" అని.

## 187 సూ. భార్యాదిరగ్నిర్దాయాదిర్వా [౧–౫–౬]

హరదత్తమితాక్షరా:—దేవయజ్ఞస్య అగ్నికార్యమూలత్వాత్ అగ్నిపరిగ్రహకాలం తావదాహ. భార్యేతి:- భార్యాశబ్దేనాత్రవివాహోలక్ష్యతే. యస్మిన్నగ్నౌభార్యోఽహ్యతేతమగ్నిమారభ్యవా యస్మిన్నహని పితృభ్రాత్రాదిభిర్దాయవిభాగః క్రియతేతదహరారభ్యవా సాయముపక్రమమగ్నిం పరిచరేత్. దాయవిభాగాత్పూర్వం పితుర్జ్యేష్ఠభ్రాతుర్వాకర్మణ్యప జీవతో నప్రత్యవాయః.

ఆంధ్రవివరణము:—ఇ తదనుక పితృయజ్ఞమును గుఱించి చెప్పి ఇటుపైని దేవయజ్ఞమును గుఱించి చెప్పదలచినవాడై -అసలు దేవయజ్ఞము అగ్నికార్యమూలకము గనుక -మున్ముందు అగ్నిని పరిగ్రహింపవలసినట్టి కాలమును రూపించుచున్నాడు. గృహస్థుడగువాడు భార్యాదిగగాని దాయాదిగగాని అగ్నిని పరిచరింపవలయును అని సూత్రార్థము. అనగా వివాహమైనది మొదలుకొని గాని, అన్నదమ్ములలో నుండి దాయభాగమును పంచికొని వేరుపడినది మొదలుకొని గాని- అగ్ని పరిచర్యను చేయటకు- (అర్థాత్తుఅగ్నికార్యమును చేసికొనుటకు) ఆరంభింపవలయునని సూత్రార్థము. మూల సూత్రమునందుగల భార్యయనుమాటచేత ఇచ్చట వివాహము అనునర్థము స్వీకరింప బడుచున్నయది. వివాహకాలమున ఏయగ్నియందు [హవనాదులను చేసిన పిమ్మట సాక్షిగానుంచుకొని] భార్య భర్తచేత వివాహము చేసికొనబడుచున్నదో ఆయగ్ని మొదలుకొని- అనగా ఆనాటి యగ్ని మొదలుకొని- దినదినమును గృహస్థుడు అగ్నిపరిచరణము చేయవలయును. (ఇదియొక కొందఱమతము చెప్పున) లేనిచో ఏవాడు తల్లి తండ్రి అన్నదమ్ములున్నగు వారిద్వారా దాయవిభాగము చేయబడుచున్నదో ఆనాడు మొదలుకొని గాని అగ్నికి పరిచరణము చేయవలయును. మఱియును దాయవిభాగమునకు మున్ను అగ్నికార్యము లొనర్పకయున్నచో ప్రత్యవాయము సిద్ధింపదాయందురేని -అంతకుముందు తండ్రిలేక పెద్దన్నగారు అగ్నికార్యము నొనర్చుచున్నందున -ఇతనికి ఎట్టి ప్రత్యవాయము రానేరదని యెఱుగునది.

## 188 సూ. తస్మిన్గృహ్యాణి కర్మాణి [౧–౫–౭]

హరదత్తమితాక్షరా:—తస్మిన్నితి. తస్మిన్నేవం పరిగృహీతే అగ్నౌగృహ్యాణి మనుష్యభూతాని

పుంసవనా దీనికర్మాణి కర్తవ్యాని.

ఆంధ్రవివరణము:— ఇట్లు పరిగ్రహింపబడినట్టి గృహ్యాగ్నియందే పుంసవనాదులగు కర్మలను చేయవలయునని సూత్రార్థము.

## 189 సూ. దేవపితృమనుష్య యజ్ఞాఃస్వాధ్యాయశ్చబలికర్మ [౧—౫—౮]

హరదత్తమితాక్షరా:—దేవేతి. తస్మిన్నిత్యను వర్తతే.తత్రదేవయజ్ఞస్యాగ్నిసంబంధః ప్రసిద్ధః. పితృమనుష్య భూతయజ్ఞానాంతు తదర్థమన్నమస్మిన్గృహ్యాగ్నౌపచ్యతఇతి. బ్రహ్మయజ్ఞస్య అగ్నిసంబంధః ఉశనసాపక్షేదర్శితః -అగ్నిసమీపఇత్యేకేషామితి. అపరిగృహీతాగ్నేరపిపంచమహాయజ్ఞవిధానాదేతే లౌకికేగ్నౌ కర్తవ్యాః

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమునుండి ఇచ్చటికి తస్మిన్ను పదము అనువృత్తివచ్చుచున్నది. రాగా అగృహ్యాగ్నియందే యనియర్థము. అగృహ్యాగ్నియందే దేవయజ్ఞము పితృయజ్ఞము మనుష్య యజ్ఞము స్వాధ్యాయము (అనగా బ్రహ్మయజ్ఞము) బలికర్మఅనునియ్యవి చేయదగునని సూత్రార్థము. దేవయజ్ఞమునకుఅగ్నిసంబంధముండుటనుగూర్చి ఇదివఱకే చెప్పబడినది. ఇక పితృయజ్ఞమనుష్యయజ్ఞభూతయజ్ఞములకు అగ్ని సంబంధమెట్టులన్న ఆశంక కలుగ గలదు. కాని ఈయజ్ఞములలో వీరికొఱకై (అనగా పితృ మనుష్య భూతములకై)అన్నము ఈగృహ్యాగ్నియందు పచనముచేయబడుచుండునుగనుక అగ్నిసంబంధము వీనికి గూడ కలదని యెఱుంగదగును. ఇక బ్రహ్మయజ్ఞమున కొన్నిచోట్ల ఉశనుని చేత పక్షాంతరమననుసరించి ప్రదర్శింపబడినది. "కొందఱిమతము ననుసరించి దీనిని (అనగా బ్రహ్మయజ్ఞమును)అగ్ని సమీపమునందే చేయవలయును" -అని. పరిగృహీతాగ్ని కాని వానికి గూడా పంచమహాయజ్ఞములు అవశ్యము చేయవలసినట్టులు విధానము.డుటవలన-అనగా విధించియుండుట వలన -ఇయ్యవి (అనగా ఈపంచయజ్ఞములు)లౌకికాగ్నియందే చేయతగినవని భావము.

## 190 సూ.అగ్నావగ్నిర్ధన్వంతరిర్విశ్వేదేవాఃప్రజాపతిస్స్విష్టకృదితి హోమః[౧—౫—౯]

హరదత్తమితాక్షరా:—అథదైవయజ్ఞ వైశ్వదేవప్రయోగమాహ-అగ్నావితి. అత్ర"జుహోతిచోదనాస్వాహాకార ప్రదానాః-" ఇత్యాపస్తంబస్మరణాద్ధోమశబ్దేన స్వాహాకారఉక్తః. అగ్న్యాదిభ్యస్స్వాహాకారాంతైరగ్నౌజుహుయాత్ స్విష్టకృచ్చాగ్న్యపవదోద్రష్టవ్యః. హుత్వా దేవాగ్నిసిద్ధా అగ్నావితి వచనంబలిహరణవద్భూమౌ న కర్తవ్య మితివచనార్థమ్. తస్మాద్ధోమధర్మ స్స్వాహాకారో బలిహరణేష్వపిభవతి. తథాచాశ్వలాయనః-స్వాహేత్యథ బలిహరణమితి. ఆపస్తంబీయానాం స్వాహాకారాంతఏవమంత్రాః పఠితాః.

ఆంధ్రవివరణము:—ఇటుపైని దైవయజ్ఞవైశ్వదేవ ప్రకారములను రూపించుచున్నాడు. -అగ్నియందు- అనగా గృహ్యాగ్నిహోత్రమునందే -అగ్ని ధన్వంతరి విశ్వేదేవతలు ప్రజాపతి -అను వీరికొఱకు అగ్న్యాదిశబ్దములతో స్వాహాకారాంతములుగా హోమము జేయ వలయు నని సూత్రార్థము.

191 సూ. దిగ్దేవతాభ్యశ్చయథా స్వమ్. [౧—౫—౧౦]

హరదత్తమితాక్షరా:— అథ భూతయజ్ఞ బలి హరణమాహ-దిగ్దేవతాభ్య ఇతి. యస్యా దేవతాయా యాదిక్ అధిష్ఠానస్థాన త్వేననిర్దిష్టా తస్యాందిశి తస్యై దేవతాయై బలిర్హర్తవ్యః. ఇంద్రాయస్వాహేతి ఈశానపర్యంతం ప్రాగాదిప్రదక్షిణం కర్తవ్యమ్,

ఆంధ్రవివరణము:—ఇటుపైని భూతయజ్ఞ బలిహరణములను వివరించుచున్నాడు. ఏయేదేవతకు ఏయేదిక్కు అధిష్ఠానస్థానముగా నిర్దేశింపబడియున్నదో ఆయాదిక్కునందు ఆయాదేవతకు బలిహరణము నొసగవలయును, అని సూత్రార్థము. అనగా ప్రాచ్యాదులగు దిక్కులు మొదలుకొని ఈశానదిక్కు వఱకు ఎన్మిదింటియందును ఆయాదిక్కులయొక్క అధిష్ఠానదేవతల నుద్దేశించి స్వాహాంతముగా ప్రదక్షిణక్రమముగా బలిహరణమును ఒసర్పవలయునని తాత్పర్యము.

192 సూ. ద్వార్షు మహద్భ్యః [౧—౫—౧౧]

హరదత్తమితాక్షరా:— ద్వార్ష్వితి. గృహస్య యావన్తో ద్వారాః తాసు స్వాహేతి బలిహరణమ్.

ఆంధ్రవివరణము:— గృహమునకు ఎన్ని ద్వారములు గలవో అన్నిటియందు స్వాహాకారపూర్వకముగా పంచమహాభూతములకై బలుల నొసంగవలయునని సూత్రార్థము. ద్వార్షుమరుద్భ్యః అని మస్కరిపాఠము.

193 సూ. గృహదేవతాభ్యః ప్రవిశ్య. [౧—

హరదత్తమితాక్షరా:—గృహదేవ- అంతఃప్రవిశ్య గృహదేవతాభ్య ఇతిబలిహరణం. ప్రవిశ్యేతివచన హిర్దేశే న కర్తవ్యమ్.

ఆంధ్రవివరణము:— వెనుకటి స చెప్పిన విధముగా ద్వారములయందు భూతబ పిమ్మట ద్వారములను దాటి లోనప్రవేశించి కొఱకు బలుల నొసంగవలయునని సూత్రార్థ

విశేషాంశములు;— ఇచ్చట ప్రవి సూత్రమునందుండుటచేత, మొట్టమొదట గృ లుపట బలిహరణముచేయవలసియున్నది. ఎట్ల మునకు వెలిభాగమున గోమయముతో మం అచ్చట దిగ్దేవతలకొఱకు బలిహరణమును చేం తరువాత బాహ్యాంతరము లగుద్వారములయ బలిహరణమును చేసి ఆపిమ్మట గృహముయొక భాగమును ప్రవేశించి గృహదేవతల కొఱక హరణము నొసంగవలయును. ఇట్టులు బలిహ గాడిరీతిని శుక్రుండు ఇట్టులు నిర్దేశించినాడు-శ క్క శిరోభాగమునందు శ్రియైనమః-అనుచును. మునందు భద్రకాళ్యైనమః-అనుచును, నందు ధనపతయేనమః అనుచును స్తంభనిలయ ద్రాయనమః-అనియును, గోష్ఠమునందు మిత్ర అనియును, రోలురోకలియొక్కనడుమ వరు అనియును బావియొద్దనఅహిర్బుధ్న్యవేనమః-అని కల్లు (పచ్చడిబండ) అగ్నిహోత్రము వీటిదగ్గర దేవతాభ్యోనమః, అనియును బలిహరణమును యును" అని.

## 194 సూ. బ్రహ్మణే మధ్యే [౧-౫-౧౩]

హరదత్తమితాక్షరా:— బ్రహ్మణఇతి-మధ్యే గృహస్యమధ్యే బ్రహ్మణేస్వాహేతి బలిర్హర్తవ్యః. దిగ్దేవతాభ్యశ్చేతి చకారాత్పృథివీవాయుః ప్రజాపతిర్విశ్వే దేవాఇతి సూత్రకారోక్తదేవతాభ్యశ్చ బ్రహ్మణోనంతరం బలిర్హర్తవ్యఇతి ఫలతి.

ఆంధ్రవివరణము:— గృహముయొక్క నడుమను (బ్రహ్మకొఱకు అగుగాక) బ్రహ్మణేస్వాహా అని బలిహరణము నొనర్పవలయునని. సూత్రార్థము.191వ సూత్రమునందు దిగ్దేవతాభ్యశ్చ- అని యొక చకారమునుకూడ చేర్చుటవలన కేవలము దిగ్దేవతలకుమాత్రమే గాక పృథివి వాయువు ప్రజాపతి విశ్వేదేవతలు అను వారికి గూడ బ్రహ్మతరువాత బలినొసంగవలయునని కూడ ద్యోతకమగుచున్నయది.

## 195 సూ. ఆకాశాయేత్యంతరిక్షే బలరుత్క్షిప్యః [౧-౫-౧౪]

హరదత్తమితాక్షరా:— ఆకాశాయేతి. స్పష్టమ్. మనురప్యాహ-శ్లో. విశ్వేభ్యశ్చైవ దేవేభ్యోబలిరాకాశ ఉత్క్షిపేత్. దివాచరేభ్యో భూతేభ్యో నక్తం చారిభ్యఏవచ-ఇతి.

ఆంధ్రవివరణము:— ఆకాశాయస్వాహా- అని చెప్పుచు అంతరిక్షమునందు ఆకాశ సంచారులగు విశ్వేదేవతలకొఱకు బలిహరణము నొనర్పవలయునని సూత్రార్థము. మనువుకూడ నానెను.- విశ్వేదేవతలకొఱకును దివాచరులును నక్తంచరులును అగు భూతములకొఱకును ఆకాశమునందే బలిని చల్లవలయును. అని.

## 196 సూ. నక్తంచరేభ్యస్సాయమ్. [౧-౫-౧౫]

హరదత్తమితాక్షరా— నక్తమితి. సాయం బలిహరణేయం విశేషః నక్తంచరేభ్యస్స్వాహేతిబలిర్హర్తవ్యః. చకారాత్పూర్వోక్తాభ్యశ్చ భవతి.

ఆంధ్రవివరణము:— నక్తంచరేభ్యస్స్వాహా-(రాత్రులు సంచరించునట్టి భూతములకొఱకు) అని చెప్పుచు సాయంకాలమునందు నక్తంచరు లగుదేవతలకుగూడ బలిహరణము నొనర్పవలయునని యర్థము. చకారము వలన వెనుక చెప్పిన దేవతలకుగూడ నని యెఱుంగునది.

## 197 సూ. స్వస్తివాచ్య భిక్షాదానమప్పూర్వమ్. [౧-౫-౧౬]

హరదత్తమితాక్షరా:— స్వస్తివాచ్యేతి. బలిహరణానంతరం భిక్షాదానం కర్తవ్యం స్వస్త్యస్త్వితిస్వస్తివచనముక్త్వా భిక్షోర్హస్తేపూర్వమపోదత్వాచేతి. పరివ్రాజకేతువిశేషః-శ్లో యతిహస్తేజలందద్యాద్భైక్షందద్యాత్పునర్జలమ్. భైక్షంపర్వతమాత్రంస్యాత్తజ్జలం,సాగరోపమమ్-ఇతి. ఏతద్భిక్షాదానమేవఅతిథిపూజాభావేమనుష్యయజ్ఞస్స్యాత్. ఏతేపంచ మహాయజ్ఞా బ్రహ్మయజ్ఞవర్జ్యాః సాయం ప్రాతశ్చ. కస్మాత్. అథసాయంప్రాతస్సిద్ధస్యహ విష్యస్యజుహుయాదిత్యాశ్వలాయనస్మరణాత్. సాయంప్రాతర్భూతమిత్యుక్తఇత్యాది కాత్యాయనసూత్రవచనాచ్చ.

ఆంధ్రవివరణము:— బలిహరణమును చేసిన పిమ్మట నుదకపూర్వకముగా స్వస్తిని పలుకుచు (అనగా

స్వస్తియగు గాక - యనిచెప్పుచు) భిక్షా దానమును ఒసగ్గవల యునని సూత్రార్థము. అనగా భిక్షార్థియై వచ్చినట్టి వటువులు మున్నగువారికి తొలుదొల్త హస్తమునందు ఉదకము నొసంగి అనంతరము స్వస్తియగుగాక యగుచు భిక్షను ఒసగవలయుననితాత్పర్యము. ఇయ్యది సాధారణముగా భిక్షార్థియగు వటువును గురించిన విషయము. ఇకను పరివ్రాజకులు (అనగా సన్న్యాసులు) మున్నగు వారివిషయమై యస్న చో విశేషము విధింపబడి యున్నది- అదిఇట్లు- "యతికి భిక్షను ఇచ్చునప్పుడు తొలుదొల్త ఆయతియొక్క హస్తమునందు జలము నొసంగి తరువాత భిక్షనొసగి- ఆపైని మరల నుదకము నొసంగవలయును. ఇట్టులు చేసినచో అయతి పరుని హస్తముననిడిన ఆకొలదిపాటి భిక్షయే పర్వతమాత్రముగాను ఆయుదకమే సాగరమాత్రముగను కాగలుగును."- అని ఇట్టులు భిక్షనొసంగుటయే అతిథి పూజలేని పట్టులలో మనుష్యయజ్ఞముగా కాగలదు. ఈ వెనుకటి సూత్రములలో చెప్పబడినట్టి పంచమహాయజ్ఞములలో ఒక బ్రహ్మయజ్ఞమును మాత్రమువదలి తక్కినవానిని అన్నింటిని సాంకాల ప్రాతః కాలములయందు రెండువేళలగూడ గృహస్థులందఱును చేయుచుండవలయును. ఏలయనగా- సాయం ప్రాతస్సిద్ధస్య హవిష్యస్య జుహుయాత్ - అని ఆశ్వలాయనుడు చెప్పుటవలన మఱియును సాయంప్రాతర్భూతమిత్యుక్త్వ ఇత్యాది కాత్యాయన సూత్రవచనములుండుటవలన- అని యెఱుంగవలయును.

## 198 సూ. దదాతిషు చైవం ధర్మ్యేషు [౧-౫-౧౭]

హరదత్తమితాక్షరా:— దదాతీతి. దదాతయః దానాని. యానిదానాని ధర్మ్యాణి నభయాది నిమిత్తాని తేషుచవేవ మప్పూర్వదానమితి,

ఆంధ్రవివరణము:— దదాతి అనగా ఇచ్చున్నాడు. అని అర్థము. (ఇచ్చుచున్నాడు ఇచ్చుచున్నాను) - అని ఇత్యాదివాక్యముల నుచ్చరించి చేయునట్టి పనులకు -అనగా దానములకు గూడ, దదాతు లనియే పేరు. ధర్మముతో కూడియున్నట్టికార్యములు ధర్మ్యము లనంబడును. ధర్మ్యము లగునట్టిదదాతులయందుకూడ- అనగా ధర్మానపేతము లగుదానకార్యములవిషయమున గూడ- ఈప్రకారమే ఉదకపూర్వకముగా నొసంగవలయునని తాత్పర్యము అగుచున్నయది. ఇచ్చట ధర్మ్యాణి అన్న విశేషణముచేత భయాది నిమిత్తకములగు దానములయిన చో ఉదకపూర్వకముగా దానము నొసంగ నక్కఱలేదని తెలుచున్నయది.

## 199 సూ. సమద్విగుణ సాహస్రానంత్యానిఫలాని అబ్రాహ్మణ బ్రాహ్మణ శ్రోత్రియవేదపారగేభ్యః [౧-౫-౧౮]

హరదత్తమితాక్షరా:— దానప్రసంగాత్ఫల విశేషమాహా - సమఇతి. అబ్రాహ్మణః క్షత్రియాదిః, బ్రాహ్మణః జాతిమాత్రం శ్రోత్రియోఽధీతవేదః, సాంగం సకల్పం సరహస్యంచాధీతవేదో వేదపారగః, ఏభ్యోదత్తం యథాక్రమం సమ ద్విగుణ సాహస్రమానంత్యంచఫలం దదాతి. తథాచమనుః- శ్లో. సమమబ్రాహ్మణేదానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే, శ్రోత్రియేశతసాహస్ర మనంత్యం వేదపారగే -ఇతి.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు దానప్రసంగము వచ్చుటవలన- ప్రస్తుతమిచ్చట దానమునందుగల ఫలవిశేషమును నిరూపించుచున్నాడు- అబ్రాహ్మణుడనగా బ్రాహ్మణుడుకానట్టివాడు. అనగా క్షత్రియ వైశ్య శూద్రాది జాతులకు చెందినట్టివాడు. బ్రాహ్మణుడనగా జాతిమాత్రముచేత బ్రాహ్మణునిగా పరిగణింపబడినట్టి వాడు. చక్కగా వేదాధ్యయనము చేసినట్టి బ్రాహ్మణుడు శ్రోత్రియుడనబడును. అందునను షడంగసహితము

గను కల్పసూత్రాది సహితముగను అథర్వణము మున్నగు రహస్యభాగములతో సహితముగను వేదము నధ్యయనము చేసినవా డెవ్వడు గలడో అతడు వేదపారగు డనబడును. అబ్రాహ్మణులు బ్రాహ్మణులు శ్రోత్రియులు వేదపారగు లను వీరికి చేయునట్టి దానము క్రమముగా సమఫలము ద్విగుణమగు ఫలమును అసంఖ్యాకమగు ఫలమును ఈయుగల దని తాత్పర్యము. మనువు కూడ నిట్లనే చెప్పుచున్నాడు-అబ్రాహ్మణుని విషయమున జేసినట్టిదానము సమఫల మొసంగును. బ్రాహ్మణబ్రువునివిషయమున -అనగా జాతిమాత్రుడగు బ్రాహ్మణుని విషయమున- జేసినదానము ద్విగుణముగ ఫలము నొసంగును, శ్రోత్రియునియందు చేసిన దానము శతసాహస్ర గుణముగ ఫలము నొసంగును. వేదపారగుని యందు చేసిన దానము అనంతముగ ఫలము నొసంగును. అని.

200 సూ. గుర్వర్థనివేశౌషధార్థవృత్తిక్షీణయక్ష్యమాణాధ్యయనాధ్వసంయోగవైశ్వజితేషు ద్రవ్యసంవిభాగో బహిర్వేది.

[౧—౫—౧౯]

హరదత్తమితాక్షరా:—దానప్రసంగా ద్యత్రావశ్యదేయమదానేచ ప్రత్యవాయ స్తంవిషయమాహ-గుర్వర్థమితి. యజ్ఞేదక్షిణాకాలే సదస్యేభ్యోయద్దానం తదంతర్వేది. తతోన్యత్ర బహిర్వేది. ద్రవ్యసంవిభాగో హిరణ్యాదే ర్దానం తద్గుర్వాదీనాంవిషయేవశ్యం దానం కర్తవ్యమ్. అధీతవేదస్య దక్షిణార్థం గుర్వర్థం నివేశౌషధార్థం నివేశో వివాహః సచ ప్రథమ స్తదర్థమ్. ఔషధార్థం రుగ్ణస్యభేషజార్థమ్. వృత్త్యాత్రదహర్జీవనేనహీనో వృత్తిక్షీణః. యక్ష్యమాణోయజ్ఞం కరిష్యన్ అధ్యయనాధ్వసంయోగః. అధ్యయనేన సంయోగోయస్యసోధ్యయనసంయోగః. అధ్వనా సంయోగో యస్య సోధ్వసంయోగః. బహువ్రీహిః. వైశ్వజితః కృతవిశ్వజిద్యాగః. సర్వస్వదానేన నిర్ద్రవ్యః. ఏతేభ్యశ్చావశ్యం యథాశక్తి హిరణ్యాది దద్యాత్. అదదత్ప్రత్యవేయాదితి. బహిర్వేది గ్రహణేన సదీక్షితవిషయమిదమాతిర్వేవన్యేభ్యోపి దేయం.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రములందు దానము చేయవలయు ననువిషయము ప్రసంగసందర్భమునందు వచ్చుటవలన ఏయేవిషయములలో ముఖ్యముగా దానము చేయవలసియున్నదియును, ఏయేవిషయము లందెవ్వరెవ్వరి కిచ్చిన ప్రత్యవాయము వచ్చుచున్నదియును ఇందు వివరించుచున్నాడు.

దానము సాధారణముగా రెండువిధములు. అంతర్వేది యని బహిర్వేదియని. యజ్ఞములను చేయునట్టి వేళలలో యజమానుడు సదస్యులకొరకు ఇచ్చునట్టి దానము అంతర్వేదియనియు తదతిరిక్తమగునట్టి దానము బహిర్వేదియనియును చెప్పబడును. ద్రవ్యసంవిభాగము-అనగా హిరణ్యాదులను ఒసగుట- అయ్యది గురువులు మున్నగువారి విషయమున ముఖ్యముగా చేయదగినదని యెఱుంగవలయును.

గుర్వర్థులు నివేశౌషధార్థులు వృత్తిక్షీణులు యక్ష్యమాణులు అధ్యయనసంయోగులు అధ్వసంయోగులు వైశ్వజితులు- అను వీరివిషయమై గృహస్థుడు తనకుగల యంతలో ద్రవ్యవిభాగమును చేసి యథాశక్తి హిరణ్యము మున్నగుదానిని ఒసంగవలయునని సూత్రార్థము. ఎవ్వరు గురువుల యొద్ద వేదమును సాంతముగ జదివి చివరను గురువులకు దక్షిణను ఒసంగుటకై ధనమును యాచింతురో వారు గుర్వర్థులని యనబడుదురు. నివేశమనగా ఇల్లు. అనగా వివాహము చేసికొని ఒక యింటివాడగుటకై ఎవ్వడు ద్రవ్యమును యాచించునో వాడు నివేశార్థుడనబడును, రుగ్ణుడై (అనగా వ్యాధిచేత పీడింపబడుచు) ఔషధమును కొనుటకై ఎవ్వడు ద్రవ్యమును యాచించునో వాడు ఔషధా

ర్థ డనబడును. ఆపూటకైనను జీవనము జరుగక బాధపడుచు ద్రవ్యమును యాచించుచుండువాడు వృత్తిక్షీణుడనబడును. యజ్ఞమును చేయదలంచి ద్రవ్యమును యాచించువాడు యక్ష్యమాణు డనబడును. అధ్యయనముద్వారా సంయోగము కలిగినవాడు అధ్యయనసంయోగుడు. అధ్వా-(త్రోవనడచుటద్వారా)సంయోగము కలవాడు అధ్వసంయోగు డనబడుచున్నాడు. విశ్వజిత్తుఅని యొకయజ్ఞము గలదు. ఈయజ్ఞమునందు యజమాని తనకున్న సర్వస్వమును దక్షిణగా సమర్పింపవలసి యున్నది. ఇట్టి విశ్వజిద్యాగముచేసి సమస్తధనమును దక్షిణగా సమర్పించి దరిద్రుడై ధనము కొఱకు యాచించువాడు వైశ్వజితుడనబడును. అట్టివారికి అవశ్యము కలంతలో ఇయ్యవలయు ననియును లేనిచో ప్రత్యవాయము(అనగా పాపము)కల్గుననియును ఎఱుంగునది. బహిర్వేది యనుటచేత నిది సదీక్షితుని విషయము. ఇకనంతర్వేది యందన్ననో ఇతరులకుగూడ నొసంగదగు నని యెఱుగునది.

## 201 సూ. భిక్షమాణేషు కృతాన్నమితరేషు [౧—౫—౨౦]

హరదత్తమితాక్షరా:— భిక్షమాణేష్వితి. ఇతరేషు ఉక్తవ్యతిరిక్తేషు భిక్షమాణేషు కృతాన్నంనామ పక్వాన్న మవశ్యం దేయమ్. ద్రవ్యాదే రదానే నదోషః కృతాన్నవిషయేపి విశేషమాహావసిష్ఠః శ్లో అవ్రతాహ్యనధీయానా యత్ర భైక్షచరాద్విజాః. తంగ్రామం దండయే ద్రాజా చోర దండప్రదోహిసః-ఇతి.

ఆంధ్రవివరణము:—పైని చెప్పినట్టి వారికంటెను వ్యతిరిక్తులగువారు - అనగా ఇతరులు - యాచించినని వారికి పక్వముచేయబడిన (సిద్ధముగానున్న) యన్నమునొసంగవలయును అని సూత్రార్థము. అనగా అట్టివారికి ధనాదుల నొసంగనిచో దోసగు లేదని భావము. పక్వముచేయబడి సంసిద్ధముగా నున్నట్టి అన్నవిషయమున గూడ వసిష్ఠుడు విశేషమును చెప్పెను - అవ్రతులును అనధీయానులునై ఎచ్చట ద్విజులు భిక్షాచరణమును చేయుచుందురో అట్టిగ్రామమువారిని రాజుదండనచేయవలయును. ఏలయనగానతడు చోరదండనవ్రతుడుగదా!.

## 202 సూ. ప్రతిశ్రుత్యాప్యధర్మసంయుక్తాయ న దద్యాత్ [౧—౫—౨౧]

హరదత్తమితాక్షరా:— అథదానాపవాదః. ప్రతిశ్రుత్యేతి. నాస్వామీవిప్రతి శ్రుత్యాప్యసంయుక్తవిషయే నదద్యాత్ యది తేన ద్రవ్యేణ అధర్మసంయుక్తం వేశ్యాగమనాది అసౌకరిష్యతీతి విజానీయాత్. అధర్మసంయుక్త ఇతి వచనాదన్యత్ర ప్రతిశ్రుత్య అదదత్ప్రత్యవేయాదితి దర్శయతి.

ఆంధ్రవివరణము:— ఇటుపైని దానమునకు అపవాద విషయమును నిరూపించుచున్నాడు - ఎవ్వడు అధర్మసంయుక్తుడుగా నుండునో అట్టివానికి తొలుదొల్త నిచ్చెదనని ప్రతిశ్రవణము చేసియున్నను ఈయగారాదు - అని తాత్పర్యము. అధర్మసంయుక్తుడు కానివానివిషయములో మాత్రము ప్రతిశ్రవణము చేసిన పిమ్మట నీయక యుండుట ప్రత్యవాయమే కాగలదని యెఱుంగతగును.

## 203 సూ. క్రుద్ధహృష్టభీతార్తలుబ్ధబాలస్థవిరమూఢమత్తోన్మత్తవాక్యాని అనృతాని అపాతకాని [౧—౫—౨౨]

హరదత్తమితాక్షరా:— ప్రతిశ్రవణవిషయే విశేషమాహ-క్రుద్ధేతి. క్రుద్ధాది వాక్యాని అనృతాని అయథార్థాన్యపి అపాతకాని

పాపం న జనయంతి క్రుద్ధః క్రోధావిష్టః హృష్టో హర్షావిష్టః భీతో భయావిష్టః ఏతేషాం గుణాం తైరావిష్టత్వాద్వాక్యం న ప్రమాణమ్. తస్మాత్ప్రతిశ్రుత్యాదానేపి తేషామదోష ఇతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— ప్రతిశ్రవణము Promise చేసికూడ ప్రత్యాఖ్యానము చేయవలసినట్టి మఱికొన్ని విశేషములను ప్రస్తుతసూత్రమునందు కనబరచుచున్నాడు - కోపముచేత నొడలు తెలియని వాడు క్రుద్ధుడు. సంతోషముచేత నొడలెఱుంగనివాడు హృష్టుడు. భయముచేత నావేశింపబడినవాడు భీతుడు. వ్యాధులు మున్నగువానిచేత బీడింపబడినవాడార్తుడు. లోభముచేత మతిచెదరినవాడు లుబ్ధుడు. ఉచితానుచిత భావముల నెఱుంగలేనివాడు స్థవిరుడు. తెలిసియు తెలియజాలనివాడు మూఢుడు. ధనాదులచేత నొడలెఱుగనివాడు మత్తుడు. చిత్తచాంచల్యమున బరగువాడున్మత్తుడు. క్రుద్ధుడు హృష్టుడు భీతుడు ఆర్తుడు లుబ్ధుడు బాలుడు స్థవిరుడు మూఢుడు మత్తుడున్మత్తుడు - అను వీరి వాక్యములు (అనగా వీరు ప్రతిశ్రవణము చేసియుండినచో అట్టి ప్రతిశ్రవణవాక్యములు) అనృతములయ్యును అపాతకములు అగునని సూత్రార్థము. అనగా నసత్యదోషమునకు గురికాజాలవు. అని భావము.

## 204 సూ. భోజయేత్పూర్వమతిథికుమారవ్యాధితగర్భిణీ స్వవాసినీ స్థవిరాన్ జఘన్యాంశ్చ

[౧-౫-౧౩]

హరదత్తమితాక్షరా:— అథ గృహస్థః పూర్వం భోజ్యానాహ— భోజయేదితి. అతిథి ర్వక్ష్యమాణః కుమారాః బాలాః వ్యాధితాస్సంజాతవ్యాధికాః గర్భిణ్యః ప్రసిద్ధాః స్వవాసిన్యో దుహితరో భగిన్యశ్చ స్థవిరాః వృద్ధాః జఘన్యాః పరిచారికాదయః, ఏతానాత్మనః పూర్వం భోజయేత్ పశ్చాత్స్వయం భుంజీత జఘన్యానాం పృథక్పఠనత్వం తేషామానంతర్య సూచనార్థమ్.

ఆంధ్రవివరణము:— గృహస్థుడు తాను భోజనము చేయుటకంటె ముందుగా అతిథులను కుమారులను వ్యాధితులను గర్భిణీ స్త్రీలను స్వవాసినీ స్త్రీలను స్థవిరులను జఘన్యులను ముందుగా భుజింపచేయదగును. కుమారులనగా పిల్లలు. వ్యాధితులనగా రోగములు కలిగియున్నట్టివారు. గర్భిణీ స్త్రీలు సుప్రసిద్ధులు. కూతురు గాని సోదరీజనము గాని స్వవాసినీ స్త్రీలనబడుదురు. స్థవిరులనగా ముదుసలులు. జఘన్యులనగా పరిచారికులు మున్నగు సేవకజనమునకు చెందినవారు. ఈసూత్రమునందు అతిథి మున్నగువారిని ఒక్క సమాసమునందు చెప్పి జఘన్యులను వేరుగా చెప్పుటవలన ఆజఘన్యులను యజమాని భుజించిన యనంతరము భోజనము పెట్టవలెనని సూచించుటకని వ్యాఖ్యాత తలచుచున్నాడు.

## 205 సూ. ఆచార్యపితృసఖీనాంచ నివేద్యవచనక్రియా.

[౧-౫-౧౪]

హరదత్తమితాక్షరా:— ఆచార్యేతి. యదివా భోజనకాలే ఆచార్యాదయః ఆగచ్ఛేయుః తదా సిద్ధమన్నం తేభ్యో నివేద్య తద్వచనక్రియా తదిచ్ఛాతః కర్తవ్యా. న తేషు సంనిహితేషు స్వాతంత్ర్యేణ భవేదిత్యర్థః.

ఆంధ్రవివరణము:— యజమానుడు భోజనము చేయబోవునట్టి కాలమునకు సరిగా ఆచార్యులు పితరులు స్నేహితులు అరుగుదెంచెదరేని అప్పుడు సిద్ధమైయున్నయన్నమును వారికి నివేదించి ఆపిమ్మట దానిని వారు చెప్పిన చొప్పున చేయవలయునని సూత్రార్థము. అనగా ఆచార్యులు సంనిహితులై యుండ తాను స్వతంత్రుడు కారాదని భావము.

206 సూ. ఆచార్యబుత్విక్ఛ్వశురపితృవ్యమాతులానాంఉపస్థానే మధుపర్కః.[౧—౫—౨౫]

హరదత్తమితాక్షరా:—ఆచార్యేతి. ఆచార్యబుత్విగాదిషు మధుపర్కో దేయః.

ఆంధ్రవివరణము:— ఆచార్యులు బుత్విక్కులు శ్వశురులు పితృవ్యులు మాతులులు తనయింటికి చనుదెంచినప్పుడు గృహస్థుడు మధుపర్కము నొసంగవలయునని సూత్రార్థము.

207 సూ. సంవత్సరే పునః. [౧—౫—౨౬]

హరదత్తమితాక్షరా:—సంవత్సర ఇతి. పూజితాస్తే యది సంవత్సరాత్పునరాగచ్ఛేయుః పునరపి మధుపర్కో దేయః. నహ్యర్వాగితి ఫలతి.

ఆంధ్రవివరణము:—ఆయాచార్యులూబుత్విక్కులు మున్నగువారూ ఇట్లుపూజితులై వెళ్లిపోయిమరల సంవత్సరము కాగానే వచ్చిరేని మరల వారిని పూజింపవలయునని సూత్రార్థము. అనగా సంవత్సరములోపల్లనైన చో అక్కఱలేదని భావము.

208 సూ. యజ్ఞవివాహయోరర్వాక్[౧—౫—౨౭]

హరదత్తమితాక్షరా:—యజ్ఞేతి. సంవత్సరాదర్వాగపి యజ్ఞవివాహయోరాగతేభ్యస్తేభ్యోమధుపర్కో దేయః. మధుపర్కవిధిస్తు గృహ్యాత్ ద్రష్టవ్యః.

ఆంధ్రవివరణము:—సంవత్సరమునకు లోపుగానైనప్పటికిని వారు -అనగా ఆయాచార్య బుత్విగాదులు- యజ్ఞములు వివాహములు మున్నగువాని యందు వచ్చిరేని వారి కొఱకు మధుపర్కము నొసంగగావలయునని సూత్రార్థము. ఇచ్చట మధుపర్క విధానము గృహ్యసూత్రమున జెప్పబడినరీతిగ నెఱుంగనగును.

209 సూ. రాజ్ఞశ్చ శ్రోత్రియస్య [౧—౫—౨౮]

హరదత్తమితాక్షరా:—రాజ్ఞ ఇతి. శ్రోత్రియస్య సతో రాజ్ఞశ్చైవం మధుపర్కో దేయః.

ఆంధ్రవివరణము:—శ్రోత్రియుడగు రాజు ఇంటికి చనుదెంచినను మధుపర్కము నొసంగదగు నని భావము.

210 సూ. అశ్రోత్రియస్యాసనోదకే[౧—౫—౨౯]

హరదత్తమితాక్షరా:— అశ్రోత్రియస్యేతి. అశ్రోత్రియస్యరాజ్ఞః ఆసనోదక మాత్రేణ పూజనం మధుపర్కః.

ఆంధ్రవివరణము:—అశ్రోత్రియుడైన రాజు వచ్చినచో -అతనికి కూడ -ఆసనమును ఉదకము నొసంగి పూజింపవలయును. ఆయాసనకట్టులు పూజించుటయే మధుపర్కమూ అనబడును అనియర్థము.

211 సూ. శ్రోత్రియస్యతుపాద్యమర్ఘ్యమన్నవిశేషాంశ్చప్రకాశయేత్.[౧—౫—౩౦]

హరదత్తమితాక్షరా:—శ్రోత్రియస్యేతి. తుశబ్దోన బ్రాహ్మణం వ్యావర్తయతి శ్రోత్రియస్య బ్రాహ్మణస్యాతిథేః పాద్యం పాదోదకం

అర్ఘ్యం ఫలోపహార తాంబూలాదికమ్. అన్నవిశేషాః పాయసాపూపాదయ స్తాంశ్చ ప్రకర్షేణ కారయేత్సమర్థః.

ఆంధ్రవివరణము:— శ్రోత్రియుడగు బ్రాహ్మణుడు అతిథిగా వచ్చినయెడల నతనికి పాదోదకమ్మును ఫలోపహార తాంబూలాది రూపమైన అర్ఘ్యమును పాయసాపూపాదులగు అన్న విశేషములను ఎక్కుడుగ నొసంగి గౌరవింపవలయునని సూత్రార్థము. ఇయ్యది సమర్థుడగు గృహస్థువులు చేయతగిన అతిథ్యము.

212 సూ. నిత్యంవాసంస్కారవిశిష్టమ్.[౧—౫—౩౧]

హరదత్తమితాక్షరా:— అసమర్థస్య విషయమాహ నిత్యమితి. యదస్య గృహే నిత్యం విద్యమానం తదేవ మరీచ జీరకాది విశిష్టం సాధయేదితి.

ఆంధ్రవివరణము:— ఇకను అసమర్థుడగువాడు చేయవలసినట్టి విధానమును చెప్పుచున్నాడు. వెనుకటి సూత్రమునందు చెప్పబడినట్టి శ్రోత్రియబ్రాహ్మణునకు అతిథిగా వచ్చినచో (సాధారణుడగు గృహస్థుడు) తనగృహములో నున్నంతలో అన్నాదులను సంస్కారవిశిష్టములుగా నొనర్చి యొసంగి గౌరవింపవలయునని తాత్పర్యము.

213 సూ. మధ్యతోన్నదానమవైద్యే సాధువృత్తే.

[౧—౫—౩౨]

హరదత్తమితాక్షరా:—మధ్యతఇతి. యస్త్వతిథిః విద్యారహితోపి సాధువృత్తో భవతి తస్మిన్నుపస్థితే మధ్యమేన సంస్కారేణాన్నం దేయమ్.

ఆంధ్రవివరణము:— ఉత్తములగు విద్యానిష్ణాతాదులు లేక మధ్యమశ్రేణి యోగ్యతగలవారు అతిథులుగా వచ్చెదరేని, అట్టివారు సాధువృత్తులుగా నున్నచో వారికిని మధ్యమమగురీతిని ఆతిథ్యము నొసంగదగునని యర్థము.

214 సూ. విపరీతేషు తృణోదకభూమిస్స్వాగతమంతతః పూజా అనత్యాశశ్చ.[౧—౫—౩౩]

హరదత్తమితాక్షరా:—విపరీతేష్వితి. విపరీతః విద్యాయుక్తోపి న సాధువృత్తః తస్మిన్నిహాస్యతామితి భూమిం తృణమాసన ముదకంచ దద్యాత్. స్వాగత మంతతోనంతరం స్వాగతంచ ప్రయుంజీత. సంభాషణేన పూజాకర్తవ్యా. అనత్యాశశ్చ. అత్యాశః పాయసాపూపాదివిశిష్టక్రమస్త దన్యో మధ్యమరీత్యా కర్తవ్యః. ఆశఃఅశనమితి యావత్

ఆంధ్రవివరణము:— విపరీతులై యుండువారివిషయమున -[అనగా విద్యాదిగుణములతో గూడినవారైనను సాధువర్తనము గల్గియుండనివారి విషయమున అనిభావము.] ఆసనార్థమై తృణమునున్ను పాద్యార్థమై యుదకమునున్ను తరువాత స్వాగతవాక్యమునున్ను ఉపయోగింపవలయును. తరువాత నట్టివారిని మధ్యమరీత్యా అన్నాదుల నొసంగుటచేత గౌరవింపవలయు నని సూత్రార్థము.

215 సూ. శయ్యాసనావసథానువ్రజ్యోపాసనాని సదృక్ శ్రేయసోస్సమానాని.[౧—౫—౩౪]

హరదత్తమితాక్షరా:—శయ్యేతి. యోతిథిర్విద్యావృత్తాదినాత్మనోసదృశః, యశ్చశ్రేయాన్. తయోర్ద్వయోరప్యాత్మనాతుల్యాని

శయ్యాసనాదీని దేయాని ఆవసథః గృహే స్థానమపి శేషః. అనువ్రజ్యోపాసనయోరాత్మన్యసంభవా త్తుల్యత్వం న సంభవతి. తేఅపి కార్యే ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:— చదువు సద్వర్తనము మొదలగువానిలో సర్వదా తనకు సమానుడుగా ఎవ్వడుండునో ఎవ్వడు అన్నివిధముల శ్రేష్ఠుడో అట్టి అతిథి వచ్చినప్పుడు గృహస్థుడు అతనిని తనతో తుల్యముగు రీతిని శయ్యాసనాదులనొసంగి గౌరవింపవలయునని తాత్పర్యము. ఇచ్చట అనువ్రజ్యోపాసనలను గూడ నొనర్పదగునని విశేషము గమనింపవలసి యున్నయది.

216 సూ. అల్పశోఽపి హీనే. [౧—౫—౩౫]

హరదత్తమితాక్షరా:— ఆత్మనా కించిదూనేఽపి అతిథావాగతే సమానాన్యేవ శయ్యాదీని దేయానీత్యేకే. వయంతు బ్రూమః—హీనే ఇతి ఖావాగతే అల్పశోఽపి శయ్యాదీని దేయాని నతు హీన ఇతికృత్వాత్యంతం లోపః కర్తవ్య ఇతి.

ఆంధ్రవివరణము:— వచ్చినట్టి అతిథి తనకంటె కొంచెము తక్కువవాడే యయ్యును అతనికి సమముగానే శయ్యాదుల నొసంగవలయునని కొందరనిరి. మేమన్ననో హీనుడు అతిథి వచ్చినచో ఏదో కొలదిపాటిగానైనను శయ్యాసనాశనాదుల నొసంగవలయునే గాని అత్యంతము లోపము (అనగా అభావము) చేయరాదని యందుము.

217 సూ. అసమానగ్రామోఽతిథిరైకరాత్రికోఽధివృక్షసూర్యోపస్థాయీ. [౧—౫—౩౬]

హరదత్తమితాక్షరా:— ఇదానీమతిథేర్లక్షణం వక్తి—అసమానఇతి. అసమానగ్రామః-అన్యగ్రామవాసీ. ఐకరాత్రికః ఏకాంరాత్రిం వసతీత్యైకరాత్రికః వృక్షాణాముపరి యదా సూర్యః సోఽధివృక్షసూర్యః కాలో మధ్యాహ్నః అథవా వృక్షాణాముపరి సూర్యరశ్మయో యద్భాభవంతి స కాల అధివృక్షసూర్యః సాయంవా, తస్మిన్కాలే ఉపస్థితోఽతిథిస్సర్వథా మాన్యతమః.

ఆంధ్రవివరణము:— ఇటుపైని అతిథియొక్క లక్షణమును నిరూపించుచున్నాడు - అసమానగ్రాముడును ఐకరాత్రికుడును అధివృక్షసూర్యోపస్థాయియును అగునట్టివాడు అతిథి యనబడునని సూత్రార్థము. అసమానగ్రాముడనగా అయూరునందుగాక ఇతరగ్రామమునందు వసించువాడు, ఐకరాత్రికుడనగా - ఏరాత్రి తానాయూరికి వచ్చునో ఆయొక్క రాత్రియే అందు వసించునట్టివాడు. అధివృక్షసూర్యోపస్థాయి యనగా సూర్యుడు సరిగా చెట్లయొక్క నడుమ నెత్తిమీదికి ఎప్పుడు వచ్చునో అట్టి కాలమున (అనగా మధ్యాహ్నకాలమునందు) అతిథిగా వచ్చినట్టివాడు. లేనిచో వృక్షములపైని సూర్యకిరణములు ప్రసరించునట్టి కాలమున - అనగా సాయంకాలమున - వచ్చునట్టివాడైనను అధివృక్షసూర్యోపస్థాయి యనబడును. ఇట్టివాడగు అతిథి మాన్యతముడని భావము.

218 సూ. కుశలానామయారోగ్యాణామనుప్రశ్నః. [౧—౫—౩౭]

హరదత్తమితాక్షరా:— కుశలేతి. బ్రాహ్మణాదిషు త్రిషు వర్ణేషు పథ్యాది సంగతేషు కుశలాదీనామానుపూర్వ్యేణ ప్రశ్నః కర్తవ్యః. అపికుశల మాయుష్మన్నితి బ్రాహ్మణః ప్రష్టవ్యః. అప్యనామయం తత్రభవత ఇతి క్షత్త్రియః ప్రష్టవ్యః. అప్యరోగో భవానితి వైశ్యః ప్రష్టవ్య ఇతి భావః.

ఆంధ్రవివరణము:— బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులను వర్ణములవారు త్రోవనడచుచు నున్నగు చోటులలో నెదురైనచో అప్పుడు వారిని ఆయావర్ణములయొక్క క్రమము ననుసరించి కుశలానామయారోగ్యశబ్దములతో అనుప్రశ్నమును (క్షేమసమాచారాదికమును) అడుగవలయు నని సూత్రార్థము. అనగా బ్రాహ్మణుడైనచో — ఆయుష్మంతుడా! కుశలముగా నుంటివా యని యడుగవలయును. క్షత్త్రియుడైనచో — పూజ్యుడా! నీకు అనామయమే (ఆరోగ్యమే) కాదా; యని యడుగవలయును. వైశ్యుడైన — ఓయీ! నీవు నీరోగివా అనగా ఏమియును జబ్బులేనివాడవుగానుంటివి కాదా! యని యడుగవలయునని తాత్పర్యము.

219 సూ. అన్త్యం శూద్రస్య [౧—౫—౩౮]

హారదత్తమితాక్షరా:— అన్త్యమితి. ఉపర్యుక్త కుశలాదిషు అనుప్రశ్నేషు యదన్త్యం తచ్ఛూద్రస్య ప్రయోక్తవ్యమప్యరోగోఽసి భవానితి.

ఆంధ్రవివరణము:— పైని చెప్పినట్టి అనుప్రశ్నములలో ఏయ్యది చిట్టచివఱది — అనగా వైశ్యుడైనచో అడుగ తగినది — కలదో; అయ్యదియే శూద్రునియొక్క విషయమునగూడ ప్రయోగింపదగునని తాత్పర్యము.

220 సూ. బ్రాహ్మణస్యానతిథిరబ్రాహ్మణః. [౧—౫—౩౯]

హారదత్తమితాక్షరా:— బ్రాహ్మణస్యేతి. అబ్రాహ్మణః క్షత్త్రియాదిః బ్రాహ్మణస్యాతిథిర్న భవతి. పూర్వోక్తా అతిథిధర్మాస్తత్ర న ప్రయోజ్యాః కేవలముదకదానాదినా అంగీకార్యః.

ఆంధ్రవివరణము:— అబ్రాహ్మణులగు వారు — అనగా క్షత్త్రియ వైశ్య శూద్రాదులు — బ్రాహ్మణునకు అతిథులుగా గణింపబడరాదని అర్థము. కావున ఇట్టివానియందు వెనుక చెప్పిన అతిథిధర్మములు నిర్వర్తింపరాదు. కాని ఉదకమిచ్చుటమాత్రముచేత నతనిని గౌరవింపవలెనని యెఱుంగవలయును.

221 సూ. యజ్ఞే సంవృతశ్చేత్. [౧—౫—౪౦]

హారదత్తమితాక్షరా:— యజ్ఞ ఇతి యజ్ఞకాల ఆహూతశ్చేదతిథివత్పూజ్యః.

ఆంధ్రవివరణము:— ఆ యబ్రాహ్మణుడు కూడ యజ్ఞము మొదలగునట్టి వానియందు ఆహ్వానింపబడుచో నప్పుడతనిని అతిథివలె పూజింపవలెనని యున్నదని తాత్పర్యము.

222 సూ. భోజనం తు క్షత్త్రియస్యోర్ధ్వం బ్రాహ్మణేభ్యః [౧—౫—౪౦]

హారదత్తమితాక్షరా:— తత్రాపి విశేష మాహ — భోజనమితి. తస్యాతిథివత్త్వేఽపి బ్రాహ్మణేషు భుక్తవత్సు పశ్చాద్భోజనం దేయమ్.

ఆంధ్రవివరణము:— ఆయజ్ఞకాలమునందుకూడను అబ్రాహ్మణుని విషయమునందు గమనింపదగిన విశేషమును చెప్పుచున్నాడు. యజ్ఞమునకు ఆహూతుడైనచో అతనిని అతిథివలెనే పూజింపవచ్చును, కాని భోజనమును మాత్రము బ్రాహ్మణులకు ఇచ్చిన యనంతరముననే ఇతనికి నీయవలయునని తాత్పర్యము.

## 223 సూ. అన్యాన్ భృత్యైస్సహానృశంస్యార్థమానృశంస్యార్థమ్. [౧—౫—౪౨]

హారదత్తమితాక్షరా:— అన్యాన్ శూద్రాదీనాతిథ్యకాలే ఆగతాన్ భృత్యైః కర్మకరాదిభిస్సహ సతి విభవే భోజయేత్. యద్యపి తేషామతిథిత్వం న భవతి తథాపి ఆనృశంస్యార్థం నృశంసతా ప్రత్యక్షక్రౌర్యమ్. తద్రాహిత్యాయ పూజయేత్. ఆనృశంస్యం పరో ధర్మ ఏవేతి. ఇతి శ్రీహరదత్తవిరచితాయాం గౌతమీయసూత్రవివృతౌ మితాక్షరాయాం పంచమోధ్యాయః.

ఆంధ్రవివరణము:— ఇతరులగు శూద్రులు మున్నగువారిని కూడ ఆతిథ్యము నొసంగు కాలమున నుపస్థితులై యున్నచో వారిని తమయొక్క (పనివారలతోబాటు) భృత్యులతో పాటుగా విభవము కొలది భుజింపచేయవచ్చునని సూత్రార్థము. నిజముగ శాస్త్రము ననుసరించి ఇట్టివారియందు ఆతిథ్యమే యుండదు. అయినను చూపరులకు ఆనృశంస్యము తోచకుండుటకై గౌరవింపవలయునని భావము. ఏలయనగా —ఆనృశంస్యము కూడ [అనగా ఇతరులకు ప్రత్యక్షముగా క్రౌర్యము కన్పింపకుండునట్టులుగా వర్తించుటకూడా] ఒక విధముగ ఉత్కృష్టధర్మమే గనుక నని యెఱుంగునది.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడును అధిగత కావ్యతీర్థాది బిరుదుడును పంచాగ్ని వంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మసూత్రాంధ్ర వివరణమునందు ప్రథమప్రశ్నమునందు అయిదవదగు నధ్యాయము,

షష్ఠాధ్యాయ ప్రారంభము

## 224 సూ. పాదోపసంగ్రహణం సమవాయేన్వహమ్. [౧—౬—౧]

హరదత్తమితాక్షరా:— ఉక్తా అతిథిపూజా. అన్యేషామపి పూజాప్రకారమాహ— పాదోపసంగ్రహణమితి. వక్ష్యమాణానాం మాత్రాదీనాం సమవాయే సంగమే ప్రతిదినం పాదోపసంగ్రహణం కార్యమ్. వ్యత్యస్తపాణినా కార్య మిత్యాదినా పూర్వోక్తప్రకారేణైవ.

ఆంధ్రవివరణము:— అతిథి పూజ వెనుకటి ప్రకరణమునందు వివరింపబడినది. ఇటుపైని ఇతర గురుజనాదులయొక్క పూజలను చేయునట్టి విధానములను ఈయధ్యాయమునందు చెప్పుచున్నాడు. [ముందు నిరూపింపబోవుచున్నట్టి] తల్లి తండ్రి మున్నగు వారియొక్క సమవాయమునందు ప్రతిదినమును పాదోప సంగ్రహణము చేయవలయునని సూత్రార్థము. పాదోపసంగ్రహణము చేయవలసినట్టి విధానము ఈవఱకే నిరూపింపబడియున్నయది యని యెఱుంగావలయును,

## 225 సూ. అభిగమ్యతు విప్రోష్య [౧—౬—౨]

హారదత్తమితాక్షరా:— అభిగమ్యేతి. తుశబ్దః ప్రకృతవ్యావృత్తౌ విప్రోష్య స్వయం విప్రవాసం కృత్వా తేషాం విప్రవాసే వా తే మాతృపిత్రాదయో యత్రాస్థితాః తత్రాభిగమ్య పాదోపసంగ్రహణం కార్యమితి.

ఆంధ్రవివరణము:— గృహస్థుడగు తాను ప్రవాసమునకేగి మఱలి ఇంటికివచ్చిన వెంటనే మాతృ పిత్రాదులున్నయెడకు పోయి పాదోపసంగ్రహణమును చేయవలయునని యర్థము.

226 సూ. తస్మాత్పితృతద్బంధూనాం పూర్వజానాంవిద్యాగురూణాం తద్గురూణాంచ. [౧—౬—౩]

హరదత్తమితాక్షరా:—తస్మాత్ పిత్రాదీనాహ:-తదితి. మాతాపితరౌ ప్రసిద్ధౌ. తద్బాంధవాః మాతులమాతృష్వసు పితృవ్యపితృష్వస్రాదయః. పూర్వజాః జ్యేష్ఠభ్రాతరః. విద్యాగురవ ఆచార్యోపాధ్యాయాదయః. తద్గురవఆచార్యాదయః, తద్విషయంపూర్వసూత్రద్వయమితి.

ఆంధ్రవివరణము:— అపాదోపసంగ్రహణము తల్లిదండ్రులగు వారికొరకుగూడ చేయదగునని చెప్పినాడు -అపాదోప సంగ్రహణమును మాతాపితరులు -తల్లిదండ్రులు -తద్బంధువులు అనగా మేనమామ, పినతల్లి, సోదరులు, మేనత్తలు, మున్నగువారు- పూర్వజులగు పెద్దన్న, మున్నగువారు విద్యాగురువులగుఆచార్యులు, ఉపాధ్యాయులు, మొదలగువారు- అను వీరియొదలగూడ చేయవలయునని సూత్రార్థము.

227 సూ. సన్నిపాతేపరస్య. [౧—౬—౪]

హరదత్తమితాక్షరా:—సన్నిపాతఇతి. మాత్రాదీనాం యుగపత్సన్నిపాతే సమాగమే పరస్యోత్కృష్టస్య ప్రథమముపసంగ్రహణం కర్తవ్యమ్. ఆచార్యశ్శ్రేష్ఠోగురూణాంమాతేత్యేకే-ఇత్యాదినాఉత్కర్షః పూర్వోక్తః. ఆపస్తంబేనతు ఆచార్యప్రాచార్య సన్నిపాతే ప్రాచార్యముపసంగృహ్య ఉపసంజిఘృక్షేదాచార్యమిత్యాదినా ఉపసంగ్రహణముక్తమ్.

ఆంధ్రవివరణము:— మాతాపితరులు మున్నగువారందరును ఒక్కమారుగా ఏకకాలమున వచ్చుటతటస్థించినచో అందు శ్రేష్ఠులగు వారికి తొలుదొల్త ఉపసంగ్రహణము నొనర్చి ఆపైని తరువాతివారలకు ఒనర్పవలయునని యర్థము. ఆచార్యాదులలో గలతారతమ్య వివక్ష ఇదివరకే చేయబడియున్నయది. ఇకను ఆపస్తంబు డేమనెననగా -ఆచార్యప్రాచార్యులుభయులు నేకకాలమునందు వచ్చినచో మున్ముందు ప్రాచార్యునికి ఉపసంగ్రహణము చేసి, ఆపైని ఆచార్యునిగురించి ఉపసంగ్రహణమును ఒనర్పవలయు నని యొఱుంగగా దగునని చెప్పెను.

228 సూ. స్వనామప్రోచ్య అహమయమిత్యభివాదోజ్ఞసమవాయే. [౧—౬—౫]

హరదత్తమితాక్షరా:— అభివాదన విధి మాహ—స్వనామేతి. యః ప్రత్యభివాదనాభిజ్ఞః తేనసంగమే స్వనామప్రోచ్య వ్యావహారికం ప్రసిద్ధంనామప్రోచ్య అహమయమితిప్రకర్షేణ ఉచ్చైరుక్త్వాభివాదనః కార్యః. అభివాదోభివాదనం, ణ్యంతాదేరచ్, ఏవంచార్థజ్ఞానాం జ్ఞాతవరసమవాయే అభివాదనక్రమేణాయమహమితి స్వనామగుహ్యం ప్రోచ్య, అభివాదనం కార్యం. ఇదంహీనవ్యతిరిక్తాభివాద్య విషయమ్. తద్యథా—అభివాదయే హరదత్తశర్మానామాహమస్మిభోఇతి. తత్రప్రత్యభివాదనవిధి ర్మనునాదర్శిత—శ్లో. ఆయుష్మాన్భవ సౌమ్యేతివాచ్యో విప్రోభివాదనే. అకారశ్చాస్యనామ్నోంతేవాచ్యః పూర్వా

క్షరఃప్లుతః—ఇతి అస్యార్థః. విప్రశబ్దేన బ్రాహ్మణవిషయ మిదమ్. అభివాదయితా విప్రః ఆయుష్మాన్భవసౌ మ్యేతివాచ్యః, అస్యనామ్నోంతే పూర్వాక్షరప్లుతో ఆకారశ్చవాచ్యః, పూర్వాక్షరప్లుత ఇత్యకారస్య విశేషణం యస్మాత్పూర్వాక్షరం ప్లుతరూపం సతథోక్తః. అక్షరమిత్యచో భిధానమ్. అకారాత్పూర్వోయోన్త్యఃసప్లుతోవాచ్యః, తేన వ్యంజన వ్యవధానేపిభవతి. ఆయుష్మాన్భవ సౌమ్యేహారదత్తా ౩అ. వ్యంజనవ్యవధానేన యథాఆయుష్మాన్భవ సౌమ్యాగ్నిచి ౩ఇద. ఇతిప్రయోగః. వసిష్ఠస్తు సంధ్యక్షరే విశేషమాహ—ఆమంత్రితే యోన్త్యస్స్వరస్సప్లవతే సంధ్యక్షరమ ప్రగృహ్యమాహుః ఆఉమావంచాపద్యత ఇతి. ఏచోప్రగృహ్యస్యా దూరాద్ధూతే పూర్వస్యార్ధ స్యాదుతర స్యేదుతావితి వైయాకరణః. తత్రాంతే కారేప్రయుక్తే తయోర్వ్యవచి సంహితాయామితియకారవకారౌ. ఆయుష్మాన్భవ సౌమ్యపినాకపాణా౩యేతి, విష్ణావేతిచప్రయోగః. అజ్ఞసమవాయపక్షే నాయ మభివాదన ప్రకారః. తత్ర స్మృత్యంతరం—అవిద్వాంసః ప్రత్యభివాదే నామ్నో యే నప్లుతిం విదుః, కామంతేషుతు విప్రోష్య స్త్రీష్వివాయమహం వదేదితి. యథాస్త్రీషు ఉక్తప్రకారంవినా తాత్కాలికేనదేశభాషాదినా యేనకేనా పిశబ్దేన వాభివాదనంతద్వ త్తేష్వపి భవతి. అభివాదనమితి సామాన్యోపలక్షణమ్.

ఆంధ్రవివరణము:—ఇటుపైని అభివాదనమును (నమస్కారమును) చేయవలసిన విధానమును చెప్పుచున్నాడు. జ్ఞాలనగా విజ్ఞులు, అనగా శాస్త్రవిధుల నెఱింగిన పెద్దలు. సమవాయశబ్దమున కిచ్చట కలయిక (సంగమము) అర్థము. జ్ఞసమవాయము తటస్థించినచో -అనగా ప్రత్యభివాదన శాస్త్రవిధి నెఱింగిన విజ్ఞులతో సంగమము కల్గినప్పుడు -అభివాదనము చేయునట్టివాడు (అనగా నమస్కరించునట్టివాడు) తనయొక్క వ్యావహారిక నామమును చెప్పి- ఈనేను అని స్పష్టముగా పలికి అభివాదనము చేయదగునని సూత్రార్థము. అనగా శబ్దజ్ఞులగునట్టి పెద్దల సంగమము సంభవించినచో అభివాదనక్రమముతో అయమహం -అని తన పేరును చెప్పి నమస్కరింప వలయునని భావము. ఇయ్యది హీనవ్యతిరిక్తులగు వారికి అభివాదమును నెఱపెడి విషయమును గుఱించినది. ఎట్లన్నను -అభివాదయే హారదత్త శర్మా నామాహమస్మిభో -ఇతి. ఇట్టులు అభివాదనము నొనర్చినప్పుడు ప్రత్యభివాదమును చేయవలసిన విధానము మనువుచే ప్రదర్శింపబడి యున్నయది -"అభివాదమును ఒనర్చినప్పుడు ప్రత్యభివాదము చేయవలసినట్టి వానిచేత అభివాదమును ఒనర్చినట్టి బ్రాహ్మణుడు "ఆయుష్మంతుడ వగుదువుగాక సౌమ్యుడా! -అని చెప్పబడవలసియుండును. మఱియును ఇతని పేరుయొక్క చివఱగలఅకారాది స్వరము ప్లుతముగ గూడ నుండవలసి యుండును -అని.

దీనియొక్క- [అనగా ఆయుష్మాన్భవసౌమ్య -అనే శ్లోకముయొక్క] అర్థము -హారదత్తుడు వివరించినరీతి ననుసరించి ఇట్టులు ఏర్పడుచున్నది -మూలమునందు విప్రో వాచ్యః అని విప్రశబ్దమును గ్రహించుటచేత నియ్యది బ్రాహ్మణవిషయము. అభివాదయితయగు బ్రాహ్మణుడు- (అనగా ఎవ్వడు అభివాదమును చేయునో వాడు అభివాదమును చేయించుకొనెడివాని చేత) ఆయుష్మాన్భవ సౌమ్య- అని చెప్పదగియుండును. ఇతనియొక్క పేరు కొనను పూర్వాక్షర ప్లుతమగు ఆకారముకూడ చేర్చి చెప్పబడతగును. పూర్వాక్షరప్లుతమగు అకారము అనగా

పూర్వాచ్చుప్లుతముగానున్నట్టి అకారమని భావము. అనగా అకారమునకంటె పూర్వముగానున్న చివఱ అచ్చుప్లుతముగా పలుకవలయుననుట. ఇట్లు చెప్పుటచేత నడుమనడుమ వ్యంజనములతో వ్యవధానమున్నను ఇత్యాది సంభవింపగలదు. ఉదా:— ఆయుష్మాన్భవసౌమ్య హరదత్తా 3 అ. అని. వ్యంజనవ్యవధానముతో ఎట్లనగా -ఆయుష్మాన్భవ సౌమ్యాగ్ని చి3ద -అని ఇట్టులు వాక్యప్రయోగముండవలసియున్నదని యెఱుంగవలయును.

ఇకను వసిష్ఠుడన్నతో సంధ్యక్షరమునందు ఆధిక్యమును చెప్పుచున్నాడు -అమ త్రితుడైనప్పుడు చివఱ స్వరము ప్లుతినొందుచున్నది అద్దానినే అపృగృహ్యసునుగా పల్కుదురు. ఆవు మావంచాపద్యతఇతి. ఏచో ప్రగృహ్యాస్య అను సూత్రముచే అమూరాదాహ్వానమునందు అదుత్తరమగు పూర్వార్థమునకు ఈదూతు ఇవచ్చునని వైయాకరణులు పల్కెదరు. ఇట్లు వచ్చునప్పుడు అంతేకారము ప్రయుక్తముకాగానే వానికి (యాావచి సంహితాయాం) యకారవకారములు వచ్చును. అప్పుడు -ఆయుష్మాన్భవ సౌమ్య పినాకపాణా3యేతి -విష్ణా3వేచ అని ప్రయోగములేర్పడును.

కొందఱు మూల సూత్రమును విభజించుటలో జ్ఞసమవాయే అనుటకు బదులుగా అజ్ఞసమవాయే అని విభజించిరి. ఈపక్షమునందు ఈపైనిచెప్పబడినట్టి విధానము పనికిరాదు, కాని ఈపక్షమునందు చేయవలసిన అభివాదనరీతిని స్మృత్యంతరము -ఇట్టులు చెప్పుచున్నది -ఎవ్వరు ప్రత్యభివాదమునందు నామముయొక్క చివఱ ప్లుతము ప్రయోగించవలసియుండుటను ఎఱుంగనంతటి అవిద్వాంసుడుగానుండునో వారియెడల ప్రవాసాగమనానంతరము స్త్రీలయందు సాధారణముగా నెట్టులు "అయమహమభివాదయే" అని చెప్పెదరో, అట్టులనే వీరివిషయమునగూడ చెప్పదగును. అనగా వెనుక జెప్పినట్టి విధానము చొప్పున గాక స్త్రీలయందు తాదాత్మికముగు ఏదేశభాషాశబ్దముతో నైనను ఏవిధముగా అభివాదనమును చేయుచుందురో ఆవిధముగానే వీరివిషయములోగూడ జేయదగునని తాత్పర్యము.

ఇకను ఆపస్తంబుడు అభివాదనమును చేయవలసిన విధానమును ఇట్టులుచెప్పినాడు .—"కుడిబాహువును చెవివఱకును ప్రసరింపజేసి బ్రాహ్మణుడు అభివాదనమును చేయును. రాజు వక్షస్థలమువఱకును వైశ్యుడు మధ్యమువఱకును ప్రసరింపచేయవలయును. శూద్రుడు క్రిందకు వ్రాలి ప్రాంజలియై అభివాదనమును చేయదగును —అని.

విశేషాంశములు —వెనుక వ్యత్యస్తపాణినా (మనువు) ఇత్యాదులచేతకూడ అభివాదనము చేయవలయునని చెప్పబడియున్నది. కాని అయ్యది ఉపసంగ్రహణమును గురించి చెప్పబడిన వాక్యమునుగాను దీనిని కేవలాభివాదనవిధినిగాను ఎఱుంగవలయును.

## 229 సూ. స్త్రీపుంయోగే –భివాదతోనియమమేకే. [౧–౬–౬]

హరదత్తమితాక్షరా:— స్త్రీపుంయోగఇతి. స్త్రీపుంయోగే జాయాపతి సమవాయే అభివాదత స్సార్వవిభక్తికస్తసిః. అభివాదనే ప్రాప్తే అనియమమేకే మన్యంతే. యద్యపి భర్తా ప్రత్యభివాదజ్ఞః తథాపి తదభివాదనే భార్యాయానియమంనేచ్ఛంతి. అభివాదయే అహమియ మిత్యాదిక్రమో నియమస్తం నేచ్ఛంతి. సామాన్యాభివాదన మాత్రమేవ. ఏవంచ భార్యయా భర్తు రహరహ ర్నమస్కారః కార్యః ఏకఇతివచనా ద్గాతమస్య పక్షే నియమఏవ.

ఆంధ్రవివరణము:—స్త్రీపుంయోగమనగా దంపతులు కలసి కూర్చునియుండుట. స్త్రీపుంయోగమునందు భార్యాభర్తలకు అభివాదనముచేయవలసి వచ్చునప్పుడు వెనుక జెప్పినట్టి అహమయం -అను నీమున్నగు నియమము అక్కఱలేదని కొందఱనిరని సూత్రార్థము. అనగా సామాన్యరీతి

గానైన నమస్కారమే చేయదగునని భావము. సూత్రము నందు ఏకే (కొందరని) అని చెప్పుటచేత గౌతముని మతమునందు నియమము కలదని తాత్పర్యము.

230 సూ. నావిప్రోష్య స్త్రీణామమాతృపితృవ్యభార్యా భగినీనామ్. [౧—౬—౭]

హరదత్తమితాక్షరా:— నావిప్రోష్యేతి. సమవాయేఽన్వహమిత్యస్య అపవాదోఽయమ్. మాతృపితృ వ్యభగినీ వ్యతిరిక్తానాం స్త్రీణాం అవిప్రోష్య ఉపసంగ్రహణ మభివాదనం చ నకార్యం కింతు విప్రోష్య ప్రత్యాగమన ఏవకార్యమ్. మాత్రాదీనాం త్వవిప్రోష్యాపి ప్రత్యహమ్. తథాచ స్మృత్యంతరమ్—శ్లో. ఉపసంగ్రహణం కుర్యాద్భగిన్యా మాతురేవచ, తథా పితృవ్యభార్యాణాం సమవాయేఽన్వహంద్విజః— ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి సూత్రమున కిది అపవాదసూత్రము. తల్లి- పినతండ్రిభార్య- తోబుట్టువు -తప్ప తక్కినస్త్రీలకు ప్రవాసమున కేగకుండునప్పుడు ఉపసంగ్రహణము చేయరాదు అని సూత్రార్థము. అనగా వీరికి ప్రవాసమున కేగి మఱలివచ్చినప్పుడు మాత్రమే ఉపసంగ్రహణము కాని తదితరములగుసమయములందు అక్కఱలేదని తాత్పర్యము. ఇక తల్లి మున్నగు వారికన్ననో ప్రతిదినమును పాదోపసంగ్రహణమును చేయవలసియే యున్నయది. ఇట్లే ఇతరస్మృతికూడ చెప్పుచున్నయది, —ద్విజుడు తనకన్న పెద్దదియగు తోడబుట్టినట్టి ఆమెకు కన్నతల్లికి పినతండ్రిభార్యకు ప్రతిదినమును ఉపసంగ్రహణమును (అనగాపాదపమును) చేయవలయునని భావము.

విశేషాంశములు— ఇచ్చట మస్కరీయ భాష్యము— "గురుస్థానీయులగునట్టివారికి ప్రవాసమునుండి రాగానే అభివాదనమునుగాని ఉపసంగ్రహమునుగాని చేయతగునని యును, అందునను కూడ నత్యంతమును గురుస్థానీయులగునట్టి మేనమామభార్యలు మున్నగువారికి ఉపసంగ్రహణమును తదితరలకు అభివాదనమును చేయవలయుననియును"— వైశిష్ట్యమును చెప్పుచున్నయది.

231 సూ. నోపసంగ్రహణం భ్రాతృభార్యాణాం స్వస్రూణాం [౧—౬—౮]

హరదత్తమితాక్షరా:— నోపసంగ్రహణమితి. విప్రోష్య ప్రత్యాగతేన ఆసాముపసంగ్రహణం న కార్యమ్. అభివాదనంతు భవత్యేవ. తత్రాత్యంతగురుస్థానీయానాంమాతులాన్యాదీనాముప సంగ్రహణమన్యాసామభివాదనమితి.

ఆంధ్రవివరణము:— భ్రాతృ భార్యలకును తోబుట్టువులకును ప్రవాసమునకేగి వచ్చినప్పుడు కూడ ఉపసంగ్రహణమును చేయగారాదు. అట్టివారియందు కేవలము అభివాదనము మాత్రమే -అని అర్థము.

232 సూ. ఋత్విక్శ్వశుర పితృవ్యమాతులానాంతు యవీయసాం ప్రత్యుత్థాన మభివాద్యాః. [౧—౬—౯]

హరదత్తమితాక్షరా:— ఋత్విగితి. ఋత్విగాదీనా మాత్మనో యవీయసాం ప్రత్యుత్థానమాత్రేణ పూజాకార్యా. నపునస్తేభివాద్యాః.

ఆంధ్రవివరణము:— తనకంటెను వయస్సునందు చిన్నవారైయుండునట్టి ఋత్విక్కులు శ్వశురులు (పిల్లనిచ్చినట్టి మామలు) పినతండ్రులు మేనమామలు — అనువీరికి ప్రత్యుత్థానము మాత్రముచేత (అనగా వీరు వచ్చినప్పుడు మర్యాదను సూచించుచు లేచి ఎదురేగుట) పూజింప తగుదురేగాని అభివాదనమును చేయగారాదని తాత్పర్యము.

233 సూ. తథాన్యః పూర్వః పౌరోఽశీతికావరః శూద్రోఽప్యపత్యసమేన. [౧–౬–౧౦]

హరదత్తమిశ్రాః:— తథేతి. ఋత్విగాదయో యథా ప్రత్యుత్థేయాః నాభివాద్యాస్తథాయమపి. అన్యస్తేభ్యోఽన్యః. పూర్వః వయసాధికః పౌరః పురవాసీ వయసాధిక్యే సత్యపి పురవాసాదపకర్ష ఉక్తః. అశీతిరేవాశీతికా తతయా ఊనో వరోఽశీతికావరః న్యూనాశీతిక ఇత్యర్థః. ఏవం విధశ్శూద్రోఽపి అపత్యసమేన ప్రత్యుత్థేయః నాభివాద్యః, అపత్యసమేనేత్యనేన అత్యంతం యవీయస్త్వముపదర్శితమ్. శూద్రగ్రహణమవర వర్ణోపలక్షణమ్. తతశ్చ శూద్రస్త్రిభిరపి వర్ణైః వైశ్యో ద్వాభ్యాం క్షత్రియస్తు బ్రాహ్మణే నేతి సిద్ధ్యతి.

ఆంధ్రవివరణము:— వెనుకటి సూత్రమునందు చెప్పబడినట్టి రీతిని ఋత్విక్కులు మున్నగువారు వయస్సున తనకంటెను చిన్నవారైనచో ఏవిధముగా ప్రత్యుత్థానమాత్రముచేత గౌరవింపదగియున్నారో అట్టులనే వానికంటె నితరుడును వయస్సుచేత పెద్దవాడును పురవాసియును [అనగా వయస్సుచేత పెద్దయయ్యును సమాగ్రామవాసియగుటచేత అపకృష్టుడు అగునని భావము.] ఎనుబది సంవత్సరములు దాటనివాడును అగుశూద్రుడుకూడ - అపత్యసముగా ప్రత్యుత్థానమాత్రము చేత గౌరవింపదగి యుండునేగాని అభివాదనము చేయుటకెంతమాత్రమును అర్హుడు కాజాలడని భావము. ఇచ్చట మూలమునందు శూద్రుడు -అని ప్రత్యేకముగా శూద్రశబ్దమును గ్రహించుటచేత ఇట్టి శూద్రుడీవిధముగ తక్కిన మూడువర్ణములవారికి ప్రత్యుత్థానమాత్రముచేత గౌరవింప తగినవాడో అట్టులనే అట్టి గుణములు గలవైశ్యుడును తక్కిన ఇరువర్ణముల వారిచేతను అట్టిక్షత్రియుడు బ్రాహ్మణునిచేతను ప్రత్యుత్థానమాత్రముచే గౌరవింప తగియుండునేగాని అభివాదనము చేయుటకు అర్హుడుకాడని తెలియదగును.

234 సూ. అవరోఽప్యార్యశ్శూద్రేణ [౧–౬–౧౧]

హరదత్తమిశ్రాః:— అవర ఇతి. న్యూనాశీతికేన శూద్రేణ అవరోఽప్యార్యో యవీయానప్యార్యః త్రైవర్ణికః ప్రత్యుత్థేయః నాభివాద్యః. అత్రాపి శూద్రగ్రహణం అవరవర్ణోపలక్షణమ్. తతశ్చ శూద్రేణ త్రయోవర్ణాః, వైశ్యేన ద్వౌ, క్షత్రియేణ బ్రాహ్మణ ఇత్యవరవయసః ప్రత్యుత్థేయా నత్వభివాద్యా ఇతి సిద్ధ్యతి.

ఆంధ్రవివరణము:— ఎనుబది సంవత్సరములకు లోబడిన వయస్సు గలశూద్రునిచేత వయస్సున చిన్నవాడైనప్పటికిని త్రైవర్ణికుడగు ఆర్యుడు ప్రత్యుత్థానము నొనర్పదగినవాడుగా నగుచున్నాడే కాని అభివాద్యుడు కాడు అని సూత్రార్థము. ఇచ్చటకూడ శూద్రశబ్దగ్రహణమును అవరవర్ణముల కుపలక్షణముగా నున్నది. కాబట్టి వెనుకటివలెనే ఇచ్చటకూడ శూద్రునిచేత తక్కిన మూడు వర్ణములవారును, వైశ్యునిచేత తక్కిన ఇర్వురును క్షత్రియునిచేత బ్రాహ్మణుడును అవరవయస్కుడయ్యును ప్రత్యుత్థానము చేయతగినవారుగా నగుచున్నారని తాత్పర్యము.

235 సూ. నామవాస్య వర్జయేత్.

[౧—౬—౧౨]

హరదత్తమితాక్షరా:— నామవేతి. అస్త్యేవాత్రపివ్యాలోపః, అస్యాస్యోత్కృష్టో త్కృష్టస్యాపకృష్టో న నామగృహ్ణీగృహ్ణీయాత్. కింత్వౌపచారికం గృహ్ణీయాత్.

ఆంధ్రవివరణము:— ఇతడు అనగా ఆర్యుడగు త్రైవర్ణికుడు వర్ణమునుబట్టి ఉత్కృష్టుడగు వానియొక్క పేరునుకూడ వర్జింపవలయు ననిసూత్రార్థము. అనగా ఔపచారికముగ పిలువవలయునే గాని పేరుబెట్టి పిల్వగారాదు.

236 సూ. రాజ్ఞశ్చాజపః ప్రేష్యః

[౧—౬—౧౩]

హరదత్తమితాక్షరా:— రాజ్ఞ ఇతి. అజపః అశ్రోత్రియః ప్రేష్యః ప్రేష్యకరః. సఉత్కృష్టవర్ణో బ్రాహ్మణోపి రాజ్ఞోభిషిక్తస్యనామ వర్జయేత్.

ఆంధ్రవివరణము:— అజపుడును ప్రేష్యకరుడును అగు బ్రాహ్మణుడు (సేవాధర్మమును బట్టి నికృష్టుడగుటవలన) పట్టాభిషిక్తుడగు రాజుయొక్క పేరును వర్జింపవలయును, అనగా పేరుబెట్టి పిలువగా రాదని తాత్పర్యము

237. సూ. భోభవన్నితి వయస్యస్సమానేహని జాతః

[౧—౬—౧౪]

హరదత్తమితాక్షరా:— భోభవన్నితి. వయసా తుల్యో వయస్యః సమానేహనిజాతః, అత్రాహశ్శబ్దః సంవత్సరవాచకః. ఏకస్మిన్సంవత్సరేజాతస్స భోభవన్నిత్యనయోరన్యతరేణ సంభాష్యః.

ఆంధ్రవివరణము:— సమానమగు వయస్సుగలవాడును సమానమగు సంవత్సరమున జనించినవాడును అగు వతనిని భో అనిగాని భవన్ అనిగాని సంబోధించి వ్యవహరింపవలయు నని తాత్పర్యము.

238-240 సూ. దశవర్షవృద్ధః పౌరః ౧౫. పంచభిః కళాభరః ౧౬ శ్రోత్రియశ్చారణస్త్రిభిః. [౧—౬—౧౭]

హరదత్తమితాక్షరా:— దశవర్షేతి. పురేవసన్ గుణహీనః దశవర్షవృద్ధశ్చ. తత్రాపికళాభరశ్చతుష్షష్టి కళాస్వన్యతమయాజీవన్ పంచభిర్వర్షైర్వృద్ధశ్చ, శ్రోత్రియోఽధీతవేదః చారిణస్సహాధ్యాయీ, ఏతేసర్వేపిభోభవన్నితి సంభాష్యాః. ఆపస్తంబస్తు సర్వత్రాభివాదన మిచ్ఛతి. దశవర్షం పౌరసఖ్యం పంచవర్షంతు చారణమ్, త్రివర్షపూర్వః శ్రోత్రియః అభివాదన మర్హతీతి.

ఆంధ్రవివరణము:— తనకంటెను పదియేండ్లు పెద్దవాడగు పౌరుడుకూడ భోఅను మున్నగురీతుల భాషింప తగినవాడు. అరువదినాల్గుకళలలో నేదైన నొకకళచేత జీవననిర్వాహము చేయునట్టి వాడును, తనతో సమానముగా వేదాధ్యయనము చేసినచారణుడునుకూడనిట్టులనే భో అని కాని భవన్ అని కాని సంబోధించి భాషింపతగినవాడై యుండు నని సూత్రార్థము.

241 సూ. రాజన్యవైశ్యకర్మా విద్యాహీనః [౧—౬—౧౮]

హరదత్తమితాక్షరా:— రాజన్యేతి. కర్మశబ్దః ప్రత్యేకమభిసంబధ్యతే. రాజన్యకర్మా వైశ్యకర్మా బ్రాహ్మణోపి రాజన్య కర్మణావా

వైశ్యకర్మణావా జీవన్నత్యంతవృద్ధో౽పి భోభవన్నితి సంభాష్యః. విద్యాహీనశ్చవృద్ధో౽పి విద్యాధికేన తథా సంభాష్యః.

ఆంధ్రవివరణము:— రాజన్యుడు చేయునట్టి పనిని చేసి జీవించునట్టి (రాజన్యుడైనను) బ్రాహ్మణుడును వైశ్యకర్మను చేసి జీవించునట్టి బ్రాహ్మణుడును భో భవన్ అని సంభాషింప తగును అని భావము,

## 242 సూ. దీక్షితశ్చ ప్రాక్ క్రయాత్ [౧-౬-౧౯]

హారదత్తమితాక్షరా:— దీక్షితశ్చేతి. వయస్య విషయ మిదమ్. దీక్షితశ్చ వయస్యః సోమ క్రయాత్పూర్వం తథా భాష్యః, తతః పరం న్నధనన్నామగ్రాహ్యః, ఉత్తమాశ్రయవిషయేఽపి నామ శ్రోత్రియవత్ప్రాశితస్య గ్వాహాగుర్యవతీతి.

ఆంధ్రవివరణము:— వయస్య ధర్మము గురించి చెప్పినను దీక్షితుడు సోమవిక్రయమునకు ముందు పూర్వమే వయస్యుడగుగాని తదనంతరము మాత్రము మాన్యుడగుచున్నాడని సూత్రార్థము.

## 243 సూ. విత్తబంధుకర్మజాతి విద్యావయాంసిమాన్యాని. [౧-౬-౨౦]

హారదత్తమితాక్షరా:— విత్తేతి. విత్తాదీనాం సాక్షాన్మాన్యత్వాసంభవాత్తద్వన్తో మాన్యా ఇత్యుపలక్ష్యన్తే. విత్తవానాఢ్యః. బంధుమాన్విశిష్టైస్సంబంధిభిర్యుక్తః, కర్మవాన్ శ్రౌతకర్మకారీ. జాతిమానభిజనయుక్తః. విద్యావానధీతవేదశాస్త్రః. వయస్వాన్ వయసాధికః, ఏతాదృశా అతాదృశైర్మాన్యాః పూజితుం యోగ్యా ఇత్యర్థః.

ఆంధ్రవివరణము:— విత్తము అనగా ద్రవ్యము. బంధువులు అనగా అన్నదమ్ములు మున్నగు చుట్టములు ప్రసిద్ధములు. కర్మ అనగా జాతికి విధించినట్టి స్వధర్మము. జాతి అనగా కులము. విద్య అనగా వేదాది విద్యలు. వయస్సు అనగా ప్రాయము, విత్తాదులు మాన్యములని సూత్రార్థము. అనగా విత్తాదులు సాక్షాత్తుగా కన్పడునవి కావుగనుక అయ్యవి గల పురుషులు మాన్యులని తాత్పర్యము. విత్తము కలవాడు విత్తవంతుడు, బంధువులు కలవాడు బంధుమంతుడు. కర్మవంతుడు. మంచివంశము కలవాడు జాతిమంతుడు, వేదశాస్త్రములను చదివినవాడు విద్యావంతుడు, వయస్సుచే పెద్దయగువాడు వయస్వంతుడు, ఇట్టివారెల్లరును మాన్యులని భావము.

## 244 సూ. పరబలీయాంసి [౧-౬-౨౧]

హారదత్తమితాక్షరా:— పరేతి. పరస్పర సమవాయే తు పరః పరో బలీయాన్మాన్యః, మాన్యోఽభివాదనప్రభృతిసంమానః.

ఆంధ్రవివరణము:— వీరిలో పరస్పరము సమవాయము కల్గినప్పుడు-అనగా ఏకకాలమున వీరందరు చేరి గౌరవించవలసి వచ్చినప్పుడు -తర్వాత వారు -అనగా విత్తవంతుని కంటెను బంధుమంతుని కంటెను కర్మవంతుడు అతని కంటెను జాతివంతుడును అతనికంటెను విద్యావంతుడును అతనికంటెను వయస్వంతుడును తొలుదొల్త మాన్యులని తాత్పర్యము.

## 245 సూ. శ్రుతంతుసర్వేభ్యో గరీయః [౧-౬-౨౨]

హారదత్తమితాక్షరా:— శ్రుతమితి. శ్రుతం మంత్రబ్రాహ్మణవిభాగేన వేదార్థపరిజ్ఞానం, తత్సర్వేభ్యో విత్తాదిభ్యో గరీయో గురుతరమ్. పూర్వసూత్రే పరబలీయాంసీతి. శ్రుతమపర ముపన్యస్తం తద్వ్యావృత్త్యర్థం పృథక్సూత్రమ్.

ఆంధ్రవివరణము:—మంత్రభాగమని బ్రాహ్మణభాగమని ద్వివిధము గానున్నట్టి వేదమును చక్కగా అర్థసహితముగా నేర్చియుండుటయే శ్రుతమని యనబడును. వెనుక జెప్పినట్టి విత్తబంధు కర్మజాతి విద్యావయస్సు లన్నిటికంటెను (అనగా విత్తవంతుడు మున్నగు వారందరికంటెను) శ్రుతమే (అనగా శ్రుతవంతుడే) గురుతరమని సూత్రార్థము. ఇచ్చట వెనుకటి సూత్రములవలననే పరబలీయస్త్వమేర్పడుచుండగా శ్రుతమని విశేషముగా ప్రత్యేకించి చెప్పుటచేత వెనుకటి శ్రుతమునకు వేదమాత్రపాఠమే అర్థమనియును, ఈశ్రుతశబ్దమునకు వేదార్థ పరిజ్ఞానమనియును విశేషము ఏర్పడుచున్నదని యందురు అని తెలియవలయును.

## 246 సూ. తన్మూలత్వాద్ధర్మస్య శ్రుతేశ్చ. [౧—౬—౨౩]

హరదత్తమితాక్షరా:—కుతఃపున శ్శ్రుతం సర్వేభ్యో గరీయ ఇత్యత ఆహ-తన్మూలత్వాదితి. శ్రుతమూలమనుష్ఠానమనుష్ఠానమూలో ధర్మ ఇతి. శ్రుతేశ్చాపి అనుచ్ఛిన్న సంప్రదాయో మూలమ్. తస్మాచ్ఛ్రుతస్య గరీయస్త్వం-శ్రుతస్య గరీయస్త్వం ఛాందోగ్యే ప్రతిపాదితమ్ -అధ్యాపయామాస పితౄన్ శిశు రాంగిరసః కవిః, పుత్రకా ఇతి హోవాచ జ్ఞానేన పరిగృహ్య తాన్.

ఆంధ్రవివరణము:—తక్కిన యన్నింటికంటెను శ్రుతమే ఏల గరీయము (అనగా గొప్పది) కావలసి వచ్చినది?-అను ఆశంక కలుగగా దానిని వారించుచున్నాడు. శ్రుతమూలమై అనుష్ఠానమున్ను అనుష్ఠానమూలమై ధర్మము నుండుటవలననే శ్రుతము గరీయము అగుచున్నదని సూత్రార్థము. శ్రుతమునకు గరీయస్త్వము ఛాందోగ్యోపనిషత్తునందు ఈవిధముగా ప్రతిపాదింపబడియున్న యది-శిశువుయైనట్టి ఆంగిరసుడగు కవి పితరులను చదివించెను. (ఆ కాలమున వారిని) ఓపుత్రకులారా! యని జ్ఞానముచేత పరిగ్రహించి [అనగా శిష్యులనుగా చేసికొని] పల్కెను అని, అనగా తాను బాలుడయ్యును విద్వాంసుడై యున్న కతనను, అన్ని జన్మములలోనికిని విద్యాతః అగునట్టి జన్మమే యుత్తమోత్తమము గనుకను, తాను పితరులకు విద్యాతః జన్మము నొసంగుటచేత గురుపదము నొందినవాడగుటచేతను ఆవిధముగా పుత్రకులారా!-(అబ్బాయిల్లారా!)అని పిలచెనని తాత్పర్యము.

## 247 సూ. చక్రిదశమీస్థానుగ్రాహ్యవధూస్నాతకరాజభ్యః పథో దానమ్. [౧—౬—౨౪]

హరదత్తమితాక్షరా:—చక్రీతి. చక్రి చక్రవచ్ఛకటాదిః, తత్రస్థశ్చక్రిస్థః దశమ్యాం దశాయాం స్థితః వృద్ధః. అనుగ్రాహ్యో రోగార్తః. వధూర్గర్భిణీ, స్నాతకో విద్యావ్రతస్నాతః, రాజా అభిషిక్తః పథిసంగమ ఏతేభ్యోఽన్యైః పంథా దేయః.

ఆంధ్రవివరణము:— చక్రములతో నడుచునట్టి బండ్లు మున్నగునవి చక్రులనబడును. చక్రియందు ఎక్కి వెళ్లువాడు చక్రిస్థుడు. దశమి అనగా పదవది. మనుజుని యొక్క వయస్సులో పదియవ అవస్థకూడ (అనగా వృద్ధత్వము) దశమియనబడును. దశమీస్థుడనగా వృద్ధత్వముచేత బాధపడునట్టివాడు. అనుగ్రాహ్యుడనగా రోగముచేత పీడింపబడునట్టివాడు. వధువనగా గర్భవతి యగునట్టి స్త్రీ. స్నాతకుడనగా విద్యావ్రతస్నాతకుడు. రాజు అనగా పట్టాభిషేకము చేయబడినట్టివాడు. చక్రిస్థుడు అనుగ్రాహ్యుడు వధువు స్నాతకుడు రాజు అను వీరికి మున్ముందుగ త్రోవను ఒసంగి పిమ్మట తాము చరింపవలయునని అర్థము. అనగా ఇట్టివారికి త్రోవనొసంగి గౌరవము జూపవలయునని తాత్పర్యము.

## 248 సూ. రాజ్ఞాతు శ్రోత్రియాయ శ్రోత్రియాయ [౧-౬-౨౫]

హారదత్తమితాక్షరా:— తత్రాపి విశేష మాహ-రాజ్ఞేతి. శ్రోత్రియసమాగమే రాజ్ఞా తు పంథాః దేయ ఇత్యర్థః.

ఇతి శ్రీహారదత్తవిరచితాయాం గౌతమీతావివృతౌ మితాక్షరాయాం షష్ఠోధ్యాయః.

ఆంధ్రవివరణము:—వెనుక చెప్పినవాని యందు గూడ వైశిష్ట్యము కలదని నిరూపించుచున్నాడు. శ్రోత్రియుడు తనకు ఎదురై వచ్చినప్పుడు రాజుచేత శ్రోత్రియుని కొఱకే శ్రోత్రియునికొఱకే మార్గము వదలిపెట్టవలయునని సూత్రార్థము. అదరార్థమై ఇచ్చట ద్విరుక్తము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడును అధిగత కావ్యతీర్థ బిరుదుడును పంచాగ్ని వంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మసూత్రాంధ్రవివరణమునందు ప్రథమప్రశ్నమునందు షష్ఠాధ్యాయము ముగిసినది.

---

సప్తమాధ్యాయ ప్రారంభము.

## 249 సూ. ఆపత్కల్పో బ్రాహ్మణస్య అబ్రాహ్మణా ద్విద్యోపయోగః [౧-౭-౧]

హారదత్తమితాక్షరా:— శ్రుతంతు సర్వేభ్యో గరీయ ఇతి విద్యాప్రాధాన్యముక్తమ్. సావిద్యా బ్రాహ్మణా దధిగంతవ్యేతి ప్రథమకల్పః. తదభావే విద్యాయా అవశ్యాధిగంతవ్యత్వా దాపత్కల్ప మాహ—ఆపత్కల్పేతి. విద్యాశ్చతుర్దశ విద్యాః-శ్లో. అంగాని, వేదాశ్చత్వారో మీమాంసా న్యాయ విస్తరః, పురాణంధర్మశాస్త్రంచ విద్యా హ్యేతా శ్చతుర్దశ. ఉపయోగో నియమపూర్వకగ్రహణమ్ అబ్రాహ్మణః క్షత్త్రియో వైశ్యః, తస్మాత్ బ్రాహ్మణేన విద్యోపయోగః కార్యఇతి యత్స ఆపత్కల్పః. ఆపద్వ్యధిః. బ్రాహ్మణస్యేత్యత్రోపలక్షణం, తేన క్షత్త్రియ స్యాపి వైశ్యా ద్విద్యోపయోగః కార్యఇతి సిద్ధ్యతి. ఆపత్కల్పఇతి అధ్యాయపరిసమాప్తే రధిక్రియతే.

ఆంధ్రవివరణము:— ఇటుపైని విద్యాభ్యాసము చేయుటలోగల ఆపత్కల్పమును నిరూపించుచున్నాడు వెనుకటి యధ్యాయమునందు శ్రుతము (అనగా వేదతదర్థపరిజ్ఞానము) తక్కినయన్నింటికంటెను గరీయమైనదని విద్యకుగల ప్రాధాన్యము నిరూపితమైనది. అయితే అట్టివిద్యను ఎవ్వరివలన పొందతగును? అను ఆశంకవచ్చినచో బ్రాహ్మణునినుండియే దానిని పొందతగుననుట (అనగా బ్రాహ్మణునినుండియే విద్యాధిగమము) ఉత్తమోత్తమమగునట్టి పక్షము. ఒక్కొక్కప్పుడు బ్రాహ్మణుడు -అనగా విద్య నుపదేశింపగలట్టి బ్రాహ్మణుడు- లభింపకయుండును. అట్టి సమయములలో ఏమి చేయవలయును? విద్యను మానుకొనుటకు వీలులేదు. ఏలయనగా అవశ్యము నయ్యది పొందితీరవలసియున్నది. మఱి ఎట్లు?-అని ఆశంకకల్గగా ఇటుపైని ఆపత్కల్పమును చెప్పుచున్నాడు. ఆపత్కల్పమనగా ముఖ్యపక్షము బొత్తుగా సంభవింపనప్పుడు -విధిలేక- అనుసరింపదగినట్టి విధానమని భావము-

బ్రాహ్మణునకు అబ్రాహ్మణునినుండి (అనగా బ్రాహ్మణుడు కానట్టివానినుండి) విద్యోపయోగము -(అనగా నియమపూర్వకముగా విద్యను గ్రహింపవలసియుండుట) ఆపత్కల్పము అని సూత్రార్థము. ఇచ్చట విద్యలనగా చతుర్దశవిద్యలు. అయ్యవియవి -"శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము జ్యోతిషము కల్పము అనునీ ఆరు వేదాంగములును, ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వణవేదము అను నాలుగు వేదములును మీమాంసయును న్యాయశాస్త్ర

మును పురాణమును ధర్మశాస్త్రమును అని మొత్తమున పదునాలుగు విద్య లనబడును.

ఇచ్చట మూలమునందుగల అబ్రాహ్మణుడన్న మాటకు బ్రాహ్మణభిన్నుడగు క్షత్త్రియుడని కాని వైశ్యుడని కాని యర్థము చేయతగును. ఈసూత్రమునందు బ్రాహ్మణునకు ఇది ఆపత్కాల్పము అనుమాట కేవలమును ఉపలక్షకము. కాబట్టి ఇందువలన క్షత్త్రియునకు గూడ వైశ్యునినుండి విద్యోపయోగము చేయవలయునని తేలుచున్నది. ఈసూత్రమునందు చెప్పబడినట్టి ఆపత్కాల్పమనునట్టి పదము ఈయధ్యాయము ముగియువఱకును అధికరింపబడుచున్నది. అనగా ఈయధ్యాయమున చివఱదనుకను జెప్పునట్టి సమస్తవిధులును ఆపత్కాల్పమునందు ఆచరింపదగినవని ఏర్పడుచున్నవని భావము.

250 సూ. అనుగమనం శుశ్రూషా [౧—౭—౨]

హరదత్తమితాక్షరా:— తత్ర యావదధ్య యనకాలం అనుగమనమేవ శుశ్రూషా నాన్యదితి.

ఆంధ్రవివరణము:— అందునకుగూడ నధ్యయనము చేయునట్టి కాలమునందు ఆయుపాధ్యాయుని అనుసరించి వెళ్లుటయే ఆపత్కాల్ప పక్షమున శుశ్రూష యగునని తాత్పర్యము.

251 సూ. సమాప్తే బ్రాహ్మణో గురుః [౧—౭—౩]

హరదత్తమితాక్షరా:— సమాప్త ఇతి. సమాప్తే త్వధ్యయనే బ్రాహ్మణఏవ గురుః

ఆంధ్రవివరణము:— ఇట్టులు అనుగమనము చేయుచు బ్రాహ్మణుడు అబ్రాహ్మణునివలన విద్యాధ్యయనము చేయునప్పుడు - సమాప్తముకాగానే (అనగా విద్యాధ్యయనము ముగియగానే) మఱల నతనికి బ్రాహ్మణుడే గురువుగా నుండదగి యున్నాడని భావము అనగా నభావపక్షమునందు అబ్రాహ్మణునివలన బ్రాహ్మణుడు విద్యాధ్యయనము చేయవలసివచ్చి అనుగమనమాత్రమున శుశ్రూష సెలపుచు వచ్చినను, విద్యార్జనను పరిసమాప్తియైనది మొదలు మఱల బ్రాహ్మణుడే గురుపదమునందుంచతగి యుండును గాని ఆయబ్రాహ్మణుని గురువుగా స్వీకరింపరాదని భావము.

252 సూ. యాజనాధ్యాపన ప్రతిగ్రహాస్సర్వేషామ్. [౧—౭—౪]

హరదత్తమితాక్షరా:— యాజనేతి. యాజనాదయో బ్రాహ్మణస్య వృత్తయః, తా ఆపది సర్వేషా మనుజ్ఞాయంతే నతు బ్రాహ్మణస్యైవేతి. అపరఆహ-ఆపది సర్వేయాజయితవ్యాః సర్వేధ్యాప్యాః సర్వతశ్చ ప్రతిగ్రాహ్యం, నతు గర్హా దోషోస్తి. తథాచమనుః-శ్లో. నాధ్యాపనా ద్యాజనాద్వా గర్హితాద్వా ప్రతిగ్రహాత్. దోషోభవతివిప్రాణాం జ్వలనాంబుసమోహి సః, ఇతి.

ఆంధ్రవివరణము:— బ్రాహ్మణుకు జీవికార్థము అనుసరింపదగిన వృత్తు లని చెప్పబడినట్టి యాజనాధ్యాపన ప్రతిగ్రహములు తక్కిన యన్నివర్ణముల వారికిగూడ ఆపత్కాల్పమున ననుసరింపతగినవే యని సూత్రార్థము. ఇయ్యది హరదత్తమతాను సారమగు నర్థము. మఱికొందఱు అనిరి-" ఆపత్కాలమునందు ఈవర్ణమువారు ఆవర్ణమువారు అను వివక్షత లేకుండ నందఱును యాజయితవ్యులే యగుదురు. అందఱును అధ్యాప్యులు నే యగుదురని" అనగా నందరిచేతను యజింపచేయవచ్చును. అందఱును అధ్యయనమును-నదివింపవచ్చును. అందఱునుండియును ప్రతిగ్రహమును చేయవచ్చును. దాన గొంచెమైనను దోసగులేదు -అని భావము. మనువుకూడ నిట్టులనే పల్కినాడు -"విప్రులకు ఆపత్కాలమున గర్హితులగువారినిఅధ్యాపనము చేయించుటవలనగాని

యజనము చేయించుట వలనగాని అట్టి వారినుండి ప్రతిగ్రహించుట వలనగాని ఏమియును దోషము కల్గజాలదు. ఏల యనగా బ్రాహ్మణుడనగా స్వభావతః ప్రజ్వలించుచున్న అగ్నివలెను స్వచ్ఛమగు నుదకమువలెను అత్యంతమును పవిత్రుడై యుండును కాబట్టి. "-అని.

## 253 సూ. పూర్వః పూర్వో గురుః.

[౧—౭—౫]

హరదత్తమితాక్షరా:— పూర్వఇతి. ఏతేషాం యజనాదీనాం యోయఃపూర్వః పూర్వనిర్దిష్టః, సఉత్తర స్మాద్గురుర్జ్యేయః, ఆపది ప్రతిగ్రహేణజీవేత్తద సంభవే అధ్యాపనేన తదసంభవే యాజనే నేతి.

ఆంధ్రవివరణము:— మఱియును ఈ వెనుక జెప్పినట్టి యాజనాధ్యాపన ప్రతిగ్రహములను మూడింటిలోను ఉత్తరోత్తరమున నున్న దానికంటె పూర్వపూర్వమగునట్టిది గురుతర మని సూత్రార్థము. అనగా అపత్కాలమునందు బ్రాహ్మణుడు దొలుదొల్త ప్రతిగ్రహము (దానమిచ్చినచో స్వీకరించుట) చేసి జీవింపవచ్చునని యును, ఆప్రతిగ్రహము లభించనప్పుడు అధ్యాపనము చేసి జీవింపదగుననియును అయ్యదియును లేనప్పుడు యాజనముచేయించి జీవింపదగుననియును తాత్పర్యము.

## 254 సూ. తదలాభే క్షత్త్ర వృత్తిః

[౧—౭—౬]

హరదత్తమితాక్షరా:— తదితి. ఇదంబ్రాహ్మణవిషయమ్. గర్హితయాజనాదే రప్యలాభే క్షత్త్రివృత్తి స్స్యాత్. బ్రాహ్మణస్సేవాదినా జీవేదిత్యర్థః. ఆపది నివృత్తాయాం నారదః-శ్లో. ఆపదంబ్రాహ్మణ స్తీర్త్వా క్షత్త్రివృత్త్యా భృతేజనే, ఉత్సృజే త్క్షాత్ర వృత్తిం తాం కృత్వా పావనమాత్మన ఇతి.

ఆంధ్రవివరణము:— పైనిచెప్పినట్టి ఆగర్హితులకు అధ్యాపన యాజన ప్రతిగ్రహములు చేయించుటకూడ లభించనప్పుడు బ్రాహ్మణుడు ఆపత్కాలమున క్షత్త్రివృత్తిని అవలంబించియైనను -అనగా సేవ మున్నగునట్టి దానిని ఆధారముచేసికొని యైనను జీవింపదగునని సూత్రార్థము. ఆపదను గడచిన పిమ్మట -క్షత్త్రియవృత్తితో కుటుంబమును పోషించుచుండెనేని -ఆక్షాత్రవృత్తిని అంతతో వదలి ఆత్మను పవిత్రమును చేసికొనదగును. అని.

## 255 సూ. తదలాభే వైశ్యవృత్తిః

[౧—౭—౭]

హరదత్తమితాక్షరా:— తదలాభ ఇతి. క్షత్త్రివృత్తే రప్యలాభే బ్రాహ్మణోవైశ్య వృత్త్యాపి జీవేత్. అలాభగ్రహణం వృత్తిసంకరో మాభూదితి. క్షత్త్రియస్య వైశ్యవృత్త్యుపజీవనం దండా పూపన్యాయేన సిద్ధమ్.

ఆంధ్రవివరణము:— ఆక్షత్త్రియవృత్తికూడ లభింపనిచో బ్రాహ్మణుడు (వృత్తి సంకరము కానిరీతిని) వైశ్యవృత్తియగు కృషి వాణిజ్యాదులతోనైన జీవింపవచ్చునని సూత్రార్థము.

## 256 సూ. తస్యాపణ్యం

[౧—౭—౮]

హరదత్తమితాక్షరా:— తస్యేతి. తస్యవైశ్యవృత్తేః బ్రాహ్మణస్యాపణ్యేన విక్రేయం వక్ష్యతే. తస్యేతి వచనా త్క్షత్త్రియస్య వైశ్యవృత్త్యుపజీవినో వక్ష్యమాణ మపణ్యం నభవతి.

ఆంధ్రవివరణము:— మఱియును ఆబ్రాహ్మణునకు (అనగా ఆభావమునందు వైశ్యవృత్తి నవలంబించినట్టి బ్రాహ్మణునకు) ముమ్ముందు చెప్పబోవునట్టి అపణ్యము కూడ విక్రయింపదగినట్టిదగును అని సూత్రార్థము.

✓257 సూ. గంధ రస కృతాన్న తిలశాణ క్షౌమాజినాని.

[౧—౭—౯]

హారదత్తమితాక్షరా:—గంధశ్చందనాదిః, రసస్తైలఘృతలవణగుడాదిః, కృతాన్నం మోదకాపూపాది. తిలాః ప్రసిద్ధాః, శాణం శణవికారో గోణ్యాదిః, క్షౌమం క్షుమోద్భూతం పట్టవస్త్రవిశేషః, అజినం చర్మకటాది. ఏతాన్యవిక్రేయాణి. శాణక్షౌమయోర్వికారనిషేధాత్ప్రకృతే రప్రతిషేధః.

ఆంధ్రవివరణము:— ఇటుపైని ఆయపణ్యములను వివరించుచున్నాడు -గంధ రస కృతాన్న తిలశాణ క్షౌమాజినములు అపణ్యములగునని సూత్రార్థము. అనగా ఇట్టివానిని బ్రాహ్మణుడాపత్కాలమున విక్రయింపరాదని తాత్పర్యము. గంధద్రవ్యములనగా చందనము మున్నగునవి. నూనె నెయ్యి ఉప్పు బెల్లము మున్నగునవి రసద్రవ్యములు లడ్డూలు భక్ష్యములు మున్నగు పక్వపదార్థములు [అనగా పిండివంటలు] కృతాన్నము అనబడును. తిలలు నువ్వులు. శాణమనగా శణవృక్షముయొక్క [జనపచెట్టు] నారతో తయారుచేసినట్టి సంచులు మున్నగునవి. క్షౌమములనగా అవిసెనారతో తయారుచేసినట్టి మృదువులగు పట్టవస్త్రములు. అజినములనగా చర్మములతో సిద్ధముచేయబడినట్టి పసుపులు మున్నగునవి. ఇయ్యవి అవిక్రేయములని తాత్పర్యము.

258 సూ. రక్తనిర్ణిక్తే వాససీ [౧—౭—౧౦]

హారదత్తమితాక్షరా:—రక్తేతి. రక్తం లాక్షాదినా వికృతం నిర్ణిక్తం రజకాదినాధౌతం, ఏవంభూతే అపి వాససీ అపణ్యే భవతః.

ఆంధ్రవివరణము:—రంగువేసినట్టివియును, చలవచేసినట్టివియును అగునట్టి వస్త్రములు కూడ అపణ్యములే యగునని సూత్రార్థము.

259 సూ. క్షీరం సవికారమ్.

[౧—౭—౧౧]

హారదత్తమితాక్షరా:—క్షీరమితి. దధ్యాదిభిర్వికారైస్సహ క్షీరమప్యపణ్యమ్.

ఆంధ్రవివరణము:— పెరుగు మున్నగు వికృతులను దాల్చినట్టి పాలుగూడ అపణ్యమే యగునని భావము.

260 సూ. మూలఫలపుష్పౌషధమధుమాంస తృణోదకాపథ్యాని

[౧—౭—౧౨]

హారదత్తమితాక్షరా:—మూలేతి. మూలం ఆర్ద్రకహరిద్రాది. ఫలం పూగాది. పుష్పం చంపకాది. ఔషధం పిప్పల్యాది. మధు మాక్షికమ్. మాంసతృణోదకాని ప్రసిద్ధాని అపథ్యం విషాది. ఏతాన్యపణ్యాని. రసశబ్దేన పూర్వమేవ నిషిద్ధేపి. పునర్మధుగ్రహణం సర్వథావృత్త్యశక్తావిత్యాదిపక్షే నిషేధార్థమ్.

ఆంధ్రవివరణము:— అల్లము పసపు మొదలగు మూలములనుండి (వేళ్లు-లేకదుంపలు) పుట్టెడి వస్తువులు కూడ మూలము లనబడును. వక్కలు మున్నగునవి ఫలములు. (అనగా పూగఫలములు మున్నగునవి.) దమనము మరువము సంపెంగలు మున్నగునట్టివి పుష్పములు. పిప్పలి మున్నగునవి ఔషధములు. తేనెయే మధువు. మాంసము సుప్రసిద్ధమే. తృణము అనగా గడ్డి. ఉదకము అనగా నీళ్లు. అపథ్యవస్తువు లనగా విషములు మొదలగునవి.

మూలములు ఫలములు పుష్పములు ఓషధులు తేనె మాంసము, మంచినీరు, విషపదార్థములు అనునియ్యవికూడ అపణ్యములే యగునని సూత్రార్థము. ఇందు మధువు నకు -(అనగా తేనెకు) వెనుకటి సూత్రమునందలి (258) రసశబ్దము చేతనే నిషిద్ధము కలుగుచున్నను, మఱల ప్రత్యేకముగా మధుశబ్దమును ఇందు పేర్కొనుటచేత ఎంతటి అసమర్థతతోనున్నను మధువు బొత్తుగ విక్రయింపరాదని తేలుచున్నయది.

## 261 సూ. పశవశ్చ హింసాసంయోగే [౧-౭-౧౩]

హారదత్తమితాక్షరా:—పశవ ఇతి. పశవోఽజాదిః. హింసాసంయోగే సౌనికాదిభ్యో హింసార్థేన విక్రేయాః.

ఆంధ్రవివరణము:— కటికవాళ్లు మున్నగువారి వలన హింసచేకూరుట కల్గునేని అప్పుడు మేకలు మొదలగునట్టి పశువులుకూడ అపణ్యములే యగును. అనగా విక్రయింప తగనివగుచున్న వని భావము.

## 262 సూ. పురుషవశా కుమారీ వేహతశ్చ నిత్యమ్. [౧-౭-౧౪]

హారదత్తమితాక్షరా:—పురుషేతి. పురుషాః దాసాదయః. వశా వంధ్యా గౌః. కుమారీ వత్సతరీ. వేహద్గర్భోపఘాతినీ. ఏతే నిత్యమపణ్యాః. నిత్యమిత్యుక్తత్వాద్ధింసాసంయోగాదన్యత్రాపి నిషేధః. అపర ఆహ—ఇహ నిత్యగ్రహణాత్పూర్వేషు తిలాదిష్వనిత్యః ప్రతిషేధః. తత్ర వసిష్ఠః:—కామం వా స్వయముత్పాద్య తిలాన్విక్రీణీరన్—ఇతి.

ఆంధ్రవివరణము:— దాసులు మున్నగు పురుషులును, గొడ్డుబోయినట్టి ఆవులును, దూడ ప్రాయముననున్న ఆవు పెయ్యయును, గర్భోపఘాతినియగు ఆవును -అను నని ఎల్లప్పుడును పశువులలో అపణ్యము లగుచున్నవని సూత్రార్థము. ఇందులో నిత్యం (ఎల్లప్పుడును) అనిచెప్పుటచేత హింసాసంయోగములేనప్పుడుకూడ అపణ్యములే యని సూచితమగుచున్నది. (ఇది హారదత్తమతము.) నుతియొకరు అనిరి కదా!-"ఇచ్చట నిత్యశబ్దమును గ్రహించుటవలన వెనుకచెప్పినట్టి తిలాదులయెడ ప్రతిషేధ మనిత్యము -"అని. అట్టులనే వసిష్ఠుడుగూడ ననెను -స్వేచ్ఛగా స్వయముగా పైరుచేసి నువ్వులనైనను విక్రయింపవచ్చును అని

## 263 సూ. భూమివ్రీహియవాజావ్యశ్వఋషభధేన్వనడుహశ్చైకే. [౧-౭-౧౫]

హారదత్తమితాక్షరా:— భూమీతి. భూమిర్గృహమ్. వ్రీహియవాజావ్యశ్వాః ప్రసిద్ధాః ఋషభస్సేచనసమర్థో గౌః ధేనుస్సకృత్ప్రసూతా. అనడ్వాననో వాహనయోగ్యో బలీవర్దః. ఏతే చాపణ్యా ఇత్యేకే మన్యంతే ఏకశబ్దాద్వయం త్వనుజానీమః. అత్రాపి అజావిగ్రహణం హింసా సంయోగవిషయపరమితి.

ఆంధ్రవివరణము:— నివసించునట్టి ఇండ్లు మున్నగునట్టి భూమియును, వ్రీహిధాన్యమును యవలును మేకలు గొఱ్ఱెలు గుఱ్ఱములును కవిలె (మోట) తోలగల ఎద్దులు ఆవులును బరువుమోయగలట్టి బండ్లులాగగలయట్టి వృషభములునుకూడ అపణ్యములే యని కొందఱని రని సూత్రార్థము. ఇది గౌతమునికిగూడ ఇష్టమైనదే. ఇచ్చట అజాదులు గ్రహించుటవలన నియ్యదియును హింసాసంయోగ విషయపరమే యని యెఱుంగతగును.

## 264 సూ. నిమయస్తు.

[౧—౭—౧౬]

హారదత్తమితాక్షరా:— నిమయ ఇతి. నిమయో వినిమయః పరివర్తనంతు శబ్దేన నిమయో నుజ్ఞాయత ఇతి సూచితం భవతీతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— ఈపైని చెప్పినట్టి వన్నియు ను అపణ్యములైనచో, మఱి బ్రాహ్మణుడు వైశ్యవృత్తిచేత ఆపత్కాల్పమునందు జీవించు టెట్టులు ?-అని ఆశంకరాగా వారించుచున్నాడు. ఈవెనుక జెప్పినట్టివానిని వినిమయము చేసి జీవించుట అంగీకరింపబడిన దని సూత్రార్థము. నిమయమనగా వినిమయము అనగా సమముగాగాని తక్కువగాని పరస్పరము మార్చుకొనుట యని తాత్పర్యము.

## 265 సూ. రసానాం రసైః

[౧—౭—౧౭]

హారదత్తమితాక్షరా:— రసానామితి. తైలఘృతగుడాదీనాం రసైరేవ వినిమయః కార్యః, తద్యథా - తైలం దత్వా ఘృతం గ్రాహ్యమితి రసైస్సమతో హీనతో వేతి వసిష్ఠః.

ఆంధ్రవివరణము:— ఇటు పైని వినిమయము చేయవలసిన విధానములను చెప్పుచున్నాడు- వినిమయమును చేయునప్పుడు - రసద్రవ్యములకు రసద్రవ్యములతో మాత్రమే వినిమయము చేయతగునని సూత్రార్థము. ఎట్లనగా- రసద్రవ్యములలో చేరినట్టి తైలమును (నూనెను) ఒసంగి రసద్రవ్యమగు ఘృతమును గ్రహింపతగును. వసిష్ఠుడుకూడ నిట్టులనే చెప్పినాడు. రసద్రవ్యములతో (ఆయా రసద్రవ్యములయొక్క ఉత్కృష్టాపకృష్టతల ననుసరించి) సమముగాగాని తక్కువగాని రసద్రవ్యములను వినిమయమును (మార్పును) చేసి కొనవలయును. -అని.

## 266 సూ. పశూనాంచ

[౧—౭—౧౮]

హారదత్తమితాక్షరా:— పశూనామితి. పశూనాం చతుష్పదాం పశుభి రేవ వినిమయః కార్య ఇతి.

ఆంధ్రవివరణము:— చతుష్పాత్తులగు (నాల్గుకాళ్లుగల) పశువులకు అట్టివియేయగు పశువులతో వినిమయమును చేసికొనవలయునని సూత్రార్థము.

## 267 సూ. నలవణకృతాన్నయోః

[౧—౭—౧౯]

హారదత్తమితాక్షరా:— నేతి. లవణస్యకృతాన్నస్యచ వినిమయోప్రతిషిద్ధః.

ఆంధ్రవివరణము:— ఉప్పునకును కృతాన్నమునకును (లడ్డులు మున్నగు పిండివంటలు) వినిమయము పనికిరాదని సూత్రార్థము.

## 268 సూ. తిలానాంచ [౧—౭—౨౦]

హారదత్తమితాక్షరా:... తిలానాంచ వినిమయోనకార్యః. లవణకృతాన్నతిలానాం ద్రవ్యాంతరస్వీకారేణ ప్రదానం నిషిద్ధమ్. సమానద్రవ్యవిషయే ప్రవృత్త్య సంభవాత్.

ఆంధ్రవివరణము:—తిలలకుగూడ లవణముతోను కృతాన్నముతోను, వినిమయము పనికిరాదని సూత్రార్థము. అనగా సమానద్రవ్యవిషయమున ప్రవృత్తి సంభవింపదు. గనుక లవణకృతాన్న తిలలకు ద్రవ్యాంతరస్వీకారముతోనైన వినిమయము పనికిరాదని తాత్పర్యము. [అనగా లవణమునిచ్చి లవణమును, తిలలనిచ్చి తిలలను, కృతాన్నమునొసంగి కృతాన్నమును, తీసికొనుట సంభవింపదు. కాబట్టి వీటికి మఱి ఇతరములగు వస్తువులతో మార్చుకొనుట కూడ పనికిరాదని భావము.]

269 **సూ. సమేనామేనతు పక్వస్యసంప్రత్యర్థే** [౧-౭-౨౧]

హరదత్తమితాక్షరా:— సమేనేతి. సమేనసమపరిమాణేన ఆమేన తండులేన సంప్రత్యర్థే తాత్కాలికోపయోగార్థే పక్వాన్నస్యనిమయః కార్యః. మనుస్తు:-తిలధాన్యేన తత్సమాఇతి. సమేనధాన్యేన తిలానాం నిమయమనుజానాతి. అపణ్యమితి విక్రయ నిషేధాత్సర్వత్ర యావదుపయోగక్రయే నిషేధోన స్యాత్. రసాదీనామపి నియమశవద్దేన ప్రదానమేవవివక్షితమ్. అన్యథాత్వవిద్యమానేన రసాంతరాదేర్ద్రవ్యాన్యా న్యృత్త్యసంభవాత్

ఆంధ్రవివరణము:— సమపరిమాణము గలఆమద్రవ్యముతో (అనగా పక్వముకానట్టి బియ్యము మొదలగు వస్తువులతో) తాత్కాలికముగా నుపయోగించుటకై కృతాన్నమును (అనగా పక్వము చేసినట్టి వస్తువును) వినిమయము చేయవచ్చునని సూత్రార్థము. ఇచ్చట మనువు- తిలధాన్యేన తత్సమాః- అని సమపరిమాణము గలధాన్యముతో తిలలను మార్చుకొనవచ్చునని అంగీకరించు చున్నాడు. అపణ్యం- అని విక్రయ నిషేధ ముండుటవలన అన్నిచోట్లగూడ ఉపయోగమాత్రమునకై విక్రయము చేయుటలో నిషేధముండదని యెఱుంగునది. ఇట్టులనే రసాదులకుగూడ వినిమయమన్నమాటచేత ప్రదానము (ఊరక ఇచ్చుట) అనునర్థమే వివక్షిత మగుచున్న ది.

270 **సూ. సర్వ వృత్తిరశక్తౌ వశాద్రేణ** [౧-౭-౨౨]

హరదత్తమితాక్షరా:— సర్వథావృత్తిరితి. ఉక్తేన ప్రకారేణ కుటుంబధారణ స్యాసంభవో శక్తిః, తస్యాంసత్యాం సర్వథావృత్తిః, ఉక్తే నసర్వప్రకారేణ నిషిద్ధేనాపినశౌద్రేణకర్మణాజే వేదితి.

ఆంధ్రవివరణము:— పైనిచెప్పిన విధములలో సర్వప్రకారములచేతనూ - [అనగా అన్నిటిచేతగూడా] కుటుంబధారణము జరుగనప్పుడు పైని నిషేధించినట్టి అన్ని విధములగు వృత్తులచేతగూడా జీవింపవచ్చును. కాని శూద్రవృత్తితో మాత్రము [అనగా ఉచ్ఛిష్టాశన శిల్పవృత్త్యాదులతో] అట్టిసమయములలోగూడ బ్రాహ్మణునకు పనికి రాదని తాత్పర్యము.

271 **సూ. తదప్యేకే ప్రాణసంశయే** [౧-౭-౨౩]

హరదత్తమితాక్షరా:— తదపీతి. ఏకేత్వాచార్యాః ప్రాణసంశయే తదపిశౌద్రం కర్మానుమన్యతే యథాహవ్యాసః-- శ్లో. ధర్మార్థకామమోక్షాణాం ప్రాణా స్సంస్థితిహేతవః, తాన్నిఘ్నతాకింనహతం రక్షతా కిం నరక్షితమ్- ఇతి.

ఆంధ్రవివరణము:— అశూద్రవృత్తినిగూడ చేయకపోయినచో ప్రాణములు నిలుచునోనిలువవో యన్నంతటిసంశయస్థితి వచ్చినచో ఆచరింపవచ్చునని కొందఱు ఆచార్యులు అంగీకరించిరని సూత్రార్థము. వ్యాసుడుకూడ నిట్టులనే చెప్పినాడు. - ధర్మార్థకామమోక్షము లను నాల్గు పురుషార్థములకును ప్రాణములే సంస్థితి హేతువులగుచున్నది. అట్టి ప్రాణములను - అనగా పురుషార్థస్థితికి కారణములైన ప్రాణములను పోగొట్టుకొనుటచేత లోకమునందు పోగొట్టునట్టివస్తువు ఏదియున్నది. రక్షించుటచేత రక్షితము కానిదేది గలదు- అని.

262. సూ. తద్వర్ణ సంకరాభక్ష్య నియమస్తు [౧—౭—౨౪]

హారదత్తమితాక్షరా:—తదితి. నియమోవర్జనమ్. శూద్రవృత్తిస్థితేనాపి బ్రాహ్మణేన తేన శూద్రవర్ణేనసహ ఆసనాంగ సంమేళనాది స్సంకరః. తదుభయవర్జనం కర్తవ్యంనతు శూద్రవృత్తిరస్మీతి యథాకామ్య మాచరేదితి.

ఆంధ్రవివరణము:— అశూద్రవృత్తిని చరించుటలోగూడ వర్ణసంకరాభక్ష్యప్రభృతులు పొసగకుండునట్టులు నియమముగా నుండవలయునని సూత్రార్థము. ఇచ్చట నియమమనగా వర్జించుటయగును. అనగా శూద్రవృత్తి యందున్నను శూద్రవర్ణమువారితో కలసి ఆసనాంగ సంమేళనాది సంకరము కలుగునట్టుగాను అభక్ష్యములగు లశునాదులను భక్షించుట కలుగునట్టులుగాను ప్రవర్తింపగా రాదని భావము.

273 సూ. ప్రాణసంశయే బ్రాహ్మణోఽపి శస్త్ర మాదదీత [౧—౭—౨౫]

హారదత్తమితాక్షరా: —ప్రాణ సంశయఇతి. ప్రాణసంశయేసతి బ్రాహ్మణోఽపి రక్షార్థం శస్త్రమాదదీత. తదలాభేఅక్షత్రవృత్తిరితి–శస్త్రగ్రహణేసిద్ధే పునరుపాదానం బ్రాహ్మణవృత్తేః సతోఽప్యనిషేధార్థం. అపిశబ్దాత్కింపున ర్వైశ్యశూద్రా.

ఆంధ్రవివరణము:—ప్రాణసంశయము కల్గునంతటి స్థితివచ్చినచో బ్రాహ్మణుడుకూడ శస్త్రమును రక్షణము కొఱకై గ్రహింపదగునని సూత్రార్థము. ఈయర్థము తదలాభే క్షత్త్రవృత్తిః- అన్నసూత్రముచేతనే సిద్ధించుచుండగా ఇచ్చట మఱల చెప్పుట బ్రాహ్మణవృత్తి కలవాడైనవానికిగూడ ప్రాణసంశయ స్థితి యందు శస్త్రధారణము చేయుట నిషిద్ధముకాదని తెల్పుటకై ఇట్టులు చెప్పబడినది. బ్రాహ్మణునకే ఇట్టులు ఆత్మార్థమై శస్త్రధారణము విహితమైనప్పుడు ఇకను వైశ్యశూద్రులను గుఱించి చెప్పవలసినదేమి కలదు? అనగా వారికినియ్యది అత్యావశ్యక మని భావము.

274 సూ. రాజన్యో వైశ్యకర్మ వైశ్యకర్మ [౧—౭—౨౬]

హారదత్తమితాక్షరా:—రాజన్యఇతి. ప్రాణసంశయే రాజన్యో వైశ్యకర్మాదదీత. తేనాత్మానం రక్షేత్. ఇతి శ్రీహరదత్తవిరచితాయాం గౌతమ వివృతౌ మితాక్షరాయాంసప్తమోధ్యాయః.

ఆంధ్రవివరణము:— ప్రాణసంశయస్థితి వచ్చినప్పుడు రాజన్యుడు వైశ్యవృత్తిని అవలంబించి తనను రక్షించుకొనవలయు నని తాత్పర్యము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును, యజుశ్శాఖాధ్యాయియును, ఆపస్తంబ సూత్రుడును, అధిగతకావ్యతీర్థ బిరుదుడును, పంచాగ్ని వంశ్యుడును. అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును, అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమధర్మ సూత్రముల ఆంధ్రవివరణమునందు ప్రథమప్రశ్నమునందు ఏడవయధ్యాయము ముగిసినది.

అష్టమాధ్యాయ ప్రారంభము.

275 **సూ. ద్వౌలోకేధృతవ్రతౌ రాజా బ్రాహ్మణశ్చబహుశ్రుతః**

[౧-౮-౧]

హరదత్తమితాక్షరా:— ఆపద్వృత్తి మాశ్రితః యదితత్రైవ రమేత తదా కేనాసౌ నివార్యేతేత్యాశంకాయామాహ-ద్వావిత్యాదినా లోకోరాష్ట్రం వీప్సాలోపశ్చాత్రద్రష్టవ్యః. లోకేలోకే ధృతవ్రతౌ వ్రతానాం కర్మణాం ధారయితారౌ ద్వౌ రాజా బహుశ్రుతశ్చ బ్రాహ్మణః తౌసర్వస్య సర్వాపదో దండోపదేశాభ్యాం నివారయితారౌ-ఇతి.

ఆంధ్రవివరణము:—వెనుకటి యధ్యాయమునందు బ్రాహ్మణాదులు ఆపదలయందు ప్రాణరక్షణార్థమై తాత్కాలికముగా అవలంబింపవలసినట్టి వర్తనవిధానము నిరూపింపబడినది. లోకమునందు ఎవ్వడైనను ఆపద్వృత్తిని ఆశ్రయించినవాడై ఆవృత్తియందే ఎల్లప్పుడును రమించుచు నుండునేని అప్పుడతడు ఎవ్వరిచే నేవిధముగా మందలింపబడవలయును? (అనగా వారింపబడవలయును) అని ప్రశ్నము కలుగగా దానిని [ఆప్రశ్నమును] వారించుటకై ఈయధ్యాయమును ఆరంభించుచున్నాడు. ప్రతిలోకమునందు ధృతవ్రతుడగునట్టి రాజును, ధృతవ్రతుడును బహుశ్రుతుడు నగునట్టి బ్రాహ్మణుడును -అను ఈఇద్దరే సమస్తములగు ఆపదలను నివారింపగల వారలగుచున్నారని సూత్రార్థము. వ్రతమనను భయ లోకక్షేమంకరమగునట్టి పని. అట్టిపనిని అవలంబించి పోషించునట్టి వారు ధృతవ్రతులనబడుదురు. ఈధృతవ్రతుడనుపదము ఇచ్చట రాజునకును బ్రాహ్మణునకును విశేషణమగుచున్నది. కాగా ధృతవ్రతుడగు రాజుఅని ధృతవ్రతుడగు బ్రాహ్మణుడని అర్థమేర్పడుచున్నది. పెద్దలనుండి అనూచానముగా వచ్చుచున్నట్టి సమస్తములగు ఆచారవ్యవహారములను ఎఱింగినవాడు బహుశ్రుతుడనబడును. ఈవిశేషణము బ్రాహ్మణున కన్వయించును. అన్వయించినచో ధృతవ్రతుడగు రాజును, ధృతవ్రతుడును బహుశ్రుతుడును అగు బ్రాహ్మణుడును [క్రమముగా దండోపాయముల చేతను, సంప్రదాయము నుపదేశించుటద్వారాను] లోకులను ఆపద్వృత్తులనుండి నివారించి వారివారి స్వవృత్తులయందు నిలుపగలవారలగుచున్నారని తాత్పర్యము.

విశేషాంశములు:— ఇచ్చట మస్కరీయభాష్యమునందు సారస్యములు చెప్పబడియున్నవి -మూలసూత్రమునందుగల ద్వౌ (ఇద్దరు) అనుమాట సంఖ్యను నిర్దేశించునదిగాక ఆధిక్యమును సూచించునదియనియును, దానివలన లోకమునందు తక్కిన వర్ణములవారిలోగూడ ధృతవ్రతులును బహుశ్రుతులు నగువారలుండి దండోపదేశములద్వారా లోకమును ఆపదలనుండి వారింపగలవారు ఉన్నప్పటికిని వారందఱికంటెగూడ బ్రాహ్మణక్షత్రియులే (ఎక్కుడుగా) అధికముగా ధృతవ్రతులును బహుశ్రుతులునై లోకమును ఆపదలనుండి నివారింపగలవారుగా నున్నారనియును చెప్పబడియున్నది. ఈబ్రాహ్మణ క్షత్రియులలోగూడ బ్రాహ్మణుడు ముఖ్యుడనియును రాజుకంటె నతనికే లోకమును ఆపదలనుండి కాపాడి స్వధర్మమునందు నిలుపవలసినట్టి బాధ్యత గలదనియుగూడ చెప్పబడియున్నది.

276 **సూ. తయోశ్చతుర్విధస్య మనుష్యజాత స్యాంత స్సంజ్ఞానాం చలనపతనసర్పణానామాయత్తంజీవనం.**

[౧-౮-౨]

హరదత్తమితాక్షరా:— తయోరితి. చతుర్విధస్య మనుష్యజాతస్య చాతుర్వర్ణ్యస్యాంతరప్రభావా దనులోమాదయస్తస్మాల త్వాత్పృథఙ్నోక్తాః, అంతస్సంజ్ఞాః వృక్షాదయః స్థావరాః వృద్ధిక్షయవంతో యేషామంతస్సంజ్ఞా నబహిస్తే తథోక్తాః-తథాచోక్తంమనునా-శ్లో. తమసా బహురూపేణ చేష్టితాః కర్మహేతునా, అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖ సమన్వితాః-ఇతి. చలనాః పశ్వాదయః. పతనాః పక్షిణః సర్పణాస్సరీసృపా భుజంగాదయః ఏషాం మనుష్యాదీనాం జీవనం తయో రాజబ్రాహ్మణ

ర్యో రాయత్తం తదధీన మిత్యర్థః. రాజాతు పరిపంథినిగ్రహాదినా తేషాంజీవన హేతుః, ఇతరస్తు కథం బహుశ్రుత ఇత్యాశంకాయాం మను రాహ-అగ్నౌప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే, ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః-ఇత్యాదిన్యాయేన జీవన హేతురితి.

ఆంధ్రవివరణము:—లోకమునందు తక్కిన వర్ణములవా రందఱు నుండగా బ్రాహ్మణ క్షత్రియు లిద్దరు మాత్రమే ఏల (లోకమును ఆపదలనుండి వారించుటకు) కారణులగుచున్నారు? అను ప్రశ్నరాగా తత్సమాధానముగా ఈసూత్రమును ఆరంభించుచున్నాడు.

బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులను పేరుతో జెప్పఁబడెడి. నాల్గువిధములగు మనుష్యజాతమునకున్నూ (అనగా మనుష్యసంఘమునకు అని భావము.) అంతస్సంజ్ఞలుగల -[అనగా పైకి తెలియబడక లోపల నెచ్చటనో ఇమిడియున్న చేతనముగల] స్థావరములగు తరుగుల్మ లతాదులకున్నూ చలనస్వభావముగల పశువులు మున్నగువానికిన్నీ, ఆకాశమున నెగిరెడి స్వభావముగల పక్షులు మున్నగు వానికిన్నీ, నేలయందు చెట్లు చేమలయందును ప్రాకునట్టి స్వభావముగల పాములు జెఱ్ఱులు మొదలగు వానికిన్నీ వారి యిద్దరియొక్క అధీనమై జీవనము ఉండుటచేత లోకానుశాసనమునందు ఆయుభయులే కారణు లగుచున్నా రని సూత్రార్థము. అనగా ఈపైని చెప్పినట్టి సమస్తజీవకోటి యొక్క జీవనమునకు ఈబ్రాహ్మణ క్షత్రియులే కారణులగుటచేత వీరిచేతనే లోకము అనుశాసింపబడవలసి యున్నదని తాత్పర్యము. అయితే వీరిద్దరిలో -[అనగా బ్రాహ్మణక్షత్రియులలో] క్షత్రియుడు శత్రునిగ్రహము చేయుట మొదలగు పనులవలన జీవనహేతువగుచున్నట్టి మాట అందరికి తెలిసినదే. కాని బ్రాహ్మణుడు [బహుశ్రుతుడైనా] వీరికి జీవనహేతువు కాగలుడు? -అని ఆశంకరాగా ...ఇట్లులు సమాధానము చెప్పినాడు -"యజమానుని చేత అగ్నియందు చక్కగా హోమము చేయబడునట్టి ఆహుతి -రసాహరణకారియగుటవలన (రసమును పీల్చుకొను వాడగుటచేత) సూర్యుని పోయి చేరుచున్నది. అట్లు చేరిన పిమ్మట ఆయాహుతియే వర్షరూపమున పరిణమించి ఆసూర్యునినుండి జాఱు వెడలుచున్నది. ఆవర్షమువలన అన్నమును, దాని నుపభోగించుటచేత ప్రజలును కలుగుచున్నారు. [ఇట్లు క్రమముగా బ్రాహ్మణుడు హోమమును చేయుటచేత సమస్తలోకమునకు పరంపరగా జీవనహేతువు అగుచున్నాడని"- తాత్పర్యము. ఇచ్చట మూలమునందుగల అంతస్సంజ్ఞ శబ్దమునకు స్థావరములగు తరుగుల్మలతాదు లర్థములనియును, ఆతరుగుల్మలతాదులలో పైకి కన్పడక లోపల నెచ్చటనో చేతనము అణగియుండుటచేత అంతస్సంజ్ఞలన్న పేరువచ్చినదనియును సూచింపబడినది. ఈ విషయమున ప్రమాణమేమి అందురేని మనువు చెప్పినమాట గలదు —"ఈస్థావరములగునట్టి వృక్షాదు లన్నియును చిత్రవిచిత్ర మగు ఖములను పాపకర్మహేతుకము నగు తమోగుణముచేత చుట్టుకొనబడి అంతస్సంజ్ఞ కలవిగా అగుచున్నవి. కాబట్టియే ఇయ్యవియును సుఖదుఃఖాది గుణములతో గూడి యున్నవి?"—అని.

277. సూ. ప్రసూతిరక్షణ మసంకరో ధర్మః [౧–౮–౩]

హారదత్తమితాక్షరా—ప్రసూతిరితి. ప్రసూతిరభివృద్ధిః, దండోపదేశాభ్యాం యథోక్తకారితయా వృష్ట్యాదిద్వారేణ రోగాద్యుపద్రవ శాంత్యాచ అభివృద్ధిర్భవతి. చోరనిగ్రహాద్రక్షణమపి, దండప్రాయశ్చిత్తోపదేశాభ్యాం భవతి వర్ణానామసంకరో సంశోధనమపి విహితోపదేశా త్ప్రతిషిద్ధసేవాయాం దండధారణాచ్చ ధర్మోపి భవతి. ఏతత్సర్వంత యోరాయత్తమితి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:— పైసూత్రమునందు చెప్పబడిన విధముగా బ్రాహ్మణ క్షత్రియుల స్వాధీనమున నుండునది జీవన మాత్రమేనా? మఱి ఏదియైనను ఇతరము కలదా? అని ప్రశ్నగలుగగా సమాధానమును చెప్పుచున్నాడు— ప్రసూతి యనగా అభివృద్ధి. రక్షణమనగా కాపాడుట. అసంకరమనగా ఆయావర్ణములవారు ఒకరితో నొకరు కలసిచెడిపోకుండు నట్లులుగా చూచుట. ధర్మముప్రసిద్ధమే. ప్రసూతియు రక్షణమును అసాంకర్యమును ధర్మమును కూడ వారియొక్క (బ్రాహ్మణ క్షత్రియులయొక్క) ఆయత్తములైయున్నవని సూత్రమునకు అర్థము. అనగా బ్రాహ్మణ క్షత్రియులు ఆయావర్ణములవారిని స్వధర్మచ్యుతులు గాకుండునట్లులుగను చెప్పినట్లులు నడచుకొనునట్లుగాను దండముద్వారాను ఉపదేశముద్వారాను చేయుచు, హోమా

దుల నొనర్చి తన్మూలకముగా వర్ణాదులను గురించి రోగములు మున్నగు ఉపద్రవములను మాన్పి తద్ద్వారా అభివృద్ధిని కల్గింతురనియును, చోరాదులను అనాచారాదులను వారించుటవలన రక్షణమును కల్గింతురనియును, దండనము చేసియును, ప్రాయశ్చిత్తమును విధించియు వర్ణసంకరము గాకుండునట్లుగా జూచెదరనియును, విహితమును ఉపదేశించియును ప్రతిషిద్ధమును వారించియును ధర్మమును అనుగ్రహించెదరనియును, కాబట్టియే ఆయుభయుల యాయత్తమునందు ఈవిశ్వమంతియు నున్నదని చెప్పబడినదనియును తాత్పర్యము.

278. సూ. సఏషబహుశ్రుతో భవతి. [౧—౮—౪]

హారదత్తమితాక్షరా— బహుశ్రుత ఇత్యుక్తం ప్రతిపాదయతి— సఏవేతి. సఏష వక్ష్యమాణనిర్దేశః.

ఆంధ్రవివరణము:— బ్రాహ్మణుడు బహుశ్రుతుడై యుండవలయు నని ఇదివఱకు చెప్పబడినది. కాని ఎట్టివాడుబహుశ్రుతుడనదగును అనిప్రశ్నమురాగా వారించుచున్నాడు— ఎవ్వడు మున్ముందు చెప్పబడు సూత్రములలో వర్ణింపబడునట్టి లక్షణములు గలవాడుగానుండునో వాడు బహుశ్రుతుడగు బ్రాహ్మణుడని సూత్రమునకు తాత్పర్యము

279. సూ. లోకవేద వేదాంగవిత్. [౧—౮—౫]

హారదత్తమితాక్షరా— లోక ఇతి. లోకశబ్దేన లోకవ్యవహారసిద్ధాః జనపదాది ధర్మాః ఉచ్యంతే. తేషాం. వేదా శ్చత్వార ఋగ్యజుస్సామాథర్వాణః, అంగానిషట్. వ్యాకరణం శిక్షాఛందోజ్యోతిషం కల్పసూత్రాణి నిరుక్తమపి. తేషాంవేత్తా పాఠతో ర్థతశ్చేతి.

ఆంధ్రవివరణము:— లోకవ్యవహారమునందు ప్రసిద్ధములగు దేశధర్మము లన్నియును ఇచ్చట లోకశబ్దము చేత గ్రహింపబడును. వేదశబ్దముచేత ఋగ్వేద యజుర్వేదములు నాల్గును గ్రహింపబడును. వేదాంగములను మాటచేత వేదములు శిక్ష ఛందస్సులు వ్యాకరణము- జ్యోతిషముకల్ప సూత్రములు నిరుక్తము అను నీయారును గ్రహింపబడును. ఏబ్రాహ్మణుడు లోకమును వేదమును వేదాంగములను [పాఠతః అర్థతః కూడా] చక్కగా నెఱిగి యుండునో అట్టివాడు మాత్రమే బహుశ్రుతుడుగా కాగల్గుచున్నాడని సూత్రమునకు తాత్పర్యము.

280. సూ. వాకోవాక్యేతిహాసపురాణకుశలః [౧—౮—౬]

హారదత్తమితాక్షరా— వేదశాస్త్రోపయోగీని తర్కోక్తి ప్రత్యుక్తిరూపాణి వాకోవాక్యాని. యథాభారతే- కసిదేకాకీచరతి - సూర్యఏకాకీచరతీత్యాది”- వాకోవాక్యమ్. భారతరామాయణాదీని ఇతిహాసః, పురాణం విష్ణుపురాణ శివపురాణా ద్యష్టాదశవిధమ్, తేషు కుశల స్సమర్థః.

ఆంధ్రవివరణము:— ఏబ్రాహ్మణుడు వాకోవాక్యములను ఇతిహాసములను పురాణములను చక్కగా చదివి అందు నేర్పరియై యుండునో, అట్టివాడే బహుశ్రుతుడగు నని సూత్రార్థము. వాకోవాక్యములనగా వేదశాస్త్ర సంబంధములైన చర్చలను చేయుట కుపయోగించు ఉక్తిప్రత్యుక్తి రూపములగు [ప్రశ్నోత్తరములగు] వాఙ్మయము. భారతము రామాయణము మొదలగునవి ఇతిహాసములు, విష్ణుపురాణము శివపురాణము మొదలగునవి పురాణములు. ఇవి పదునెన్మిది విధములు. ఈచెప్పినవాఙ్మయము నంతను నేర్చి నైపుణ్యమును ఆర్జించినచో బహుశ్రుతుడని చెప్పదగి యుండును నని తాత్పర్యము.

281 సూ. తదపేక్ష స్తద్వృత్తిః [౧—౮—౭]

హారదత్తమితాక్షరా— తదపేక్షఇతి. యాన్యేతాని లోకాదీ న్యనుక్రాన్తాని తా న్యపేక్షత ఇతి.తద్వృత్తి స్తదభిహితానాం కర్మణామనుష్ఠాతా.

ఆంధ్రవివరణము:— వేదప్రసిద్ధములగు ఈలోకాదులన్నియు దేవ ననూక్తము లగుచున్నవో అట్టి అర్థములను అపేక్షించినవాడై- [అనగా వేదప్రసిద్ధములగు అర్థములను

అనువాదనముచేయునట్టి స్వభావము గలవాడై యనిభావము.] తదభిహితములయిన కర్మాదుల నాచరించునట్టి శీలముగలవాడైఎవ్వ డుండునో- వాడే బహుశ్రుతుడనబడుచున్నాడని భావము.

## 282. సూ. చత్వారింశ త్సంస్కారై స్సంస్కృతః [౧—౮—౮]

హరదత్తమితాక్షరా—చత్వారింశదితి. చత్వారింశ త్సంస్కారాః గర్భాదానాదయో వక్ష్యంతే. తై స్సంస్కృతః,

ఆంధ్రవివరణము:—నలువదిసంస్కారములు విధింపబడినవి. అయ్యవి మున్ముందు వివరింపబడ గలవు. ఎవ్వడు నలుబది సంస్కారములచేతనుసంస్కృతుడై యుండునో అట్టి బ్రాహ్మణుడే బహుశ్రుతుడని తాత్పర్యము.

## 283. సూ. త్రిషు కర్మస్వభిరతః [౧—౮—౯]

హరదత్తమితాక్షరా— త్రిష్వితి ఇజ్యాధ్యయన దానాని త్రీణి కర్మాణి. తేష్వభిరతః, తేషాంసాతత్యే నానుష్ఠాతా. తద్వ్యత్తి రిత్యనేనైవ సిద్ధే పునర్వచనమతి దార్ఢ్యార్థమితి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము:—ఇజ్య (అనగా యజ్ఞము చేయుట) అధ్యయనము దానము అనునట్టి ఈమూడుకర్మలయందును నిరంతరమును ఆసక్తిగలవాడై యుండెడివాడే బహుశ్రుతు డనదగునని యర్థము.

## 284. సూ. షట్సువా. [౧—౮—౧౦]

హరదత్తమితాక్షరా— షట్స్వితి. యాజనాధ్యాపన ప్రతిగ్రహైస్సహ షట్కర్మాణి తేష్వభిరతః, వాశబ్దేన పూర్వోక్తేషు నియమః,

ఆంధ్రవివరణము:— యాజనము అధ్యాపనము ప్రతిగ్రహము అను నీమూడింటితో కలిసిన వెనుకటిసూత్రమునందు చెప్పినట్టి ఇజ్యాధ్యయనకర్మలయందు- అనగా యజనయాజన అధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహములను ఆరు కర్మలయందు- గాని సర్వదా అనురక్తిగలవాడై యెవ్వ డుండునో వాడేబహుశ్రుతుడుఅనబడునని సూత్రార్థము.

## 285. సూ. సామయాచారికేష్వభివినీతః [౧—౮—౧౧]

హరదత్తమితాక్షరా—పౌరుషేయీ వ్యవస్థా సమయః, తన్మూలాః ఆచారాస్సమయాచారాః తేషుభవాః సామయాచారికాః ధర్మాః స్మార్తా ఇత్యర్థః, తేష్వభివినీతః పిత్రాదిభి స్సమ్యక్ఛిక్షితఇతి:

ఆంధ్రవివరణము:—పురుష నిర్మితమగునట్టి లోకవ్యవస్థయే సమయమనబడును. సమయమును ఆధారముగా చేసికొని ఏర్పడినట్టి ఆచారములు సమయాచారము లనబడును. అట్టి సమయాచారములందు జనించిన ధర్మము లెయ్యవి గలవో అయ్యవి (అనగా స్మార్తధర్మములు) సామయాచారికము లని యనబడును. సామయాచారిక ధర్మములందు శిక్షితు డగువాడును బహుశ్రుతుడని యనదగును.

విశేషాంశములు:— స్మృతులయందు ఉపనిబద్ధములగు ధర్మములుసామయికములని యును; శిష్యపరంపరాగత వచ్చు ధర్మములు ఆచారికము లనియును, ఈయుభయ విధములగునట్టి ధర్మములయందును శిక్షితుడై యుండెడివాడు మాత్రమే బహుశ్రు తుడనియును మస్కరిభాష్యమునందు గలదు.

## 286. సూ. షడ్భిః పరిహార్యో రాజ్ఞా [౧—౮—౧౨]

హరదత్తమితాక్షరా— షడ్భిరితి. షడ్భిర్వక్ష్యమాణై ర్వధాదిభిః పరిహార్యో రాజ్ఞాభవతి. పరిహారోవర్జనమ్.

ఆంధ్రవివరణము:—కాబట్టి వెనుక జెప్పినట్టి లక్షణములు గల బ్రాహ్మణుడు మున్ముందు చెప్పబోవునట్టి వధాదులగు వారింటిచేతను రాజుచే వదలి పెట్టతగునని సూత్రార్థము.

287. సూ. అవధ్యశ్చ బంధ్యశ్చ అదండ్యశ్చ బహిష్కార్యశ్చ అపరీవాద్యశ్చ పరిహార్యశ్చ.

[౧-౮-౧౩]

హరదత్తమితాక్షరా. తాన్వధాదీనాహ- అవధ్య ఇతి. వధస్తాడనంబంధో నిగడనందండో ర్థాపహారః, బహిష్కారో గ్రామాదిభ్యోనిర్వాసనం పరివాదో దోషసంకీర్తనమ్ పరిహారస్త్యాగః, షడేతేవధాదయః, ఏవంభూతే బహుశ్రుతే బ్రాహ్మణే సత్యబుద్ధిపూర్వ్యాపరాథే రాజ్ఞా వర్జ్యాః, బుద్ధిపూర్వస్యతు ప్రసంగాభావాత్ ఇతిశబ్దః ప్రకారవచనే. యచ్చాన్య దేవం రూప సంభాషణాది తదపి వర్జనీయ మితి భావః.

ఆంధ్రవివరణము:—— ఇట్టి బహుశ్రుతుడైన బ్రాహ్మణుడు [పొరపాటున ఏదేని అపరాధము చేసియున్నను] రాజునకు అవధ్యుడుగను అబంధ్యుడుగను అదండ్యుడుగను అబహిష్కార్యుడుగను అపరీవాద్యుడుగను అగుచున్నాడని సూత్రార్థము. అనగా ఇట్టివారిని రాజు [అబుద్ధిపూర్వకములగు దోషములు గలవారైనందునను, బుద్ధిపూర్వకముగా ఇట్టివారియందు దోషములే సంభవింపజాలవు గనుకను] వర్జింపవలయును. అనగా వదలిపెట్టవలయునని తాత్పర్యము. వధమనగా కొట్టుట. కొట్టుట కర్హుడగువాడు వధ్యుడు. వధ్యుడుకానివాడు అవధ్యుడు అనబడును. ఇట్లునే బంధమనగా సంకెలతో కట్టివేయుట. బంధనమున కర్హుడు బంధ్యుడు. బంధ్యుడుకానివాడు అబంధ్యుడు దండమనగా ద్రవ్యమును అపహరించుట (అనగా జరిమానా పేరుతో తప్పుచేసినవానినుండి లాగికొనుట) దండన కర్హుడైనవాడు దండ్యుడు. దండ్యుడుకానివాడు అదండ్యుడు, అనబడును. బహిష్కారమనగా ఊరుమున్నగువానినుండి వెళ్లగొట్టుట. బహిష్కారమునకు అర్హుడైనవాడు బహిష్కార్యుడు. బహిష్కార్యుడు కానివాడు అబహిష్కార్యుడు అనబడును. పరివాదనమనగా తప్పులనెన్నుట. పరివాదనమున కర్హుడైనవాడు పరీవాద్యుడు పరీవాద్యుడు కానివాడు అపరివాద్యుడనబడును. పరిహారమనగా విసర్జించుటకు అర్హుడైనవాడు పరీహార్యుడు. పరీహార్యుడు కానివాడు అపరీహార్యుడనబడును,

288 సూ. గర్భాధాన పుంసవన సీమంతోన్నయన జాతకర్మ నామకరణాన్న ప్రాశనచౌలోపనయనమ్

[౧-౮-౧౪]

హరదత్తమితాక్షరా:——చత్వారింశత్సంస్కారై రిత్యుక్తం తానాహ——గర్భాధానేత్యాదినా. సమాహారద్వంద్వః. గర్భాధానంబుతావుపేయా దిత్యాదికాలని యమేనసూత్రకారోక్త విధాననిషేకః, గర్భాధానాదయః సంస్కారాస్తత్ర గృహ్యేష్వాక్తాః, ఇహతు సంస్కార గణనార్థం స్వరూప నిర్దేశమాత్రం కృతమ్.

ఆంధ్రవివరణము:——ఇటుపైని వెనుకటి సూత్రమునందు (282) సూచించినట్టి నలుబది సంస్కారములను పేర్కొనుచున్నాడు - గర్భాధానము సీమంతోన్నయనము జాతకర్మము నామకరణము అన్నప్రాశనము చౌలము ఉపనయనము అనునిత్యవి ఆనలుబది సంస్కారములలో తొలుదొల్తటివి. ఋతావుపేయాదిత్యాది గృహ్యసూత్రనియమము ననుసరించి చేయునట్టి నిషేకకర్మము గర్భాధాన మనబడును. మూడవనెలలో (తొట్టతొలిసారి గర్భమునకుమాత్రము) చేయు సంస్కారము పుంసవనమనబడును. నాలవనెలలోగాని ఆరవనెలలోగాని ఎన్మిదవనెలలోగాని చేయునట్టి సంస్కారము సీమంతోన్నయన మనబడును. స్తనప్రాశనమై నాభివర్ధనము ఆగుటకుముందు చేయుసంస్కారము జాతకర్మము అనబడును. పదవదినముగాని పండ్రెండవ దినమునగాని చేయునట్టి సంస్కారము నామకరణము. ఆరవనెల వత్సరమందుగా చేయునట్టి సంస్కారము చౌలము. ఉపనయము ఇదవఅకే నిరూపింపబడినది.

289 సూ. చత్వారి వేదవ్రతాని. [౧—౮—౧౪]

హారదత్తమితాక్షరా— చత్వారీతి. ఏతానిచత్వారి వేదవ్రతాని ప్రతివేదం ప్రతిశాఖంచ గృహ్యేష్వూక్తాని.

ఆంధ్రవివరణము:— ఈచెప్పబోవునట్టి నాలుగును వేదవ్రతము లనబడును అనిభావము. ఒక్కొక్క వేదమును అనుసరించియును ఒక్కొక్క వేదశాఖను అనుసరించియును ప్రత్యేకప్రత్యేకముగ నియ్యవి ఆయావేదములు గలవారికై ఆయాగృహ్యసూత్రములందు నిరూపింపబడినవి.

290. సూ. స్నానం సహధర్మిణీ సంయోగః [౧—౮—౧౬]

హారదత్తమితాక్షరా— స్నానంసమావర్తనం. సహధర్మచారిణీ సంయోగోవివాహః,

ఆంధ్రవివరణము:—స్నానమును (అనగా సమావర్తనము చేసికొనుటయును) సహధర్మిణీసంయోగము (అర్థాత్తువివాహము అనునివి కూడ అనలుబడిసంస్కారములలోనే చేరునని యర్థము.

291. సూ. పంచానాం యజ్ఞానామనుష్ఠానం దేవపితృమనుష్యభూతబ్రహ్మణామ్. [౧—౮—౧౭]

హారదత్తమితాక్షరా—పంచానామితి. దేవాదీనాం యజ్ఞాస్తేషామనుష్ఠానం ఏతత్పంచమహాయజ్ఞానుష్ఠాన మహరహః కర్తవ్యమ్. నతుసకృత్కృతేన సంస్కారసిద్ధిః, పంచగ్రహణాత్పంచైతే పృథక్సంస్కారాః నపునస్సముదితాః, ఏతత్సంస్కారః,

ఆంధ్రవివరణము:—దేవతలు పితరులు మనుష్యులు భూతములు బ్రహ్మ -అను వీరియొక్క యజ్ఞములుకూడ అనలుబడిలోనే చేరును. ఈశాల్గింటిని దినదినమును చేయవలయునేకారి ఎప్పుడో యొక్కమారు చేసి వదలుటచేత సంస్కారసిద్ధియగునట్టివికావు. మూలసూత్రమునందు పంచశబ్దమును వేర్కొనుటచేత నియ్యవి ప్రత్యేక ప్రత్యేకములగు సంస్కారములే యగునుకాని అన్నియుచేరి ఒక్కసంస్కారము మాత్రము కాదని సూచితమగుచున్నది.

292. సూ. ఏతేషాంచ [౧—౮—౧౮]

హారదత్తమితాక్షరా— ఏతేషామితి. వక్ష్యమాణానామష్టకాదీనాంచ పాకయజ్ఞానామనుష్ఠానం సంస్కార ఇతి వ్యవహ్రియత ఇతిభావః.

ఆంధ్రవివరణము:— మున్ముందు చెప్పబోవునట్టి అష్టకాది పాకయజ్ఞములుకూడ పైనివేర్కొన్నట్టి సంస్కారములలోనే చేర్చుకొనవలయు నని తాత్పర్యము.

293. సూ. అష్టకాః పార్వణః శ్రాద్ధం శ్రావణ్యాగ్రహాయణీ చైత్ర్యాశ్వయుజీతి సప్తపాకయజ్ఞసంస్థాః [౧—౮—౧౯]

హారదత్తమితాక్షరా:— అష్టకాఇతి. ఊర్ధ్వమాగ్రహాయణ్యాః త్రయో పరపక్షాస్తేష్వేకైకస్మిన్నేకాష్టకాభవతీతి ఛందోగాః. హేమంతశిశిరయోశ్చతుర్ణామ పరపక్షాణాం అష్టమ్యైకైకస్యాం చేశ్వతశ్శ్వలాయనః యామాఘ్యాః పౌర్ణమాస్యాః ఉపరిష్టాన్మధ్యాష్టకా తస్యామష్టమీ జ్యేష్ఠయాసంపద్యతేతామేకాష్టకే త్యాచక్షతే ఇత్యాపస్తంబః. ఏవంభూతాష్టకా. పర్వణిభవస్థాలీ పాకః పార్వణః, శ్రద్ధం మాసిశ్రాద్ధమ్. శ్రావణీ సర్పబలిః శ్రావణ్యాం పౌర్ణమాస్యాంగృహ్యమగ్ని మతిప్రణీయేత్యాది ఛందోగాభిహితః, శ్రావణ్యాం పౌర్ణమాస్యామస్తమితే స్థాలీపాక ఇత్యాపస్తంభః, ఆగ్రహాయణీ

మార్గశీర్ష్యాం పౌర్ణమాస్యాంక్రియమాణః సర్పబలిరుత్సర్గహోమః, హేమంతే ప్రత్యవరోహణాఖ్యం చకర్మాత్ర ఆగ్రహాయణీశబ్దేన ఉచ్యతే. చైత్రీశూలగవ ఈశానబలిరిత్యాపస్తంబీయానాం ప్రసిద్ధః. సచైత్ర్యాం పూర్ణిమాయాంభవతి. అథశూలగవశ్శరది వసంతే చేత్యాశ్వలాయన, ఆశ్వయుజీం రుద్రాయ సఇతి చ్ఛందోగాః,ఆశ్వయుజ్యాం పౌర్ణమాస్యాం తత్కర్మనివేశన మలంకృత్య స్నాతాశ్శుచివాససః పశుపతయే స్థాలీపాకం నిరూప్య జుహుయాదిత్యాశ్వలాయనః. అనాహితాగ్నే రాగ్రయణమపి తత్రైవభవతి. తదిదంద్వయ మాశ్వయుజీశబ్దేన వివక్షితమ్. పాకయజ్ఞ ఇతిగార్హ్యాణాం కర్మణా మాఖ్యా. యథాహాపస్తంబః—లౌకికానాం పాకయజ్ఞశబ్దఇతి. సంస్థావిధాః పాకయజ్ఞవిధాః సప్తేత్యర్థః.

ఆంధ్ర వివరణము:—అష్టకలు పార్వణ శ్రాద్ధము శ్రావణి ఆగ్రహాయణి చైత్రి ఆశ్వయుజి—అను నీఏడు పాకయజ్ఞసంస్థలు అని చెప్పబడును. ఇందులో అష్టకల విషయమున మతభేదములు కలవు. ఆగ్రహాయణికి పిమ్మట (అనగా మార్గశీర్షమాసముయొక్క పున్నమికి పిమ్మట) వచ్చునట్టి మాసు కృష్ణ పక్షములలోను, ఒక్కొక్కదానియందు వచ్చునట్టి అష్టమీతిథులు మూడును అష్టకలని యే చెప్పబడును, అనగా మార్గశీర్ష బహుళఅష్టమి పుష్యబహుళ అష్టమి మాఖ బహుళమునందును ఫాల్గున బహుళమునందును- వచ్చునట్టి అష్టమీ తిథులే అష్టకలనబడునని ఆశ్వలాయనులు పలుకుదురు. మాఘపూర్ణిమకు పైన వచ్చునట్టి అష్టమి మధ్యాష్టకయనబడును. ఈమధ్యాష్టకయందు జ్యేష్ఠానక్షత్రముతో కూడివచ్చునట్టి అష్టమి ఏకాష్టకయనబడునుఅనిఆపస్తంబుడనియెను. ఇట్టిలక్షణములుగల వి అష్టకలని యనబడును.

ప్రతి పర్వమునందు (అనగా పూర్ణిమయందు) అగునట్టిది గనుక పార్వణము అని యనబడును. ఈపార్వణమునకే స్థాలీపాకమనియు నింకొకపేరు గలదు. ప్రతి మాసమునందును చేయునట్టి మాసశ్రాద్ధమే శ్రాద్ధమను మాటచేత ఇచ్చట గ్రహింపబడును. శ్రావణియనగా సర్పబలి. ఇయ్యది శ్రావణ్యాం పౌర్ణమాస్యాం- అను మున్నగు వచనములద్వారా ఛాందోగములందు చెప్పబడియున్నది. దీనినే కొందఱు ఉపాకర్మయనియునందురు. శ్రావణియను మాట వలన శ్రావణపౌర్ణమాసీయుక్త- అని అర్థము వచ్చుటవలన, దీనినే శ్రావణ్యాం పౌర్ణమాస్యాం- అనుమున్నగు సూత్రములవలన నాపస్తంబుడును విధించుచున్నాడు. మార్గశీర్ష పూర్ణిమనాడు చేయునట్టి సర్పబలి- లేక ఉత్సర్గ హోమము ఆగ్రహాయణి యనియే యనబడును.

ఇకను చైత్రియనగా శూలగవమను కర్మ. దీనికే ఆపస్తంబ సూత్రములలో ఈశానబలియని మఱొకపేరు గూడ కలదని పలుకుదురు. ఇవి సాధారణముగా చైత్రశుద్ధ పూర్ణిమయందు వచ్చునట్టిది గనుక చైత్రియందురు. ఈశూలగవము శరదృతువునందును వసంతర్తువునందును చేయతగునని ఆశ్వలాయను లనిరి. ఇకను ఆశ్వయుజమున్నది, ఆశ్వయుజీం రుద్రాయ స- అని ఛాందోగములు. ఆశ్వయుజపూర్ణిమయందు చేయునట్టి కర్మ. తొలుత ఇంటిని అలంకరించి స్నాతులై శుచివస్త్రులై ఈశ్వరుని కొఱకు స్థాలియందు పాయసమును వండిహోమముచేయవలయునని ఆశ్వలాయనులనిరి. అనాహితాగ్నియగు వానికిగూడ ఆగ్రయణము అప్పుడే విధింపబడినది. ఈరెండు విధములైనట్టి కర్మలును ఆశ్వయుజీశబ్దముచేత నిచ్చట సూచింపబడినవి. ఇకను- గృహ్యములగునట్టి కర్మలకే పాకయజ్ఞమనునది మఱొక్కపేరు. స్థాలీపాకముతో సంబంధించినదని సూచించుటకై పాకశబ్దమును, అగ్నిసంబంధము కలదని సూచించుటకై యజ్ఞమని వీనికి పేరును పెట్టియున్నారు. ఈపైని చెప్పినట్టి యేడును పాకయజ్ఞ సంస్థలని వ్యవహరింపబడుచుండును.

**294. సూ. అగ్న్యాధేయం, అగ్నిహోత్రం దర్శపూర్ణ మాసా వాగ్రయణం చాతుర్మాస్యాని నిరూఢ పశుబంధః సౌత్రామణీతి సప్త హవిర్యజ్ఞ సంస్థాః [౧—౮—౨౦]**

హరదత్తమితాక్షరా :— ఆగ్న్యాధేయమితి. అగ్న్యాధేయాదయ శ్శ్రుతి ప్రసిద్ధాః సంస్కారేషుగణ్యంతే. సప్తగ్రహణాద్దర్శ పూర్ణమాసౌ సముదాయిత యైకః సంస్కారః సోమ సంబంధాభావా ద్ధవిర్యజ్ఞా ఇతి.

ఆంధ్రవివరణము:—అగ్న్యాధేయము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసలు ఆగ్రయణము చాతుర్మాస్యలు నిరూఢపశుబంధము సౌత్రామణి -అను నీయేడును హవిర్యజ్ఞసంస్థ లని సూత్రార్థము. ఈఅగ్న్యాధేయము మున్నగునవి శ్రుతిప్రసిద్ధము లగునట్టి కర్మలు. శ్రుతిసిద్ధములు అగునియ్యవి సంస్కారములయందు పరిగణింపబడుచున్నవి. ఏడు -అని గణనము చేయుటచేత దర్శపూర్ణమాసలు రెండును కలసి ఒక్క-సంస్కారమేఅని యెఱుంగతగును. సోమసంబంధము ఈసంస్థలకు లేనందున నియ్యవిహవిర్యజ్ఞము లని చెప్పబడుచున్నవి. ఈఏడు హవిర్యజ్ఞములలోను అగ్న్యాధేయము అనగా ఆధానము. అగ్నిహోత్రమనగా హవిర్యజ్ఞమనెడి వేదప్రసిద్ధ మగునట్టి కర్మ. దర్శపూర్ణమాసలు సుప్రసిద్ధములు. ఆగ్రయణ చాతుర్మాస్యాదులు కూడ సుప్రసిద్ధములే.

**295. సూ. అగ్నిష్టోమోత్యగ్నిష్టోమో ఉక్థ్యః షోడశీ వాజపేయోప్తోర్యామోతిరాత్ర ఇతి సప్తసోమసంస్థాః [౧—౮—౨౧]**

హరదత్తమితాక్షరా :—అగ్నిష్టోమఇతి. అగ్నిష్టోమో రాజన్యస్య. షోడశిగ్రహోగృహ్యతేయత్రసోత్యగ్నిష్టోమః బ్రాహ్మణస్య కథమయం సంస్కార ఇతిచింత్యమ్. అన్యే ప్రసిద్ధాః.

ఆంధ్రవివరణము:— అగ్నిష్టోమము అత్యగ్నిష్టోమము ఉక్థ్యము షోడశి వాజపేయము అతిరాత్రము అప్తోర్యామము -అను నీయేడును సోమసంస్థలని సూత్రార్థము, ఇందులో చెప్పినట్టి అగ్నిష్టోమ యాగము క్షత్రియులకు విధింపబడినది. ఇయ్యది బ్రాహ్మణునకెట్టులు విహితమో యెఱుంగరాదని హరదత్తుడు శంకించుచున్నాడు [ కాని ఈవిచారణము స్థలాంతరమున చేయబడును కాన నిటవదలితిమి.] ఇందు చెప్పబడినవన్నియును సోమసంస్థలు. అనగా యజ్ఞములని తాత్పర్యము.

**296. సూ. ఇత్యేతే చత్వారింశత్సంస్కారాః [౧—౮—౨౨] x**

హరదత్తమితాక్షరా:—ఇత్యేతఇతి- ఇతి ఉక్తోపసంహారః, చత్వారింశద్గ్రహణాదేవ తావంతఏవసంస్కారాః, నాన్యానిస్మార్తకర్మాణి కామ్యాదీని చేతి విజ్ఞేయాని.

ఆంధ్రవివరణము:— ఈరీతిగా పైని నిరూపింపబడినట్టి నలుబదియును సంస్కారములని చెప్పబడుచుండునని సూత్రార్థము. సూత్రములో నలుబదియని (చత్వారింశతి) కంఠోక్తిగా చెప్పుటవలననే యివి మాత్రమే సంస్కారశబ్దముచేత చేర్కొనదగినవి కాని తక్కినస్మార్తములగు కామ్యకర్మలు మాత్రము కావని యెఱుంగునది,

297. సూ. అథాష్టావాత్మగుణాః [౧-౮-౨౩.].

హారదత్తమితాక్షరా:—అథేతి. అష్టా వాత్మ గుణాః. వక్ష్యంత ఇతి శేషః.

ఆంధ్రవివరణము.—ఇటు పైని ఎనిమిదివిధములగు నట్టి ఆత్మగుణములను నిరూపించుచున్నాడని భావము.

298. సూ. దయాసర్వ భూతేషు క్షాంతిరనసూయాశౌచ మనాయాసో మంగళ మకార్పణ్యా మస్పృహేతి. [౧-౮-౨౪.]

హారదత్తమితాక్షరా.—దయేతి. శ్లో, ఆత్మవ త్సర్వభూతేషు యద్ధితాయ శివాయచ, వర్తతే సతతం హృష్టః కృత్స్నాహ్యేషా దయాస్మృతా ౧. శ్లో. ఆకృష్టో భిహతోవాపి నక్రోశేన్నచ తాడయేత్. అదుష్టో వాఙ్మనః కాయైః సా తితిక్షా క్షమా స్మృతా. ౨. శ్లో.—యోధర్మ మర్థం కామం చ లభతే మోక్షమేవచ, నద్విష్యాత్తం సదా ప్రాజ్ఞః సానసూయా సదా బుధైః. ౩. శ్లో.—ద్రవ్యశౌచం మనశ్శౌచం వాచికం కాయికం తథా, శౌచం చతుర్విధం ప్రోక్తం ఋషిభి స్తత్వదర్శిభిః. ౪. శ్లో. యదారంభే భవేత్పీడా నిత్యమంతే తథాత్మనః, తద్వర్జ యే ద్ధర్మ్యమపి సోనాయాసః ప్రకీర్తితః. ౫. శ్లో. ప్రశస్తాచరణం నిత్యం అప్రశస్తవర్జనమ్, ఏతద్ధి మంగళంనామ మునిభి స్తత్వదర్శిభిః. ౬. శ్లో. —ఆపద్యపిచ కష్టాయాం భవేద్దీనో న కస్యచిత్, సంవిభాగరుచిశ్చస్యాత్ త దకార్పణ్య ముచ్యతే. ౭.శ్లో.—వివర్జయే దసంతోషం విషయేషు సదా నరః, పరద్రవ్యాభిలాషంచ సాస్పృహా కథ్యతే బుధైః. ౮ ఇత్యుక్తప్రకారేణాష్టా వాత్మగుణాః, అథశబ్దోత్ర సంభావనాయాం ప్రయుక్త ఇతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము—వెనుకటిసూత్రమునందు చెప్పబడినట్టి ఎన్మిది ఆత్మగుణములను ప్రస్తుతము ఈసూత్రమునందు వివరించుచున్నాడు. (౧) సర్వభూతములయందును దయగలిగి యుండుటయును (౨) క్షాంతి గల్గియుండుటయును (౩) అనసూయయును (౪) శౌచముగల్గి యుండుటయును (౫) అనాయాసము గల్గియుండుటయును (౬) మంగళము గల్గియుండుటయును (౭) కార్పణ్యము లేక యుండుటయును (౮) అస్పృహుడై మెలంగుటయును—అను నీయెనిమిదియును ఆత్మగుణము లని చెప్పబడుచుండు నని సూత్రార్థము. ఈ చెప్పినట్టి ఎన్మిది ఆత్మగుణములయొక్కయు (అనగా దయాక్షాంత్యనసూయా శౌచానాయాస మంగళాకార్పణ్యములయొక్క) స్వరూపము ఈ క్రింద వివరింపబడుచున్నది.

౧ దయ — సమస్తభూతముల యెడలను ఆత్మవంతుడై [అనగా సమస్తభూతములును తన వలెనే ఈశ్వరునియొక్క అనుగ్రహమునకు అర్హము లనియును వానియెడ నెల్లడను ఈశ్వరుని మూర్తి ప్రతిఫలించు ననియును గనుకొని, సమస్తభూతముల ఈశ్వరమయములనుగా తలంచి వానికిహితమును శుభమును కల్గుటకొఱకై ఎవ్వడు వర్తించుచున్నాడో, సుఖదుఃఖముల రెండింటియందును హృష్టుడై మెలంగునో, అట్టి యీగుణజాలమంతయును దయయని పెద్దలచేత చెప్పబడుచుండు నని భావము.

౨ క్షాంతి—లేక క్షమ—ఎవ్వడుతాను శత్రువర్గము మున్నగువారిచేత(లాగబడుచున్నను) ఆకృష్టు డగుచుండియును, కొట్టబడుచు నుండియును ఏవిధమైన ఆక్రోశములను పల్కకయుండునో, తిరిగి వారిని కొట్టకయుండునో, మఱియును అట్టివారియెడ వాచా మనసా కర్మణా వాపి—దుష్టభావము ఏమాత్రము కూడ లేక యుండునో—ఇట్టి గుణమెయ్యదిగలదో, అయ్య

డియే క్షాంతియని గాని క్షమయని గాని యన బడును.

3 అనసూయ—ఎవ్వాడు ధర్మమును అర్థమును కామమును మోక్షమును పొందగోరుచు సంభవించినంతవఱకును వీనిలో—అనగా ధర్మార్థకామమోక్షములను నాలుగు పురుషార్థముల లోను— దేనియందును ద్వేషము నుంచికొనక సమబుద్ధితో ప్రాజ్ఞుడై వర్తించుచుండునో, అట్టి వానివర్తనమే అనసూయ యనబడును.

౪. శౌచము—ద్రవ్యశౌచము మనశ్శౌచము వాక్శౌచము కాయశౌచము—అని శౌచము నాల్గువిధములు అని తత్వదర్శులగు ఋషులచే జెప్పబడి యున్నది. ఈనాల్గు విధములగు శౌచములను గల్గియుండుటయును ఇచట శౌచము అను మాటచేత గ్రహింపబడుచున్నది.

౫. అనాయాసము—ఏకార్యము ధర్మశాస్త్రవిహితమైనదయ్యును, ఆచరణకాలమునందు తనకును నితరులకును గూడ అత్యంతములయందు పీడాకరముగ నుండునో అట్టికార్యమును వెంటనే వదలిపెట్టుటయే అనాయాస మని చెప్పబడుచునుండును.

౬. మంగళము—సర్వదా అత్యంతము ప్రశస్తము లగునట్టి కార్యములను చేయుటయును అప్రశస్తములగు కార్యములను వదలివేయుట యును అను నీరెంటను మంగళములే యని తత్వదర్శకులగు మునులచేత జెప్పబడి యున్నది. ఇట్టిదియే మంగళము అనదగినది కూడను.

౭. అకార్పణ్యము—ఆపదలు వచ్చి అలమికొన్నను, ఘోరములగు కష్టములు సంభవించినను దేనికిని దీనుడుగాక సంవిభాగరుచియై యుండుటయే అకార్పణ్య మని యనఁబడును.

౮. అస్పృహ— విషయములను ఇంకను అనుభవింపవలెను అని ఎప్పటికిని తృప్తినొందక యుండుట వదలిపెట్టుటయును, (అనగా విషయాతృప్తిని వీడుటయును) పరద్రవ్యాభిలాష లేక యుండుటయును అనునియ్యవి కల్గియుండుటయే అస్పృహయని యనబడును.

విశేషాంశములు — మస్కరీయ భాష్యము నందు ఈఎనిమిదివిధములగు ఆత్మగుణములకును కల్గునట్టి ఉత్తమోత్తమములగు ఫలములు ఇట్లు లు వివరింపబడి యున్నవి. శ్లో. క్షమావాన్ జయతే భూమిం దయావా న్సుఖ మశ్నుతే, అనసూయ ల్లభేత్స్వర్గం శౌచేనాధ్యాత్మమేవచ, మంగళాదపి సంపూజ్యః ఇహలోకే పరత్రచ, సురసామ్య మనాయాసా దకార్పణ్యా త్ప్రకృతౌ లయమ్. అస్పృహో లభతే నిత్య మనంతం సుఖ మేవ చ, సర్వైస్తు బ్రహ్మణః సంస్కారైస్తు తథైవ చ—ఇతి. ఈశ్లోకముల కర్థమిది—క్షమగలవాడు భూమిని జయింపగల్గుచున్నాడు. దయగలవాడు సుఖమును అనుభవించుచున్నాడు. అనసూయుడు స్వర్గమును పొందగలవాడగుచున్నాడు. శౌచముచేత అధ్యాత్మమును పొందగల్గుచున్నాడు. మంగళము వలన నుభయలోకములను పూజింపతగినవా డగుచున్నాడు. అనాయాసమువలన దేవతాసామ్యమును పొందుచున్నాడు. అకార్పణ్యమువలన ప్రకృతియందు లీనుడు కాగల్గుచున్నాడు. అస్పృహుడగువాడు ఎల్లప్పుడును అనంతమగు స్వర్గమును పొందుచు

న్నాడు. మొత్తమున నీ ఆరింటిచేతను గూడు వాడు బ్రహ్మమును పొందగల్గుచున్నాడు. అని.

29౯. సూ. యస్యైతే చత్వారింశ త్సంస్కా
రా నచాష్టావాత్మ గుణా నస బ్రహ్మణ
స్సాయుజ్యం సాలోక్యం గచ్ఛతి.
[౧-౮-౨౪.]

హరదత్తమితాక్షరా.—ఏషా ముత్కర్ష మాహ-యస్యేతి. సాలోక్యం సమానలోకవాసిత్వమ్. ఏకదేశ సంయోగా త్సాలోక్యం సమస్తయోగా త్సాయుజ్యమితి.

ఆంధ్రవివరణము—ఈ ఆత్మగుణముల యొక్క ఉత్కర్షమును (అనగా ఆధిక్యమును) వివరించుచున్నాడు. ఎవ్వనికి ఈవెనుకటి సూత్రములందు వివరింపబడినట్టి నలుబది సంస్కారములుండియును, ఎన్మిదియగు ఆత్మగుణములు లేకయుండునో, అట్టివాడు [ఆత్మగుణములు కలిగియున్నందులకు ఫలములుగా చెప్పబడినట్టి] బ్రహ్మ యొక్క సాయుజ్యమున్నూ పొందజాలడు. సాలోక్యమున్నూ పొందజాలడు అనిభావము. సాలోక్యమనగా సమానలోకమునందు వసించియుండుట. ఈ ఆత్మగుణములలో ఏకదేశము కల్గినందువలన సాలోక్యమును, సమస్తమును పొందినందువలన సాయుజ్యమును పొందు నని వైశిష్ట్యమును గ్రహించునది.

300. సూ. యస్యతుఖలు సంస్కారాణామే
కదేశోపి అష్టావాత్మగుణాః అథస బ్రహ్మ
ణః సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతి
గచ్ఛతీతి. [౧-౮-౨౫.]

హరదత్తమితాక్షరా. —యస్యత్వితి. తు శబ్దో విశేషవాచీ. ఖలు శబ్దః ప్రసిద్ధౌ. యస్య చత్వారింశత్సంస్కారేషు ద్విజత్వమూల కతిపయసంస్కారసంబంధే ప్యష్టా వాత్మగుణా స్సంతి. అథశబ్దో నిర్ధారణే. బ్రహ్మణ స్సాయుజ్యం సాలోక్యం చ గచ్ఛత్యేవ.

ఇతి శ్రీహరదత్త విరచితాయాం గౌతమసూత్ర వివృతౌ మితాక్షరాయాం అష్టమోధ్యాయః.

ఆంధ్రవివరణము.—ఎవ్వనికి ఈ చెప్పబడినట్టి చత్వారింశత్సంస్కారములలోనూ బ్రాహ్మణత్వమూలకము లగు ఏకొన్ని సంస్కారములతోనో సంబంధ మున్నప్పటికిని, ఎన్మిదగు ఆత్మగుణములు పూర్ణములై యుండునో, అట్టివాడు బ్రహ్మయొక్క సాయుజ్యమునున్నూ సాలోక్యమునున్నూ పొందుచున్నాడు. తప్పక పొందుచున్నాడు. అని సూత్రార్థము.

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును యజశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుడు అధిగత కావ్యతీర్థ బిరుదుడును పంచాగ్ని వంశ్యుడును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమ ధర్మ సూత్రముల ఆంధ్రవివరణమునందు ప్రథమ ప్రశ్నమునందు ఎన్మిదవ దగు నధ్యాయము.

నవమాధ్యాయప్రారంభము.

301. సూ. స విధిపూర్వకం స్నాత్వా భార్యా
మధిగమ్య యథోక్తా న్గృహస్థధర్మాన్
ప్రయుంజాన ఇమాని వ్రతాన్య
నుకర్షేత్. [౧-౯-౧.]

హరదత్తమితాక్షరా. —సవిధిపూర్వక మితి—తచ్ఛబ్దేన పూర్వాధ్యాయోక్తౌ రాజా, బ్రాహ్మణశ్చ పరామృశ్యతే. వైశ్యస్యతు స్నాతకవిషయే విశేషంవక్ష్యతి. విధిపూర్వం విధిం పురస్కృత్య స్నాత్వా వేదవ్రతాని పారం నీత్వా సమావర్తనం కృత్వా భార్యామధిగమ్య వివాహం కృత్వా తదనంతరం యథోక్తా నతిథిపూజాదిగృహస్థధర్మాననుతిష్ఠన్ ఇమాన్యపి వక్ష్యమాణాని వ్రతాన్యనుకర్షేదాత్మానం ప్రాపయే దనుతిష్ఠేదిత్యర్థః. అనుకుర్యా దిత్యపి పాఠోస్తి తస్మిన్న ప్యయమే వార్థః.

ఆంధ్రవివరణము — వెనుకటి ప్రకరణమునందు పేర్కొనబడినట్టి రాజును బ్రాహ్మణుడును విధిపూర్వకముగా వేదవ్రతమును గడిపి అనగా సమావర్తనమును చేసికొని ఆపైని భార్యను అధిగమించి (అనగా పెండ్లిచేసికొని) ఆ పిమ్మట ఇదివఱలో చెప్పినట్టి అతిథి పూజాదులగు గృహస్థధర్మములను అనుష్ఠించుచు ఈపైని చెప్పబోవునట్టి వ్రతములను కూడ తాను యావజ్జీవమును ఆచరింపవలయు నని సూత్రార్థము.

302. సూ. స్నాతకః. [౧-౯-౨.]

హారదత్తమితాక్షరా—స్నాతక ఇతి, చకారోత్ర ద్రష్టవ్యః. స్నాతకశ్చైతాని గృహస్థవ్రతాన్యను తిష్ఠేత్. బ్రహ్మచర్యాన్నివృత్తత్వా ద్గార్హస్థ్య వ్యతిరిక్తాశ్రమాంతరాభావాచ్చ భార్యాధిగమా దూర్ధ్వమితి పూర్వసూత్ర మారబ్ధమ్. స్నాతకస్యతు భార్యాధిగమాసంభవే యావజ్జీవం గృహస్థధర్మా ఏవానుష్ఠేయాఇతి సూత్రమారబ్ధమ్. ఏతచ్చ రాజబ్రాహ్మణయోరేవ స్నాతకవ్రతానుష్ఠానం తదతిక్రమే ప్రాయశ్చిత్తంచ విధీయతే, తథాచ స్మృత్యంతరమ్—రాజబ్రాహ్మణయోరేవ నేతరేషాం కథంచ నేతి.

ఆంధ్రవివరణము—స్నాతకు డగునట్టి (బ్రాహ్మణుడును క్షత్రియును కూడ) వాడుకూడ ఈ గృహస్థవ్రతములను ఆచరింపవలయు నని సూత్రార్థము. స్నాతకుడు బ్రహ్మచర్యము నుండి నివృత్తుడై యుండుటవలనను, అట్టివానికి తదనంతరము కాదగినది ఒక్క గార్హస్థ్యము తప్ప, తద్వ్యతిరిక్తమైనది లేకపోవుటవలనను, వెనుకటిసూత్రమునందు (భార్యను అధిగమించినపిమ్మట) భార్యాధిగమాదూర్ధ్వం అని ఈమున్నగురీతి పూర్వసూత్రమారంభింపబడినది. అయితే ఈసూత్రమెందులకందురేని, స్నాతకునికి ఒకవేళ భార్యాధిగమము సంభవింపకున్నను, అతడుయావజ్జీవమును గృహస్థధర్మములనే అనుష్ఠింపవలయునని సూచించుటకని యెఱుంగవలయును. మఱియు నీ స్నాతకవ్రతానుష్ఠానము రాజన్యునకును బ్రాహ్మణునకు మాత్రమే విధింపబడినది. దీనిని అతిక్రమించినచో ప్రాయశ్చిత్తముకూడ కలదు. ఇయ్యది రాజబ్రాహ్మణులకేగాని ఇతరుల కెంతమాత్రము కాదు అని తాత్పర్యము.

303. సూ. నిత్యం శుచిస్సుగంధి స్నానశీలః [౧-౯-3.]

హారదత్తమితాక్షరా—కాని పునస్తానీత్యాహ-నిత్యమితి. ఆచమనాదినా నిత్యం శుచిః శక్తివిషయే నముహూర్తమ ప్యప్రయతస్స్యాత్. సుగంధిశ్చందనాద్యనులిప్తేన సురభితాంగః, యద్వా గంధశ్శీలం సుశీలస్స్యాదితి. స్నానశీలో నిత్య స్నాయీ స్యాత్. అత్రస్నాతకవిషయే వసిష్ఠః. శ్లో—స్నాతకానాంతు నిత్యం స్యా దంతర్వాసస్తథోత్తరం, యజ్ఞోపవీతే ద్వేయష్టిః సోదకశ్చ కమండలుః ఇతి. మనుః—శ్లో. వైష్ణవీం ధారయే ద్యష్టిం సోదకంచ కమండలుమ్. యజ్ఞోపవీతం వేదంచ, శుభేరౌక్మేచ కుండలే. ఇతి. వేపో దర్భముష్టిః.

ఆంధ్రవివరణము—ఆస్నాతకుడు చేయవలసిన వ్రతముల వివరించుచున్నాడు. ప్రతినిత్యమును శుచియై, అనగా నాచమనాదులచేత సర్వదా శుచియైయుండుచు, (శక్తియున్నచో ఒకముహూర్తమైన నశుచి కారాదు.) చందనము మున్నగు పరిమళద్రవ్యములను పూసికొనుటచేత సుగంధియగుచు, ప్రతిదినమును స్నానముచేయునట్టి స్వభావము కలవాడై, గృహస్థుడును స్నాతకుడును ఒప్పుచుండవలయు నని సూత్రార్థము.

ఇచ్చట స్నాతకుని విషయమునందు వసిష్ఠుడు చెప్పుచున్నాడు.—(స్నాతకులగువ్వారు సర్వ

దా అంతర్వస్త్రమును ఉత్తరవస్త్రమును రెండు యజ్ఞోపవీతములును ఒక యష్టియును సోదకమగు కమండలువును ధరించి యుండవలయును' అని. మనువుకూడ చెప్పినాడు—వైణ్ణవియగు యష్టిని సోదకమగు కమండలువును యజ్ఞోపవీతమును దర్భముష్టిని శుభములగునట్టి వెండికుండలములను ఆయన ధరించి యుండవలయు నని భావము.

విశేషాంశములు.—ఇచ్చట, సుగంధస్నానశీలః-అని సమానపదముగా మస్కరీయ భాష్యమునం దున్నది. సుగంధస్నానము చేయునట్టి శీలముకలవాడుగానుండవలయునని అర్థమును వ్రాసి, సుగంధస్నాన మనగా-ఆమలకాదులచేత అనగా ఉసిరికనూనె మున్నగువానితో చేయునట్టి స్నానమని వివరించినాడు. వైణ్ణవీంధారయేద్యష్టిం అను శ్లోకము ఇప్పుడు ముద్రితములైన మనుస్మృతులలో నా తెలిసినంతదనుక కాన వచ్చుటలేదు.

304. సూ. సతివిభవే న జీర్ణమలవద్వాసాస్స్యాత్. [౧-౯-౪.]

హారదత్తమితాక్షరా — సతివిభవఇతి. విభవే అన్యస్యసంభవేసతి జీర్ణం మలవచ్చ వాసో న ధారయేత్.

ఆంధ్రవివరణము.—తగునట్టి విభవమున్నచో, జీర్ణమై (అనగా చినిగిపోయి) మలవంతమై యుండెడి వస్త్రములను ధరింపరా దని భావము.

305. సూ. నరక్తముల్బణ మన్యధృతం వాసో బిభృయాత్. [౧-౯-౫.]

హారదత్తమితాక్షరా—నరక్తమితి. కుసుంభాది రాగయుక్తముల్బణం బహుమూల్య మన్య ధృతం గురువర్జమన్యైః పూర్వధృత మేవంవిధాని వాసాంసి న ధారయేత్, సతివిభవ ఇత్యను వర్తతే.

ఆంధ్రవివరణము.— తగునట్టి విభవములున్నచో కుసుంభము మున్నగు రంగులతో అద్దినట్టి వస్త్రములనుగాని, చాల వెలగలిగి కన్ను కోరగించునట్టి వస్త్రమునుగాని ఆతడు [అనగా గృహస్థుడును స్నాతకుడును] ధరింపగా రా దని తాత్పర్యము.

306. సూ. నస్రగుపానహౌ. [౧-౯-౬.]

హారదత్తమితాక్షరా.—నేతి. స్రగుపానహౌ అన్యధృతే న ధారయేత్.

ఆంధ్రవివరణము.— మఱియును అన్యధృతములగునట్టి పుష్పమాలికలనుగాని పాదుకలనుగాని ధరింపగా రాదు.

307. సూ. నిర్ణిక్తమశక్తౌ. [౧-౯-౭.]

హారదత్తమితాక్షరా—నిర్ణిక్తమితి. అన్యస్యాలాభేఽశక్తౌ, అశక్తావన్యధృతం వాసః స్రగుపానహౌ చ నిర్ణిజ్య ధారయేత్ తత్ర వాసో నిర్ణేజనం ఊషరోదకే పక్వం కార్యమ్.

ఆంధ్రవివరణము —ఇతరమగునట్టిది దొరకనప్పుడు ఇతరులు ధరించినట్టి వస్త్రములు మాలికలు మున్నగు వానినికూడ నిర్ణేజనముచేసి ధరింపగా వచ్చును. ఊషరోదకమునందు పక్వము జేయుటయే వస్త్రములకు నిర్ణేజన మనబడును.

308. సూ. నరూఢశ్మశ్రురకస్మాత్. [౧-౯-౮.]

హారదత్తమితాక్షరా—నరూఢశ్మశ్రురితి. శ్మశ్రుగ్రహణం నఖాదీనా మప్యుపలక్షణార్థమ్. అకారణాన్నరూఢశ్మశ్రుః స్యాత్. కారణేసతి రూఢశ్మశ్రుస్స్యాత్. కారణంతుస్మృత్యంతరేవిహితమ్—శ్లో. షష్ఠాబ్దే షోడశాబ్దే చ వివాహాబ్దే తథైవ చ, అంతర్వత్న్యాం చ జాయాయాం క్షౌరకర్మ వివర్జయేత్—ఇతి. వపనస్యాపి గంగాయాం భాస్కరక్షేత్ర ఇత్యాదినా చోదితకాలత్వాత్కథం తర్హిస్యాత్తత్ర మనుః,క్లుప్తకేశనఖశ్మశ్రురితి కల్పనాకర్తనేన సమీకరణమ్. యాజ్ఞవల్క్యశ్చ—శ్లో. శుక్లాంబరధరోనీచకేశశ్మశ్రునఖ శ్శుచి రితి.

ఆంధ్రవివరణము.—రూఢశ్మశ్రువై యుండ రాదని సూత్రార్థము. మఱియును అతడు అకస్మాత్తుగా రూఢశ్మశ్రువుగా [అనగా గడ్డములు మీసములను మున్నగువానిని పెంచుకొనగా] రాదనుటకు కారణము ఇతర స్మృతులలో చెప్పబడియున్నది — ఆరవయేటను పదునారవ యేటను వివాహమైనట్టి యేడును, భార్య గర్భిణి గానున్నప్పుడును గృహస్థుడు క్షురకర్మను అనగా క్షౌరమును వర్జింపవలయును. అయితే ఈ కాలములందే 'గంగాయాం భాస్కరక్షేత్రే' అను విధివిహితకాలము గూడ సంభవించినచో ఎట్టులు- అని శంక రాగా మనువుచెప్పినాడు.—క్లుప్త కేశ నఖశ్మశ్రుః అనుమాట కత్తెరతో సమీకరించుట కగును.యాజ్ఞవల్క్యుడుగూడ— శుక్లాంబరధరుడును నీచ కేశశ్మశ్రునఖుడును శుచియును నై యుండవలయును అని చెప్పెను.

విశేషాంశములు.— ఈసూత్రమున ఆధునికులగు నవీనవ్యాఖ్యాతలు భిన్నముగ నర్థములు సెప్పుచున్నారు. రూఢశ్మశ్రు శబ్దమునకు క్లుప్త పదమునకు ఉశనుడు చెప్పినట్టులుగాగ కేశములు నఖములు మీసములు మున్నగువానిని నిర్మలములగునట్లును మృదువులుగ నుండునట్లును పెంచి సుగంధసంయుతములుగా చేయదగు నని యర్థమనియును, దానివలన మీసములుంచుకొనుట శిష్టాచార సమ్మతమే యనియును, వారి భావమైయున్నది. కాని ఎంతవఱకు ఇది శిష్టసమ్మతమో తెలియరాదు.

309. సూ. నాగ్నిమపశ్చయుగపద్ధారయేత్. [౧-౯-౯.]

హరదత్తమితాక్షరా.... నేతి. ఏకేన హస్తేనాగ్నిం అపరే ణాపశ్చ యుగప న్న ధారయేత్.అత్ర వ్యాఘ్రో విశేష మాహ —శ్లో. న ధారయే దప శ్చాగ్ని మప శ్చాన్నం తథైవచ, యుగపత్స్నాతకో నిత్యమ్ తద్భార్యాపి తథైవచేతి.

ఆంధ్రవివరణము — అగ్నిని ఉదకమును నొక్కమారుగా ధరింపరా దని సూత్రార్థము. అనగా ఏకకాలమునందు ఒక చేతితో అగ్నిని, వేరొక చేతితో నీటిని, ధరింపరా దని తాత్పర్యము. ఈ విషయమునందు వ్యాఘ్రుడు ఆధిక్యమును చెప్పుచున్నాడు—స్నాతకుడును ఆతని భార్యయును, ఏకకాలమున నీటిని అగ్నిని గాని, అన్నమును నీటినిగాని, ధరింపగా రాదు అని తాత్పర్యము.

310. సూ. నాంజలినాపిబేత్. [౧-౯-౧౦.]

హరదత్తమితాక్షరా... నాంజలినేతి. యత్కించి త్క్షీరాది పేయమంజలినాన పిబేత్,సంయుక్తౌ హస్తావంజలిః

ఆంధ్రవివరణము — పాలు మున్నగునట్టి పేయపదార్థమును దోసిలితో త్రాగరాదని భావము. ఈ నిషేధము నీళ్లు మున్నగువానికే యని పాలకులే దని మస్కరి భాష్యమునందు వ్రాసినాడు. కారణమేమనగా వెనుకటి సూత్రమునందు నాగ్నిమపశ్చ—అని విసమాసము చేయుటచేత ఇట్టి యర్థము వచ్చు నని చెప్పెను. కాని ఇది శిష్టవిగర్హితము.

311. సూ. నతిష్ఠ న్నుద్ధృతోదకేనాచామేత్. [౧-౯-౧౧.]

హరదత్తమితాక్షరా.—నతిష్ఠన్నితి. ఉద్ధృతోదకేన తిష్ఠ న్నాచామేత్. ఆసీనఏవ ఆచామేత్. ఉద్ధృతోదకేనేతి వచనాత్తటాకాదిషు తీరప్రదేశస్య అశుచిత్వే జానుదఘ్నే జలే తిష్ఠతో ప్యాచమన మప్రతిషిద్ధమ్. ఆచారో ప్యేవమేవ శిష్టానామ్,

ఆంధ్రవివరణము—దేనిచేత ఉదకము ఉద్ధరింపబడునో, అయ్యది ఉద్ధృతోదక మనబడును. అనగా ఇచ్చట అంజలితోనని భావము. ఉద్ధృతోదకముగ నిలుచుండి ఆచమనము చేయగా రా దని భావము. అనగా కూర్చుండియే ఆచమనము చేయవలయును. ఇచ్చట ఉద్ధృతోదకేన - అన్నమాటచేత ఈ నిషేధవాక్యము ఇండ్లు మున్నగు స్థలములలో అనుష్ఠానము చేయునప్పుడేగాని చెరువులు మున్నగు వానిలో తీరము అపరిశుద్ధముగా నున్నప్పుడు మోకాలు బంటిలోతు నీటిలో నిలుచుండి ఆచమనము చేయునట్టి విషయమునగాదని యెఱుంగునది.

విశేషాంశములు — ఇచ్చట మస్కరీయ భాష్యమునందు నతిష్ఠన్ అన్నంతవరకు ఒక సూత్రముగాను, ఉద్ధృతోదకే నాచామేత్ అన్నంతవఱకును వేరొక సూత్రముగాను విడదీసి— నతిష్ఠన్నిపిబేత్-క్షీరాదులనైనను సరియే నిలుచుండి త్రావగారాదు అని యొక దానికి యర్థమును 'ఉద్ధృతోదకముతో (అనగా కమండలువుతో) ఆచమించవలయును' అని వేఱొక సూత్రమునకు నర్థమును వ్రాసిరి.

312. సూ. నశూద్రాశుచ్యేకపాణ్యావర్జితేన. [౧-౯-౧౨.]

హరదత్తమితాక్షరా.—న శూద్రాశుచీతి. శూద్రేణ శుచినా ప్యస్పృశ్యస్పర్శాది దూషితేన ద్విజేనాప్యేకేన పాణినా చ యదావర్జితం తేనోదకేన న ఆచామేత్. స్వయంతు వామహస్తావర్జితే నోదకేన. ఆచమనవిషయ ఏకపాణ్యావర్జితత్వం సమాన మితిచేన్న. హస్తద్వయ స్యాప్యాచమన కర్మ సంబంధా త్తథా శిష్టాచారదర్శనాత్తు.

ఆంధ్రవివరణము—శూద్రునిచేతను, అస్పృశ్యస్పర్శాదులచేత దూషితుడైనట్టి ద్విజునిచేతను,ఒంటిచేతితోను, తీసికొని రాబడి ఉంచబడినట్టి ఉదకము చేతను ఆచమింపగా రాదని సూత్రార్థము.ఇచ్చట ఏకపాణ్యాచమన నిషేధము-తాను స్వయముగా తన ఎడమచేతితో వంచుకొనినచో లేదని యెఱుంగునది. ఆయితే ఆచమన విషయములో ఏకపాణ్యావర్జితత్వము సమానమేగదా యన్నచో కాదు. ఏమనగా రెండు చేతులకును ఆచమనకర్మతో సంబంధ ముండుట వలనను శిష్టాచారముకూడ అట్టులనే యుండుట వల్లను అని యెఱుంగవలయు నని భావము.

విశేషాంశములు— ఇచ్చట అప్రాప్తమైన దానిని ప్రతిషేధమును చెప్పుటవలన వెనుకటి సూత్రమునకు నియమాభావమును జ్ఞాపకము చేయుచున్నదనియును, దానిచే అర్థమునందు— కమండలువు చేతగాని శూద్రునిచేతగాని శుచియైన ఉభయ హస్తావర్జిత మైనట్టి దానిచేతగాని ఆచమింప వలయు నని వికల్ప మేర్పడుచున్నది. కాబట్టి కమండలువుతోనే ఆచరింపవలయునన్న నియమము లేనందున ఆకమండలువును ధరించుట కూడ నియమహితముకాదని తేలుచున్న దని తాత్పర్యము.

313. సూ. నవాయ్వగ్నివిప్రాది త్యాపోదేవతాగాశ్చ ప్రతిపశ్యన్వామూత్ర పురీషామేధ్యాన్య్వదస్యేత్. [౧-౯-౧౩.]

హరదత్తమితాక్షరా. — నేతి. అప్సద్వాంతే ద్వంద్వ ఆర్షత్వా త్సమాసాంతో నకృతః. అనిత్య త్వాస్సమాసాంతా ఇతికేషాం చిత్పక్షః. దేవతాః ప్రతిమాః వాయ్వాదీన్ప్రతి మూత్రాదీని నకుర్యాదస్యే త్పశ్యన్వా న కుర్యాదితి ప్రతి

317. సూ. నమ్లేచ్ఛాశుచ్యధార్మికై స్సహ సంభాషేత. [౧-౯-౧౭.]

హరదత్తమితాక్షరా—నమ్లేచ్ఛేతి. వర్ణాశ్రమ ధర్మరహితే దేశే సింహళద్వీపాదౌ యేవసంతి తే మ్లేచ్ఛాః. అశుచయః ఆర్యాఅపి విహితాని సంధ్యావందనాని యే నకుర్వంతి తే తథోక్తాః, అధార్మికాః పతితాదయః తైస్సహన సంభాషేత. సంశబ్ద ప్రయోగా దేవసిద్ధే సహగ్రహణం తైస్సహైకకార్యభూత్వాన సంభాషేతేత్యేవమర్థం, తేన మార్గ ప్రశ్నాదౌ న దోషః

ఆంధ్రవివరణము—బ్రాహ్మణాది వర్ణధర్మములును బ్రహ్మచర్యాదులగు ఆశ్రమధర్మములును లేనియట్టి సింహళద్వీపము మొదలగు దేశములయందు ఎవ్వరు వసించుచుందురో, వారు మ్లేచ్ఛలని యనఁబడుదురు. ఆర్యులయ్యును తమకు నిత్యములుగా విహితములైనట్టి సంధ్యావందనము మొదలగు వానిని ఎవ్వరు చేయక యుందురో వారు అశుచులు. (అనగా అపవిత్రులు.) ధర్మము నుల్లంఘించి చరించి అధఃపతనము నొందినట్టి పతితులు మొదలగువారు అధార్మికులు. మ్లేచ్ఛులు అశుచులు అధార్మికులు—అగువారితో కూడా కలసి మెలసి సంభాషింపగారాదు అని సూత్రార్థము. ఇచ్చట మూలమునందు న సంభాషేత—అని సం అను ఉపసర్గను చేర్చుట చేతనే సహగ్రహణము సిద్ధించుచుండగా మఱల సహ—అని సహశబ్దమును వాడుటచేత పైని పేర్కొన్నవారితో ఏకకార్యులుగానుండి భాషించిన నే దోషముగాని, మార్గము మున్నగువానిని గుఱించిన ప్రశ్నములు మున్నగునవి చేయు నంతమాత్రముచేత నేమియు దోసగురాదని భావము.

విశేషాంశములు—ఇచ్చట మస్కరీయభాష్యమునందు మ్లేచ్ఛులనగా పారసీకాదులని అర్థము చెప్పబడినది. ఇట్లె నసంభాషేత యన్నమాటకు నసంమంత్రయేత్—(కలసి ఆలోచనము చేయరాదు) అనియును అర్థము చెప్పబడినది.

318. సూ. సంభాష్య పుణ్యకృతో మనసా ధ్యాయేత్. [౧-౯-౧౮.]

హరదత్తమితాక్షరా—సంభాష్యేతి. యది కారణవశా త్తైస్సహ సంభాషేత తతః పుణ్య కృతో వసిష్ఠాదీన్మనసా ధ్యాయేత్. మనసేతి ధ్యాన స్వభావానువాదః.

ఆంధ్రవివరణము— ఒకవేళ ఎప్పుడైనను అట్టి మ్లేచ్ఛాదులతో సంభాషింపక తప్పనియప్పుడు సంభాషణము ముగియగనే-తద్దోషపరిహారార్థమై పుణ్యకర్తలగు వసిష్ఠుడు మొదలగు నట్టివారిని మనసా ధ్యానము చేయవలయునని సూత్రార్థము.

319. సూ. బ్రాహ్మణేన వా సహ సంభాషేత్. [౧-౯-౧౯.]

హరదత్తమితాక్షరా—బ్రాహ్మణేనేతి. ప్రకరణాద్బ్రాహ్మణోఽపి పుణ్యకృ దేవ.

ఆంధ్రవివరణము—లేనిచో బ్రాహ్మణుడు కూడ పుణ్యకరుడే కావున నట్టి బ్రాహ్మణునితోనైనను సంభాషింపవలయునని సూత్రార్థము. ఇట్లుచేసినచో మ్లేచ్ఛాది సంభాషణజనితమగు పాపము నశించునని భావము.

320. సూ. అధేనుం ధేనుభవ్యేతి బ్రూయాత్. [౧-౯-౨౦.]

హరదత్తమితాక్షరా—అధేనుమితి. ధేనుః పయస్వినీ గౌః, అధేనుస్తద్విపరీతా, తామపి ధేనుభవ్యేతి బ్రూయాన్నపునరధేనురితి.

ఆంధ్రవివరణము— గొడ్డుటావును గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు గూడ ధేనుభవ్య [అనగా చక్కగా పాలిచ్చునట్టిదిగా మునుముందు కాగలది] అనియే సంభాషింపవలయు నని సూత్రార్థము.

321. సూ. అభద్రం భద్రమితి బ్రూయాత్ [౧-౯-౨౧.]

హరదత్తమితాక్షరా—అభద్రమితి. అభద్రమపి వస్తు భద్రమిత్యేవ బ్రూయాత్.

ఆంధ్రవివరణము—అభద్రము [అమంగళకరమై పొందరానిదైనట్టిదై] అగునట్టి వస్తువైనను భద్రము అగునట్టిదే యని సంభాషింపవలయు నని యర్థము.

322. కపాలం భగాలమితి. [౧-౯-౨౨.]

హరదత్తమితాక్షరా—కపాలం బ్రువన్భగాలమితి బ్రూయాత్.

ఆంధ్రవివరణము— కపాల మనగా పగిలిపోయినకుండ బొచ్చెమున్నగునవి ఇట్టిదానిని చెప్పవలసివచ్చినప్పుడు కూడ భగాల మనియే చెప్పవలయును అని సూత్రార్థము.

323. సూ. మణిధను రితి ఇంద్రధనుః. [౧-౯-౨౩]

హరదత్తమితాక్షరా—ఇంద్రధను రితి బ్రువన్మణిధనురితి బ్రూయాత్.

ఆంధ్రవివరణము—ఇంద్రధనుస్సు అనిచెప్పవలసివచ్చినప్పుడును మణిధను వనియే చెప్పవలయు నని భావము.

324 సూ. గాం ధయంతీం పరస్మై నాచక్షీత. [౧-౯-౨౪]

హరదత్తమితాక్షరా—గామితి. ధేట్పానే, వ్యత్యయేనాయం కర్మణి కర్తృప్రత్యయః. వత్సేన ధీయమానాం గాం పరస్మై నాచక్షీత స్వామినే న బ్రూయాత్. యస్య హవిషేవత్స అపాకృతే ధయేయురిత్యాదికే నిమిత్తే తు ఆఖ్యాతవ్యమేవ, సంసృష్టాం చ వత్సే నేత్యాపస్తంబీయే విశేషాత్.

ఆంధ్రవివరణము—దూడ పాలు గుడుచుచున్నప్పుడు—అట్టి ఆవును (అనగా తనదూడకు పాలుకుడుపుకొనుచున్న ఆవును) ఇతరునికి-అనగా యజమానునికి- చెప్పగారాదు ఇయ్యది సామాన్యవిషయము ఇక హవిస్సులు మొదలగు పితృకార్యముల కని దూడను తొలగించి కట్టిన సందర్భములలో ఆవు దూడను కుడుపుకొనుచున్నచో తప్పక చెప్పవలసియే యుండును ఏమనగా ఆపస్తంబుడుకూడ వత్సతో సంసృష్టయైన గోవును అని అధికముగా నర్థమును చెప్పియుండుటవలన నని తెలియుచున్నది.

325. సూ. న చైనాం వారయేత్. [౧-౯-౨౫]

హరదత్తమితాక్షరా—నచేతి. న చ స్వయమప్యేనాం వారయే దితి.

ఆంధ్రవివరణము—పరులకు చెప్పకుండుట మాత్రమేగాక తానుకూడ అట్టిఆవును వారింపగా రాదని భావము.

సూత్రమేలయని యందురేని ఇయ్యది త్రిరాత్ర ముతర్వాతకూడ ఎంతవఱకు స్త్రీకి రజస్సు వెడలుచుండునో అంతదనుకగూడ పురుషుడు ఆవిడతో సంగమింపగారాదని తెల్పుటకని యెఱుంగునది.

విశేషాంశములు—ఇచ్చట మఱికొందఱు వ్యాఖ్యాతలు రజస్వలాశబ్దమునకు కాలముగాని కాలమునందు రజోవతియైన స్త్రీని అర్థముగా చెప్పి అట్టి స్త్రీని పొందగారాదని వ్యాఖ్యానము చేసిరట; ఇట్లు చేసినవ్యాఖ్యానము- రజస్సు యను శబ్దము కాలప్రవృత్తమైనస్త్రీరక్తమునందే చరితార్థమై యుండుటచేతను అట్టిరజస్సే అశుచికరమై యుండుటవలనను సరియైనదికాదని చెప్పుచు మస్కరీయభాష్యమునందు ఇట్టులు ప్రమాణవాక్యములు ఈయబడి యున్నవి—శ్లో. అకాలే యద్భవేత్ స్త్రీణాం రక్తమాహుర్మనీషిణః కాలేతు తద్రజః ప్రోక్తం తస్మాత్తత్రైవ సాశుచిః [స్త్రీలకు అకాలమునందు కల్గెడి స్రావమెయ్యదికలదో దానిని పెద్దలు రక్తమనియే యందురు. కాలమునందు బయలువెడలునది యేది కలదో అయ్యది యే రజస్సు అనబడును. ఆ రజోవస్థయందున్నప్పుడే ఆస్త్రీ అశుచి యగుచున్నదనిభావము.] భార్గవస్మృతిలోకూడ నున్నది- శ్లో. అకాలే యద్భవేత్ స్త్రీణాం శుచి తత్తు వినిర్దిశేత్, అశుద్ధం తద్విజానీయా న్మాసిమాసి భవేత్తు యత్. [స్త్రీలకు అకాలమునగల్గెడి స్రావమెయ్యదిగలదో అది శుచియనియే చెప్పదగును. ఇకను నెలనెలకు వచ్చునట్టి దెయ్యది గలదో అది మాత్రమే అపవిత్రమైన దని యెఱుంగవలయును. అని.]

331. సూ. న చైనాం శ్లిష్యేత్. [౧-౯-౩౧.]

హరదత్తమితాక్షరా—న చేతి. ఏనాం రజస్వలాం న శ్లిష్యే న్నాలింగేత్.

ఆంధ్రవివరణము—ఇట్టి రజస్వల యగునట్టి స్త్రీని ఆలింగనము చేసికొనగా రాదని తాత్పర్యము.

332. న కన్యామ్. [౧-౯-౩౨.]

హరదత్తమితాక్షరా—న కన్యామితి. కన్యాం అనూఢామపి నశ్లిష్యే న్నాలింగేత్.

ఆంధ్రవివరణము—పెండ్లి కానట్టి కన్యకను గూడ నాలింగనము చేసికొనగారాదని సూత్రార్థము. ఇచ్చట మస్కరీయభాష్యమునందు ఉదకపూర్వముగా నీ యబడినను రజోవతికానట్టికన్యను ఆలింగనము చేసికొనరా దనిరి.

334. సూ. అగ్నిముఖోపధమన విగృహ్యావాద బహిర్గంధ మాల్యధారణ పాపీయసావలేఖన భార్యయా సహ భోజనాంజన్త్యవేక్షణ కుద్వార ప్రవేశన పాదపాదధావనా సందీస్థ భోజన నదీబాహుతరణ వృక్షవిషమారోహణావరోహణ ప్రాణ వ్యాయచ్ఛనాని వర్జయేత్.

[౧-౯-౩౩.]

హరదత్తమితాక్షరా—అగ్నీతి. ఉపధమన సముపధ్మానం నాగ్నిం ముఖేనోపధమ్యే న్నజ్వలయేత్ విగృహ్యావాదో వాక్కలహః, గంధమాల్యయోర్బహిర్ధారణమ్ ప్రకాశధారణమితి. అనావిష్కృగను లేపనస్నా ప్రతిషేధః. పాపీయసావలేఖన మశుచినా కాష్ఠాదినా శిరఃప్రభృతేః కండూయనం తృతీయాయాఅలుక్ఛాందసః, భార్యయా సహ భోజనం భార్యయాసహ ఏకస్మిన్భాజనే భోజనం, కేషుచి ద్దేశేష్వాచారాత్ప్రాప్తౌసత్యాంనిషేధః, అన్యే త్వే

కస్మిన్నాకాలే భోజనం సహభోజనమిచ్ఛంతి. అంజంత్యవేక్షణమ్. అంజంతీం తైలాభ్యంగం కుర్వతీం అంజనాదిభి రలంక్రియమాణాం వాతిస్త్ర్యవేక్షణమ్. తస్యాస్తథాత్వే శయనం త్యేకే స్త్రీమాత్రస్య ... ద్వారేణ ప్రవేశనం ద్వారాదన్యతిరిక్తప్రదేశేన ... గృహాదేః ప్రవేశనమప్రసిద్ధమార్గేణ నగరగ్రామాదేః ప్రవేశనమితి. యథాచాపస్తంబః—నచ ... ప్రతిశేతే ... ఇత్యేతా ... పాదపాదధావనం పాదేనపాదస్య ప్రక్షాళనమ్. ఆసందీస్థభోజనమ్, ఆసందీపీఠికా. తత్రస్థాప్యస్య స్వభోజనమాసందీస్థభోజనమ్. యద్వా యత్రాసీనో భుంక్తే తత్రఆసనేభోజనపాత్రం నిధాయ యద్భోజనం తద్వా ఆసందీభోజనమ్. నదీబాహుతరణం బాహుభ్యాం నద్యాస్తరణం ... బాహుతరణాత్ప్లవాదినా ..., వృక్షారోహణం ... మప్యుపలక్షణమ్. వృక్షవిషమారోహణావరోహణే వృక్షస్యారోహణం విషమస్యావరోహణం చ, వృక్షవిషమగ్రహణేన అత్యున్నతనిమ్నస్థలం లక్ష్యతే. ప్రాణవ్యాయచ్ఛనం ప్రాణసంశయకరం ... ద్వ్యధిగాహణమ్. ఏతాన్యగ్నిముఖోపధమనాదీని వర్జయేత్.

ఆంధ్రవివరణము—స్నాతకుడగువాడు (౧) అగ్నిముఖోపధమనము (౨) విగృహ్యవాదము (3) బహిర్గంధమాల్యధారణము (౪) పాపీయసావలేఖనము (౫) భార్యాసహభోజనము (౬) అంజంత్యవేక్షణము (౭) కుద్వారప్రవేశనము (౮) పాదపాదధావనము (౯) అసందీస్థ భోజనము (౧౦) నదీబాహుతరణము [౧౧-౧౨] వృక్షవిషమావరోహణారోహణములు (౧3) ప్రాణవ్యాయచ్ఛనము—అను వీనిని వర్జింపవలయునని సూత్రార్థము. అనగా ఈకార్యములు స్నాతకునికి నిషిద్ధములని తాత్పర్యము.

(౧) అగ్నిముఖోపధమనము—ఉపధమనము అనగా ఊదుట. అగ్నిని ముఖముతో (అనగా నోటితో) నూదుట అనగా జ్వలింపచేయుట అగ్నిముఖోపధమనము అనబడును. ఇయ్యది స్నాతకునికిని గృహస్థునకుగూడ నిషిద్ధమని భావము.

(౨) విగృహ్యవాదము—పెడగాచేయునట్టి వాక్కలహము. విగ్రహణము అనగా ఎదుటివానిమాటలను మరొకతీరున నన్వయించుచు పెనగా వాదించుట. విగ్రహణముతోగూడిన వాదము విగృహ్యవాదము. దీనినే వాక్కలహమని మనవా రందురు. ఇదియు స్నాతకునకు కూడనిపని.

(3) బహిర్గంధమాల్యధారణము—గంధద్రవ్యములను పుష్పమాల్యములను ప్రకాశముగా ధరించుటయే బహిర్గంధమాల్య ధారణము అనబడును. సంస్కృతీయభాష్యమునందు బహిర్గంధమాల్యధారణ మనగా నిర్గంధములగు [అనగా వాసనలేనియట్టి] పూలమాలికలను ధరించుటయని అర్థము వ్రాయబడినది, ఇందులకు ప్రమాణముగా "నాగంధాం స్రజం ధారయేదన్యత్ర హిరణ్య స్రజః"—బంగారుతో చేసిన హారములు మున్నగునవి తప్ప తక్కిన నిర్గంధమగు పుష్పమాలికలను ధరింపగారాదు—అని స్మృతి వాక్యమును ఉదాహృతమైనది.

(౪) పాపీయసావలేఖనమ్—పాపీయమనగా పాపయుక్తమైనట్టి శ్వాదికము. అనగా అశుచి పదార్థములలో బడిన పుడకలు మున్నగునవి. ఇట్టి పాపీయముతో తల వీపు మున్నగునట్టి శారీర భాగములను గోకికొనుట యేదిగలదో అయ్యదియే పాపీయసావలేఖనమని యనబడును. ఇదియును కూడనిపనియే యగును.

(౫) భార్యాసహభోజనము—భార్యతో కూడ కలసి ఒక్కపాత్రములోనే (దంపతులు) భుజించుట భార్యాసహభోజన మనబడుచున్నది. ఇయ్యది కొన్ని దేశములలో ఆచారమై యుండి ఆచరింపవలసినట్టులు తోచుచుండుటవలన నిచ్చట నిషేధింపబడుచున్నది. అనగా దేశతః ఇయ్యది ఆచారమైనను శాస్త్రతః కాదని రూపించుట కిచ్చట ప్రత్యేకముగా పేర్కొనబడుచున్నది. ఇచ్చట మఱికొందఱు భార్యతో ఏకకాలమున (విడివిడిగా) భుజించుటయే సహభోజన మని యందురు. మస్కరీయభాష్యమునందు "అర్థో వా ఏష ఆత్మనో యత్పత్నీ"—[భార్యయనగా తనలో సగభాగమన్నమాట] అను శ్రుతివాక్యముచేత సహభోజనము ప్రాప్తించుచుండగా ప్రతిషేధించుటకై ఇచ్చట చెప్పబడినదని వ్రాసియున్నది.

(౬) అంజంత్యవేక్షణము—అంజన మనగా స్త్రీలు కన్నులకు పెట్టుకొనునట్టి కాటుకకు పేరు. అంజనమును పెట్టుకొను స్త్రీ అంజంతి యనబడును. కొందఱు తైలము మున్నగువానితో చేసికొనెడి (తలంటికిని) అభ్యంజనమునకు అంజనము అనియును అంజనము చేసికొనుచున్న భార్యకు అంజంతి యనియును పేరుఅనిరి. తైలాభ్యంజనము మున్నగువానిని చేసుకొనుచున్నప్పుడు స్త్రీలు వివృతశరీరులై యుందురు గనుక అట్టిస్త్రీని చూచుట పనికిరాదని తెలియదగును. ఇయ్యది కేవలము స్వభార్యవిషయమని కొందఱును స్త్రీమాత్రవిషయ మని కొందఱును భిన్నముగ వ్రాసిరి.

(౭) కుద్వార ప్రవేశనము—దేవాలయములు ఇండ్లు మున్నగువానికి బహిరంగముగా ప్రవేశింపదగినట్టి ద్వారములుగాక అప్రసిద్ధకీతితో [సందులు గొందులు కంతలుగా] నుండు ద్వారములు కుద్వారములని యనబడును. గృహాదులను కుద్వారములద్వారా ప్రవేశించుటయును పనికిరానిపని యని భావము.

(౮) పాదపాదధావనము—ఒకకాలితో మఱియొకకాలిని తోమి ప్రక్షాళనము చేసికొనుటయే పాదపాదధావనము అనబడును.

(౯) ఆసందీస్థ భోజనము—ఆసందియనగా బల్లలు పీటలు మున్నగునవి. ఆసందిపై సన్నము నుంచికొని భోజనముచేయుటయే ఆసందీస్థ భోజనమని యందురు. లేనిచో ఏపీటపైని కూర్చుని భుజింతురో ఆపీటపైననే భోజనపాత్రమును కూడ పెట్టుకొని భోజనము చేయుటయైనగాని ఆసందీస్థ భోజన మని యనబడును.

(౧౦) నదీబాహు తరణము—బాహువులతో (అనగా చేతులతో) నదిని ఈదుకొని దాటుట నదీబాహుతరణ మనబడును. బాహువులతోగాక తెప్పలు మున్నగువానితో దాటుట దోషము కాదు. కేవలము బాహువులతో ఈది దాటుటయే దోష మగును. ఇచ్చట నదీశబ్దము చేత లోతుగల్గి ప్రమాదమును కల్గింపగలట్టి చెరువులు కొలనులు మున్నగునవి యన్నియు గ్రహింపబడును. స్నాతకుడిట్టివానియందు సాహసముతో వర్తింపగూడదని భావము.

[౧౧-౧౨] వృక్షవిషమారోహణావరోహణములు—చెట్లను విషమములగు కొండలు

మున్నగువాని నెక్కుటయును, సొచ్చుతగ్గులు ఒరగడ్డములు గలిగిన త్రోవలు మున్నగువాని లోనికి దిగుటయును కూడ స్నాతకునికి కూడని పనులు. వృక్షవిషయములను దేశవిషయములను గ్రహించుటచేత అత్యంతము నున్నతములగునట్టి ఇతరస్థలములను కూడ నిట్టులనే ఎక్కరాదని యును అత్యంతము లోతుగు స్థలములను కూడ దిగరాదనియును సూచితమగుచున్నయది.

(౧౩) ప్రాణవ్యాయచ్ఛనము—ఊపిరిని బిగబట్టుకొని గోడలు ప్రాకారములు మున్నగు విషమప్రదేశములను దాటుట మున్నగునవి యన్నియును ఇచ్చట ప్రాణవ్యాయచ్ఛనమను మాటచేత గ్రహింపబడును. ప్రాణవ్యాయచ్ఛనముకూడ స్నాతకునికి కూడనిపనియే యని యెఱుంగదగును.

335. సూ. న సంశయ్యం నావ మధి రోహేత్. [౧-౯-౩౩.]

హరదత్తమితాక్షరా—న సంశయ్యా మితి. సంశయగమనే సందిగ్ధాం నావమనేక హేతోః నావం నహ్యాధి తిష్ఠేత్.

ఆంధ్రవివరణము—పడవలు మున్నగునట్టి వానిప్రయాణములను దాటునప్పుడు సందేహమునకు గురియై యున్నట్టివానిని [అనగా పగిలి బ్రద్దలయి పోవునని సందేహమునకు గుఱియై యున్నట్టి ఓడలు మున్నగు నట్టివానిని] ఎక్కరాదని తాత్పర్యము.

336. సూ. సర్వత ఏవాత్మానం గోపాయేత్. [౧-౯-౩౮.]

హరదత్తమితాక్షరా—సర్వత ఏవేతి. సర్వేభ్యః ఉపాయేభ్యః ఆత్మానం గోపయేద్రక్షయేత్. ఏకో న గచ్ఛేదధ్వాన మిత్యాదిభ్యః.

ఆంధ్రవివరణము—సమస్తములగునట్టి ఉపాయములద్వారాను తనను తాను సంరక్షించుకొనవలయునని సూత్రార్థము. అనగా—"ఏకో న గచ్ఛేదధ్వానం—ఒంటరివాడై మార్గమును పయనింపరాదు—అను మున్నగువానిలో చెప్పిన రీతిని తనను తాను సంరక్షించుకొనుచు తిరుగవలెను అని భావము.

విశేషాంశములు—ఇచ్చట మస్కరీయభాష్యమునందు సర్వతః—అన్నమాటకు సమస్తములగు అపాయములనుండియును శరీరమును సంరక్షించుకొనవలయునని యర్థమును చెప్పుచు, సర్వశబ్దగ్రహణముచేత ప్రతిషిద్ధములగు వానిని సేవించకుండుట ద్వారాను, గ్రహశాంత్యాదులను చేయుటద్వారాను ఆత్మసంరక్షణమును చేసికొనవలయునని వ్రాయబడియున్నది. మఱియును ఆత్మానం—అనుమాటకు శరీరము అర్థము అనియును, వానిని వినాశముకాకుండునట్లు రక్షింపవలయుననియును, అర్థమును వ్రాసిరి. మఱికొందఱిమతము ననుసరించి ఆత్మ యన్నమాటచేత—పరమాత్మ క్షేత్రజ్ఞ జీవాత్మ భూతాత్మలను నాల్గువిధములగు ఆత్మలు గ్రహింపబడుననియును చెప్పిరి. ఈనాల్గువిధములగునట్టి ఆత్మస్వరూపములను మనువు ఇట్టులు వివరించినాడు—శ్లో. యోఽస్యాత్మనః కారయితా తం క్షేత్రజ్ఞం ప్రచక్షతే, యఃకరోతితు కర్మాణి సభూతాత్మోచ్యతే బుధైః, జీవసంజ్ఞోఽన్తరాత్మా

య స్సహజః సర్వదేహినామ్, యేన వేదయతే సర్వం సుఖం దుఃఖంచ జన్మసు, ప్రశాసితారం సర్వేషాం అణీయాంస మణోరపి, రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యా త్తం పురుషంపరమ్—అని [ఈ శ్లోకముల యర్థమిది— ఎవ్వడీ శరీరమును కార్యములయందు వర్తింపజేసి పనులచేయించుచున్నాడో; ఆయాత్మను క్షేత్రజ్ఞుడని యందురు. మఱియు నెయ్యది వ్యాపారములను (పాంచభౌతికములగు కార్యములను) చేయుచున్నదో ఆ శరీరము భూతాత్మ యనబడును. దేనిద్వారా ఇది సుఖము ఇది దుఃఖము అని జన్మములయందు తెలిసికొనబడుచున్నదో ఎయ్యది సమస్త దేహధారులకును సహజమై యున్నదో అయ్యది జీవాత్మయనబడును. బ్రహ్మాది స్తంబపర్యంతమగు ఈచేతనాచేతనము నెల్లను ఎయ్యది ప్రశంసించుచున్నదియో, ఎయ్యది అణువుకంటెగూడ నణువై యున్నదో, ఎయ్యది స్వచ్ఛమైన పది యారవవన్నె బంగారమువలె నున్నదియో, ఎయ్యది మనోమాత్రగమ్యమో, అట్టి యాత్మస్వరూపమునే పరమాత్మ యని చెప్పుదు రని భావము.

337. సూ. న ప్రావృత్య శిరోఽహని పర్యటేత్. [౧-౯-౩౫.]

హారదత్తమితాక్షరా—ప్రావృత్యాశిరసో దివా చంక్రమణప్రతిషేధః, అనేనస్యయథారుచి, మార్గే వర్షాతపాదిబాధే ప్రావృత్యాపి చంక్రమణేనదోషః; సర్వతఏవాత్మానం గోపాయేదిత్యుక్తత్వాత్.

ఆంధ్రవివరణము:— పగటిపూట తలనిండ ముసుకువేసుకొని సంచరింపగారాదు అని సూత్రార్థము. ఇయ్యది సంచరించునప్పటి విషయము ఒక్కచోట కూర్చుండునప్పుడు ఇష్టమువచ్చినట్టు లుండవచ్చును. కాని త్రోవను చరించుపట్టులలో వర్షబాధకాని ఎండబాధగాని కల్గినప్పుడు తలనిండ కప్పుకొని సంచరించినను దోసగురాదు. ఏలయనఁగా సర్వత ఏవాత్మానం గోపయేత్తని [336. సూ. చూడు.] అన్నాడుగనుకననిభావము.

338. సూ. ప్రావృత్యతు రాత్రౌ. [౧-౯-౩౬]

హారదత్తమితాక్షరా—ప్రావృత్యేతి. రాత్రౌతు శిరః ప్రావత్యైవ పర్యటేత్.

339. సూ. మూత్రోచ్చారేచ. [౧-౯-౩౭]

హారదత్తమితాక్షరా—మూత్రేతి. మూత్రణం మూత్రమ్. ఉచ్చారః పురీషకర్మ. తయోస్సమాహారద్వంద్వః. తత్రచశిరః ప్రావృత్య ప్రావృతశిరాః కర్మకుర్యాదితి శేషః.

ఆంధ్రవివరణము.—మలమూత్రములను విసర్జించునప్పుడుకూడ ప్రావృత శిరుడయియే- అనగా తలనిండ కప్పుకొనియే- వర్తింపవలయునని సూత్రార్థము.

340. సూ. నభూమావ నంతర్ధాయ [౧-౯-౩౮]

హారదత్తమితాక్షరా—నభూమావితి— మూత్రపురీషకర్మణీ భూమా తృణాదిభి రంతర్ధాయైవ కుర్యాత్. అయజ్ఞియై స్తృణైరితి, స్మృత్యంతరే—భూమిమయజ్ఞియై స్తృణై రాచ్ఛాద్యమూత్రపురీషే కుర్యాత్—ఇతి. అత్రాపి భూమిగ్రహణా దిష్టకాదౌ న దోషఇతిజ్ఞేయమ్.

ఆంధ్రవివరణము.—మూత్ర పురీషకర్మలను చేయునప్పుడు భూమియందు గడ్డి మున్నగు తృణపదార్థములతో సంతర్ధానమును (అడ్డమును) కల్గించుకొని చేయవలయును అని సూత్రార్థము. ఇచ్చట తృణపదార్థములన్న మాటచేత యజ్ఞసంబంధములగునట్టి తృణములు తప్ప తక్కినతృణము

లనియును గ్రహింపదగును. స్మృత్యంతరమునను నిట్టులనే యున్నది—"భూమిని అయజ్ఞాంగము లగు- అనగా యజ్ఞాంగములు కానట్టి వగు- తృణములతో కప్పి దానిపైని మూత్రపురీషములను ఒనర్పదగును"- అని. అందుననుకూడ భూమియందు అని చెప్పుటచేత ఈ నిషేధము ఇటుకలు మున్నగునవి అడ్డుగా నున్న యెడల వర్తింపదని యెఱుంగవలయును. ఈసూత్రము మస్కరీయభాష్యమునందు 42 వ దిగా పఠింపబడినది.

341. సూ. న తిష్ఠన్. [౧-౯-౩౯]

హరదత్తమితాక్షరా— నతిష్ఠన్నితి. తిష్ఠన్నపి న కుర్యా న్మూత్రపురీషకర్మణీ.

ఆంధ్రవివరణము.—భూమియందు అంతర్ధానము నుంచుకొనకయే ఎట్లులు మలమూత్రములను విసర్జింపగారాదో అట్లే నిలుచుండికూడ మూత్రపురీషములను విసర్జింపగారాదని సూత్రార్థము.

విశేషాంశములు.— ఈసూత్రము వ్రాతప్రతులలోను మస్కరీయభాష్యపు ముద్రితప్రతిలోను మాత్రమే కలదు.

342. సూ. నారా చ్చావసథాత్. [౧-౯-౪౦]

హరదత్తమితాక్షరా—అవసథో గృహమ్. తత్సమీపే మూత్రపురీషే న కుర్యాత్,

ఆంధ్రవివరణము— కాపురముండు ఇంటికి చేరువగా మలమూత్రములను విసర్జింపరా దని భావము.

343. సూ. న భస్మకరీష కృష్టచ్ఛాయా పథికాదికామ్యేషు [౧-౯-౪౧]

హరదత్తమితాక్షరా—నభస్మకరీషేతి. కరీషం గోమయమ్. ఛాయోపజీవ్యాః పథికాదయో యత్ర విశ్రామ్యంతి. కామ్యం కమనీయం ప్రదేశం, భస్మాదిష్వేతేషు మూత్రపురీషకర్మణీ న కుర్యాత్.

ఆంధ్రవివరణము— భస్మము అనగా బూడిద. కరీషమనగా ఆవుపేడ మున్నగునది. కృష్టమనగా దున్నినట్టి పొలము. ఛాయ యనగా బాటసారులు మున్నగువారు విశ్రమించునట్టి నీడలుగల తావులు. పంథానములు మార్గములు. కామ్యప్రదేశము లనగా చూచుట కింపుగల్గునట్టి ప్రదేశములు. భస్మమొదలగు ఈ ఆప్రదేశములందును మలమూత్రములను విసర్జింపగారాదని సూత్రార్థము. ఈ సూత్రమునందు కామ్యేషు- అని (కమనీయములగు ప్రదేశములు అని) చెప్పుటచేత ఇతరస్మృతులలో- అనగా వసిష్ఠస్మృత్యాదులలో- నిషేధింపబడినట్టి ప్రదేశములనుగూడ నిందుచేర్చి పఠించుకొన దగునని తేలుచున్నయది. వసిష్ఠస్మృతిలో నిషేధింపబడిన అధికవిషయము లివి "నది యందు మేహనమును చేయరాదు. మార్గమునందును భస్మమునందును గోమయమునందును దున్నిన భూమియందును వెదజెట్టిన చోట్లను పచ్చికగలచోట్లను బాటసారులు మున్నగువారు నీడకై కూర్చుండుచోట్లను మలమూత్రములను చేయగారాదు"- అని.

344. సూ. ఉభే మూత్ర పురీషేతు దివాకుర్యా దుదఙ్ముఖః [౧-౯-౪౨]

హరదత్తమితాక్షరా— ఉభఇతి. మూత్రపురీషే దివాచే దుదఙ్ముఖఏవ కుర్యాత్.

ఆంధ్రవివరణము.— మూత్రపురీషములను రెండింటినిన్ని పగటిపూటనైనచో ఉత్తరదిక్కునకు అభిముఖుడయియే చేయవలయునని సూత్రార్థము.

345. సూ. సంధ్యయోశ్చ. [౧-౯-౪౩]

హరదత్తమితాక్షరా—సంధ్యయోశ్చేతి. ఉదఙ్ముఖః కుర్యాదితి శేషః,

ఆంధ్రవివరణము— సాయం ప్రాతఃకాలములలో సంధిసమయములందును ఉదఙ్ముఖుడై-అనగా ఉత్తరదిక్కునకు అభిముఖుడయియే మలమూత్రములను విడువవలయునని సూత్రార్థము.

346. సూ. రాత్రౌ చేద్దక్షిణాముఖః [౧-౯-౪౪]

హరదత్తమితాక్షరా— రాత్రావితి. రాత్రౌ చేద్దక్షిణాముఖ ఏవ కుర్యాదితి శేషః.

ఆంధ్రవివరణము—రాత్రియందు మలమూత్రముల విసర్జించుట్లైనచో దక్షిణపుదిక్కునకు అభిముఖుడయియే మలమూత్రవిసర్జనమును చేయవలయు నని సూత్రార్థము.

విశేషాంశములు—మస్కరీయభాష్యమునందు ఈ రెండుసూత్రములును (అనగా 345, 346) మూత్రోచ్చారేచ (339. సూ.) అనుసూత్రము తర్వాత వ్యాఖ్యానము చేయబడినవి.

347. సూ. పాలాశ మాసనం పాదుకే దంతధావన మితి చ వర్జయేత్. [౧-౯-౪౫]

హరదత్తమితాక్షరా—పాలాశమితి. ఇతికారా ద్యర్థా ద్విచ్ఛాస్యసేవం యుక్తం రథాది యదపి పాలాశం వర్జయేత్. అత్ర పఠంతి—శ్లో. ఆసనం శయనం యానం గృహోపకరణం తథా, వర్జయేత్పాదుకాం చైవ పాలాశం దంతధావనమ్ — ఇతి.

ఆంధ్రవివరణము—పాలాశ వృక్షసంబద్ధములగు కొయ్యలతో చేయబడిన ఆసనమునున్ను పాదుకలను దంతధావనమునకైన పుడకనుకూడ స్నాతకుడు విసర్జింపవలయు నని సూత్రార్థము. ఈవిషయమునందు పెద్దలుకూడ నిట్టులనే చెప్పిరి "పాలాశముతో చేసినట్టి ఆసనమును శయనమును యానమును గృహోపకరణమును పాదుకలను దంతధావన కాష్ఠమునుకూడ వర్జింపవలయును"-అని.

348. సూ. సోపానత్కశ్చ అశనా సనాభివాద నమస్కారా న్వర్జయేత్. [౧-౯-౪౬]

హరదత్తమితాక్షరా—సోపానత్క ఇతి. అభివాదనం పూర్వోక్తం. నమస్కారో దేవతాప్రణామః అభివాదనాదీని సోపానత్కో నకుర్యాత్. ఉపాన ద్గ్రహణం పాదుకాదే రప్యుపలక్షణమ్.

ఆంధ్రవివరణము—సోపానత్కుడై (అనగా కాళ్లకు పావుకోళ్లు చెప్పులు మున్నగువానిని తొడిగికొని వాటిని విడువకుండగనే) అశనము (భోజనము) ను అభివాదనమును ఈమున్నగు వానిని నమస్కారమునుచేయగారాదని భావము.

349 సూ. న పూర్వాహ్ణ మధ్యందినాపరాహ్ణాన్ అఫలాన్ కుర్యా ద్యథాశక్తి ధర్మార్థకామేభ్యః [౧-౯-౪౭]

హరదత్తమితాక్షరా—నేతి. పూర్వాహ్ణాదీన్త్రీన్భాగా న్ధర్మాదిభి స్త్రిభి ర్యథా శక్త్యఫలాన్న కుర్యాత్కింతర్హి సఫలా నేవ కుర్యా ద్యథాసంఖ్యమ్.

ఆంధ్రవివరణము— అహ్నమనగా పగలు. దానిని మూడుభాగములుచేసిన పూర్వాహ్ణమని మధ్యాహ్నమని అపరాహ్ణమని యగును. సూ

ర్యోదయము మొదలుకొని రెండుజాములగు వఱకును ఉండెడికాలము పూర్వాహ్ణము అనబడును. రెండుజాములు అయినది మొదలు మూఁడవజాము తిరుగువఱకు నుండెడికాలము మధ్యాహ్నము. అటుతరువాతిది అపరాహ్ణము. పగటిలోని మూఁడుకాలములను ధర్మార్థ కామములను యథాశక్తి ఆచరించుటద్వారా సఫలములను చేయవలయునేగాని అఫలములనుగా (నిష్ఫలములనుగా) చేయరాదని అర్థము. అనఁగా ఆర్యులు పురుషార్థైక ప్రయోజనులు గనుకను, పురుషార్థ సాధనభూతములగు కర్మలనాచరించుటకు పగలు ఉత్తమమగుకాలమై ఐహికాముష్మికఫలములను చేకూర్చునది అగుటచేతను, అట్టికాలమును ఒక్కక్షణమైనను వృథగానీకుండ ధర్మార్థకామములకు సంబంధించిన సత్కార్యములను చేయుచు గడుపవలయునేగాని, ధర్మహాని అర్థహాని మున్నగు ననర్థపరంపరలకు తావునొసగు కార్యములతో గడుపరాదని సూత్రార్థము.

350. సూ. తేషుతు ధర్మోత్తరస్స్యాత్ [౧-౯-౪౮]

హారదత్తవ్యాఖ్యా — తేష్వితి. తుశబ్దో ఽసవస్థాం పరిహరతి. తేషు ధర్మార్థకామేషు ధర్మోత్తరస్స్యాద్ధర్మ ప్రధానస్స్యాత్. ధర్మావిరోధే అర్థకామౌ సేవేతేతి. తథాచ మనుః — శ్లో. పరిత్యజే దర్థకామౌ యౌ స్యాతాం ధర్మవర్జితౌ — ఇతి.

ఆంధ్రవివరణము — ఆధర్మార్థ కామములను సఫలములను చేయుటలోకూడ ధర్మమే ప్రధానముగా నుండునట్టులు చేయవలయునని యర్థము. అనగా ధర్మావిరోధముగా అర్థకామముల నార్జించవలెను. మనువుకూడ నన్నాడు — ధర్మములేని అర్థకామములను రెండును వర్జింపబడదగినవి అని.

విశేషాంశములు — ఈ యభిప్రాయమునే కామసూత్రకర్తలగు వాత్స్యాయనుఁడు మొదలగువారుకూడ వెల్లడించినారు. కామసూత్రములలో (88 సూ) శతాయుర్వై పురుషో విభజ్య కాలమన్యోన్యానుబద్ధం పరస్పరస్యానుపఘాతకం సేవేత — అను సూత్రములో త్రివర్గమును (అనగా ధర్మము అర్థము కామము అను నీమూఁడు పురుషార్థములగుమిని) అన్యోన్యానుబద్ధముగను పరస్పరమునకు అనుపఘాతకముగను సేవింపవలసినది - అని చెప్పఁబడినది. ఈ త్రివర్గము అన్యోన్యానుబద్ధమగుటఎట్లో, పరస్పరానుపఘాతకమెట్లో - అనేవిషయములు అందుచక్కగా వివరింపబడినది. అవియే ఇచ్చట ఉద్ధరింపబడినవి.

ధర్మము అర్థానుబద్ధమగు రీతి — ధర్మశాస్త్రముల ననుసరించి వివాహము చేసికొన్న ధర్మపత్నిని, పురుషుఁడు (అనఁగా భర్త.) సంతానార్థియై ఋతకాలమునందు సంగమించె ననుకొనుడు. ఇచ్చట అభిప్రేతమగు ధర్మము అర్థముతో ననుబద్ధమైనది. ఇది ధర్మము అర్థానుబద్ధమగురీతి.

ధర్మము కామానుబద్ధమగు రీతి — సంతానార్థికాకయే అభిప్రేతయగు ధర్మపత్నిని సంగమించినచో, కామానుబద్ధమగు ధర్మమగుచున్నయది.

అర్థము ధర్మానుబద్ధమగు రీతి — అవివాహితుఁడుగా (పెండ్లిగానివాఁడుగా) నుండి, సవర్ణము నుండి (అనగా-

యగు కన్యకను పొందగల్గినచో నయ్యది ధర్మానుబద్ధమగు అర్థము అగుచున్నది.

అర్థము కామానుబద్ధ మగు రీతి—వివాహితుడుగానుండి అసమవర్ణము వారినుండి (అనగా తనకులమువారినుండిగాక తనకులముకంటెను భిన్నములైన కులములవారినుండి) అభిప్రేతమగు కన్యాలాభము పొందినచో, ఇయ్యది కామానుబద్ధమగు అర్థ మగును.

కామము ధర్మానుబద్ధ మగు రీతి—ధర్మశాస్త్రములచొప్పున వివాహముచేసికొనియున్న ధర్మపత్నిని ఋతుకాలములందు సంగమించినచో నియ్యది ధర్మానుబద్ధగు కామము అగుచున్నది. ఏలయనగా- 'ఋతౌ ఉపేయాత్' అనే ధర్మశాస్త్రమును అనువర్తించినవా డగును. కామమును సేవించినవా డగును. దీన ధర్మమును కామమును రెండును కలసివచ్చుటచేత నిది ధర్మానుబద్ధమగు కామ మగుచున్నది.

కామము అర్థానుబద్ధ మగురీతి—వివాహితుడుగానుండి నిష్కించనుడుగా (అనగా డబ్బు లేనివాడుగా-) నుండి, తనకంటెను తక్కువకుల ముదియై ద్రవ్యవంతురాలై యుండు యువతితో సంగమించినచో ఇయ్యది అర్థానుబద్ధమగు కామము అని యనఁబడును. ఇవి ఏకానుబద్ధములగు త్రివర్గములు.

ధర్మము అర్థముతోటి కామముతోటి అనుబద్ధమగు రీతి:—అవివాహితుడై యుండి, తనకు సవర్ణయై అనన్యపూర్వయై యభిప్రేతయై యున్న కన్యకను యథావిధిగా సంగమించినచో అర్థకామానుబద్ధమగు ధర్మము అగుచు

అర్థము ధర్మకామానుబద్ధ మగురీతి- హితుడై యుండి సవర్ణయైనకన్యక సా సహితముగా పరిగ్రహించి సంగమిం నయ్యది ధర్మకామములతో ననుబద్ధము మని యనఁబడును.

కామము ధర్మార్థములతో ననుబద్ధ అవివాహితుఁడుగ నున్న వానికే అర్థము గల్గినవై-పరస్పరోత్కంఠముగలకన్యక తో హముజరిగి సంగమముకలిగినచో ఆసం ధర్మార్థములతో ననుబద్ధమగు కామము బడును. ఇవి ద్వ్యనుబద్ధములు.

పరస్పరానుపఘాతకం— అని మూల నన్న మాటకు అర్థమేమనఁగా చాల ముులున్నచోట ఒకటి తక్కినదానికి భ కల్గించని రీతిని, ఒక్క అనుబంధమున్న తదితరమునకు భంగము కల్గింపని రీతిని వలయునని భావము.

351. సూ. ననగ్నాం పరయోషిత మీ
[౧-౯-౪౯]

హరదత్తమితాక్షరా—ననగ్నామితి. పర యోషిచ్చ పరయోషిత్. అస్యథావిధవానాథాదేశా సన్యుః. తాం నగ్నాం సతీం న వీక్షేత.

ఆంధ్రవివరణము— పరురాలగు యో (అనగా స్త్రీ) పరస్త్రీ యనబడును. పరస్త్రీ మాటచేత నిచ్చట వేశ్యలు భర్తృహీనలు ల్లిగావి పడుచులు మున్నగువారెల్లరును గ్ర

బడుదురు. నగ్నుడైయున్నట్టి– అనగా దిగంబరుడై యున్నట్టి– పరయోషిత్తును చూడగా రాదని తాత్పర్యము.

352. సూ. న పదాసన మాకర్షేత్. [౧–౯–౫౦]

హరదత్తమితాక్షరా—నపదేతి. పదాపాదేన ఆసనమాత్మసమీపం నాకర్షేత్ ప్రాపయేదిత్యర్థః.

ఆంధ్రవివరణము—కాలితో తాను కూర్చుండునట్టి ఆసనమును తనయొద్దకు లాగుకొనగా రాదని యర్థము. ఈ రెండుసూత్రములును– అనగా 351, 352 సూత్రములు మస్కరిభాష్యమునందు లేవు.

353. సూ. న శిశ్నోదరపాణిపాద వాక్చక్షుశ్చాపలాని కుర్యాత్. [౧–౯–౫౧]

హరదత్తమితాక్షరా—నశిశ్నోదరేతి. చాపలశబ్దః ప్రత్యేకం సంబధ్యతే. శిశ్నచాపలమకాలేమైథునేచ్ఛా. ఉదరచాపలంసర్వదా బుభుక్షయిషా. పాణిచాపలం శిల్పకర్మశిక్షాభిలాషః, పాదచాపలం పర్యటనం. వాక్చాపలం 'నాపృష్టః కస్యచిద్బ్రూయాన్నచాన్యాయేన పృచ్ఛతః' ఇత్యేదతిక్రమేణ వ్యవహారః, చక్షుశ్చాపలం నృత్యాది దిదృక్షా. ఏతాని న కుర్యాత్.

ఆంధ్రవివరణము— శిశ్నమనగా పురుషుని గుహ్యావయము. ఉదరమనగా పొట్ట. పాణి–చేయి. పాదము కాలు, వాక్–మాట. చక్షుస్సు–కన్ను. చాపలమనగా లోలత్వము. చాపలశబ్దము శిశ్నాదిశబ్దములతో నన్వయించును. కాగా శిశ్నచాపలము ఇత్యాది పదములు ఏర్పడును. స్నాతకుడు శిశ్నచాపలము మున్నగు నారువిధములగు చాపలములను వర్జింపవలయునని సూత్రార్థము. ఇచ్చట శిశ్నచాపలమనగా– అకాలమునందు– అనగా అసమయమునందు– మైథునము చేయవలయునని కోర్కెగల్గుటయును, ఉదరచాపలమనగా ఎల్లప్పుడును తిండినితినుచునే యుండవలయునను ఇచ్ఛగల్గుటయును, పాణిచాపలమనగా ధర్మనిషిద్ధములయిన శిల్పకర్మాదులను అభ్యసింపగోరుటయును, పాదచాపలమనగా (నిష్ప్రయోజనముగా) పర్యటనము జేయు దివురుటయును, వాక్చాపలమనగా తననడిగినవానికి నడుగనివానికి ఏకవిధముగా నుపన్యసింప దొరకొనుటయును చక్షుశ్చాపలమనగా నృత్యము మున్నగు అదర్శనీయములను చూడవలయునని ఆత్రపడుచుండుటయు నని హరదత్తుని భావము.

354. సూ. ఛేదనభేదన విలేఖన విమర్దనావస్ఫోటనాని న హ్యకస్మాత్కుర్యాత్ [౧–౯–౫౨]

హరదత్తమితాక్షరా—ఛేదనేతి. ఛేదనంతృణాదీనాం, భేదనం ఘటాదేః, విలేఖనం కుడ్యభూమ్యాదౌనఖాదిభిర్విలేఖనమ్. విమర్దనం లోష్ఠాదీనాం చూర్ణీకరణం అవస్ఫోటన మంగుళీనాం. సశబ్దం ప్రసారణమ్. ఏత దకస్మాన్నకుర్యాత్. కారణేత్వవస్ఫోటనాదిషునదోషః. ఛేదనాదిష్వపి యథాసంభవం మృగ్యమ్.

ఆంధ్రవివరణము—స్నాతకుడగువాడు నిష్కారణముగా భేదన ఛేదనాదులను ఆచరింపగా రాదని సూత్రార్థము. కాని కారణము కలిగిన చో యథాసంభవముగా నొనర్పనుకూడ వచ్చుననియు నెఱుంగునది. ఇచ్చట ఛేదనమనగా గడ్డి మొదలగు తృణములను కోయుటయును, భేదనమనగా కుండలు మున్నగువానిని పగులగొట్టుటయును, విలేఖనమనగా గోడలు స్తంభములు

మొదలగు వానిపై, గోళ్లతో గీచుటయును, విమ ర్దనమనగా చిల్లపెంకులు మట్టిబెడ్డలు మొదలగు వానిని చిదుకగొట్టుటయును, అవస్ఫోటనమనగా వ్రేళ్లతో చిటికలు మొదలగు శబ్దములను చేయు టయును అని యెఱుంగునది.

355. సూ. నోపరి వత్సతంతీం గచ్ఛేత్ [౧-౯-౫౩]

హరదత్తమితాక్షరా—— నోపరీతి. వత్సతంతీం వత్ససంబంధినీం రజ్జు ర్వత్సతంతీ. తాముపరి నగచ్ఛేత్. వత్స శబ్దో గోజాతే రుపలక్షణమ్.

ఆంధ్రవివరణము——ఆవు దూడలు మున్నగు వానిని కట్టివైచునట్టి పలుపులు మొదలగువానిని స్నాతకుడు దాటగారాదని సూత్రార్థము.

356. సూ. న కులంకుల స్స్యాత్. [౧-౯-౫౪]

హరదత్తమితాక్షరా——నకులమితి. కులమేవకులం యస్యాసః కులంకులః, ఛాందసో ముమాగమః, ఏవంవిధో న స్యాత్. అన్యత్ర గమనే అధ్యయనాదిలాభే సతి సత్కులే ఏవ కర్తవ్యమిత్యర్థః. అపర ఆహ —కులాత్కులాంతరగామీ కులం కులోపదత్తానుసూత్రేణత థావిధో నస్యాత్. స్వసూత్రపరిత్యాగేన పరసూత్రం నభజేదితి. తత్రస్మృత్యంతరమ్— శ్లో. యస్స్వ సూత్రం పరిత్యజ్య పరసూత్రం నిషేవతే, శాఖారండ స్స విజ్ఞేయః సర్వకర్మ బహిష్కృత ఇతి.

ఆంధ్రవివరణము——కులమేకులము ఎవ్వనికో వాడు కులంకులుడు. స్నాతకుడు కులంకులుడు కారాదని భావము. అన్యత్ర గమనమునందు-అనగా అధ్యయనాదులు లభించునప్పుడు మాత్ర ము కులంకులుడు కావచ్చునని యర్థము. ఇచ్చట మఱికొందఱనిరిగదా——ఒకవంశమునుండి మఱి యొకవంశమునకు దత్తుడు మున్నగు సంబంధ ములద్వారా సంక్రమించువాడే కులంకులుడు. అనగా స్వసూత్రస్వశాఖాదులను త్యజించి ఇతర కులముల (ఇతరవంశముల) వారికి దత్తుడు అగుట మున్నగువానిద్వారా పరసూత్ర పరశాఖాదు లను స్వీకరించి వానితో తన్ను వ్యవహరించు కొనెడివాడు కులంకులుడని భావము. ఈ విష యమున స్మృత్యంతరముకూడా ఇట్టులే యున్నది ఎవ్వడు స్వసూత్రమును పరిత్యజించి పరసూత్ర మును సేవించునో అట్టివాడు శాఖారండుయని యును, సర్వకర్మ బహిష్కృతుడనియు నెఱుంగ దగును-అని.

357. సూ. నయజ్ఞ మవృతో గచ్ఛేత్. [౧-౯-౫౫]

హరదత్తమితాక్షరా—— నయజ్ఞమితి. అవృతః అనుపామంత్రితో యజ్ఞం న గచ్ఛేత్.

ఆంధ్రవివరణము——ఆమంత్రణము చేయబడ కయే (అనగా పిలువబడకయే) స్నాతకుడు యజ్ఞ మునుగూర్చి పోవగారా దని తాత్పర్యము. ఇయ్యది ఋత్విజుడుగా వెళ్లునట్టివాని విషయమని యెఱుంగునది.

358. సూ. దర్శనాయతు కామమ్ [౧-౯-౫౬]

హరదత్తమితాక్షరా——దర్శనాయేతి. అవృతోపి కామం దర్శనాయ యజ్ఞంగచ్ఛేత్. నత్వార్త్విజ్యాయ.

ఆంధ్రవివరణము——ఆమంత్రితుడు కాకున్నను యజ్ఞమును సందర్శించుటకైనచో స్వేచ్ఛగా పోవచ్చును. కాని ఋత్విజుడుగా నుండుటకై మాత్రము పోవగా రా దని తాత్పర్యము.

359. సూ. నభక్షానుత్సంగేభక్షయేత్
[౧-౯-౫౭]

హరదత్తమితాక్షరా—నభక్షానితి. భక్షాః పృథుకాదయః తానుత్సంగే కృత్వా న భక్షయేత్.

ఆంధ్రవివరణము— భక్షింపదగినట్టి పదార్థములు భక్షములు. అనగా అటుకులు మున్నగు ఫలాహారములు. భక్షములను తొడపైనుంచికొని భక్షింపగా రా దని తాత్పర్యము.

360. సూ. నరాత్రౌ ప్రేష్యాహృతం[౧-౯-౫౮]

హరదత్తమితాక్షరా— నరాత్రావితి, రాత్రౌ ప్రేష్యేణ కింకరేణ యదానీతం త ద్యత్కించిదపి న భక్షణీయమేవ, ఏకవచననిర్దేశాత్.

ఆంధ్రవివరణము— రాత్రియందు పరిచారకుడు ఏదేని భక్ష్యమును గొనివచ్చి యిచ్చునేని దానిని భక్షింపగారాదని యర్థము. రాత్రియందు తెచ్చినదానిని భక్షింపకూడదనుటచేత పగటిపూట తెచ్చినదానికి ఈ నిషేధము వర్తింపదని మస్కరీయభాష్యమునందు వ్రాయబడినది.

361. సూ. ఉద్ధృతస్నేహ విలపనపిణ్యాకమథిత ప్రభృతీనిచ ఆత్తవీర్యాణి నాశ్నీయాత్.
[౧-౯-౫౯]

హరదత్తమితాక్షరా—ఉద్ధృతస్నేహాదీతి. ఆత్తవీర్యాణి ఉపాత్తసారాంశాని నాశ్నీయాన్న భక్షయేత్. కాని పునస్తాని తేషా ముదాహరణ ప్రపంచః, ఉద్ధృతస్నేహే ఉపాత్తాగ్రమండే దధిపయసీ. విలపనం నవనీతమలమ్. యంత్రేపీ డితానాం తిలానాం కల్కం పిణ్యాకమ్. యస్యమథన మాత్రం నాంబుసంసర్గః తదపి మథితం— యదాహుశ్శ్ఘంటికాః—శ్లో. తక్రం హ్యుదశ్విన్మథితం పాదాంబ్వర్ధాంబు నిర్జలమ్-ఇతి. తచ్చత్రివిధమ్. ఆత్తనవనీత విశేషణ. తత్రాద్యస్య ఇహగ్రహణం తద్ధ్యాత్త వీర్య స్యోదాహరణమ్. ప్రభృతి గ్రహణేన యచ్చాన్య దేవంవిధం కల్కరూపంతస్య గ్రహణమ్. ఉద్ధృతనవనీతం తక్రం అశ్య మనాశ్యమితి చింత్యమ్. ఆచారస్త్వశనమేవ. అభక్ష్యప్రకరణే వక్తవ్యే ఇహ వచనా త్స్నాతక వ్రతలోపేయ త్ప్రాయశ్చిత్తం తదేవై షా మశనేభవతి నాభక్ష్యభక్షణనిమిత్తమ్.

ఆంధ్రవివరణము—ఆత్తవీర్యములగు అనగా సారము విడిచివేయబడినట్టివగు- ఉద్ధృతస్నేహ విలపన పిణ్యాక మథితాదులను స్నాతకుడు భక్షింపగారాదు అని సూత్రార్థము. స్నేహమనగా పాలు పెరుగులపై (కాచి పేరబెట్టినప్పుడు) పేరుకొనెడి మీగడ తరకలనియర్థము. దీనినే మండమనియు నందురు. ఉద్ధృతస్నేహము లగునట్టి- అనగా పైనిగల మీగడతరకలను తీసివేసినట్టి పాలు పెరుగుకూడ ఉద్ధృతస్నేహమనియే చెప్పబడుచుండును. స్నాతకుడు ఆత్తసారమగు ఉద్ధృతస్నేహమును భక్షింపగా రాదని అర్థము. వెన్నను నీరువడియునట్లు పిండి చేసిన ముద్దకు విలపనమని పేరు. కొందఱు దీనిని విలయనమనియు నందురు. ఆత్తసారమగునట్టి విలపనమునుకూడ భక్షింపరాదు. రోటిలోపోసి (లేక గానుగలో పోసిగాని) త్రొక్కి ముద్దచేసినట్టి నువ్వులపిండికి పిణ్యాకమని పేరు. ఆత్తసారమగునట్టి- [అనగా నువ్వులనుదంచి తత్సారమగు నూనెను పిడిచి వేసినట్టి] పిణ్యాకమును (అనగా నువ్వుపిండిని లేక గానుగపిండిని) భక్షింపరాదు. నీరుగలియకుండ చిలికినట్టి పెరుగునకు మథితమని పేరు. ఈమథితము ఆత్తనవనీతము అని, (అనగా వెన్ననుతీసినదని) అనాత్తనవనీతమని (వెన్ననుతీయనిదని) రెం

డువిధములు. అందులో తొలుదొల్లటిదానినే అనగా ఆర్తసవనీతమగునట్టి మథితమునే ఇచ్చట మథితశబ్దముచేత గ్రహింపవలయును. ఆర్తసారమగు మథితమును భక్షింపరాదని భావము. ప్రభృతిశబ్దగ్రహణముచేత నింకను ఇటువంటి వానిని గ్రహించునది. అయితే ఇచ్చట వెన్నను తీసివేసినట్టి తక్రము అశ్యముగాను అనాశ్యముగాను (భక్షింపతగినదిగాను తగనిదిగాను) ఉండుననుట ఆలోచింపతగినది. కాని భక్షింపకుండుటయే పరంపరాగతమగు ఆచారము. అభక్ష్య పదార్థములను చెప్పునట్టి ప్రకరణమునందు చెప్పవలసినట్టి వీనిని ఇచ్చటచెప్పుట అచ్చటనే ప్రాయశ్చిత్తముగలదో అదియే వీటికిగూడ గలదని సూచించుటకేగాని అభక్ష్యభక్షణముకొఱకు మాత్రము కాదని యెఱుంగవలయును.

విశేషాంశములు—మస్కరీయభాష్యమునందు మూలములో ప్రభృతీనిచ అనుచోటగల చకారము వెనుకటిసూత్రమునందుగల రాత్రిశబ్దమును అనుకర్షించుటకనియును, అట్లు అనుకర్షించుటచేత రాత్రియందు వీనిని (అనగా పిణ్యాకాదులను) భక్షింపరాదనియును అర్థమువ్రాసిరి.

362. సూ. సాయంప్రాతస్త్వన్న మభిపూజిత మనిన్దన్ భుంజీత [౧-౯-౬౦]

హరదత్తమిశ్రాః—సాయంప్రాతరితి-తుశబ్దస్త్వవధారణే. సాయం ప్రాతరహస్తయో ర్ద్వయో రేకకాలయో రశనం భుంజీత. నాన్తరేతి ప్రాప్తస్య భోజనస్య పరిసంఖ్యేయమ్. అత్రగుణవిధి రభిపూజిత మనిన్దన్నితి. అభిపూజితం శోచత ఇతి. అనిన్దన్ కదన్నత్వాదిదోషేణ అకుత్సయన్ సాయంప్రాతరశనా న్యభిపూజయే దితివసిష్ఠః,

ఆంధ్రవివరణము—సాయంకాల ప్రాతఃకాలముల రెండిటియందును ఏకకాలములయందు[అనగా ముఖ్యకాలములయందుమాత్రమే] అన్నమును భుజింపవలయును. నాంతరా భోజయేత్-అనునట్టిదానికిది పరిసంఖ్య. అట్టులు భుజించునప్పుడు ఆయన్నమును అభిపూజితమునుగా నొనర్చి నిందింపకయే భుజింపవలయు నని యర్థము.

363. సూ. నకదాచి ద్రాత్రౌ నగ్నస్స్వపేత్ [౧-౯-౬౧]

హరదత్తమిశ్రాః— నకదాచితి. సుప్యాద్రాత్రౌనతు నగ్నః స్వపేత్. తదేవంరాత్రౌ నగ్నస్యస్వాప ప్రతిషేధో దివాతు సర్వథేతి. కదాచి ద్గ్రహణా దివం లభ్యతే. అన్యథా రాత్రౌ ననగ్న స్స్వపేదిత్యేవ వాచ్యంస్యాత్.

ఆంధ్రవివరణము— ఎప్పటికిని రాత్రులందు నగ్నుడై అనగా దిగంబరియై నిద్రింపగారాదని యర్థము. రాత్రియందు నగ్నుడై నిద్రింపరాదను ఈనిషేధముచేత పగలుబొత్తుగా పనికిరాదని "ఎప్పటికిని" అనునీ విశేషణమువలన తెలియుచున్నయది.

364. సూ. స్నాయాద్వా [౧-౯-౬౨]

హరదత్తమిశ్రాః—స్నాయాదితి. ననగ్న మిత్యేవ నగ్నోజలం నావతరేదితి స్మృత్యంతరమ్.

ఆంధ్రవివరణము—రాత్రియందుగాని పగలుగాని నగ్నుడై స్నానము నొనర్పగా రాదని భావము. ఈభావమునే "దిగంబరియై జలములను ప్రవేశింపగారాదు" అను ఇతరస్మృతి వచనము కూడ చెప్పుచున్నది.

365. యచ్చాత్మవంతో వృద్ధాస్సమ్యగ్వినీతాః దంభలోభ మోహా వియుక్తా వేదవిదః ఆచక్షతే తత్సమాచరేత్ [౧-౯-౬౩]

హరదత్తమిశ్రాక్షరా— ఆనంత్యాదాచారాణాం ప్రతిపదపాఠో నశక్యఇతి సంక్షిప్యాహ— యచ్చాత్మవంత ఇతి. ఆత్మవంతో జితేంద్రియాః, వృద్ధాః పరిణతవయసః యౌవనే విషయవశ్యతా సంభవాత్. సమ్యగ్వినీతాః గురుభిశ్శిక్షితాః దంభోధర్మచ్ఛలేన లోకవంచనమ్. లోభో అన్యాయేన పరద్రవ్యాదిత్సా. మోహః అజ్ఞానం లోకవిరుద్ధజ్ఞానం వా తేనవియుక్తాః వేదవిదః పాఠతశ్చార్థతశ్చ వేదానాం చోదితారః, అత్రవృద్ధా ఇతి విశేష్యమ్. ఏవం భూతాః వృద్ధా ఇతి విశేష్యమ్. ఏవం భూతాః వృద్ధాః య మాచక్షతే తత్కర్తవ్యమితి. బహువచననిర్దేశా ద్బహూనా మైకమత్యే తద్భవతి.

ఆంధ్రవివరణము—ఈవిధముగా ఆచారములను ఒక్కొక్కదానిని గైకొని విధినిషేధములను చర్చింపబూనినచో ఎప్పటికిని అంతము గానరాక యుండుటవలనను [అనగా ఆచారములు అనేకముగను అనంతముగను ఉండుటవలనను] ప్రతిపదపాఠముగ ఒక్కొక్కదానిని వివరింపగల్గుట అసాధ్యమైనది కావునను సంక్షేపించి ఆచారముల నెఱుంగవలసినట్టి రీతిని ప్రస్తుతసూత్రమునందు వివరించుచున్నాడు.

ఆత్మవంతులును వృద్ధులును చక్కగా వినీతులును దంభ మోహ లోభ వియుక్తులును వేదవేత్తలును అగు పెద్దలు దేనిని ఆచారమునుగా నిరూపించుచుందురో, అట్టిదానిని ప్రమాణముగా గైకొని, అనగా ఆచారత్వేన ప్రమాణముగా గ్రహించి, ఆచరింపవలయును అని సూత్రార్థము. ఆత్మవంతులనగా ఇంద్రియములయొక్క ఆకర్షణకు లోబడక వానినిగెల్చి జ్ఞాననిష్ఠులును కర్మనిష్ఠులును నగు నట్టివారు. వృద్ధులనగా వయస్సు చాలగడచి అనేకమంది పెద్దలయొక్క పరిచర్యామూలమున బహుకాలమునుండి ధర్మస్వరూపము యొక్క అనుభవమును గల్గినట్టివారు. మస్కరీయ భాష్యమునందు వేదములయందుగల తత్త్వము నెఱింగినవారు వృద్ధులని చెప్పబడినది. గురువులచేత సంప్రదాయ విజ్ఞానము చక్కగా గఱుపబడినవారు సమ్యగ్వినీతు లనబడుదురు. దంభము అనగా ధర్మమను మిషతో లోకవంచనము చేయుట. అన్యాయముతో ఇతరుల ద్రవ్యమును అపహరించుట లోభము. కేవలము తెలివిలేకుండుటగాని, ఉన్నను అయ్యది లోక విరుద్ధముగా వర్తించుటగాని మోహము. దంభము లోభము మోహము అను నీగుణములను త్యజించినట్టి పెద్దలు దంభ లోభ మోహ వియుక్తులని యనబడుదురు. సమస్తవేదములను సాంగోపాంగముగా జదివినట్టివారు వేదవిదులు అనబడుదురు.

366. సూ. యోగక్షేమార్థ మీశ్వర మధిగచ్ఛేత్ [౧-౯-౨౮]

హరదత్తమిశ్రాక్షరా—యోగక్షేమార్థమితి. అలబ్ధస్య లాభో యోగః, లబ్ధస్య పరిపాలనం క్షేమః. తదర్థ మీశ్వర మధిగచ్ఛేత్ రాజానమధిగచ్ఛేదిత్యర్థః. అధిశబ్ద ప్రయోగాదధి కైశ్వర్య ఇత్యస్మా దకార్పణ్యేన స్వతంత్రో గచ్ఛేదితి.

ఆంధ్రవివరణము—యోగక్షేమములను పొందెడికొఱకై రాజును అధిగమింపవలయు నని సూత్రార్థము. అలబ్ధమగునట్టి వస్తువులను పొందుట యోగమనియును, లబ్ధమును పాలించుట క్షేమమనియు ననంబడును. అనంగా యోగక్షేమసాధనము రాజుగనుక తన్నిమిత్తమై రాజునొద్ద కేగుచుండవలయునని తాత్పర్యము.

విశేషాంశములు:—ఈసూత్రమునందు చెప్పబడిన యోగక్షేమార్థమై రాజదర్శనము చేయవలయు ననెడి విధానము అర్థశాస్త్రజ్ఞులగు నాచార్యుల మతము ననుసరించినది- వారివాక్యము ఇది- దేవతా మభిగచ్ఛేత్తు ధార్మికాంశ్చ ద్విజోత్తమాన్, ఈశ్వరంచైవ రక్షార్థం గురుమేవచ పర్వసు, ఉపేయా దీశ్వరంచైవ యోగక్షేమార్థ సిద్ధయే- అని విద్వాంసులగు గృహస్థులు ఎంతని రీహులుగ నున్నను, ఎంతటి ఐహిక విరాగులుగ నున్నను లోకయాత్రకై - దేవతలను ధార్మికులగు బ్రాహ్మణోత్తములను, లోకక్షేమార్థమై ఉద్యత దండుడై ప్రజలను చక్కగా పాలించునట్టిరాజును ఉపాసింపనలయును, అని అర్థము. ఇందులో ఈశ్వరుఁడనుమాటకు (అనగా రాజను పదమునకు) పట్టాభిషేకాది యోగ్యతలుగల రాజనియును, ఉపాసింపవలయు నన్నమాటకు ఆశ్రయించి యుండవలయునేగాని సేవ (రాజసేవ) చేయరాదనియును, వ్యాఖ్యాతలు భావమును వెల్లడించిరి. ఎందువలన ననగా- రాజసేవ శ్వవృత్తిని బోలినదని వారిభావము. ఇందులకు ప్రమాణముగా మనువు చెప్పిన యీక్రింది శ్లోకముల నుదాహరించెదరు. శ్లో. నరాజ్ఞః ప్రతిగృహ్ణీయా దరాజన్య ప్రసూతితః, యోరాజ్ఞః ప్రతిగృహ్ణాతి లుబ్ధస్యోచ్ఛాస్త్రవర్తినః, సతీపర్యాయేణ యా మాన్నరకా నేకవింశతిమ్.

367. సూ. నాన్యమన్యత్ర దేవగురు ధార్మికేభ్యః [౧-౯-౬౫]

హారదత్తమితాక్షరా—నాన్యమితి. అన్యం రాజ శ్యాశ్రిత్యం యోగక్షేమ-సమర్థమపి నాధిగచ్ఛేది త్యనువాదః దేవాః ఇంద్రాదయః, గురవః పిత్రాదయః, ధార్మికాః ధర్మాచరణశీలాః, ఏతేభ్యోఽన్యత్ర. ఏతా నధిగచ్ఛే దేవేతి భావః.

ఆంధ్రవివరణము— రాజుకంటె నన్యుఁడగు వానిని యోగక్షేమార్థమై అధిగమింపగారాదు అనియును, అందుననుకూడ ఇంద్రుడుమున్నగు దేవతలు తల్లితండ్రి మొదలగు గురువులు ధర్మాచరణశీలురగు పెద్దలు- తప్ప- తక్కినవారిని యోగక్షేమార్థమై అధిగమింపగా రాదనియును ఈ ఇంద్రాదులమాత్రము అధిగమింప వచ్చునని యును తాత్పర్యము.

368. సూ. ప్రభూతైధోదక యవస కుశ మాల్యోప నిష్క్రమణం ఆర్యజన భూయిష్ఠ మనలసనమృద్ధం ధార్మికాధిష్ఠితమ్ నికేతన మావసితుం యతేత [౧-౯-౬౬]

హారదత్తమితాక్షరా—ప్రభూతేతి. ఏధ. కాష్ఠముదకం స్నానపానయోగ్యం యవసం తృణాని గవాదీనాం భావః, కుశాః ప్రసిద్ధాః, మాల్యాని పుష్పాణి దేవతా ర్చనార్థమ్. ఉపనిష్క్రమ్యతే యత్ర త దుపనిష్క్రమణం బహిరవకాశ స్సంచారాద్యర్థమ్. ఏవమాదీని ప్రభూతాని యత్ర. ఆర్యాస్త్రైవర్ణికాః త ఏవజనాస్తై ర్భూయిష్ఠం వ్యాప్తమ్. అలసాః కృత్యేషు నిరుధ్యమానాః తద్విపరీతా అనలసాః తైస్సమృద్ధంధార్మికాః ధర్మశీలాః, తైరధిష్ఠాతృభిః అధిష్ఠితమ్. ఏవంభూతం నికేతన మావసితుం యతేత. ఏవంభూతే స్థానే యత్నేనాపి వసేదిత్యర్థః.

ఆంధ్రవివరణము—పధస్సులు ఉదకము యవసము కుశలు మాల్యములు ఉపనిష్క్రమణద్వారములు- ఇవి ప్రభూతములై యుండునట్టి (అనగా విస్తారముగా గల్గియుండునట్టి) దియును, ఆర్యజన భూయిష్ఠమును అనలసులు విస్తారముగా గలట్టి యును ధార్మికులు వసించినట్టిదియును అగు ప్రదే

శమునకు జని వసించుటకై యత్నింపవలయు నని భావము. ఏధస్సులనగా కట్టెలు. ఉదకము లనగా స్నానమునకు పానమునకు చాలినన్ని మంచినీళ్లు. యవసములనగా ఆవులనిమిత్తమైన గడ్డి గాదము మున్నగునవి. కుశలు దర్భలు. మాల్యము లనగా దేవతార్చనాదులకొఱకైన పూవులు. ఉపనిష్క్రమణద్వారము లనగా రాకపోకలకు ఇరుకు లేకుండునట్టి త్రోవలు. అనలసులనగా ఉత్సాహవంతులు. ధార్మికులనగా ధర్మశీలురు. ఇట్టిస్థానమును ప్రయత్నపూర్వకముగా నన్వేషించి అందు వసింపవలయు నని తాత్పర్యము.

369. సూ. ప్రశస్తమాంగళ్య దేవతాయతన చతుష్పథాదీని ప్రదక్షిణ మావర్తేత [౧-౯-౨౭]

హరదత్తమితాక్షరా—ప్రశస్తేతి. ప్రశస్త మాంగళ్య దేవతాయతన చతుష్పథాదీని స్వానుప్రవేశాదిషు యథా దక్షిణపార్శ్వే భవంతి తథా కుర్యాదితి.

ఆంధ్రవివరణము—ప్రశస్తములు మాంగళ్యములు దేవతాయతనములు చతుష్పథములు మొదలగువాటిని ప్రదక్షిణముగా నగునట్టులు ఒనర్చి వచ్చుచుండవలయును. అనగా తాను అట్టివాని చేరువను పోవునప్పుడు ఆ ప్రశస్తాదులు తనకు కుడివైపు నుండు రీతినిగా, ప్రదక్షిణములనుచేసి రాకపోకలను జరుపుచుండవలయు నని సూత్రార్థము.

370. సూ. మనసా వా [౧-౯-౨౮]

హరదత్తమితాక్షరా— ప్రశస్తాదీని మనసావాపి ప్రదక్షిణ మావర్తేతేత్యన్వయః.

ఆంధ్రవివరణము—ఈపైని చెప్పినట్టి ప్రశస్తములు మున్నగువానిని పనులతొందరచేత స్వయముగా ప్రదక్షిణముచేయుటకు వీలులేనప్పుడు మనస్సుతోనైనను ప్రదక్షిణము నొనర్చి రాకపోకలు జరుపుచుండవలయునని భావము. ప్రశస్తములనగా ఆవులు బ్రాహ్మణులు ప్రజ్ఞాతములగు అశ్వత్థవృక్షములు మొదలగు వనస్పతులు. పాలు పెరుగు నేయి పూర్ణకుంభములు మున్నగునవి మాంగళ్యములు. అనగా మంగళవస్తువులని భావము. దేవాలయములకే దేవాయతనములని పేరు. చతుష్పథములనగా నాల్గుత్రోవలు కలియునట్టి చౌకులు మొదలగునట్టి గ్రామమధ్యప్రదేశములు.

371. సూ. తత్సమగ్ర మాచార మనుపాలయే దిత్యాపత్కల్పః. [౧-౯-౨౯]

హరదత్తమితాక్షరా—తదితి. సంభవేతు సాక్షాదనుష్ఠాన మేవేతి.

ఆంధ్రవివరణము—అవకాశముగల్గునేని ఈపైనిచెప్పినట్టి ఆచారమునంతను సమగ్రముగా అనుపాలనము చేయతగును. ఇయ్యది (అనగా ఈప్రకరణమునందు చెప్పబడినట్టిది) యే ఆపత్కల్పము అనిభావము.

372. సూ. సత్యధర్మా [౧-౯-౩౦]

హరదత్తమితాక్షరా— సత్యేతి. స్నాతకస్సత్యధర్మా స్యా దితి వక్ష్యమాణ మపేక్షతే.

ఆంధ్రవివరణము—స్నాతకుడు సత్యధర్ముడై (అనగా ఎన్నికష్టములు క్లేశములు వచ్చినను సత్యమును వీడనంతటి సత్యసంధుడై యనిభావము) మెలంగవలయు నని సూత్రార్థము.

373. సూ. ఆర్యవృత్తః [౧-౯-౭౧]

హరదత్తమితాక్షరా — ఆర్యవృత్త ఇతి. పూర్వభాషీ ప్రియంవద ఇత్యాద్యార్యాణాం వృత్తమివ వృత్తం యస్యాసః తథా. ఉష్ట్రముఖ వన్మధ్యమ పదలోపః.

ఆంధ్రవివరణము — మఱియును ఆతడు ఆర్యులయొక్క ప్రవర్తనమువంటి ప్రవర్తనముగలవాడై యుండవలయు నని సూత్రార్థము. ఆర్యుల వర్తనము అనగా — స్మితపూర్వాభి భాషిత్వము ప్రియంవదత్వము మొదలగునది యని యెఱుంగవలయును.

374. సూ. శిష్టాధ్యాపకః [౧-౯-౭౨]

హరదత్తమితాక్షరా — శిష్టేతి. సతా మధ్యాపయితా చ త్వయోగ్యానామ్.

ఆంధ్రవివరణము — అయోగ్యులకు గాక యోగ్యులై శాస్త్రవిహితములగు ఆచారములను లోకావిరుద్ధముగా నాచరించునట్టి శిష్టులైయున్నవారికి మాత్రమే అధ్యాపయితయై [అనగా చదువును చెప్పునట్టి వాడై] స్నాతకు డుండవలయు నని సూత్రార్థము.

375. సూ. శౌచశిష్టః [౧-౯-౭౩]

హరదత్తమితాక్షరా — శౌచశిష్టఇతి. శిష్టం శాస్త్రవిహితం శౌచం యస్యాస్తి స తథా నిష్ఠాంతస్య పరనిపాతః, శాస్త్రవిహితేవ శౌచేవ తద్వాన్. శౌచస్య తుపః శ్రేష్ఠ్యాపనార్థ స్తాత్పర్యార్థమ్.

ఆంధ్రవివరణము — శౌచశబ్దమువ కిదివఱకే యర్థము వివరింపబడినదిగదా. ఇకను శిష్టమనఁగా శాస్త్రములచే విద్యుక్తమ్యాది యీయావిధముగా నాచరింపబడవలయునని అనుశాసింపబడినట్టి ఆచరణము. (అట్టి యాచరణము కలవాఁడుగూడ శిష్టుడే.) శిష్టమైనట్టి శౌచము ఎవ్వనికిగలదో వాడు శౌచశిష్టుఁ డనిపించుకొనబడును. స్నాతకుఁడు శౌచశిష్టుఁడై అనగా శిష్టములయిన శౌచక్రియలు గలవాఁడై యుండవలయు నని సూత్రార్థము. ఇచ్చట మూలమునందు శిష్టశౌచః అని ఉండవలసియున్నను, శిష్టశబ్దము పరముగ నుండునట్టులు నిపాతచేయబడి యుండుటచే నిట్లున్నదని యెఱుంగవలయును. ఈయధ్యాయము నందు శౌచమునుగుఱించి అనేక మారులు మఱి మఱల నొక్కి చెప్పుట యెందులకనఁగా శౌచము మిగుల ముఖ్యమైనదని తెల్పుటకే అని యెఱుంగ దగును.

విశేషాంశములు — మస్కరీయ భాష్యమునందు — 'నిత్యంశుచిః, (చూ. సూ. 303)' 'సమిధునీభూత్వా (చూ. సూ. 326) ఇత్యాది సూత్రములవలెనే శౌచవిధానము సిద్ధించుచుండగా మఱల నిచ్చట శౌచమును చెప్పుటయెందులకు! అని శంకించుకొని, 'మనసావా'(చూ. సూ. 370) ఇత్యాది స్థలములందు ఆపత్కల్పమును విధించి యుండుటచేత చదువరులు ఈశౌచవిధినికూడ ఆపత్కల్పమే యని యర్థముచేసికొని అశ్రద్ధవహింతురేమో యన్న కారణమున నిట్లు ప్రత్యేకముగాఁ జెప్పఁబడినది అని సమాధానము వ్రాసిరి.

376. సూ. శ్రుతినిరత స్స్యాత్ [౧-౯-౭౪]

హరదత్తమితాక్షరా — శ్రుతీతి. సర్వదా శ్రుతి నిరతః వేదాభ్యాసరత స్స్యాత్.

ఆంధ్రవివరణము — స్నాతకుఁడు సర్వదా వేదములను మఱలమఱల నభ్యసించుటయందుఁ దత్పరుఁడై యుండవలయును అనిభావము. ఇచ్చ

ట శ్రుతినిరతుండై అని మూలసూత్రమునందు శ్రుతిశబ్దము నుచ్చరించుట "మన్వాదిస్మృతులు అంతగా మఱలమఱల నభ్యసింపనవసరము లేదు" అని చెప్పుటకని వ్రాయబడినది. మఱియును ఈమూడు సూత్రములును (374. 375, 376 సూ) మస్కరీయ భాష్యమున నొక్క సూత్రముగాఁ బఠింపబడినవి యనియు నెఱుంగవలయును.

377-379. సూ. నిత్యమహింస్రో మృదుర్దృఢకారీ దమదానశీలశ్చ [౧-౯-౨౧, ౨౨, ౨౩]

హారదత్తమిశ్రాః—నిత్యమితి. నిత్యం నిమిత్తే సత్యపి అహింస్రోఽహింసాశీలః, మృదుః కృతాపరాధేపి సహః, దృఢకారీ ప్రారబ్ధస్య సమాపయితా నప్రారమికః, దమః ఇంద్రియనిగ్రహః, దానం సంవిభాగః, తచ్ఛీల స్నాతక ఇతి సూత్రార్థోఽభిప్రేతః.

ఆంధ్రవివరణము—స్నాతకుఁడు ఎల్లప్పుడును ఎట్టికారణములు పొసగినప్పటికిని అహింస్రుఁడై అనగా సర్వప్రాణులను హింసించుస్వభావము కలుగనివాఁడై వర్తింపవలయును. మఱియును మృదువై (అనఁగా తన కితరులు ఎంతెంతటి యపకారములను చేసినను చేయుచున్నను వానినన్నిటిని సహించునట్టి సత్త్వముగలవాఁడుగ నున్నవాఁడై) దృఢకారియై అనగా ఏదేనియొక కార్యమును గాని వ్రతమును గాని యారంభించినచో దానిని తుదినొందించునట్టి దార్ఢ్యమును కల్గి యుండువాఁడుగానై యుండవలయును. ఇట్లులనే దమము దానము లివిముగాఁ గలవాఁడునై యుండవలయునని సూత్రార్థము. ఇచ్చట దమమనఁగా ఇంద్రియములను నిషిద్ధవిషయములనుండి నిగ్రహించియుంచి కొనుట యనియును దానమనగా స్వార్జితద్రవ్యమును సద్ధర్మోపయోగములకొఱకై విభజించి యుంచుటయును అనిభావము. స్నాతకుఁడు అహింస్రాశీలుఁడుగను మృదుశీలుఁడుగను దృఢతాశీలుఁడుగను శమనశీలుఁడుగను దానశీలుఁడుగను నుండవలయు నని తాత్పర్యము.

380. సూ. ఏవమాచారో మాతాపితరౌ పూర్వాపరాంశ్చ సంబంధాన్దురితేభ్యో మోక్షయిష్యన్స్నాతకః శశ్వద్బ్రహ్మలోకా న్న చ్యవతే నచ్యవతే [౧-౯-౨౪]

హారదత్తమిశ్రాః—ఏవమాచార ఇతి. ఏవముక్తప్రకార ఆచారో యస్య స ఏవమాచారః ఏవంభూతః స్నాతకో మాతాపితరౌ పూర్వసంబంధాః పితామహాదయః, అపరసంబంధాః పుత్రాదయః, తాంశ్చ పూర్వాపరసంబంధాన్దురితేభ్యః పాపేభ్యో మోక్షయిష్యన్ యే పూర్వం భూతాః తాం స్తథైవ నరకాదిభ్యో మోచయతి. యేతు భవిష్యంతః పుత్రాదయః తాంశ్చ మోక్షయిష్యన్ స్వప్రత్యయసామర్థ్యో మోచయిష్యన్భవతి. స ఏవం భూతః స్నాతకః శశ్వద్బహుకాలం బ్రహ్మలోకాన్నచ్యవతే. ద్విరుక్తిరధ్యాయ పరిసమాప్త్యర్థా. పునస్స్నాతక గ్రహణం స్నాతకధర్మాణామేవైతత్ఫలం న గృహస్థధర్మసహితానామితి సూచయితుమితి జ్ఞేయమ్.

ఇతి శ్రీ హారదత్త విరచితాయాం గౌతమీయ వివృతౌ నవమోఽధ్యాయస్సమాప్తః, ప్రశ్నశ్చాపి ప్రథమస్సమాప్తః.

ఆంధ్రవివరణము— ఈ యధ్యాయమునం దింతవఱకును వర్ణింపఁబడినట్టిరీతిని [redacted]వ్వఁడు ఆచరించుచునుండునో అట్టిస్నాతకుఁడు తనను గన్న తల్లితండ్రులను తనకు పూర్వసంబంధులగు (అనగా తనకుపెద్దలై ముందుచన్నవారగు) తాతలు మున్నగువారినిన్ని, అపరసంబంధులను (అనగా

తనకుతరువాత కలుగబోవునట్టి కొడుకులు ము న్నగువారినిన్ని సమస్తవిధములగు పాపములనుండి (అనగా ఇదివఱలో చేసినట్టివి ఇకముందుచేయు నట్టివి యగు సమస్త పాపములనుండియని యర్థము.) విడిపించుచున్నవా డగుటయేగాక తాను ఎప్పటికిని శాశ్వతములగునట్టి బ్రహ్మలోకము నుండి చ్యుతినొందక యుండగల్గుచున్నాడు-చ్యుతి నొందక యుండగల్గుచున్నాడు. (దిక్కుము)అని సూత్రమునకుఁ దాత్పర్యము. ఇచ్చట మూల సూత్రమునందు "నచ్యవతే నచ్యవతే"—అను ద్విరుక్తి ఈ అధ్యాయమును ముగించుచున్నా మని సూచించుటకని యెఱుంగునది. ఈ యధ్యాయమున వచ్చుచున్న సందర్భమునుబట్టియే స్నాతకుడు అని సిద్ధించుచున్నను మరల స్నాతకుడు అని చెప్పుటచేత ఈ చెప్పినట్టి ఫలములు కేవలమొక్క స్నాతకధర్మములను గుఱించినవి మాత్రమే యనియును ఇందులోనే గృహస్థధర్మ ములకును ఫలము నిర్దేశింపబడలేదు అనియు నెఱుంగవలయును.

విశేషాంశములు— ఇచ్చట మాతాపితరు లన్నమాటచేత లోకమునందు ఉత్పాదక సంబంధముచేత తలిదండ్రులుగా జెప్పబడినట్టి తన్నుగన్న తల్లిదండ్రులున్ను విద్యా ప్రదానాదికముచేత తండ్రులుగా చెప్పబడినట్టి ఆచార్యాదులును [ఈ యుభయులును] కూడా సంగ్రహింపబడెద రని యును పూర్వసంబంధు లన్నమాటచేత తండ్రిని గన్న తాత ముత్తాతలును అపరసంబంధు లన్న మాటచేత తల్లినిగన్న తాత ముత్తాతలును గ్రహింపబడవలయు ననియును మస్కరీయభాష్య మునందు చెప్పబడి యున్నది. యురిమ మను స్మృతియందు సైతము ఈవిషయమున నిట్లు ఫల శ్రుతి చెప్పఁబడినది:—శ్లో. ఏషోదితో గృహస్థస్య వృత్తి ర్విప్రస్య శాశ్వతీ, స్నాతక వ్రతకల్పశ్చ సత్త్వ వృద్ధికరశ్శుభః. శ్లో. అనేన విప్రో వృత్తేన వర్తయ న్వేదశాస్త్రవిత్, వ్యపేత కల్మషోనిత్యం బ్రహ్మలోకే మహీయతే- అని. [ఈ పైని చెప్పఁబడిన ఋతాదివృత్తి గృహస్థుఁడను బ్రాహ్మణునికి గృహస్థుఁడు కానున్నవానికని, శాశ్వతమైనదిగా- అనగా సర్వకాల సర్వావస్థ లందును అవిరతముగా ఆచరింపదగినదని చెప్పం బడినది. ఈపైని చెప్పబడినట్టి స్నాతకవ్రత విధానము శుభమగు సత్త్వగుణము నభివృద్ధిచేయు నని ప్రశంసింపబడినది. ఇట్టివృత్తితో విప్రుడు వేదశాస్త్ర వేత్తయై ప్రవర్తించినచో సమస్త పాపములనుండి విడివడి అంతమునందుసర్వోత్కృష్టమగు బ్రహ్మలోకమున (అనగా పరబ్రహ్మము నందు) వెలయగల వాడగును.]

ఇది భారద్వాజగోత్ర పవిత్రుడును, యజు శ్శాఖాధ్యాయియును,ఆపస్తంబసూత్రుడును,అధిగత కావ్యతీర్థ బిరుదుడును పంచాగ్నివంశ్యుడును, అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుడును అగు ఆదినారాయణశాస్త్రి కూర్చిన గౌతమ ధర్మసూత్రాంధ్ర వివరణమునందు ప్రథమప్రశ్న మునందు నవమాధ్యాయము ముగిసినది.

గౌతమ ధర్మసూత్రములందు ప్రథమప్రశ్నము సమాప్తము.

# గౌతమధర్మసూత్రములు

## ద్వితీయప్రశ్న ప్రారంభము.

381. సూ. ద్విజాతీనా మధ్యయన మిజ్యా దానమ్. [౨-౧-౧]

హరదత్తమితాక్షరా — ద్విజాతీనామితి. ఉక్తాః ప్రాయశః ఆశ్రమధర్మాః అథేదానీ వర్ణధర్మా వక్తు మారభ్యంతే ద్విజాతీనా మితి — యథాసంఖ్య మత్ర న భవతి. ఉత్తరత్రాధిక గ్రహణాత్ తత్రైవ వక్తవ్యం భవిష్యతి. అధ్యయనం వేదగ్రహణాభ్యాసరూపమ్. ఇజ్యా యాగో దేవతోద్దేశేన [illegible] దానం పాత్రే దవ్యత్యాగః ద్విజాతీనా మితి వదతా [illegible] ద్విజాతయః సంపన్నాః కృతోపనయ నాః [illegible] తే ధర్మాః, తేనానుపనీతానాం దానే [illegible] నాస్తీతి కేచిత్. నేతి చ వయమ్. ద్విజాతీనా [illegible] యేషాం ద్విజాతి జన్మ తేషామితి. తే నానుప నీతస్య పిత్రాదిభిః ప్రవర్తితస్య దానం భవతి.

ఆంధ్రవివరణము — వెనుకటి ప్రశ్నమునందు ప్రాయశః ఆశ్రమధర్మములు నిరూపింపబడి యున్నవి. ఇప్పు డీప్రశ్నమునందు వర్ణధర్మములను నిరూపింప దలచినవారై ఈ యధ్యాయమును ఆరంభించుచున్నాడు.

ద్విజాతులకు- అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు అధ్యయనము చేయుటయును, యజ్ఞములు యాగములు మున్నగువానిని చేయుటయును దానము నిచ్చుటయును ధర్మము లగునని సూత్రార్థము. అధ్యయనము చేయుటయనగా వేదమును తదంగములను గ్రహణ ధారణ జపాదులద్వారా మననము చేయుటలు మున్నగునవి. ఇచ్చట ద్విజాతులకు యథాసంఖ్యముగా (వరుసగా) అధ్యయనాదులు ధర్మములని అర్థము సేయరాదు. మున్ముందు అధికశబ్దమును గ్రహించుటంజేసి. సూత్రకారులకు ఇచ్చట యథాసంఖ్యమే యర్థమగునేని దీనినికూడ నచ్చటనే (371 సూత్రములో) చెప్పియుండెడివాడుగదా! మూలమునందు ద్విజాతు లనుటచేత ఎప్పుడు ద్విజాతు లయ్యెదరో- అనగా ఉపనయనాది సంస్కారములు కలవా రయ్యెదరో అప్పటినుండియే ఈ ధర్మములు ఆరంభింప దగుననియును, అందుచేతనే అనుపనీతులకు దానమునిచ్చుటలో కూడ నధికారము లేదనియును కొందఱందురు. కాని మేము ఆమతమును కాదందుము. ఏమన గా ఇచ్చట ద్విజాతు లన్నమాటచేత ఎవ్వరు ద్విజాతులలో జన్మించియుందురో వారు అని అర్థము చేసెదము. అందువలన విశేషమేమనగా అనుపనీతునికిగూడ అర్థమున్నచో ఆప్తులద్వారా ప్రవర్తితులైయుండి దానమిచ్చుటకు అధికారము గలదని తెలుచున్నది. ఈ అనుపనీతులకు దానాధికారము లేదన్నమతము మస్కరీయుల ననుసరించువారలది.

ఆంధ్రవివరణము—వెనుకజెప్పినట్టి శుశ్రూషువుల విషయమునందు కంటె తక్కినచోట్ల ఆచార్యులు జ్ఞాతులు ప్రియులు గురువులు ధననియమము విద్యానియమము గల వారు ఇట్టి వారి విషయమున వేదము నొసంగవలయునని సూత్రార్థము. ఆచార్యులు ఇదివఱకే రూపింపబడినారు. అన్నలు తమ్ములు పినతండ్రులు మున్నగువారు జ్ఞాతులు. స్నేహితులు మున్నగువారు ప్రియులు. మేనమామలు మున్నగువారు గురువులు. ధనము నొసంగి విద్యను గ్రహించువారు ధననియమము గలవారు. విద్య నొసంగి విద్యను గ్రహించువారు విద్యానియములు. ఈ ధన విద్యానియమము కూడ యోగ్యులగు వారి విషయమే. శిష్టాధ్యాపకులు అని చెప్పుటనుబట్టి. అంతియేకాని దానికిగూడ నిది అపవాదము అని అనరాదు.

385. సూ. కృషి వాణిజ్యే చాఽస్వయంకృతే. [౨-౧-౫]

హరదత్తమితాక్షరా—కృషీతి. కృషిః కర్షణేన సస్యోత్పాదనం, వాణిజ్యా క్రయ విక్రయ వ్యవహారః. తే చ బ్రాహ్మణస్యాధికే య ద్యస్వయంకృతే అన్యేన కారయితుం శక్యేతే.

ఆంధ్రవివరణము— అస్వయంకృతము లగునట్టివైనచో, అనగా తాను స్వయముగాచేయక తనకు బదులుగా మఱియొకరినుంచి వారిద్వారా చేయించుట శక్యము అగునేని, కృషి వాణిజ్యములు రెండును బ్రాహ్మణునకు అధికములగు ధర్మములని సూత్రార్థము. కృషియనగా భూమిని దున్నిపైరువేయించి ఫలింపజేసి జీవించుటయును వాణిజ్యము అనగా వ్యాపారము చేయించుటయును అని యెఱుంగునది. మస్కరీయభాష్యమునందు కృషి వాణిజ్యే చా స్వయంకృతే- అని పాఠమున్నది. అచ్చట చకారము వలన పశుపాలనము కూడ- [ఇతరులద్వారా చేయింపగల్గినచో అర్ఘ్యాదియును-] బ్రాహ్మణునకు ధర్మమే యగు నని విశేషము వ్రాయబడినది.

386. సూ. కుసీదం చ [౨-౧-౬]

హరదత్తమితాక్షరా—కుసీదమితి. కుసీద ముపచయార్థో ధనప్రయోగః, తదస్యఅస్వయంకృతంచే ద్బ్రాహ్మణస్య అధికమ్.

ఆంధ్రవివరణము—వెనుకజెప్పినట్టివి మాత్రమే గాక కుసీదము కూడ బ్రాహ్మణునకు అధికమగు ధర్మమే యగునని యర్థము. కుసీదమనగా ద్రవ్యమును పెంపుచేయుటకై యుపచయము చేయుట. అనగా వడ్డికి నిచ్చుట యని భావము.

387. సూ. రాజ్ఞోఽధికం రక్షణం సర్వభూతానాం [౨-౧-౭]

హరదత్తమితాక్షరా—రాజ్ఞఇతి. రాజ్ఞోభిషిక్తస్య సర్వభూతానాం రక్షణ మధికం ధర్మః, సర్వగ్రహణాత్ స్థావరాదీనా మ ప్యశ్వత్థాదీనాం ఛేదన నిరోధాదినాపి.

ఆంధ్రవివరణము—పట్టాభిషిక్తుడైనట్టి రాజునకు సమస్తభూతములయొక్క రక్షణమును ధర్మమై యున్నదని సూత్రార్థము. ఇచ్చట "సర్వభూతములయొక్క రక్షణము-" అన్నమాటచేత కేవలము ఒక్కమనుష్యులను మాత్రమేగాక జంగమములగు సమస్తజీవరాశినిన్నీ స్థావరములైన

వృక్షములు మున్నగు [అశ్వత్థాదులగు వనస్పతులు మొదలగు సమస్తమగు స్థావరమును] సమస్తమైన అంతస్సంజ్ఞగల భూతరాశినిన్నీ రక్షించి పోషించుట కూడ [అనగా అట్టివాని కేవిధమగు హానియు కలుగకుండునట్లుగా చేయుట కూడ] రాజునకు స్వధర్మమే యగునని సూచింపబడుచున్నయది.

388. సూ. న్యాయ్యదండత్వమ్ [౨-౧-౮]

హరదత్తమితాక్షరా—న్యాయ్యేత్యాది. న్యాయాదనపేతో న్యాయ్యః, శాస్త్రావిరుద్ధో దండో యస్య తద్భావో న్యాయ్యదండత్వమ్. న్యాయ దండత్వ మిత్యపి పాఠే ప్యయమేవార్థః, స చ రాజ్ఞో ధర్మః రాగద్వేషాదినా న న్యూనాధికదండ స్స్యా దితి.

ఆంధ్రవివరణము— న్యాయమునుండి తొలగని యట్టిది గనుక న్యాయ్యమనబడును [అనగా న్యాయసహితమైనదని భావము] న్యాయ్యమగు దండము కలవాడు న్యాయ్యదండుడు. అతని యొక్క ధర్మము న్యాయ్యదండత్వము. పట్టాభిషిక్తుడగునట్టి రాజునకు న్యాయ్యదండత్వము కల్గియుండుట కూడ ధర్మమని సూత్రార్థము. ఇచ్చట న్యాయ్యదండత్వ మనుమాటచేత శాస్త్రావిరుద్ధమగునట్టి దండనమని యర్థము గ్రహింపదగును. న్యాయదండత్వమ్ అనికూడ నొక పాఠముగలదు అచ్చటకూడ ఈపైని చెప్పినట్టి యర్థమే గ్రహింపదగినట్టిది. అనగా రాజగునట్టివాడు ప్రజలను పోషించి రక్షించుచు- తప్పులను చేయునట్టి వారిని- ఆయా అపరాధములకు తగినట్టిరీతిని [అర్థాత్తు ఎక్కువగాకుండను తక్కువగాకుండను] సమానముగా శిక్షించి ధర్మ్యమార్గమునందు నడచునట్లు చేయుట- అతనికి స్వధర్మమని తాత్పర్యము.

389. సూ. బిభృయా ద్బ్రాహ్మణాన్ శ్రోత్రియాన్ [౨-౧-౯]

హరదత్తమితాక్షరా— బిభృయాదితి. శ్రోత్రియాః అధీతవేదా స్తా న్బ్రాహ్మణాన్ అన్నాచ్ఛాదనైః బిభృయా త్పోషయే దిత్యర్థః.

ఆంధ్రవివరణము—వేదములను వేదాంగములను చదివినట్టి బ్రాహ్మణులకు శ్రోత్రియులని పేరు. శ్రోత్రియులైనట్టి బ్రాహ్మణులను అన్నాదుల నొసంగుటద్వారా- అనగా వారికి జీవిక జరుగునట్టి వసతులను ఏర్పఱచుట ద్వారా- రాజు భరింపవలయు నని సూత్రార్థము. అనగా తనదేశమునందు వసించునట్టి శ్రోత్రియులను ఉపేక్షచేయక పట్టాభిషిక్తుడగు రాజు జీవికలను కల్పించి వారిని పోషింపవలయు ననియును, అట్లొనర్పవలసియుండుట రాజులకేర్పడినట్టి ధర్మములలో నొక్కటియనియును తాత్పర్యము.

390. సూ. నిరుత్సాహాం శ్చ బ్రాహ్మణాన్ [౨-౧-౧౦]

హరదత్తమితాక్షరా—నిరుత్సాహానితి. జీవనార్థం ఉత్సాహం కర్తు మసమర్థాః నిరుత్సాహాః, తా న్బ్రాహ్మణా నపి బిభృయాత్. కింపున ర్బ్రాహ్మణాన్ ప్రత్యేకశః త్రే సర్జనే సమర్థా నపి శ్రోత్రియాన్ సమ మాహారాయ బిభృయాత్.

ఆంధ్రవివరణము— జీవనార్థమై నిరుత్సాహమును చెందినట్టి బ్రాహ్మణులను కూడ రాజు

భరింపవలయునని అర్థము. వెనుకటి సూత్రము నందు సమర్థులయి యున్నను శ్రోత్రియులైన-వా స్వయముగా నాహ్వానించి పోషింపవలయు నని యును, ఈ సూత్రమునందు ఆ శ్రోత్రియులను వలెనే జీవిక జరుగని - అనగా విరక్తి ఇత్యాదు లగు కారణములచే నిరుత్సాహులయి జీవనో పాధి లేనివారగు-బ్రాహ్మణులను కూడ పోషింప దగు ననియును భావము.

391. సూ. అకరాంశ్చ [౨-౧-౧౧]

హరదత్తమితాక్షరా—అకరానితి. యే పూర్వైర్దత్తా అకరాః బ్రాహ్మణాదిభ్య స్తాంశ్చ యథాపూర్వం బిభృయా ద్బాధకాదినిరాసేన. స్వయం చ నాపూర్వం కర ముత్పాదయే దితి.

ఆంధ్రవివరణము—తనపూర్వీకులు బ్రాహ్మ ణులు మొదలగువారికిచ్చినట్టి అకరములగు భూ ములు మున్నగువాటిని (అనగా పన్ను లేకుండ దానము చేసినట్టి భూములను) పట్టాభిషిక్తుడగు నట్టి రాజు- వానికి ఎట్టి బాధలును పొరయకుం డునట్టులుగా పాలించుచుండుటయేగాక తాను కూడ క్రొత్తపన్నులను వేనిని గాని వానిపై వే యరా దని భావము.

392. సూ. ఉపకుర్వాణాంశ్చ [౨-౧-౧౨]

హరదత్తమితాక్షరా—ఉపకుర్వాణానితి. అధీ యానాః బ్రహ్మచారిణః ఉపకుర్వాణాః తాంశ్చ బిభృయా దన్నాదిదానేన యద్యర్థినః స్వయం జీవితవంతో వనసూక రాదివ్యా వర్తనేన. అపర ఆహ- ఉపకుర్వాణాః లోక ముపకుర్వాణా వైద్యాదయ ఇతి,

ఆంధ్రవివరణము— అధ్యయనమును చేయు చున్నట్టి బ్రహ్మచారులను ఉపకుర్వాణులని యం దురు. అట్టి ఉపకుర్వాణులను అన్నము మున్న గువాని నొసంగుట ద్వారా రాజు పోషింపవల యు నని సూత్రార్థము. మఱికొందఱనిరి గదా! ఉపకుర్వాణులనగా లోకమునకు ఉపకారమును చేయునట్టి వైద్యులు మున్నగునట్టి వారు. అట్టి వారినికూడరాజు పోషింపవలయును అనిభావము.

విశేషాంశములు—మస్కరీయభాష్యమునం దు (390-391) పైరెండు సూత్రములును ఒక్క టిగానే వ్రాసి అర్థమునందు కూడ భిన్నతను గన బఱచిరి—వారివృత్తిననుసరించి- "అకరులనగా పరివ్రాజకులు అనగా సన్యసించినట్టివారు. అందు ననుకూడను బ్రాహ్మణులు మాత్రమే. వారికే రాజపోషణాధికార ముండుటవలన. మఱి అబ్రా హ్మణ పరివ్రాజకులు కారాదా యందురేని వా రికి ప్రతిగ్రహాధికారము లేనందున ఇచ్చట చెప్ప బడలేదు. కాబట్టి అట్టి అకరులను లోకమున కుపకరించునట్టి వైద్యప్రభృతులను రాజు పోషిం పవలయును"- అని సూత్రమునకు యర్థము.

393. సూ. యోగశ్చ విజయే [౨-౧-౧౩]

హరదత్తమితాక్షరా— యోగఇతి. యోగఉపా యో విజయవిషయ శ్చ యోగః కార్యః, అయమపి రాజ్ఞో ధికో ధర్మ ఇతి జ్ఞేయమ్.

ఆంధ్రవివరణము—విజయమును గుఱించిన విషయమునందు యోగము నవలంబింపవలయు నని యర్థము. అనగా శత్రుజయవిషయమునందు

మనస్సమాధిని పూనదగునని భావము. ఇది కూడ రాజునకు అధికమగుధర్మమేయని యెఱుంగవలయునని భావము. యోగమనగా అలబ్ధ లాభము. అనగా వాల్లభ్యాదులను పురస్కరించికొని పన్నుల నొసంగని ఆటవికాదులను ప్రయత్నపూర్వకముగా లొంగదీసి పన్నులను గ్రహించుటయును కేవలము గ్రహించుటయేగాక అట్లు గ్రహించిన వానినికూడ రక్షింపవలయు ననుట యును. ఏతావతా తేలిన విశేషమియ్యది "రాజగువాడు శత్రువులను జయింపగోరినచో ముమ్ముందు తనకువలసినట్టి యోగక్షేమములను సంపాదించికొని ఆపైని శత్రువిజయమునకై ప్రయత్నింపదగును" అని.

394. సూ. భయే విశేషేణ [౨-౧-౧౪]

హారదత్తమితాక్షరా—భయఇతి. అన్యాభిభవాది నిమిత్తే విశేషేణ యోగః కార్యః.

ఆంధ్రవివరణము— అందుననుకూడ ఇతర రాజులవలన అభిభవము రాగలయట్టి విషయములలో అత్యంతమును యోగముకలుగునట్టులుగా యత్నింపవలయునని సూత్రార్థము. అనగా అట్టి పరిస్థితులలో మామూలుదినము లందు కంటె నెక్కుడగు ప్రయత్నముతో యోగక్షేమములను సంరక్షించుకొన వలయు నని తాత్పర్యము.

395. సూ. చర్యా చ రథధనుర్భ్యామ్ [౨-౧-౧౫]

హారదత్తమితాక్షరా—చర్యాచేతి చరణం చరా బహిః ప్రదేశే చరణ రథ మారూఢో ధనుర్హస్తశ్చ చరేత్. రథగ్రహణం హస్త్యశ్వాదేరప్యుపలక్షణం ధనుర్గ్రహణం చ ఖడ్గాదేః.

ఆంధ్రవివరణము— సంచరించుటగూడ చర్య యనబడుచున్నది. రాజు పట్టణమునకు వెలుపల రాష్ట్రమునందు సంచరించునప్పుడు రథమును అధిరోహించియును ధనుస్సును ధరించియును చరింపవలయునని యర్థము. ఇచ్చట రథశబ్దము ఏనుగులు గుఱ్ఱములు మున్నగు వాటికిని ధనుశ్శబ్దము కత్తులు ఖడ్గములు మున్నగువాటికిని ఉపలక్షకముగా నెఱుంగునది. మూలమునందున్న చకారము వలన ఏకత్ర అవస్థానము సూచింపబడుచున్నదనియును, ఈచర్యను గూర్చినట్టి అవస్థానము (ఉనికి గూర్చినట్టి వ్యవస్థ) ఆయా కార్యములను బట్టియుండుననియును మస్కరీయ భాష్యమునందు వ్రాయబడి యున్నయది.

396. సూ. సంగ్రామే సంస్థాన మనివృత్తిశ్చ. [౨-౧-౧౬]

హారదత్తమితాక్షరా—సంగ్రామ ఇతి. సంగ్రామో యుద్ధమ్. తత్ర సంస్థానం ప్రాణాత్యయేపి నివృత్తిః పలాయనం, తదభావో అనివృత్తిః, ఏతే చ ...

ఆంధ్రవివరణము—యుద్ధము సంభవించునపుడు ప్రాణాత్యయమైనను నిలవబడుటయును, వెనుకకు తిరిగిపోక యుండుటయును - అనునియ్యవి రాజునకు అధికము లగు ధర్మములని సూత్రార్థము.

397. సూ. నదోషో హింసాయా మాహవే. [౨-౧-౧౭]

హారదత్తమితాక్షరా—నదోష ఇతి. యత్ర పరస్పర మాహ్వాయంతే స ఆహవః, తాదృశే యుద్ధే శత్రూణాం హింసాయా మపి న దోషః, నిత్య మహింస్య ఇత్యస్యాయ మపవాదః.

ఆంధ్రవివరణము— వీరు లైరాజులు దేని యందు ఒకరినొకరు యుద్ధార్థులై పిలచికొందురో, అయ్యది ఆహవమని యనబడును. అట్టి ఆహవమునందు శత్రువులను హింసించినప్పటికి గూడ నయ్యది హింస కాజాలదని తాత్పర్యము. ఇయ్యది నిత్యమహింస్రః - అన్నదానికి అపవాద సూత్రము.

398. సూ: అన్యత్ర వ్యశ్వ సారథ్యాయుధ కృతాంజలి ప్రకీర్ణకేశ పరాఙ్ముఖోపవిష్ట స్థలవృక్షాధిరూఢ దూత గోబ్రాహ్మణవాదిభ్యః.

[౨-౧-౧౮]

హరదత్తమితాక్షరా—విశబ్దశ్చ త్రిభి స్సంబధ్యతే. వ్యశ్వో విసారథిః వ్యాయుధ ఇతి. యస్యాశ్వో హతః వ్యశ్వః, యస్య సారథిర్హతః స విసారథిః, యస్యాయుధం కృత్తం పతితం వా స వ్యాయుధః కృతాంజలి ర్భయేన, ప్రకీర్ణకేశః కేశానపి నియంతు మక్షమః పరాఙ్ముఖో భయేన పృష్ఠీకృత్య పలాయమానః ఉపవిష్టః పలాయితు మక్షమః ఆసీనః స్థలవృక్షాధిరూఢః స్థల మున్నతప్రదేశ స్తం వృక్షం వా రూఢః దూతో వార్తాహరః. గౌరస్మి బ్రాహ్మణోస్మీతి యే వదంతి తే గోబ్రాహ్మణవాదినః ఏతేభ్యోన్యత్ర ఆహవే హింసాయం న దోషః, ఏతేషు తు దోష ఏవ.

ఆంధ్రవివరణము— ఈ క్రింద పేర్కొనబడువారు తప్ప తక్కిన వారియెడల యుద్ధమునందు చేయునట్టి హింసయందు దోషములేదని సూత్రార్థము. (౧) వ్యశ్వులు - యుద్ధము చేయుకాలమున ప్రతియోధుని బారికి గుఱియైగుఱ్ఱము కూలిపోయినట్టివాడు. (౨) విసారథి - సారథి చచ్చిపోయినట్టి వాడు. (3) వ్యాయుధుడు - అనగా విరిగిపోయినట్టి లేక జారి పడిపోయినట్టి కానిఆయుధము కలవాడు. (౪) కృతాంజలి - భయముచేత దోసిలొగ్గి రక్షణముం గోరెడివాడు. (౫) ప్రకీర్ణకేశుడు - భయముచేత తలముడి వీడగా దానిని మరల ముడివైచుకొనుటకైన చాలనివాడు. (౬) పరాఙ్ముఖుడు -ప్రాణభయముచే యుద్ధరంగమును వదలి వెన్నుజూపి పారి పోవువాడు. (౭) ఉపవిష్టుడు - పరుగెత్తుటకై శక్తిలేక కూలబడినవాడు. (౮) స్థలాధిరూఢుడు-శత్రుబాధకు వెఱచి కొండలు గుట్టలుమున్నగు ఎత్తగుచోట్ల కెగబ్రాకువాడు. (౯) వృక్షాధిరూఢుడు - చెట్లుచేమల నెక్కుడివాడు. (౧౦) దూత - శత్రువుల యొద్దినుండి సందేశమును గొనివచ్చినవాడు. (౧౧) గోవాది - ఏమియునెఱుంగని గంగి గోవునని అంగలార్చెడివాడు. (౧౨) యుద్ధమునందు బ్రాహ్మణవాది పప్పుబ్రాహ్మణుడను చచ్చుబ్రాహ్మణుడను కాన చంపకుడు. పశువును. రక్షించుడని మొరపెట్టువాడు-అను వీరిని తప్ప తక్కినవారి యెడల నైన హింసదోషము కాదని భావము.

399. సూ. క్షత్త్రియ శ్చేదస్య స్తముపజీవేత్తద్వృత్త్యా [౨-౧-౧౯]

హరదత్తమితాక్షరా—క్షత్త్రియ ఇతి. అన్యశ్చేత్ క్షత్త్రియః తం రాజానం దేశోపప్లవాదినా ఉపజీవేత్తదా తద్వృత్త్యా తస్య రాజ్ఞో యా వృత్తి శ్చర్యా రథధనుర్గ్రాహ్య మిత్యాదికా తయా యుక్తస్సన్ జీవేత్తేన రాజ్ఞైవ మసౌ సంమత ఇతి,

ఆంధ్రవివరణము—ఇతరుడు జాతిమాత్రము చేత సంబద్ధుడగు క్షత్త్రియుడున్నచో - ఆతడు ఆపట్టాభిషిక్తుడగు రాజును ఆవృత్తితోనే. (అన.

ఆంధ్రవివరణము—— వీరు లైరాజులు దేని యందు ఒకరినొకరు యుద్ధార్థులై పిలచి కొందురో, అయ్యది ఆహవమని యనబడును. అట్టి ఆహవమునందు శత్రువులను హింసించినప్పటికి గూడ నయ్యది హింస కాజాలదని తాత్పర్యము. ఇయ్యది నిత్యమహింస్రః - అన్నదానికి అపవాద సూత్రము.

398. సూ. అన్యత్ర వ్యశ్వ సారథ్యాయుధ కృతాంజలి ప్రకీర్ణకేశ పరాఙ్ముఖోపవిష్ట స్థలవృక్షాధి రూఢ దూత గోబ్రాహ్మణవాదిభ్యః.

[౨-౧-౧౮]

హరదత్తమితాక్షరా——విశబ్దః ప్రత్యేకం సంబధ్యతే. వ్యశ్వో విసారథిః వ్యాయుధ ఇతి. యస్యాశ్వో హతః వ్యశ్వః, యస్య సారథిర్హతః స విసారథిః, యస్యాయుధం కృత్తం పతితం వా స వ్యాయుధః కృతాంజలిర్భయేన, ప్రకీర్ణకేశః కేశానపి నియంతుమక్షమః పరాఙ్ముఖో భయేన పృష్ఠీకృత్య పలాయమానః ఉపవిష్టః పలాయితుమక్షమః ఆసీనః స్థలవృక్షాధిరూఢః స్థలమున్నతప్రదేశః తం వృక్షం వా రూఢః దూతో వార్తాహారః. గోఽస్మి బ్రాహ్మణోఽస్మీతి యే వదంతి తే గోబ్రాహ్మణవాదినః ఏతేభ్యోఽన్యత్ర ఆహవే హింసాయాం న దోషః, ఏతేషు తు దోష ఏవ.

ఆంధ్రవివరణము—— ఈ క్రింద పేర్కొనబడు వారు తప్ప తక్కిన వారి యెడల యుద్ధమునందు చేయునట్టి హింసయందు దోషములేదని సూత్రార్థము. (౧) వ్యశ్వులు - యుద్ధము చేయుకాలమున ప్రతియోధుని బారికి గుఱ్ఱమెగుర్రము కూలిపోయినట్టివాడు. (౨) విసారథి - సారథి చచ్చిపోయినట్టి వాడు. (3) వ్యాయుధుడు - అనగా విరిగిపోయినట్టి లేక జారి పడిపోయినట్టి కానిఆయుధము కలవాడు. (౪) కృతాంజలి - భయముచేత దోసిలొగ్గి రక్షణముం గోరెడివాడు. (౫) ప్రకీర్ణకేశుడు - భయముచేత తలముడి వీడగా దానిని మరల ముడివైచుకొనుటకైన చాలనివాడు. (౬) పరాఙ్ముఖుడు - ప్రాణభయముచే యుద్ధరంగమును వదలి వెన్నుజూపి పారిపోవువాడు. (౭) ఉపవిష్టుడు - పరుగెత్తుటకై శక్తిలేక కూలబడినవాడు. (౮) స్థలాధిరూఢుడు-శత్రుబాధకు వెఱచి కొండలు గిట్టలుమున్నగు ఎత్తగు చోట్ల కెగబ్రాకువాడు. (౯) వృక్షాధిరూఢుడు - చెట్లుచేమల నెక్కెడివాడు. (౧౦) దూత - శత్రువుల యొద్దినుండి సందేశమును గొనివచ్చినవాడు. (౧౧) గోవాది - ఏమియు నెఱుంగని గంగిగోవునని అంగలార్చెడివాడు. (౧౨) యుద్ధమునందు బ్రాహ్మణవాది పప్పుబ్రాహ్మణుడను చచ్చుబ్రాహ్మణుడను కాన చంపకుడు. పశువును. రక్షించుడని మొరపెట్టువాడు-అను వీరిని తప్ప తక్కినవారి యెడల నైన హింసదోషము కాదని భావము.

399. సూ. క్షత్త్రియ శ్చేదన్య స్తముపజీవేత్తద్వృత్త్యా [౨-౧-౧౯]

హరదత్తమితాక్షరా——క్షత్త్రియ ఇతి. అన్యశ్చేత్ క్షత్త్రియః తం రాజానం, దేశోపప్లవాదినా ఉపజీవేత్తదా తద్వృత్త్యా తస్య రాజ్ఞో యా వృత్తి శ్చర్యా రథధనుర్గ్రాహ్య మిత్యాదికా తయా యుక్తస్సన్ జీవేత్తేన రాజ్ఞైవ మహో సంమత ఇతి,

ఆంధ్రవివరణము——ఇతరుడు జాతిమాత్రముచేత సంబద్ధుడగు క్షత్త్రియుడున్న చో - ఆతడు ఆపట్టాభిషిక్తుడగు రాజును ఆవృత్తితోనే. (అన.

గా ఏవృత్తి పటాభిషిక్తునకు ఏర్పరుపబడినదో దానితోనే) ఉపజీవింపవలయు నని తాత్పర్యము.

400. సూ. జేతా లభేత సాంగ్రామికం విత్తమ్. [౨-౧-౨౦]

హరదత్తమితాక్షరా—జేతేతి. రాజ్ఞా నియుక్తో రాజభృత్యాది స్సంగ్రామే శత్రూ న్నిర్జిత్య యద్విత్తం లభతే త త్సఏవ జేతా లభేత న రాజా.

ఆంధ్రవివరణము— యుద్ధసమయములలో రాజుచేత శత్రుజయార్థమై నియోగింపబడెడి సేవకులు క్షత్రియులు మున్నగువారు శత్రువులను జయించినపిమ్మట (యుద్ధకాలమునందు) ఎవ్వరెవ్వరేయే వస్తువులను గెల్చెదరో, వారువారు ఆ వస్తువులను గ్రహింపవలయునే కాని రాజు తీసికొనగాదని తాత్పర్యము. అనగా ఇట్టి వస్తువులనే సాంగ్రామిక ధనమనియును అయ్యది భృత్యులదేగాని రాజుది కాదనియును భావము.

401. సూ. వాహనం తు రాజ్ఞః. [౨-౧-౨౧]

హరదత్తమితాక్షరా—వాహన మితి. వాహనం హస్త్యశ్వాదికం నిర్జిత్య లబ్ధం రాజ్ఞో భవతి న జేతుః.

ఆంధ్రవివరణము— ఇట్లు గెల్చినవస్తువులు ఏనుగులు గుఱ్ఱములు మున్నగు వాహనములుగా నున్నచో అయ్యవి రాజునకే చెందునుగాని గెల్చినవారికి (భృత్యునకు) చెందవని సూత్రార్థము. ఇది వేర్వేరుగా శత్రువులను గెల్చి తెచ్చిన ధనవిషయమున మాత్రమే అని భావము.

402. సూ. ఉద్ధార శ్చాపృథ గ్జయే. [౨-౧-౨౨]

హరదత్తమితాక్షరా—ఉద్ధార ఇతి. యది సర్వై సైనికాః సంభూయ జయేయు ర్జిత్వా చ కిమపి లభేరన్ తస్మిన్న పృథగ్జయే రాజ్ఞ ఉద్ధారో విశేషద్రవ్యం స్వయం స్వేతో దేయః.

ఆంధ్రవివరణము—సైనికు లెల్లరును కలసియే గెల్చియును, గెల్చుటయేగాక ఏమైన విశేషమైన ద్రవ్యమును కలసియే తెచ్చియు నున్నచో అట్టి దానియందు రాజునకు ఎక్కువపాలు ద్రవ్యమును (అతడు కోరినదానిని) ఒసంగదగును.

403. సూ. అన్యత్తు యథార్హం భాజయే ద్రాజా. [౨-౧-౨౩]

హరదత్తమితాక్షరా—అన్యదితి. య త్స్వయం వృతం మాణిక్యాది తతోన్య ద్యథార్హం యస్య యాదృశా న్వ్యాపారో యావద్వా శౌర్యం త త్తదనురూపేణ భాజయేత్. యత్రైతే తదనురూపం భజేరన్ తథా కారయే దిత్యర్థః.

ఆంధ్రవివరణము—సైనికులు స్వయముగా గెల్చి తెచ్చిన మాణిక్యములు రత్నములు మున్నగు రాజభోగ్యములగు వస్తువులు గాక తక్కిన వస్తుజాతమును రాజు వారివారియొక్క పనిని బట్టియును కార్యమును అనుసరించియును అందులకు తగినట్లుగా వారలకు పంచి యొసంగదగును.

404. సూ. రాజ్ఞే బలిదానం కర్షకై ర్దశమమష్టమం షష్ఠమం వా [౨-౧-౨౪]

హరదత్తమితాక్షరా—రాజ్ఞ ఇతి. కర్షకైః క్షేత్రేయ ల్లబ్ధం తస్య దశమోభాగో అష్టమః షష్ఠో వాంశో బలిదానం కరరూపేణ దేయః, అస్యరాజ్ఞః కర్షకైః క్షేత్రే యల్లబ్ధం తద్రక్షణనిమిత్తా వృత్తిశ్చైషా క్లృప్తా యా భూమేః అతిభోగ మధ్యమభోగ అల్పభోగవిషయోయం వ్యవస్థితో వికల్పః, అతిభోగే దశమాంశో మధ్యమభోగే అష్టమాంశః అల్పభోగే షష్ఠాంశ ఇతి.

ఆంధ్రవివరణము— కర్షకులనగా భూమిని దున్ని వ్యవసాయము చేయునట్టివారు. కర్షకులు ఇట్లు భూములనుదున్ని పైరుచేసి పండించిన ఫలములో పదియవపాలును గాని ఎన్మిదవపాలును గాని ఆరవపాలునుగాని రాజునకు బలిదానము నొనర్చవల[illegible]ను. అనగా పన్నులక్రింద నొసంగవలయునని తాత్పర్యము. ఇయ్యది రాజునకు రక్షణనిమిత్తమేర్పడిన వృత్తియగును. ఇచ్చట చేసిన ఈవికల్పము వ్యవస్థితవికల్పము. కావునపంట మిక్కిలిగా పండినప్పుడు దశమాంశమనియును మధ్యమరీతిగా పండినప్పుడు అష్టమాంశమనియును అల్పముగా పండినప్పుడు ఆరవపాలనియును ఇట్లు పన్ను నొసంగవలయునని ఎఱుంగవలయునని భావము.

405. సూ. పశుహిరణ్యయో రప్యేకే పంచాశద్భాగః [౨-౧-౨౫]

హారదత్తమితాక్షరా— పశు హిరణ్యయో రితి. యే పశుభిర్జీవంతి యే వా హిరణ్యప్రయోక్తారో వార్ధుషికా స్తైః పంచాశత్తమో భాగో రాజ్ఞే దేయ ఇత్యేకే. తద్యథా యస్య పంచాశత్పశవ స్సంతి స ప్రతిసంవత్సర మేకం పశుం రాజ్ఞే దద్యాత్. యస్య వా పంచాశన్నిష్కైః వృద్ధిప్రయోగః స ప్రతిసంవత్సర మేకైకం నిష్కం రాజ్ఞే బలిరూపేణ దద్యా దితి.

ఆంధ్రవివరణము—ఆవులు ఎద్దులు గేదెలు (బఱ్ఱెలు) మున్నగునవి పశువులు. బంగారు నాణెములు వెండి నాణెములు మున్నగునవి హిరణ్యములు. పశువులద్వారాను హిరణ్యములద్వారాను ఎవ్వరు జీవనమును జరుపుకొందురో వారు వానిమీాద వచ్చునాదాయములో ఏబదియవ పాలును రాజునకు పన్నుగా నొసంగవలయునని కొందఱి మతమని సూత్రార్థము. అనగా ఎవ్వరు పశువులను పెంచి విక్రయించుచుగాని నవరలు రూపాయలు మున్నగు ధనమును వడ్డికిఇచ్చి జీవించుచుగాని యుందురో అట్టివారు ఏబదియవపాలును రాజునకు పన్నుగానొసంగవలయునని తాత్పర్యము. ఇయ్యది ఎట్లనగా ఎవ్వరికి ఏబదిపశువులును జీవనముగానుండునో వాడు తనకువచ్చు ఆదాయమునుండి ప్రతియేటను ఒక్కొక్క పశువును రాజునకు ఇయ్యవలయును. ఎవ్వరికి ఏబది వరహాలతో వడ్డిజీవనము జరుగుచుండునో వాడు ప్రతియేటను ఒక్కొక్క వరహాను రాజునకు పన్నుగా నొసంగవలయునని తాత్పర్యము. ఈసూత్రమునందు చెప్పబడునట్టి పన్నులవిధానము గౌతమునకు ఇష్టమైనదికాదని కొందర(ఏకే)న్నమాటచే యెఱుంగవలయును.

విశేషాంశములు—. ఇచ్చట హిరణ్యమును వడ్డికి ఇచ్చెడి (వార్ధుషికుల) వారి విషయమైగల నిషేధస్మృతి వాక్యము మస్కరీయ భాష్యమునందు దాహరింపబడినది. శ్లో. సమార్ఘంధనము ద్ధృత్య మహార్ఘంయః పయచ్ఛతి. సవైవార్ధుషికో నామబ్రహ్మవాదిషు గర్హితః[విద్వాంసుడు సమమైన వెలగలద్రవ్యమునుగొని మహార్ఘమైనదానినిగా ఒసంగుచున్నాడో వాడువార్ధుషికుడని యనబడును. ఆతడు బ్రహ్మవాదులలో గర్హితుడని చెప్పబడుచున్నాడు.] అని.

406. సూ. వింశతిభాగ శ్శుల్కః పణ్యే. [౨-౧-౨౬]

హారదత్తమితాక్షరా—వింశతి భాగఇతి. యద్వ్

ణిగ్భి ర్విక్రీయతే తత్పణ్యం తత్రవింశతి తమోభాగో రాజ్ఞే దేయ స్తస్యైవ దీయమానస్య శుల్క ఇతిసంజ్ఞా. శుల్క ప్రదేశాః ప్రతిభాష్యం వణిక్శుల్క మిత్యాదయః.

ఆంధ్రవివరణము.—వర్తకులు మారు బేరమునకు విక్రయించుకొను వస్తువు లెయ్యవిగలవో అయ్యవి పణ్యములని యనబడును. పణ్యవిషయమునందు ఇరువదియవపాలు రాజునకు పన్నుగా నొసంగవలయునని సూత్రార్థము. ఈ సూత్రమునందు శుల్కమను నర్థము ప్రసక్తమగుచున్నప్పటికి మఱల ప్రత్యేకముగా శుల్కశబ్దమును పేర్కొనుట సంజ్ఞానిమిత్త మనియును, "శుల్కప్రవేశాః"- ఇత్యాదిసూత్రముల యందు వణిక్శుల్కము మున్నగు వ్యవహారము లిందు మూలమున సిద్ధించు ననియును ఎఱుంగవలయును.

407. సూ. మూలఫలపుష్పౌషధ మధుమాంస తృణేంధనానాం షష్ఠః. [౨-౧-౨౭]

హరదత్తమితాక్షరా—మూలేతి, మూలం హరిద్రాది. ఫలం ఆమ్రాది పుష్పం ఉత్పలాది ఔషధం బిల్వాది శిష్టాని ప్రసిద్ధాని. ఏతేషు పణ్యేషు షష్ఠతమోభాగో రాజ్ఞే దేయో విక్రేత్రా.

ఆంధ్రవివరణము—పసపు మున్నగు (దుంపలుగా పైరగు) వస్తువులు మూలము లనబడును. మామిడిపండ్లు మున్నగునవి ఫలములనబడును. కల్వలు మున్నగునవి పుష్పము లనఁబడును. బిల్వములు మున్నగునవిఔషధములు. మధువనగా తేనె. మాంసము సుప్రసిద్ధము. తృణము పశువులుమున్నగు వానికైన కసవుఇంధనములనగా కట్టెలు. మూలములు ఫలములు పుష్పములు ఔషధులు మధుమాంసములు కసవు పదార్థములు కట్టెలు—వీనిని పణ్యములుగా నుంచుకొని జీవనము చేయుచున్నచో అట్టివాడు తనయాదాయములో అరువదియవ వాలును పన్నుగా నొసంగవలయునని సూత్రార్థము.

విశేషాంశములు—ఇచ్చట మస్కరీయ భష్యమునందు ఫలమనగా మిరియములు మున్నగనవి యనియును, పుష్పములనగా కుసుంభ పుష్పములు మున్నగువనియు, ఔషధులనగ అభయ (కరక్కాయ) మొదలగునవి యనియున నర్థము వ్రాయబడినది.

408. సూ. తద్రక్షణ ధర్మిత్వాత్.

[౨౧-౨౮]

హరదత్తమితాక్షరా—కస్మాత్పున రేవం రాజ్ఞే దేయఇత్యత అహ తదితి. తేషాం కరదాయినాం రక్షణరూపేణ ధర్మేణ తద్వత్త్వాత్తే పామయం రక్షకఇతి కృత్వా

ఆంధ్రవివరణము—వెనుకటి సూత్రములందు రాజునకు పన్నుల నొసంగవలయునని నిరూపింపబడినది. అయితే ఈవిధముగా నతనికి (రాజునకు) ఈయా వృత్తుల వారు ఏల ఈపన్నుల నీయవలయును?-- అని శంకరాగా వారించుచున్నాడు. - రాజు ఆయావృత్తుల వారి కందరకును రక్షణధర్మియై యుండుటవలన (నొసంగవలయు) నని సూత్రార్థము. అనగా పన్నుల నొసంగునట్టి వారి కందరకును వారివారి వృత్తులను తదాధారములను రక్షించి నిలవబెట్టుచుండుట రాజునకు ధర్మము గనుకను అట్టిధర్మమును రాజు నిర్వర్తించు చుండుటచేత ఆయావృత్తుల వారును (ఆతనిని రక్షకుడని తలంచి) పన్నుల నొసంగదగుననియును తాత్పర్యము.

కొనవలయునని సూత్రార్థము. ఇచ్చట రాజువృత్తిని జరుపుకొనుట యనగా తనకు అధికారము అని చెప్పబడినట్టి క్రియలద్వారా తాను ఆర్జించిన ద్రవ్యముతో తనయొక్క పోష్యవర్గమగు భార్యాపుత్రాదులను పోషించుకొనవలయునేగాని పూర్వులార్జించిన నిక్షేపముతో చేయరాదనియును, ఆపత్కాలములందు ఇట్టి పూర్వార్జిత విత్తముతో గూడ పోషించుకొనవచ్చు ననియును తాత్పర్యము. ఈ యర్థమునకు ఉపబలకముగా వ్యాఘ్రుని వచనముగూడ నున్నయది. రాజు ప్రతిదినమును తన కుటుంబమును పోషించుచునూ ఉండవలయును పూర్వసంచిత కోశమును గూడ వృద్ధిచేయవలయును. ఆపత్కాలములలో తప్ప తక్కిన వేళలలో నెప్పుడును పూర్వసంచిత కోశమునుండి ధనమును గ్రహింపగూడదు అని. ఇచ్చట కోశమనగా (ఖజానా) ధనమును నిలువజేయునట్టి కొట్టు అని అర్థము.

411. సూ. శిల్పినో మాసిమా స్యేకైకం కర్మ కుర్యుః [౨-౧-౩౧]

హరదత్తమితాక్షరా— శిల్పిన ఇతి. ఏకేనాహ్నా సాధ్యం కర్మ ఏక మిత్యుచ్యతే.—శిల్పినో లోహకారాదయః, తేపి ప్రతిమాసేం రాజ్ఞే స్వీయు మేకమహః కర్మకుర్యుః. ఏషఏవ ఏషాం శుల్కః.

ఆంధ్రవివరణము—ఏకమనగా ఒకటి ఒక్క పగలుతో చేయదగినట్టి పనికి గూడ ఏకమని పేరు. లోహకారులు స్వర్ణకారులు మున్నగువారు శిల్పులనబడుదురు. శిల్పముచేత జీవించునట్టి వారగు లోహకారులు మున్నగువారు నెలనెలకు రాజునకు చెల్లింపవలసినట్టి పన్నునకు బదులుగా) ఒక్కొక్కదినము పనిని చేయవలయునని సూత్రార్థము. అనగా శిల్పవృత్తిచేత జీవించునట్టి వారు ధనాదుల ద్వారా పన్నును చెల్లింపలేనట్టి వారు గనుక అట్టివారిని నెల కొక్కొక్కదినము దివాణమున వారి పనుల చేయించి ఆకూలిని శుల్కముగా రాజు గ్రహింపదగు నని తాత్పర్యము.

విశేషాంశములు— ఈ విషయమునందు మనువు ఇట్టులు అధికృతమును చెప్పుచున్నాడు- శ్లో. కారుకాన్ శిల్పినశ్చైవ శూద్రాం శ్చాత్మోపజీవినః, ఏకైకం కారయేత్కర్మ మాసిమాసి మహీపతిః. [సూపకారులు మొదలగు కారువులనన్నా, అంతకంటెను కొంచెమంత యుత్కృష్టులుగ గణింపదగిన లోహకారులు మున్నగు వారినిన్ని తమతమ యొక్క శరీరకష్టముల వలన జీవించునట్టి కూలీలు మొదలగు [ఆత్మోపజీవులగు] శూద్రులనన్నా రాజగువాడు నెలనెలకున ఒక్కొక్కదినపుపనిని [పన్నుకు బదులుగా] చేయింపవలయును అని. సూత్రార్థము.]

412. సూ. ఏతేన ఆత్మోపజీవినో వ్యాఖ్యాతాః [౨-౧-౩౨]

హరదత్తమితాక్షరా— ఏతేనేతి. ఆత్మోపజీవినో యే శరీరాయాసేన జీవంతి కాష్ఠవాహాదయః తేప్యేతేః శిల్పిషూక్త ప్రకారేణ వ్యాఖ్యాతాః. మాసిమా స్యేకైక కర్మ కుర్యురితి. న త్వతాదిష్వ ప్యేషైవ గతిః.

ఆంధ్రవివరణము—శిల్పుల విషయమును గణించిన పన్నులను చెప్పుటచేత- ఇంకను వీరివలె శరీరకష్టము చేసి జీవించునట్టి ఇతరులు గూడ

[శాస్త్రపాఠకులుమొ] ఇట్టులనే పన్నునకు బదులుగ రాజునకు నెల కొక్కొక్కరోజు పనిని చేయవలయునని సూత్రార్థము. నటనర్తకాదులకు కూడ ఇదియే రీతి.

**413.** సూ. నౌ చక్రీవంతశ్చ. [౨-౧-౩౩]

హరదత్తమిశ్రాః—నౌ చక్రీవంత ఇతి. నౌశ్చ చక్రంచ నౌచక్రే. చక్రశబ్దేన తద్వచ్ఛకటం లక్ష్యతే. తద్వంతః నౌచక్రీవంతః, ఆసందీవదిత్యాదినా కథంచిద్రూపసిద్ధిః. నావంతో నౌజీవినః, చక్రవంతశ్శకటజీవినః, తేపి రాజ్ఞ ఏకమహస్తత్కర్మ కుర్యుః.

ఆంధ్రవివరణము—నౌః అనగా ఓడ. చక్రమనగా బండియొక్క చక్రము. అయినను ఇచ్చట బండియనియే లక్షణయా చెప్పబడుచున్నది. నావకలవాడు నౌవంతుడు. చక్రము గలవాడు చక్రీవంతుడు. నౌవంతుడును చక్రీవంతుడును [అనగా నావను జీవనాధారముగా పెట్టుకొని ఇతరుల సామానులను బాడుగకు వేసికొనిపోయి చేర్చి జీవించువాడును, బండిని జీవనాధారముగా గొని బాడుగతో జీవించువాడును అని భావము] కూడా వెనుక జెప్పినట్టి శిల్పులు మొదలగు వారివలెనే నెలనెలకును ఒక్కొక్కదినము పనిని రాజునకు పన్నుకుబదులుగా చేయుచుండవలయు సూత్రార్థము.

**414.** సూ. భక్తం తేభ్యోదద్యాత్. [౨-౧-౩౪]

హరదత్తమిశ్రాః—భక్తమితి. శిల్పినో మాసి మాసీ త్యారభ్య యేనుక్రాంతా స్తేభ్యః కర్మకుర్వద్భ్యో భక్తమన్నం దివాభోజనం దద్యాద్రాజైవ.

ఆంధ్రవివరణము—శిల్పులు మున్నగు వారందఱును ద్రవ్యరూపముగా పన్నును చెల్లింపలేనివారగుటచేత గదా ఇట్టులు నెలకొక్కొక్క దినము పన్నునకు బదులుగా పని చేయనలసినట్టులు విధింపబడినది! కాని నెలకొక్కొక్క రోజున రాజునకు పనిచేయుకాలమున వీరి భోజనస్థితి యెట్లు జరుగవలయును? - అని ఆశంకరాగా వారించుచున్నాడు. శిల్పినో మాసిమాసి [411-413] అనే సూత్రము మొదలుకొని ఇంతవనుక జెప్పంబడినట్టి ఆయావృత్తులవారు రాజునకు నెలకొక్కొక్కరోజు పనిచేయునట్టి దినములలో [అనగా ఏరోజు రాజునకు పనిచేయువచ్చిన నారోజు] వారికగునట్టి భోజనమును మాత్రమే రాజుగారే ఒసంగవలసి యున్నదని సూత్రార్థము.

**415.** సూ. పణ్యం వణిగ్భిః అర్థాపచయేన దేయమ్. [౨-౧-౩౫]

హరదత్తమిశ్రాః—పణ్యమితి. మాసిమాస్యేకైకమిత్యనువర్తతే. వింశతిభాగశ్శుల్కః పణ్య ఇత్యుక్తమ్. తతశ్శుల్కాదధికమిదం మాసిమాస్యేకం పణ్యమర్థాపచయేన ప్రాప్తస్య మూల్యస్య కించిన్న్యూనతాం కల్పయిత్వా వణిజో రాజ్ఞే దద్యుః, తథాచ బృహస్పతిః-శ్లో. శుల్కం దద్యుస్తతో మాసమేకైకం పణ్యమేవచ, అర్ఘాపచం మూల్యేన వణిజస్తే పృథక్పృథక్ - ఇతి.

ఆంధ్రవివరణము— ఆదాయమునుండి ఇరువదియవపాలు గలశుల్కము పణ్యమని ఇదివఱకే చెప్పబడినది. వెనుక జెప్పిన శుల్కమున కంటెను ఎక్కువగా నెలనెలకును ఒకొక్కొక్క పణ్యమును అర్థాపచయముచే రాజునకు ఇవ్వదగునని సూత్రార్థము. ఇయ్యది వర్తకము చేయువారి విషయమని ఎఱుంగఁదగినది.

416. సూ. ప్రనష్టమస్వామిక మధిగమ్య రాజ్ఞే ప్రబ్రూయుః [౨-౧-౩౬]

హరదత్తమితాక్షరా—ప్రనష్టమితి. ప్రనష్టం స్వామినః సకాశాత్ భ్రష్టం అస్వామికం అజ్ఞాయమానస్వామికం అధిగమ్య భూమౌ పతితం ముపలభ్య జనపదపాలనే నియుక్తా ఏతే రాజ్ఞే ప్రబ్రూయుః, అన్యేవా యేకేచి ద్దృష్టవంతః తే ప్రబ్రూయుః.

ఆంధ్రవివరణము—త్రోవలో ఏవేని వస్తువుల యొక్క హక్కుదారులనుండి జారిపడిపోయినట్టి వస్తుజాతమును ప్రనష్టమని యందురు. హక్కుదారు డెవ్వడో యెఱుఁగరాక దొరకినట్టి వస్తుజాతమునకు అస్వామిక మని పేరు. ప్రనష్టమైయున్నట్టి వస్తువులను గాని. అస్వామికమగువస్తువులను గాని కనుగొన్నప్పుడు-వానిని - ఆయా జనపదములను పాలించుటకై నియోగింపబడినట్టి అధ్యక్షులుగానీ- లేక ఇతరులు గాని-రాజునకు విజ్ఞాపింప వలయునని సూత్రార్థము.

417. సూ. విఖ్యాప్య సంవత్సరం రాజ్ఞా రక్ష్యమ్. [౨-౧-౩౭]

హరదత్తమితాక్షరా—తతః కింకర్తవ్యం రాజ్ఞా ఇత్యత్రాహ విఖ్యాప్యేతి. విఖ్యాప్య ఇదమేవం జాతీయకం వస్తు సమాసాదితం రక్ష్యతే యస్యైతత్ స్యాత్ స ఆగచ్ఛత్వితి నగరే పటహేన ఘోషయిత్వా సంవత్సరం రక్ష్యం. ప్రాక్సంవత్సరాత్ స్వామ్యాగచ్ఛతి తతో లక్షణాని పృష్ట్వా సామ్యం చేత్ తస్మై దేయమ్. వైషమ్యే స దండ్యః. తథాచ యాజ్ఞవల్క్యః—శ్లో: ప్రనష్టాధిగతం దేయం నృపేణ ధనినే ధనం, విభావయే న్నచేల్లింగై స్తత్సమం దండమర్హతి.

ఆంధ్రవివరణము— వెనుకటి సూత్రములో చెప్పినట్లుగా ప్రనష్ట స్వామికమగునట్టి వస్తువును రాజునకు చేర్చినపిమ్మట ఆరాజు చేయవలసినపనియేమి అని ఆశంక గలుగగా చెప్పుచున్నాడు.- "ఇట్టివస్తువు ఈవిధమగువస్తువు మాకు దొరకినది. జాగ్రత్త చేయబడినది కూడను. కాబట్టి ఈవస్తు వెవ్వనికి చెందియున్నదో వాడు వచ్చికొని పోవచ్చును"- అని నగరమునందు తప్పెట మున్నగువాని ద్వారా తెలియబఱచి (అనగా దండూరాను వేయించి) ఆ వస్తువుయొక్క హక్కుదారులు వచ్చినచో ఈయవలయును. లేనిచో ఒక్క ఏడాదివఱకును హక్కుదారులు ఎవ్వరైనను వచ్చిన నిచ్చుటకొఱకు దానిని రాజు జాగ్రత్తగా దాచి యుంచవలసినది. ఇట్లు దాచునప్పుడు సంవత్సరము లోపల ఎవడైనను హక్కుదారుడనని వచ్చినచో అతనిని ఆవస్తువుయొక్క లక్షణములను (అనగా గుర్తులను) చెప్పుమనియడిగి ఆలక్షణములన్నియును సరిగా సరిపోయినచో అతనికి ఆవస్తువును ఇచ్చివేయవలయును. లక్షణములు సరిపోక వైషమ్యము (హెచ్చుతగ్గులు)ఉన్నట్లున్న, మోసమునకు యత్నించినచో అతనిని మోసగానినిగా నిర్ణయించి అట్లు మోసము చేసినందులకై శిక్షింపవలయును. ఇట్లే యాజ్ఞవల్క్యుడు కూడ చెప్పియున్నాడు- రాజుచేత ప్రనష్టాధిగతమగు ధనమును (దానియందు హక్కుగలదని నిర్ణయింపబడినచో) సొమ్ము గలవానికి ఈయవలెను. ఇయ్యున్నది లక్షణములచేత విరుద్ధముగా నున్నట్లు తోచినచో రెట్టింపు దండనమునకు వాడు (అనగా మోసగాడు) అర్హుడగుచున్నాడు. అని.

418. సూ. ఊర్ధ్వ మధిగంతా శ్చతుర్థం రాజ్ఞ శ్శేషః. [౨-౧-౩౮]

హరదత్తమితాక్షరా— ఊర్ధ్వమితి. యేనాధిగమ్య ఆఖ్యాతం తస్మై చతుర్థమంశం దత్వా శేషో రాజ్ఞా గ్రాహ్యః.

ఆంధ్రవివరణము—ఇట్టులు సంవత్సరము వఱకు రాజు ఆవస్తువులను రక్షించినప్పటికీ గూడ "నేను హక్కుదారుడను"-అని యెవ్వరును రాని యెడల చేయవలసిన దేమి?- అనినచో చెప్పుచున్నాడు. ఆవస్తువుయొక్క విలువలో దానిని కనిపెట్టిన వాని నాల్గవపాలు నొసంగి తక్కినమూడు పాళ్లను రాజు స్వాధీన పఱచుకొనదగునని యర్థము.

419. సూ. స్వామీ రిక్థక్రయ సంవిభాగ పరిగ్రహాధిగతేషు. [౨-౧-౩౯]

హరదత్తమితాక్షరా— స్వామీతి. రిక్థం పిత్రాదీనామభావే ప్రాప్తం. క్రయో మూల్యేన స్వీకారః సంవిభాగో భ్రాత్రాదీనాం సాధారణస్య పరస్పర విభాగః పరిగ్రహో వస్త్వేష్వస్వామికేషు వృక్షాదిషు పూర్వస్వీకారః. అధిగమః ప్రనష్టస్వాజ్ఞాతస్వామికస్య నిధ్యాదేః స్వీకారః. ఏతేషు కారణేషు ద్రవ్యస్వీకర్తా స్వామీ భవతి. తేన ప్రనష్టేధిగతే రాజ్ఞోధిగంతుశ్చ స్వామ్య ముపపన్నమితి ప్రకరణసంగతిః. క్షేత్రేషూత్పన్నాని సస్యాదీని క్షేత్రవదేవ క్షేత్రవతస్స్యురపి. ఏతేనాక్షేత్రేషూత్పన్నం లవణాది వ్యాఖ్యాతం. ఏతాని సర్వవర్ణ సాధారణాని స్వామ్య కారణాని.

ఆంధ్రవివరణము— ఇట్లు ప్రనష్టాధిగతమైన వస్తువునుగూర్చిన యజమానుడు సంవత్సరము లోపలనే ఈవస్తువు నాదియని చెప్పినచో ఆచెప్పినవాడే హక్కుదారుడని తెలిసికొనుట యెట్లు అని ఆశంక కల్గగా వారించుచున్నాడు- సంవత్సరములోపల ఎవ్వడైనను వచ్చి తాను ఆవస్తువునకు హక్కుదారుడనని చెప్పుచు అందుకు సాధనములుగా (వస్తుప్రాప్తిని గుఱించిన) రిక్థక్రయ సంవిభాగ పరిగ్రహాధిగమములను కారణములుగా నిరూపించునేని, అట్టి సందర్భములలో ఆవస్తువునకు అతడే స్వామి యని (హక్కుదారుడని) నిర్ణయింపవలయునని సూత్రార్థము. అనగా తనకు ఆవస్తువు రిక్థముగా వచ్చినదనిగాని, క్రయముచే పొందినదనిగాని, సంవిభాగమువలన చెందినదని గాని పరిగ్రహముగా వచ్చినదని గాని, (త్రోవలో దొరకి) అధిగమముగా వచ్చినదని గాని నిరూపించినచో అతనిని ఆవస్తువునకు స్వంతదారునిగా అంగీకరించి దానినతనికి ఇచ్చివేయవలయునని తాత్పర్యము. ఇచ్చట రిక్థమనగా పైతృకమగు ఆస్తి. అనగా తల్లిదండ్రులు చనిపోయిన పిమ్మట సంక్రమించినట్టి ధనమనిభావము. ద్రవ్యము నొసంగి కొనినట్టిది క్రయముచే వచ్చినట్టిది. సంవిభాగమనగా- అన్నదమ్ములు మున్నగువారు లోకరీతి ననుసరించి పంచుకొనగా వచ్చినట్టి ద్రవ్యము. పరిగ్రహమనగా- దిక్కులేని అడవులయందు వృక్షములు మున్నగు చోటుల దొరికినట్టిది. అధిగమమనగా ప్రనష్టస్వామికమగునట్టి ద్రవ్యము అని యెఱుంగునది. మఱియును ఇచ్చట ప్రనష్టద్రవ్యము అధిగతమైనప్పుడు రాజునకును అధిగంతకును నిర్ణేతకును సమానముగా హక్కుకలదని ప్రకరణ సందర్భము నెఱుంగవలయును. క్షేత్రములు మున్నగువానిలో ఉత్పన్నములైన సస్యాదులు ఆక్షేత్రములవలెనే క్షేత్రవంతునకు స్వ

హ్మణుడు అభిరూపుడగు బ్రాహ్మణుడు. అభిరూపుడగునట్టి బ్రాహ్మణునకు నిధిప్రాప్తి కల్గినయెడల-ఆనిధి [వెనుకటి సూత్రమునందు చెప్పినట్లు రాజునకు చెందవలసినట్టి ద్రవ్యముగాక] కేవలము ఆబ్రాహ్మణునకే చెందు నని సూత్రార్థము.

425. సూ. అబ్రాహ్మణోఽప్యాఖ్యాతా షష్ఠంలభేతే త్యేకే. [౨-౧-౪౫]

హరదత్తమితాక్షరా—అబ్రాహ్మణ ఇతి. అబ్రాహ్మణోఽపి నిధి ముద్ధృత్య య ఆచష్టే ఇద మిత్థ మాసాదిత మితి, స తస్య నిధేః షష్ఠం లభేతే త్యేకే స్మర్తారో మన్యంతే. బ్రాహ్మణే నభిరూపే కల్ప్యః.

ఆంధ్రవివరణము— అబ్రాహ్మణుడైనను నిధిని కన్పట్టి చెప్పినచో-[అనగా రాజునకు ఎఱింగించినచో] అతనికి ఆనిధియందు ఆరవపాలు నీయదగునని కొందఱు ధర్మశాస్త్రప్రవక్తలు చెప్పిరని సూత్రార్థము.

426. సూ. చౌరహృత మపజిత్య యథాస్థానం గమయేత్. [౨-౧-౪౬]

హరదత్తమితాక్షరా—చౌరహృత మితి. చౌరైర్హృతం ద్రవ్యం తానపజిత్య యథాస్థానం గమయేత్. స్వామినఏవ దద్యాత్. జేతుస్తు జయఫలం కించిత్.

ఆంధ్రవివరణము—దొంగలచేత నపహరింపబడినట్టి సొమ్మును రాజగువాడు ఆదొంగలను గెల్చి తీసికొని యథాస్థానమును (అనగా ఆసొమ్ము ఎవ్వరికి చెందినదో వారిని) పొందింపవలయు నని సూత్రార్థము. ఇట్లు చేయునప్పుడు జేతయగు వానికి జయఫలముగా కొంచెము ఆసొమ్ములో నుండి ఈయవచ్చునని భావము.

427. సూ. కోశాద్వా దద్యాత్. [౨-౧-౪౭]

హరదత్తమితాక్షరా— కోశాద్వేతి. యదన్విష్యాపి చోరా నదృష్టాస్త ఏవవాజిత్య గతాస్తదా స్వకోశాదాదాయ తావద్ధనం స్వామినే దద్యా ద్యావదపహృతం చోరైరితి.

ఆంధ్రవివరణము—ఒకవేళ చోరులను ఎంత వెదకినను గన్పడనియప్పుడును, లేదా చోరులే గెల్చి తప్పించికొని పోయినప్పుడును ఎంతధనము చోరులు అపహరించిరో అంతధనమును రాజుతఖజానానుండి తీసికొనిపోయి, సొమ్మును కోల్పోయిన వారికి ఇవ్వవలయు నని తాత్పర్యము.

428. సూ. రక్ష్యం బాలధన మావ్యవహార ప్రాపణాత్. [౨-౧-౪౮]

హరదత్తమితాక్షరా—రక్ష్యమితి. బాలోఽప్రాప్తషోడశవర్షః, తస్య యది హితైషిణో రక్షకాః పిత్రాదయో నసంతి, సంతో వా మూర్ఖాశ్చాధార్మికాశ్చ భవేయుః, తదా తద్ధనం రాజ్ఞా రక్ష్యమ్. ఆకుతః వ్యవహార ప్రాపణాత్. యావ దసౌ వ్యవహారప్రాప్తః షోడశవర్షో భవతి.

ఆంధ్రవివరణము—రాజగువాడు - తన రాష్ట్రమునందు బాలురుగానుండిన [అరక్షకులుగానున్న యెడల] వారియొక్క ద్రవ్యమును వారికి వ్యవహారదశ వచ్చువఱకును రక్షింపవలయు నని సూత్రార్థము. అనగా పదునాఱేండ్లు బాలురుగానుండి, వారి ద్రవ్యమును విచారణచేసి కాపాడ తగినట్టి రక్షకులుగా నుండుటకు తలి తండ్రులు మున్నగువారు జీవించి యుండకున్నను, ఉన్నప్పటికిని మూర్ఖులును అధర్మశీలురునై యుండినను, అట్టి సమయములలో కన్పెట్టి రాజు ఆద్రవ్యమునంతయు తాను స్వాధీన పఱచికొని - ఆబా

యును పూర్వులకున్నట్లు ఉపనయనమనెడి రెండవజన్మ యితనికి లేదనియును నెఱుంగునది. ఉపనయనము లేదని నిషేధించుటచే తన్మూలకమగు వేదాధ్యయనముకూడ నీనాలవవర్ణమువారి కుండదు. ఈవిషయమునందు గృహ్యసూత్రకారు డిట్లు చెప్పుచున్నాడు - శూద్రునకుగూడ నిషేకపుంసవనాదులగు కర్మలన్నియు యథాకాలమున అమంత్రకములుగా ఉపదేశింపబడినవి"-అని. వివాహముకూడ వారికి అమంత్రకముగానే ఆయాదేశీయుల ఆచారవ్యవహారముల ననుసరించి జరుపదగుననియును తెలియదగి యున్నది. ఈసూత్రముకొన్ని వ్రాతప్రతులలో రెండుగ విభజింపబడి యున్నది.

432. సూ. తస్యాపి సత్య మక్రోధ శ్శౌచమ్.
[-౨-౧-౫౨]

హరదత్తమితాక్షరా—తస్యేతి. ఉపనయనాధ్యయన రహితత్వేపి యథావృత్తికత్వం, శూద్రాదితి. తస్యాపి శూద్రస్య సత్యాదయో ధర్మా భవంతి. సత్యం యథాదృష్టార్థ వాదిత్వం, అక్రోధః పరానభిద్రోహ బుద్ధిః. శౌచం పూర్వోక్త ద్రవ్యశౌచం మనశ్శౌచమిత్యాది. వసిష్ఠస్తు - సర్వేషాం సత్య మక్రోధో దాన మహింసా ప్రజననం చేతి.

ఆంధ్రవివరణము— ఆశూద్రునకుగూడ సత్యము అక్రోధము శౌచము అనునవి (ముఖ్యము లగు) ధర్మములుగా నుండతగినవి అని సూత్రార్థము. యథాదృష్టమగు దానిని (అనగా తాను తనకును ప్రత్యక్షముగ చూచి యెఱింగియుండునో దానిని) పలుకుటయే సత్యము. శౌచమనగా వెనుక జెప్పినట్టి ద్రవ్యశౌచ మనశ్శౌచాదులు. ఇయ్యవి తక్కిన త్రైవర్ణికము వారితో బాటుగా శూద్రునకు గూడ ముఖ్యధర్మము లని తాత్పర్యము.

విశేషాంశములు—ఇచ్చట మూలసూత్రమునందు సత్యాక్రోధశౌచాని- అనికలిపి సమాసముగా చెప్పక విసమాసముగా (విడదీసి) చెప్పుటచేత ఈసత్యము అక్రోధము శౌచములతో బాటుగా అస్తేయము - (అనగా పరద్రవ్యములను దొంగలింపకుండుట) ఇంద్రియ సంయమము మున్నగునవి కూడ సర్వవర్ణముల వారికిని సమాన ధర్మములని సూచింపబడుచున్నదనియును, మనువుకూడ నీయభిప్రాయమును కల్గియుండుట చేతనే = శ్లో. అహింసా సత్య మక్రోధః శౌచమింద్రియ సంయమః, ఏతత్ సామాసికం ధర్మం - చాతుర్వర్ణ్యే బ్రవీన్మనుః అని చెప్పియున్నాడనియును మస్కరీయ భాష్యమునందు చెప్పబడియున్నయది. కాని ముద్రితములగు మనుస్మృతి ప్రతులలో అహింసా సత్యమక్రోధః - అనుటకు బదులుగా - అహింసా సత్యమ స్తేయం - అని పాఠముకలదు. ఇందు చెప్పఁబడినధర్మము కేవలము ఒక్క చాతుర్వర్ణ్యము వారికేగాక, ప్రకరణ సందర్భమును బట్టి సంకీర్ణజాతులగు వారికి గూడ అనగా అనులోమవిలోమజాతులవారికి గూడా వర్తించునని కుల్లూకభట్టు వ్రాసెను.

433. సూ. ఆచమనార్థే పాణిపాద ప్రక్షాళన మేవైకే [-౨-౧-౫౩]

హరదత్తమితాక్షరా—ఆచమనార్థ ఇతి. త్రయాణాం వర్ణానాం యత్రాచమన ముక్తం తస్మిన్విషయే శూద్రస్య పాణిపాద ప్రక్షాళనమేవ భవతి. నాస్య ఆచమనమిత్యేకే మన్యంతే. మనుస్తు-సకృదంబు ప్రాశనమిచ్ఛతి -

ఆంధ్రవివరణము—భృత్యులనగా అన్నపాన ములనొసంగి పోషింపవలసినట్టి పరిజనమునకు పేరు. భృత్యులను పోషించుటకూడ నితనికి ముఖ్య కర్తవ్య మని తాత్పర్యము.

436. సూ. స్వదారవృత్తిః [౨-౧-౧౬]

హరదత్తమితాక్షరా— స్వదారేతి. స్వేషుదారే ష్వేవ వృత్తిః. సజాతీయేష్వపి పరదారేషు వేశ్యాసు చ ప్రసంగ స్తద్దండ్య ఇతి. అపరఆహ - స్వదారవృత్తిరేవాస్య భవతి, నాశ్రమాంతర ప్రాప్తిరితి.

ఆంధ్రవివరణము-స్వదారలయందు మాత్రమే వర్తించుటకూడ నతనికి ముఖ్యకర్తవ్యమని సూత్రార్థము. అనగా సజాతీయులై యున్నవారిలో గూడ పరుల భార్యలయందును వేశ్యాస్త్రీలయందును వర్తింపగా తగదనియును నట్లువర్తించినచో దండనార్హు డగునని యును, కాబట్టి కేవలము తాను ధర్మానుసారముగా వివాహమాడినట్టి స్త్రీలయందు మాత్రమే కామముల వర్తింపవలయునని యును తాత్పర్యము. ఇది హరదత్తమతానుసృతము. మఱికొందఱు:—స్వదారవృత్తియే ఇతనికి అర్హముకాని ఆశ్రమాంతరముల వాన ప్రస్థాదుల నితడు పొందగా రాదని యభిప్రాయమును వర్ణించిరట.

విశేషాంశములు— మూలసూత్రమునందు స్వదారః—అన్నంత మాత్రముచేతనే పైని వర్ణింపబడినట్టి యావదర్థమును వచ్చుచుండగా వృత్తి శబ్దమునుకూడ నేలజోడింపవలెనని శంకించుకొని-వృత్తిశబ్దము దేవరాముల నియోగవిధిని వీరిలో ప్రతిషేధించుట కనియును, దాన స్వదారలయందు మాత్రమే వీరు వర్తింపదగును కాని పరదారలయందు కూడదని సిద్ధించుచున్న దనియును, అసమానముగా గ్రహించుట గుర్వర్థాదిదానాపహం గ్రహార్థ మనియును మస్కరీయ భాష్యమునందు విశేషము వ్రాయబడి యున్నది.

437. సూ. పరిచర్యా చోత్తరేషాం [౨-౧-౧౭]

హరదత్తమితాక్షరా—పరిచర్యేతి. ఉత్తరేషాం త్రయాణాం వర్ణానాం పరిచర్యా శుశ్రూషా చ కర్తవ్యా.

ఆంధ్రవివరణము—మఱియు నతడు (అనగా శూద్రుడు) తనకంటె పూర్వులగు బ్రాహ్మణాదులగు మూడు వర్ణముల వారికిని శుశ్రూషను చేయుచుండ వలయునని సూత్రార్థము.

438. సూ. తేభ్యో వృత్తిం లిప్సేత [౨-౧-౧౮]

హరదత్తమితాక్షరా—సైషా వృత్త్యర్థేత్యాహ తేభ్యఇతి. తేభ్యః పరిచరితేభ్యో జీవనం లిప్సేత. అభిలషే దిత్యర్థః.

ఆంధ్రవివరణము—అట్టి పరిచరితులగు వారినుండి వృత్తిని అనగా జీవికను- కోరదగునని సూత్రార్థము. ఇయ్యది జీవికను నిర్వహించుకొనుట కేర్పడినదనుట.

439. సూ. తత్ర పూర్వంపూర్వం పరిచరేత్ [౨-౧-౧౮]

హరదత్తమితాక్షరా—తత్రేతి. తత్ర పరిచరితేషు. తథా చాపస్తంబః—శ్లో. పూర్వస్మిన్ పూర్వస్మిన్ వర్ణే నిశ్శ్రేయసం భూయ ఇతి. తదేవం - యథాయాజనాధ్యాపన ప్రతిగ్రహేషు బ్రాహ్మణస్య ప్రతిగ్రహో ముఖ్యా వృత్తి స్తథాశూద్రస్య పరిచర్యా ఇతి. తత్రాపిపూర్వస్మిన్ పూర్వస్మిన్ వర్ణే ఇతి.

ఆంధ్రవివరణము— ఆ శూద్రునిచేత గూడ వృత్తిక్షీణుడగు తన త్రైవర్ణికులమువాడు శిల్పము మున్నగు వానిద్వారా పోషింపదగి యుండునని సూత్రార్థము. ఈ విషయమునందు జాతూకర్ణ్యు డిట్లు చెప్పుచున్నాడు—ఎవ్వాడు నీచుని ఆశ్రయించియుండునో ఎవ్వాడు ఆర్యునియెడ తనను పోష్యునిగా సందర్శించునో, వాడు తాను నీచుడయ్యును అట్టి వానిని గుఱించి తనను తాను దాసునివలె చేసికొని సంచరింపవలయును. అనాశ్రితుడై యున్నప్పటికిని దరిద్రుడును దాంతుడును వేదపారగుడును అగు బ్రాహ్మణుడు శూద్రుని చేత గూడ పోషింపబడదగి యుండును. బుద్ధిమంతుడగు వాడు శూద్రుడైయున్నను ద్రవ్యవంతుడైయున్నచో సమస్తయత్నములచేతను ఇట్టివానిని పోషింపవలయు ననిీ భావము.

445. సూ. తదర్థోస్య నిచయ స్స్యాత్

[౨-౧-౬౫]

హరదత్తమితాక్షరా— తదర్థ ఇతి. అస్యశూద్రస్యనిచయోఽర్థ సంచయ స్తదర్థస్స్యాత్. తస్యోత్తరస్య పోషణార్థస్స్యాత్. పూర్వసూత్రస్య హేతురయమ్.

ఆంధ్రవివరణము—కాబట్టియే ఈ శూద్రునకు ఉత్తరత్రకులముల వారిని పోషించుటకై ద్రవ్య సంగ్రహణము చేయవలసియున్నదని సూత్రార్థము.

446. సూ. అనుజ్ఞాతోస్య నమస్కారో మంత్రః

[౨-౧-౬౬]

హరదత్తమితాక్షరా—అనుజ్ఞాత ఇతి. అస్యశూద్రస్య వైశ్వదేవాదిషు తత్తద్దేవతాపదంచతుర్థ్యంతం మనసాధ్యాత్వా నమోనమ ఇత్యేతద్రూపో మంత్రోఽధ్యర్థైః - ఆపరఆహ - దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్యఏవచ నమస్స్వధాయై స్వాహాయైనిత్యమేవ నమోనమః. ఇత్యయం మంత్రో నమస్కారశబ్దేన వివక్షితః, సర్వేష్వపి కర్మసు భవతి, తచ్చాహ-- గృహ్యాకారః- "బ్రాహ్మణానుపదేశ్య దేవతాదికం మంత్రం జపేత్-- ఇతి.

ఆంధ్రవివరణము— ఈశూద్రుడు వైశ్వదేవాది కర్మలను ఆచరింపవలసి నప్పుడు శిష్టులు మున్నగు వారిచేత ననుజ్ఞాతుడై ఆయా దేవతాపదములను చతుర్థీ విభక్త్యంతములుగా మనస్సున భావించి నమస్కరించుటయే మంత్రమని పెద్దలు చెప్పిరని సూత్రార్థము. మఱికొందఱు ఇచ్చట -నమస్కారమను మాటచేత 'దేవతాభ్యః పితృభ్యశ్చ-'అనే మంత్రము చెప్పబడిన దనియును అయ్యది పితృకార్యముల యందు సంభవించుచుండుననియు ననిరి.

447. సూ. పాక యజ్ఞైస్స్వయం యజేతేత్యేకే.

[౨-౧-౬౭]

హరదత్తమితాక్షరా—పాక యజ్ఞైరితి. పక్వగుణకేషు అపక్వగుణకేషు వగార్హ్యేషు కర్మసు పాకయజ్ఞశబ్దః ప్రసిద్ధః. యథాహాపస్తంబః—లౌకికానాంపాకయజ్ఞశబ్ద ఇతి.

ఆంధ్రవివరణము— పాకయజ్ఞము మొదలగు గార్హ్యస్థకర్మలయందు ఈతడు స్వయముగా యజింపవలయునని కొందఱు పల్కిరని సూత్రార్థము.

448. సూ. సర్వేచోత్తరోత్తరం పరిచరేయుః

[౨-౧-౬౮]

హరదత్తమితాక్షరా—సర్వేచేతి. సర్వఏవ వైశ్యాదయోపి ఉత్తరముత్తరం వర్ణం పరిచరేయు స్తే కేవల

శూద్ర ఏవ బ్రాహ్మణస్యాపి ఉత్తరోత్తరో నాస్తి. మధ్యేతు క్షత్రియ వైశ్యౌ, తథాపి సర్వశబ్దే అనులోమజ మధ్యాంతర ప్రభవాణాం గ్రహణార్థం, అపరఆహ - సమానేపి వర్ణే యో హీనోపి గుణతః ఉత్తర స్తత మపర ఉపరః పరిచరేదిత్యేవ మర్థః.

ఆంధ్రవివరణము—— అన్ని వర్ణముల వారును తమకంటె నుత్తరోత్తర వర్ణములవారిని పరిచరింపవలయునని తాత్పర్యము. అనగా ఈ పరిచర్యవిషయము కేవలమొక్క నాలవవర్ణము వారికి మాత్రమేగాక, ఆర్యవర్ణముల వారిలో నుత్తమోత్తమ వర్ణముల వారిని, ఆయాక్రింది వర్ణములవారును పరిచరింపవలసియే యుండునని సూచించుటకును, సర్వ (అన్ని వర్ణములవారన్న) శబ్దముచేత ఆవాంతర జనితులగు అను లోమవిలోమ జాతులవారికి గూడ నీవిధానమే యనలంబింపదగునని సూచించుటకును, ఇట్లు చెప్పబడెనందురు. మఱికొందఱు సవర్ణులలో సవర్ణులు కూడ నిర్లోపమగు నన్న గుణవిశేషమును బట్టి అధికులగువారికి పరిచర్య చేయవలయునని సూచించుట కిట్లు చెప్పిరందురు.

449. సూ. ఆర్యానార్యయో ర్వ్యతిక్షేపే కర్మణ స్సామ్యం సామ్యమ్. [౨-౧-౬౯]

హరదత్తమితాక్షరా—— ఆర్యేతి. ఆర్యాస్త్రైవర్ణికాః, అనార్యాశ్శూద్రాః, తయోః కర్మణి ఆచారస్య వ్యతిక్షేపే వ్యత్యాసేసతి తయోః సామ్యమేవ భవతి నపరిచార్య పరిచారక భావః. బ్రాహ్మణాది నార్యకర్మాచే న్నశూద్రైః పరిచరణీయః. శూద్రోప్యార్యకర్మా చేదనార్య కర్మభిరితి త్రైవర్ణికైః ప్రకర్షేణ నావమంతవ్య ఇతి. ఏతేన బ్రాహ్మణా క్షత్రియా క్షత్రియ వైశ్యాచ వ్యాఖ్యాతా.

ఇతి శ్రీ హరదత్త విరచితాయాం గౌతమీయసూత్ర వృత్తౌ ద్వితీయప్రశ్నే - ప్రథమోధ్యాయః.

ఆదితః దశమోధ్యాయః.

ఆంధ్రవివరణము—— ఆర్యానార్యయోః లో - త్రినగా త్రైవర్ణికులగు ఆర్యులును నాలవకులము వారగు అనార్యులును అను వీరలో గూడ ఆచారముయొక్క వ్యత్యాసము గల్గినప్పుడు - ఉభయులకును సామ్యమే యగునుగాని సేవ్యసేవక భావముగాని పరిచార్యపరిచారక భావము గాని లేదని సూత్రార్థము. అనగా బ్రాహ్మణాదులు ఆర్యధర్మములను వర్తించుటను మాని, అనార్యకర్మగల వారలైయున్నచో అప్పుడు నాలవవర్ణము వారగు శూద్రులచేత; పరిచరింపబడదగినవారుగా నుండరనియును, శూద్రులయ్యును ఆర్యకర్మలను ఆర్యధర్మములను శ్రద్ధతో నిర్వర్తించువారుగాను యున్నచో అనార్యకర్మలుచేయు నితరులచే అనగా వర్ణాధిక్యముగల అనార్యకర్ములగు బ్రాహ్మణాదులచే జాత్యపకర్షమును బట్టి అవమానింపబడదగరనియును తాత్పర్యము. ఈవిధముగానే బ్రాహ్మణ క్షత్రియుల విషయమునను క్షత్రియ వైశ్యుల విషయమునను - అనియు నెఱుంగవలయును.

ఇది భారద్వాజ గోత్రపవిత్రుండును యజుశ్శాఖాధ్యాయియును ఆపస్తంబ సూత్రుండునగు అధిగతశాస్త్రార్థ బిరుదమునను సంభావ్య నామధేయుండును అలమేల్మంగా వేంకటేశ్వరుల పుత్రుండును అగు ఆదినారాయణ శాస్త్రి రచించిన గౌతమధర్మ సూత్రాంధ్ర వివరణమునందు ద్వితీయప్రశ్నమునందు ప్రథమాధ్యాయము ముగిసినది.

మొదటినుండి పదియవ యధ్యాయము.

450. సూ. రాజా సర్వస్యేష్టే బ్రాహ్మణవర్జమ్. [౨-౨-౧]

హరదత్తమిశ్రాః—ఆర్యానార్యయో ర్వ్యతిక్షేపే నివారయితా రాజా. అత స్తద్ధర్మా నాహ - రాజేతి. రాజాఽభిషిక్తః సర్వస్య స్వజనపదవర్తినో జనస్యేష్టే నిగ్రహానుగ్రహాకార భోగనియోగేషు. కిమవిశేషేణ? నేత్యాహ - బ్రాహ్మణవర్జం బ్రాహ్మణాన్వర్జయిత్వా. తత స్తేఽప్యవం తోఽపి స్వధర్మా (1)త్సాంత్వేన స్థాప్యాః (2) సర్వక్రియాసు స్వాతంత్ర్యఖ్యాపనార్థం వచనమ్. యథాహ నారదః—శ్లో. (3) అస్వతంత్రాః ద్విజాస్సర్వా స్స్వతంత్రః పృథివీపతిః—ఇతి.

[పాఠాంతరములు—(1) త్సత్త్వేన న స్థాప్యాః (2) సర్వవిదితిక్రియాసు, సర్వవర్తిక్రియా (3) అస్వతంత్రా ప్రజాస్సర్వే—అని యున్నది.

ఆంధ్రవివరణము— ఆర్యులును అనార్యులును తమకుతమకు విధించినట్టి ధర్మములను ఆచరించుటలో వ్యత్యాసము కల్గినప్పుడు - [అనగా జాతిచే శ్రేష్ఠుడగు త్రైవర్ణికుడును, జాతిచే తక్కువవాడగు అనార్యుడును తమతమ ధర్మములలో (ఆచార వ్యవహారములలో) వ్యత్యస్తము నవలంబించినప్పుడు అని భావము] అట్టి వ్యత్యాసమునుండి లోకమును కాపాడుటకు సమర్థుడగువాడు రాజు. గనుక నిట్టి వర్ణాశ్రమ ధర్మ వ్యత్యయమును రానీయక లోకమును కాపాడగలట్టి రాజు యొక్క ధర్మములను - అనగా అతడు ఆచరింపవలసినట్టి వగురాజ ధర్మములను - నిరూపించుటకు ఆరంభించుచున్నాడు.

రాజు అనగా నిచ్చట పట్టాభిషేకము నొందినట్టి క్షత్త్రియుడని యర్థము. రాజగువాడు తన దేశమునందు నివసించుచున్నట్టి సమస్తజనమునకును నిగ్రహానుగ్రహాది విషయములందు ఈశ్వరుడు [అనగా శాసకుడు-అర్హాత్తు శిక్షించునట్టి వాడు] అగుచున్నాడు. కాని బ్రాహ్మణుల కొక్కరికి తప్ప- [తక్కిన లోకమున కంతకును ఈశ్వరుడగుచున్నాడు] అని సూత్రార్థము. ఇచ్చట బ్రాహ్మణులకు తప్ప-అని చెప్పుటచేత బ్రాహ్మణులు-స్వధర్మమునుండి భ్రష్టులగుచున్నను వారిని సాంత్వనమార్గము నవలంబించి ఆ యా ఆశ్రమధర్మములందు నిలుపవలయునని యర్థమును గ్రహింపవలెను. ఏమనగా ఇట్టులు చెప్పుట - వారు అనగా సర్వ ఆబ్రాహ్మణులు-కార్యముల యందును స్వతంత్రులని తెల్పుటకుమాత్రమే. నారదుడు కూడ ఇట్టులనే అనెను—సమస్తులగు ద్విజులును అస్వతంత్రులే యగుదురు. కేవలము పృథివీపతియొక్కడుమాత్రమే స్వతంత్రుడగును అని.

451. సూ. సాధుకారీ సాధువాదీ [౨-౨-౨]

హరదత్తమిశ్రాః—శాస్త్రవిరుద్ధేష్వేనాస్య స్వాతంత్ర్య మిత్యాహ సాధుకారీతి. సాధుకారీ శాస్త్రవిరుద్ధాచరణశీలః, సాధువాదీ వ్యవహారకాలే స్వపక్షపరపక్షేషు సమవాదీ.

[పాఠాంతరములు. (1) సాధుకారీ స్యాత్సాధువాదీ-అనియును పాఠ మున్నది. (2) సూనృతవాదీ అనియు పాఠమున్నది.]

ఆంధ్రవివరణము— వెనుకటి సూత్రమునందు పృథివీపతి(అనగా రాజు) స్వతంత్రుడని నిరూపింపబడినది. కాని ఆస్వతంత్రత ఎట్టి విషయములందుండవచ్చును—అను నాశంక కలుగగా, [దానికి సమాధానము] శాస్త్రములకును విరుద్ధములు కాని

విషయములందు మాత్రమే యని సమాధానము చెప్పుటకై ఈసూత్రము ఆరంభింపబడుచున్నది.

సాధువనగా శాస్త్రమర్యాదల ననుసరించి వర్తనము అని గ్రహింపవలయును. రాజు సాధుకారియై-అనగా శాస్త్రమర్యాదల ననుసరించినట్టి కార్యములను చేయువాడై- సాధు కాదియై సమస్తకార్యములందును సత్యవచనములను పల్కునట్టివాడై [అనగా వ్యవహారాదులందు ఇది స్వపక్షము ఇది పరపక్షము అను భేదము కొంచెమైనను పాటింపనట్టివాడై] యుండవలయునని సూత్రార్థము. అనగా రాజు తాను సమస్త ప్రాణికోటిని శాసింపగల ప్రభువయ్యును, తనను కూడ శాసించునట్టిది శాస్త్రమనియు అట్టి శాస్త్రవిహితములగునట్టి మర్యాదల నతిక్రమింపకయును పరద్రవ్యాపహరణము పరదారాపహరణము మున్నగునట్టి కార్యములను చేయకయును చేయింపకయును, వ్యవహారాదులు వచ్చినప్పుడు పక్షపాతము నవలంబింపక లోకక్షేమము నాసించి సత్యమునే పల్కుచును ప్రవర్తింపవలెనని తాత్పర్యము.

452. సూ. త్రయ్యా మాన్వీక్షిక్యాం వా
(1) అభివినీతః [౨-౨-3]

హరదత్తమితాక్షరా— త్రయ్యామితి. ఋగ్యజుస్సామాత్మికా స్త్రయోవేదా స్త్రయీ, అథర్వణశ్చ వేద స్తేష్వంతర్భవతి. తత్రాపిహి మంత్రా ఋచో యజూంషి వా. భేదవ్యవహారస్తు ప్రవచననిమిత్తః. శాంతికపౌష్టికాది ప్రమేయ భేదనిబంధనో వా. ఆన్వీక్షికీ న్యాయవిద్యా. తయోరభివినీతో గురుభి స్సమ్య క్ఛిక్షితః స్యాత్. మనుస్తు--శ్లో. త్రైవిద్యేభ్య స్త్రయీం విద్యాం దండనీతిం చ శాశ్వతీమ్. ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః —ఇతి.

[పాఠాంతరములు— (1) ఆన్వీక్షిక్యాంచ అనికొన్ని ప్రతులలో పాఠము కలదు.]

ఆంధ్రనిరూపణము— ఋగ్వేదము యజుర్వేదము సామవేదము-అను నీమూడు వేదములును కలిసి త్రయి యని చెప్పబడుచుండును. [త్రి అనగా మూడు మూడింటి సముదాయమునకు త్రయి అని పేరు. నాల్గవదియగు అథర్వణ వేదము కూడ ఈమూడు వేదములయందే అంతర్భూతమై [ఇమిడినదై] యున్నయది. అందునను కూడ మంత్రభాగములును ఋక్కులునుగాని యజుస్సులుగాని త్రయియనియును చెప్పబడుచుండును. భేదముగా వ్యవహరించుట ఇచ్చట ప్రవచనము కొఱకే అనిగాని శాంతికపౌష్టికాది ప్రమేయములలో గల భేదములనుకూర్చుటకొఱకని గాని ఎఱుంగవలయును. ఆన్వీక్షికి యనగా న్యాయవిద్య యని అర్థము.

రాజగువాడు త్రయియందును, ఆన్వీక్షికియందును అభివినీతుడై-[అనగా గురుముఖమునొద్ద నియమ పూర్వకముగా త్రయిని ఆన్వీక్షికిని చక్కగా పఠించి, వారిచే చక్కని శిక్షణమును బడసినవాడై] యుండవలయునని సూత్రమునకు తాత్పర్యము. ఈవిషయమును మనువు విశేషముగా శాసించియున్నాడు— "ఋగ్యజుస్సామాత్మకములగు త్రివిద్యను [illegible] చక్కగా పఠించినట్టి త్రైవిద్య వృద్ధులనుండి త్రయీ విద్యనున్నూ, అర్థశాస్త్ర స్వరూపమును వెలయుచు అర్థపురుషార్థమును గుఱించునట్టి యోగక్షేమములను బోధింపగలట్టి - నిత్యమగు దండనీతినిన్నీ తర్కవిద్యనున్నూ ప్రాచీనులయొక్క

భూతవర్తమానముల తెలియఁగలిగింపఁగల. ఆత్మ విద్యనున్నూ-[అనగా బ్రహ్మవిద్యనున్నూ] కృషి ని (వ్యవసాయమును) వాణిజ్యమును (వర్తకము ను) పశుపాలనము మున్నగువానిని చెప్పునట్టి వార్తా శాస్త్రములనున్నూ, ఆ వార్తా శాస్త్ర ములందు చెప్పబడినట్టి కార్యములను ఆరంభించు విధానములను బోధించునట్టి ఇతర శాస్త్రము నున్నూ, - రాజగునట్టివాఁడు చక్కఁగా పఠింపవ లయును"—అని.

విశేషాంశములు—ఇచ్చట మూలమునందు ఆన్వీక్షిక్యాం చాభివినీతః—అని పఠించి, చశబ్ద సారస్యముచేత దండనీతి యందును వార్తాశా స్త్రమునందును కూడ రాజు అభివినీతుఁడై యుం డవలయునని మస్కరీయ భాష్యమునందు చెప్ప బడినది.

453. సూ. శుచిర్జితేంద్రియో గుణవత్సహాయో పాయసంపన్నః [౨-౨-౫]

హరదత్తమితాక్షరా—శుచిరితి. శుచి రంతః పర ద్రవ్యాదిషు అస్పృహః, బహిస్స్నానాదిపరః, జితేంద్రియః స్త్రియోఽక్షా మృగయాపాన మిత్యాది వ్యసనరహితః, గుణాః (1) క్షాంత్యాదయః, తద్వద్భి స్త్రిసామాదిభి స్సహాయై స్సంపన్నస్సమవేతః, సామాదిభిశ్చోపాయై స్సమ్పన్నో దేశ కాలా వస్థానురూపం తేషాం ప్రయోక్తా స్యాత్ స్యా దితి వక్ష్యమాణేన సంబధ్యతే.

[పాఠాంతరములు—(1)గుణా శ్శౌచిత్రాదయః. అని కొన్నిటిలో నున్నది.]

ఆంధ్రవివరణము—మఱియును రాజు [అంత శ్శౌచ్యమును బహిశ్శౌచమును కల్గి] శుచియై జి తేంద్రియుఁడై గుణవంతములగు సహాయోపాయ సంపదలు గలవాఁడై యుండవలయు నని సూత్రా ర్థము. ఇచ్చట అంతశ్శుచిత్వము బహిశ్శుచిత్వ ము అని శుచిత్వము రెండువిధములు. అంతశ్శు చిత్వమనగా పరద్రవ్యములు పరదారలు పరహింస లు మున్నగు పాపకార్యముల మీఁద నిస్పృహుఁడై మెలంగుట. బహిశ్శుచిత్వమనగా స్నాన ము మున్నగు శౌచవిధానములను కల్గియుండుట. ఇంద్రియములను- [అనగా ఇంద్రియార్థములను] జయించి మెలంగుటయే జితేంద్రియత్వము నా బడును. అనగా స్త్రీలు జూదము పానము మొద లగు సప్తవ్యసనములకు లొంగక (అనగా ఆవ్యసన ములు లేనివాఁడై)యుండుట యని భావము. గుణ ములనగా శాంతి దమము సత్యము అస్తేయము మున్నగు గుణములని కొందఱును, మంచిశీలము కులము చరిత్రము మున్నగునవియని కొందఱును అనిరి. ఇట్టిగుణములు గలవారు గుణవంతులు. సహాయులనగా అమాత్యులు మంత్రిపురోహితు లు మున్నగునట్టివారు. గుణవంతులగునట్టి సహా యులయొక్క సంపదగలవాఁడు గుణవత్సహాయ సంపన్నుఁడని యనబడును. అయితే ఇచ్చట హ రదత్తుని మతము ననుసరించి సహాయశబ్దముచేత సామాద్యుపాయములు మాత్రము చెప్పఁబడి నవి. గుణవంతములయిన - [అనగా ఉత్సాహ ప్రభు మంత్ర శక్తి సంపన్నములయిన]సామాద్యు పాయములతోఁ గూడినవాఁడైననే దేశమును కాల మును అవస్థను అనుసరించి వానిని ప్రయోగిం ప కల్గుచున్నాఁడుఅను వక్ష్యమాణోక్తి అపేక్షి త మగుచున్నదని ఆయన సూచించుచున్నాఁడు.

విశేషాంశములు—రాజు జితేంద్రియుఁడై యుండవలసినట్లును, అట్లులుండనిచో నాతఁడు న

శించునట్టులును ధర్మశాస్త్రములు అర్థశాస్త్రములు మున్నగువానియందు సోదాహరణముగా నిరూపింపబడినవి. ఇందులో ధర్మశాస్త్రముల నుండి ఒక యుదాహరణమును అర్థ కామశాస్త్రములనుండి ఒక యుదాహరణమును ఇచ్చట చదువరులకు నివేదించెదను. (౧) ధర్మశాస్త్రములనుండి—[మనుస్మృతి. అధ్యా 7.]శ్లో బ్రాహ్మణా న్పర్యుపాసీత ప్రాతరుత్థాయ పార్థివః. త్రైవిద్యవృద్ధాన్ విదుష స్తిష్ఠే త్తేషాంచ శాసనే, వృద్ధాంశ్చనిత్యం సేవేత విప్రా న్వేదవిద శ్శుచీన్ వృద్ధోపసేవీ సతతం రక్షోభిరపిపూజ్యతే. తేభ్యోధిగచ్ఛేద్వినయం వినీతాత్మాపినిత్యశః. వినీతాత్మాహి నృపతి ర్నవినశ్యతి కర్హిచిత్. బహవో వినయాన్నష్టాః రాజానః సపరిచ్ఛదాః, వనస్థాఅపి రాజ్యాని వినయాత్ప్రతిపేదిరే వేనో వినష్టోఽవినయా న్నహుషశ్చైవ పార్థివః, సుదాః పైజవనశ్చైవ సుముఖో నిమిరేవ చ. పృథుస్తు వినయా ద్రాజ్యం ప్రాప్తవా న్మనురేవచ, కుబేరశ్చ ధనైశ్వర్యం బ్రాహ్మణ్యం చైవ గాధిజః—అని ఈశ్లోకముల కర్థమిది—రాజు ప్రతిదినమునను ప్రాతఃకాలమున వేలేచి త్రైవిద్యవృద్ధులును విద్వాంసులును అగు బ్రాహ్మణులను ఉపాసింపవలయును. మఱియును వారియొక్క ఆజ్ఞయందు వర్తింపవలయును. వేదవేత్తలును వృద్ధులును అగు బ్రాహ్మణులను అతడు సర్వదా సేవించుచుండ వలయును. ఇట్టి వృద్ధుల నేరాజు సేవించుచు ప్రజాపాలనము నొనర్చుచుండునో అట్టివాడు రాక్షసులచేతను సయితము పూజింపబడుచున్నాడు. కావున అట్టి వృద్ధులగువారినుండి రాజు నీతిశిక్షణము నొందవలయును. మఱియును వినీతాత్ముడుకూడ కావలయును. ఇట్లు చేసి వినీతాత్ముడగు రాజు ఎప్పుడును నశింపకయుండును. అనేకులు రాజులు అవినయమునకు పాల్పడిన కారణమున హస్త్యశ్వరథ కోశాది బలసమేతముగ నశించిరి. వినయము నార్జించిన కారణమున నేకులు రాజులు అడవులపాలయ్యును రాజ్యములను పొందిరి. ఇందులకు కొన్ని యుదాహరణములు— అవినయకారణమున వేనుడు నశించినాడు. నహుషుడు సుదస్సుడు విజనుడను రాజుకొడుకగు పైజనుడనువతడు, సుముఖుడు నిమిచక్రవర్తి అనువారుకూడ అవినయము మూలాననే నాశము నొందిరి. వినయము మూలాననే పృథుచక్రవర్తియును మనువును రాజ్యమును పొందిరి. ఈ వినయము మూలాననే కుబేరుడు ధనైశ్వర్యమును గాధికుమారుడగు విశ్వామిత్రుడు బ్రాహ్మణత్వమును పొందగల్గిరి. అని.

(౨) అర్థశాస్త్రములనుండి—విద్యావినయహేతు రింద్రియజయః కామక్రోధ లోభమాన మదహర్ష త్యాగా త్కార్యః... ... ... తద్విరుద్ధవృత్తి రవశ్యేంద్రియ శ్చతురంతోఽపి రాజా సద్యో వినశ్యతి. యథాదాండక్యో నామ భోజః కామాద్బ్రాహ్మణ కన్యా మభిమన్యమానః సబంధురాష్ట్రో వినినాశ. కరాళశ్చ వైదేహః. కోపాజ్జనమేజయో బ్రాహ్మణేషు విక్రాంతః. తాళజంఘశ్చ భృగుషు, లోభా దైల శ్చాతుర్వర్ణ్య మత్యాహారయమాణః, సౌవీరశ్చాజబిందుః, మానాద్రావణః పరదారా నప్రయచ్ఛన్, దుర్యోధనో రాజ్యా దంశంచ,మదా ద్దంభోద్భవో భూతా

వమానీ హైహయ శ్చార్జునః, హర్షాద్వాతాపి రగస్త్యమత్యాసాదయన్. వృష్ణిసంఘశ్చద్వైపాయనమితి"—— ఈవాక్యముల కియ్యది యర్థము——విద్యా వినయహేతువగు నింద్రియజయము కామక్రోధ లోభమానమద హర్షత్యాగముచలన నొనర్పదగును. ... ... ... ... తద్విరుద్ధ వృత్తి యగువాడు చతుస్సముద్రాంతమగు భూమినేలునట్టి రాజయ్యును వెనువెంటనే నశించిపోగలడు. ఎట్టులనగా—దాండక్యుడను పేరుగల భోజవంశ్యుడగునట్టి రాజు బ్రాహ్మణ బాలికను కామించినవాడై బంధురాష్ట్రములతో సహా నశించెను. విదేహాధిపతియగు కరాళుడుకూడ నిట్టులనే నశించెను. జనమేజయుడను రాజు కోపమువలన బ్రాహ్మణులపై విక్రమించి నశించెను. ఇట్టులనే తాళజంఘుడను రాజుగూడ భృగువంశ్యులగు బ్రాహ్మణులపై విక్రమించి నశించెను. లోభముచేత ఐలుడనురాజు నాల్గువర్ణములవారిని పీడించుచుండి నశించెను. ఇట్టే సౌవీరదేశాధిపతియగు అజబిందువుకూడ నశించెను. అభిమానమువలన రావణుడు పరులభార్యను మఱలి యొప్పగింపజాలక నశించెను. ఇట్టులనే దుర్యోధనుడు రాజ్యభాగమునీయక నశించెను. మదముచేదంభోద్భవుడు నశించెను. ఇట్టులనే హైహయవంశీయుడగు కార్తవీర్యార్జునుడు కంఠకగుపడిన ప్రతిషాణిని అవమానించి నశించెను. హర్షమువలన వాతాపి అగస్త్యుని చంపబోయి చచ్చెను. యాదవులుకూడ నిట్టులనే ద్వైపాయనుడగు వ్యాసుని చంపబోయి చచ్చిరి"——అని. ఈవిషయమునందలి ఈకథల పూర్ణవృత్తాంతము నెఱుంగగోరినచో నాప్రచురణమగు అర్థశాస్త్రమును చూడుడు.

(3) కామశాస్త్రమునుండి—— "యథాదాండక్యోనామ భోజః కామాద్బ్రాహ్మణ కన్యామభిమన్యమానః సబంధురాష్ట్రో విననాశ దేవరాజశ్చాహల్యాం అతిబలశ్చ కీచకో ద్రౌపదీం రావణశ్చసీతా మపరేచాన్యేచ బహవో దృశ్యంతే కామవశగా వినష్టాః——[చూ. నాప్రచురణము కామశాస్త్రము. పేజి 82, సూ 132, ౧-౨-౪౫.] ఈ వాక్యములయొక్క అర్థమియ్యది——ఎట్టులు అనగా దాండక్యుడను భోజవంశీయుడగు రాజు కామమువలన బ్రాహ్మణకన్యకను అభిగమించి సబంధురాష్ట్రముగ నశించెను. దేవరాజగు ఇంద్రుడు అహల్యనున్ను అతి బలుడగు కీచకుడు ద్రౌపదినిన్ని రావణుడు సీతనున్ను బలాత్కరించి నశించిరి. ఇట్టులనే ఇంకను అనేకులు కామవశగులై వినష్టులైరి——అని.

454. సూ. సమః ప్రజాసుస్యాత్. [౨-౨-౫]

హారదత్తమితాక్షరా——సమఇతి. వ్యవహారకాలే ద్వేష్యేప్రియేచ సమస్స్యాత్.

ఆంధ్రవివరణము——రాజ్యాంగ వ్యవహారములను నెఱపునప్పుడు రాజగువతడు ప్రజలయందు సముడై -[అనగా వీరు అప్రియులు వీరుప్రియులు లను భేదములేక నిగ్రహానుగ్రహములయందును ప్రియాప్రియత్వములయందును పక్షపాతమును వహింపక సమానభావము గలవాడై -] మెలంగవలయును అని సూత్రార్థము.

455. సూ. హిత మాసాం కుర్వీత [౨-౨-౬]

హారదత్తమితాక్షరా——హితమితి. ఆసాం ప్రజానాం యోగక్షేమయో రవహిత స్స్యాత్.

ఆంధ్రవివరణము—మఱియునితడు ఈప్రజల కేయొక్క విషయమున హితమును ఒనర్చుచుండ వలయునని సూత్రార్థము. అనగా ప్రజలను పరిపాలించునట్టి వేళలలో—కేవలమును తన ప్రాభవము నే ముఖ్యముగా జూచుకొనక - ఆప్రజలయొక్క యోగక్షేమ సాధనముల నారసి - వానిని కూర్చుటయందు సర్వదా అవహితుడై యుండవలయునని తాత్పర్యము. ఇచ్చట మస్కరీయ భాష్యమునందు హితము నొనర్పవలయునను మాటచేత—చెరువులు కాలువలు బావులు ఆనకట్టులు ఉద్యానవనములు మున్నగువాని నొనర్చుట మూలమున హితకార్యముల చేయుటయున్నూ, జూదములు మద్యపానములు మున్నగు వ్యసనములను పోగొట్టుట మూలమున అహితకార్యముల నివారించుటయున్నూ, రెండింటినిగూడ చేయతగునని సారస్యము చెప్పబడియున్నయది. ఇయ్యది "హితంచాస్యకుర్వీత"—అని మూలమునందు చకారము నెక్కుడుగా పఠించి ఆచకారమునకు సారస్యముగా ఇట్టులు చెప్పబడినది.

456. సూ. తముపర్యాసీన మధస్తాదుపాసీర న్నన్యే బ్రాహ్మణేభ్యః [౨-౨-౭]

హరదత్తమితాక్షరా—తమితి. తమేవం గుణం రాజానముపరి సింహాసనాదా వుచ్చైరాసీన మధస్తాచ్చ మా వేవాసీరన్. కిమవిశేషేణ. నాన్యే బ్రాహ్మణేభ్యో బ్రాహ్మణవ్యతిరిక్తా ఇత్యర్థః. అథ ఉపాసీరన్నిత్యేవసిద్ధే ఉపాసీన మితిస్వభావానువాదః. సర్వదారాజ ముపర్యాసీనో భవతి నతు రిహస్యపి భూమావితి.

ఆంధ్రవివరణము—ఈపైని చెప్పినట్టి గుణసంపదగల రాజును ఉపరి (పై) భాగమునందు—అనగా ఉన్నతాసనమునందు - కూర్చుండియుండగిన వానినిగా నెఱింగి బ్రాహ్మణులు తప్ప తక్కిన ప్రజలు ఆతని సమక్షమున అధో (క్రింది) భాగమునందు—అనగా రాజుకంటెను తక్కువది యగునట్టి యాసనమునందు కూర్చుండవలయును. కాని బ్రాహ్మణులుమాత్ర మట్టులు గాదని భావము. అనగా రాజు వ్యవహారములు తీర్చునప్పుడు మున్నగు సమస్తకాలము లందును ఉన్నతాసనమునకే అర్హుడనియును, ప్రజలలో ఒక్క బ్రాహ్మణ వర్ణము వారు తప్ప తక్కిన వర్ణములవారు అతని యెదుటతక్కువదగు నాసనమునందు మాత్రమే, కూర్చుండవలయుననియును తాత్పర్యము. ఇచ్చట మస్కరీయ భాష్యమునందు—బ్రాహ్మణులనుటచే గుణవంతులగునట్టి బ్రాహ్మణులనియును, జాతి మాత్రముచేత బ్రాహ్మణులయినవారి విషయమున నియ్యది వర్తింపదనియును వ్రాయబడి యున్నయది.

457. సూ. తేప్యేనం మన్యేరన్. [౨-౨-౮]

హరదత్తమితాక్షరా—తేపీతి. తేపి బ్రాహ్మణా ఏనం రాజానం మన్యేరన్, ఆశీర్వాదాదిభిః పూజయేయురిత్యర్థః.

ఆంధ్రవివరణము—ఆబ్రాహ్మణులును తాము ఉన్నతాసనముల నొంది [అధికులమని కొనక] ఇతనిని కూడ [అనగా రాజుకూడ ఈశ్వరసముడని భావించి] అతనికి శ్రేయోభివృద్ధులు కలుగునట్టులుగా ఆశీర్వచనములు మున్నగువానిని చేయుట ద్వారా గౌరవింపవలయు నని సూత్రమునకు అర్థము. అనగా రాజుచే బ్రాహ్మణులు పూజితులై అతనిని ఆశీస్సులుమున్నగు ప్రతిపూ

ఆంధ్రవివరణము—రాజు ఇట్టులు అభిరక్షించుచున్నను వారు-అనగా ఆవర్ణములవారును ఆశ్రమముల వారును తమతమ ధర్మములనుండి చలించిపోవుట కల్గునేని - అనగా స్వస్వధర్మమును త్యజించి వర్తింతురేని - అట్టి వారిని రాజగువాడు బలిమిని నిగ్రహించి స్వధర్మమునందే నెలకొల్పవలయునని యర్థము.

460. సూ. ధర్మస్య హ్యంశభాగ్భవతీతి. [౨-౨-౧౧]

హరదత్తమితాక్షరా—కస్మాత్పునరేతదుచ్యత ఇత్యాహ ధర్మస్యేతి. విజ్ఞాయతే హి యస్మాద్రక్షితో ధర్మస్యాంశో భవతి. ఉపలక్షణమేతత్. అరక్షితోఽప్యధర్మస్యాంశోఽస్య భవతీతి జ్ఞేయమ్. అత్ర మనుః—శ్లో. సర్వతో ధర్మషడ్భాగో రాజ్ఞో భవతి రక్షణాత్, అధర్మస్యాపి షడ్భాగో భవత్యస్య హ్యరక్షతః

ఆంధ్రవివరణము—వెనుకటి సూత్రములందు చెప్పబడినరీతిని రాజు ప్రజలనేల రక్షించుచుండవలయునను ఆశంకకల్గగా, ప్రస్తుత మీసూత్రమునందు వారించుచున్నాడు— న్యాయమును తప్పకుండ ప్రజలను కాపాడునట్టి రాజు వారు చేయునట్టి ధర్మమునందు కొంత యంశమునకు అధికారి యగుచున్నాడు. (కావున పాలింపవలయును)అని సూత్రార్థము. ఇయ్యది ఉపలక్షకము మాత్రము. ప్రజలను (రాజునకు ప్రజలను రక్షించినచో ధర్మమునందు అంశ (భాగము) కలుగునట్టులుగానే) రక్షింపకయున్నచో కూడా - ధర్మముయొక్క అంశము లేకపోవుటయే కాకుండ పై పెచ్చు అధర్మముయొక్క అంశముకూడ కల్గునని యెఱుంగదగును. ఈ సందర్భమునందు మనువుకూడ నిట్టులనే చెప్పియున్నాడు—"రాజగువానికి ప్రజలను ఎట్టియుపద్రవములను పొందనీయక కాపాడుటవలన ధర్మమునందు ఆరవపాలు లభించును. ఇట్టులనే బాగుగా రక్షింపక పోయినను అధర్మమునందు కూడ ఆరవపాలు అతనికి అధర్మఫలముగా ఇతనికి లభించును"— అని.

461. సూ. బ్రాహ్మణం చ పురోదధీత విద్యాభిజన వాగ్రూప వయశ్శీల సంపన్నం న్యాయవృత్తం తపస్వినమ్. [౨-౨-౧౨]

హరదత్తమితాక్షరా—బ్రాహ్మణమితి—స చ బహుశ్రుతో భవతీత్యస్య ఉక్తస్వరూపా విద్యా. విశిష్టే జన్మ అభిజనః వాక్సంస్కృతా భారతీ. రూపం మనోహరమ్. వయః మధ్యమం నాతిబాలో నాతిస్థవిర ఇతి. శీలమంతః కరణశుద్ధి ర్బాహ్యం చానుష్ఠానమ్. ఏతైర్విద్యాభిజనాదిభి స్సమృద్ధం సంపన్నం న్యాయవృత్తం లోకశాస్త్రావిరుద్ధాచారమ్, తపస్వినమభోగపరం, ఏవంభూతం బ్రాహ్మణం పురోదధీత పురోహితం కుర్వీత. సర్వేషు కర్మసు పురో ధీయత ఇతి పురోహితః.

ఆంధ్రవివరణము—వెనుక 278 వ సూత్రము మొదలుకొని 285 వ సూత్రమువఱకును వర్ణింపబడినట్టి లక్షణములు గల దెయ్యది కలదో అదియే ఇచ్చట విద్య నాబడును. అనగా బహుశ్రుతత్వాదులచేత లక్షితమైనట్టిది విద్యయని భావము. శ్రేష్ఠమగునట్టి వంశమునందు జన్మించుటయే అభిజన మనంబడును. విజ్ఞానవిభవముచేత చక్కగా సంస్కరింపబడినట్టి సరస్వతియే ఇచ్చట వాక్కనబడును. రూపమనగా మనస్సును

ఆకర్షించునట్టి చక్కని దసము. ఆట్టి కొలదివయసూ గాక, అట్టి ముదిమియునూ గాక నడువయస్సున నుండెడి ప్రాయమే ఇచ్చట వయస్సనాబడును. పవిత్రమైన అంతఃకరణవృత్తి గల వర్తనమే ఇచ్చట శీలమని చెప్పబడును. లోకమునకును శాస్త్రమార్గమునకు విరోధములేకుండ నడచుటయే ఇచ్చట న్యాయవృత్తమని చెప్పబడును. భోగాసక్తుడు గాక సర్వదా ఆముష్మిక చింతగల్గి వర్తించుటయే తపస్విత్వ మనబడును. రాజగువాడు విద్యాసంపన్నుడును అభిజనసంపన్నుడును వాక్సంపన్నుడును రూపసంపన్నుడును శీలసంపన్నుడును న్యాయవృత్తము గలవాడును తపస్విత్వముచే నొప్పెడివాడును అగునట్టి బ్రాహ్మణుని పురోహితునిగా చేసికొనవలయు నని సూత్రార్థము. ఐహికములు ఆముష్మికములు నగునట్టి సమస్తకార్యములను సరిగా నిర్వర్తించు పట్టులలో పురోభాగమున (అగ్రస్థానమున) ఉంచుకొనబడదగువాడు గనుక పురోహితుడని యనబడునని యెరుంగవలయును. మస్కరీయ భాష్యమునందు ఈ సూత్రమును మూడు సూత్రములుగా విభజించి వ్యాఖ్యానము చేయుచు,—"విద్యా సంపన్నుడనగా అథర్వవేదమును చక్కగా చదివినట్టి వాడనియును ఇట్టి పురోహితుడైననే రాజునకు శాంతిక పౌష్టికాది కార్యముల నెరవేర్చుటకు సమర్థుడుగా నుండుననియు, అభిజనసంపన్నుడనగా సచ్చరిత్రము కలవాడనియు, అట్టివాడైననే కార్యములందు జాగ్రత్త వహింపగలడనియు, వాక్సంపన్నుడనగా చక్కని వక్తృత్వము గలవాడనియును అట్టివాడైననే శత్రుల మిత్రుల నయితము సమముగా రంజింప చేయగలడనియు, వయస్సంపన్నుడనగా కార్యదక్షుడనియు శీలసంపన్నుడనగా ఓరిమిగల వాడనియు నిట్టివాడైననే అసాధ్యములగు కార్యముల నైతము సాధ్యములుగా చేయగలడనియు న్యాయవృత్తుడనగా లోకాచారములకు విరుద్ధుడు గాక గౌరవించు వాడనియు ఇట్టివాడే ఎంతటి కష్టసమయములలో నైన రాజును పరిత్యజింపక యుండుననియు, తపస్వియనగా కేవలము ఋతుకాలములను మాత్రమే స్వదారగమనము చేయుచుండు గృహస్థుడనియు ఇట్టివాడైననే అంతఃపురము మున్నగు రాజప్రాసాదములలో నిరపాయముగా వారియందు నిరభ్యంతరముగా సంచరించుటకు యోగ్యత గలవాడగుననియును పారస్యములు చెప్పబడినవి.

విశేషాంశములు—రాజధర్మములను విరివిగా బోధించునట్టి కౌటిల్యుని అర్థశాస్త్రమునందును పురోహితుని లక్షణము లిట్లు చెప్పబడినవి—

సూ. పురోహిత ముదితోదితకులశీలం షడంగే వేదే దైవే నిమిత్తే దండనీత్యాం చ అభివినీతం, ఆపదాం దైవమానుషీణాం అథర్వభిరుపాయైశ్చ ప్రతికర్తారం కుర్వీత. తమాచార్యం శిష్యః పితరం పుత్రః, భృత్యస్స్వామిన మివచ అను వర్తేత—అని.

ఈ వాక్యముల కియ్యది అర్థము— [ధర్మశాస్త్రములందు పురోహితు కేయే లక్షణములు గలవాడుగా ఉండవలయు నని నిరూపింపబడుచున్నదో అట్టి] ఉదితములందు ఉదితమైన కులశీలములు గల వానినిగాను, [అనగా విద్యాభిజనాది లక్షణములు గల వానినిగాను] శిక్షా వ్యాకరణాది షడంగములతో కూడిన వేదము

నందున్నూ పూర్వజన్మ ఫలముల రూపింపగల జ్యోతిశ్శాస్త్రాది దైవభాగము నందున్నూ శకున శాస్త్రమునందున్నూ దండనీతి యందు శిక్షణమును బడసియున్నట్టి వానినిగాన్నూ, దైవసంబంధములగు ఆపదలందున్నూ [అనగా అగ్న్యుపద్రవము జలోపద్రవము వ్యాధులు కఱవులు చావులు అను నీయైదు విధములగు ఆపదలందున్నూ, అని అర్థము] మానుష సంబద్ధములగు [ఆయుధోపద్రవము చోరోపద్రవము శత్రువుల యుపద్రవము రాజవల్లభుల యుపద్రవము రాజలోభము] అను నీయైదు విధములగు ఆపదలయందున్నూ అథర్వణ విధానముల ద్వారా సామాద్యుపాయముల ద్వారా ప్రతిక్రియలు చేయగలవానిని గాన్నూ, చూచి పురోహితునిగ నేర్పఱచుకొనవలయు. ఇట్టి పురోహితుని - శిష్యుడు ఆచార్యుని అనువర్తించునట్లును, కుమారుడు తండ్రి ననువర్తించునట్లును, సేవకుడు తన యేలిక ననువర్తించునట్లున్నూ రాజున్నూ వీరిని అనువర్తించు చుండవలయు నని తాత్పర్యము.

462. సూ. తత్ప్రసూతః కర్మాణి కుర్వీత. [౨-౨-౧౩]

హరదత్తమితాక్షరా— పురోహితత్వం దర్శయతి— తత్ప్రసూత ఇతి. తేన పురోహితేన ప్రసూతః అనుజ్ఞాతః ఇదమిత్థం కర్తవ్యమితి కృతోపదేశః కర్మాణి శ్రౌతస్మార్తాదీని నిత్యనైమిత్తికాని శాంతికపౌష్టికాన్యాభిచారికాణి కుర్వీత. తత్ప్రసూత ఇత్యస్య మూలత్వేన బ్రాహ్మణముదాహరతి.

ఆంధ్రవివరణము— వెనుకటి సూత్రమునందు చెప్పినట్టి పురోహితునియొక్క కార్యస్వరూపమును ఇందు వివరించుచున్నారు. ప్రసూతుడనగా ఇచ్చట ననుజ్ఞను పొందినట్టివాడు. తచ్ఛబ్దము చేత వెనుకటి సూత్రమునందలి పురోహితుడు గ్రహింపబడును. మఱియును రాజు ఆపురోహితుల చేత ననుజ్ఞను బొందినవాడై - అనగా ఈయా కార్యములను ఇట్టిట్టులు చేయవలయునని ఉపదేశింపబడుచున్నవాడై - శ్రౌతస్మార్తాదులగు పౌరాణిక కార్యములనున్నూ నిత్యనైమిత్తికములగు శాంతిక పౌష్టికాదులగు కార్యములనున్నూ అథర్వణ వేదమునందు చెప్పబడినట్టి శత్రుమారకములగు ఆభిచారిక కార్యములనున్నూ చేయవలయునని సూత్రముయొక్క అర్థము. ఇచ్చట తత్ప్రసూతః— అనుమాటకు మూలార్థక మగుటచేత బ్రాహ్మణమే పురోహితుడుగా నుండవలెనన్న యర్థము చెప్పబడుచున్నది.

463. సూ. బ్రహ్మప్రసూతం హి క్షత్రమృధ్యతే న వ్యథత ఇతి చ విజ్ఞాయతే. [౨-౨-౧౪]

హరదత్తమితాక్షరా— బ్రహ్మప్రసూతమితి. బ్రహ్మ బ్రాహ్మణః, తేన ప్రసూతం అనుజ్ఞాతం హి క్షత్రం క్షత్రియః ఋధ్యతే. సమృద్ధిం భజతే. న వ్యథతే న పీడ్యతే శత్రుభిః పరాభవం న ప్రాప్నోతి ఇత్యేవం బ్రాహ్మణే విజ్ఞాయతే. హి శబ్దో హేత్వర్థే.

ఆంధ్రవివరణము:— బ్రహ్మ [అనగా బ్రాహ్మణుడు] చేత ఇదమిత్థమని యుపదేశము చేయబడి అనుజ్ఞాతమైనదో, అట్టి క్షత్రము (అనగా క్షత్రియుడని భావము) సమృద్ధము - (అనగా సమస్త సంపత్తుల వృద్ధిని పొందగల్గుట) అగుచున్నది. మఱియును వ్యథకని నెట్టి సందర్భములలో గూడ బాయింప నలవిగాదనుటయే గాక లోంగనిదిగ గూడ కాగల్గుచున్నదని పరంపరగా పెద్దలవలన

పింబడుచున్నదని సూత్రమునకు యర్థము. అనగా—పూర్వోక్త గుణవంతులగు బ్రాహ్మణుల ద్వారా అనుజ్ఞనొంది. క్షత్రియకార్యములు (పరిపాలనాదులు) చేయబడుచు నుండునేని యథావిధిగా నిర్వర్తింపబడినందు వలనను, పాత్రదోషాదులు రానందువలనను, అయ్యవి నిర్బాధకములుగా వృద్ధినొందు నని శ్రుతిస్మృత్యాదుల నుండి పెద్దలు పరంపరగా నుదాహరించుచు వచ్చిరని భావము.

విశేషాంశములు— కౌటిల్యుడు కూడ తన యర్థశాస్త్రమునందు ఈ విధముగనే చెప్పియున్నాడు— శ్లో. బ్రాహ్మణేనైధితం క్షత్రం మంత్రిమంత్రాభి మంత్రితమ్, జయ త్యజిత మత్యంతం శాస్త్రానుగమశాసితమ్—అని. దీనియొక్క యర్థమిది— "బ్రాహ్మణేన - శాస్త్రములందు వర్ణింపబడినట్టి విద్యాభిజన వాగ్రూప వయశ్శీలాది సంపన్నుడైనట్టి పురోహితునిచేత, ఏధితం - వృద్ధి పొందింపబడినట్టిదగు, క్షత్రం-క్షత్రియుల కార్యజాతము (అనగా రాజులయొక్క పరిపాలనాదులగు పనులు) మంత్రి మంత్రాభిమంత్రితం శాస్త్రములందు వర్ణింపబడినట్టి గుణములు గల మంత్రులయొక్క ఆలోచనముచేత చక్కగా సంస్కరింపబడినదై, శాస్త్రానుగం - ధర్మాదిశాస్త్రపద్ధతుల ననుసరించుచున్నదై, అశస్త్రితం - ఏవిధమైన శస్త్రకార్యముకూడ నపేక్షింపనిదై (అనగా కత్తితో పనిలేకయే) అత్యంత మజితమపి - మిక్కిలిగ జయించుటకు వీలులేనట్టి శత్రువునైనను, జయతి - జయింప గల్గుచున్నది. అథవా, అత్యంతం - మిక్కిలి, అజితమపి లభ్యముగానట్టి దాని నైనను, జయతి - లభింపగల్గుచున్నయది"- అని తాత్పర్యము.

౪౦౪. సూ. యాని దైవోత్పాత చింతకాః ప్రబ్రూయుః తా న్యాద్రియేత. [౨-౫-౧౫]

హరదత్తమితాక్షరా— యానీతి. దైవచింతకాః జ్యోతిర్విదః, ఉత్పాత చింతకాః శకునజ్ఞాః, ఉత్పాతానాం చాగ్రే ఫలాని జానతే తే యత్ప్రబ్రూయుః ఇదం కర్మ గ్రహవైకల్యకృత మిదం మద్య ... ... ... య మేవాంసహార ఇతి చ తాన్యపి సర్వాణ్యాద్రియేత న హ్యుపేక్షేత.

ఆంధ్రవివరణము— దైవము అనగా సాధారణముగా కర్మఫలము. కాని దైవమనగా నిచ్చట జ్యోతిశ్శాస్త్రము. ఉత్పాతమనగా ముందు రాబోవునట్టి శుభాశుభనిమిత్తములను, చెప్పునట్టి జ్యోతిశ్శాస్త్రము. దైవముయొక్క స్వరూప స్వభావాదులను ఫలములను చింతనముచేసి కనుగొనునట్టి శాస్త్రజ్ఞులు దైవచింతకు లనియును, ఉత్పాతములయొక్క స్వరూప స్వభావాదులను ఫలములను చింతనముచేసి కనుగొనునట్టి శాస్త్రజ్ఞులు ఉత్పాతచింతకు లనియును చెప్పబడుచు నుందురు. దైవ చింతకులును ఉత్పాత చింతకులును [రాజు యొక్కయును రాజ్యముయొక్కయును యోగక్షేమములను అభిలషించినవారై] ఏయే విధానములను చెప్పుచుందురో వానిని రాజు శ్రోసిపుచ్చక ఆదరించి చేయుచుండవలయునని సూత్రార్థము. అనగా దైవచింతకులు వచ్చి— "అయ్యా! ఇప్పుడు ఫలానా గ్రహము వక్రించినది. దీన నరిష్టము కల్గును కాబట్టి

దీని కియ్యది శాంతివిధానము"—అని నిశ్చయముగా నెఱింగించి నప్పుడును, ఉత్పాత చింతకులు వచ్చి—అయ్యో! ఇయ్యది దుశ్శకునము. దీన నేమ ఉత్పాతము కలుగునట్టులు తోచుచున్నది. ఈయీ విధముగా శాంతికర్మలను జరిపినచో దీనికి పరిహారము అగును అని చెప్పినప్పుడును రాజు వానిని అనాదరబుద్ధితో త్రోసివేయక పరిగ్రహించి వారు చెప్పినట్టులు చేయవలయునని భావము.

విశేషాంశములు— మస్కరీయ భాష్యమునందు ఈసూత్రమును "యాని చ దైవోత్పాత చింతకాః" అపిచకారముతో పఠించి, కేవలము ఒక్క దైవచింతకులును ఉత్పాత చింతకులును మాత్రమే గాక చ శబ్దముయొక్క సారస్యముచేత విద్యావయో వద్ధులగు గురుజనముకూడ దేనిని చెప్పెదరో అద్దానినిన్నీ రాజు ఒనర్పవలయునని వ్రాయబడినది.

465. సూ. తదధీన మపి హ్యేకే యోగక్షేమం ప్రతిజానతే. [౨-౨-౧౬]

హరదత్తమితాక్షరా— కిమర్థం దైవోత్పాత చింతకానాం వచన మాదరణీయ మిత్యత్రేస్సమాధత్తే తదధీనమితి. నకేవలం దక్షిణాదివిహిత మనుష్ఠానమ్. కిం తర్హి తదధీనమపి దైవోత్పాతచింతకైః గ్రహవైకృతాదౌ యత్కర్తవ్యతయా ప్రోక్తం తదధీనమపి యోగక్షేమం భవతి. అలబ్ధస్యలాభో యోగః, లబ్ధస్య రక్షణం క్షేమః, తయో స్సమాహారద్వంద్వః, 'ఆయోగప్రజావిందే ద్యోగక్షేమో నః కల్పతా'మిత్యాదౌ ఏకవింశత్యాదివ త్స్వరవల్లింగతా. తద్యథా ఏకశ్చవింశతిశ్చ ఏకవింశతి స్తం యోగక్షేమం ప్రతిజానత ఏక ఆచార్యా ఇతి.

ఆంధ్రవివరణము— దైవచింతకులయొక్కయును, ఉత్పాతచింతకుల యొక్కయును మాటను ఏల పాటింపవలయునను ఆశంక కలుగగా వారించుచున్నాడు— [రాజుయొక్క ధర్మము రాష్ట్రమునందలి ప్రజలను రక్షించుట మున్నగు పనులుచేయుటతోనే పూర్తి కాదనియును, వారి యొక్క యోగక్షేమములను సయితము కాపాడవలయు ననియును] అట్టి యోగక్షేమములు తదధీనములై యుండుటచేత - [అనగా దైవచింతకుల యొక్కయును ఉత్పాతచింతకుల యొక్కయును అధీనములై యుండుటచేత] వారి మాటలున్నూ రాజు పాటింపవలయును-అనికొందఱు చెప్పిరని సూత్రార్థము. అనగా గ్రహములు వక్రించుటలు మున్నగునవి జరిగినచో అందులకు దగినశాంతిని జరిపి యోగక్షేమమును కల్గించుట దైవచింతకుల యధీనమునందును, భూకంపములు మొదలగు నుత్పాతములు వచ్చునేని అందులకు తగిన ప్రతి విధానమును జరిపి యోగక్షేమములను స్థాపించుట ఉత్పాతచింతకుల యధీనమునందును ఉండునని కొందఱు పల్కిరి. కాబట్టి ఆ దైవచింతకులయును ఉత్పాత చింతకులయును వాక్యములను ఆదరింపవలయునని తాత్పర్యము. ఇచ్చట యోగక్షేమము లనగా—అలబ్ధముయొక్క లాభము యోగమనియును, లబ్ధమగు దానిని రక్షించుట క్షేమము అనియును యెఱుంగ వలయును.

466. సూ. శాంతి పుణ్యాహ స్వస్త్యయనా యుష్మ న్మంగళ సంయుక్తాని ఆభ్యుదయికాని విద్వేషణ సంవననాభి చారద్విషద్వ్యృద్ధి యుక్తానిచ శాలాగ్నౌ కుర్యాత్. [౨-౨-౧౭]